# అనుబంధము

మ. వినుతింతున్ మదిలోఁ బురాణపురుషున్ విఖ్యాతు యోగీశ్వరున్
గొనియాడం గలవాఁడ నాదికవి వాగ్యోషామనోవల్లభున్
జనతాసంస్తుత భావభవ్య కృతి భాస్వన్మూర్తి నా కాళిదా
సుని దాసుండ నటంచు నెంచెదను మత్సూక్తి ప్రసక్తిం గనన్. ౧

ఉ. వాగనుశాసనుండు జనవంద్యుఁడు దిక్కన మాకుఁ బూని స
ర్వాగమసారముం బ్రకృత మౌ సరణి న్విరచించి పెట్టె భా
షాగురుభావ మొప్ప వికసత్ప్రతిభుం డయి శంబుదాసభా
షాగణితాత్మవైభవత నద్దిర భారత మిచ్చె మెచ్చఁగన్. ౨

ఉ. మాధవుఁ డాదిశంకరుఁడు మాఘుఁడు *భారవి సీత దండి శ్రీ
నాథుఁడు సోమనాథుఁ డధినాథుఁడు పోతన రామకృష్ణుఁడున్
సాధుతరాంధ్రసంస్కృత లస త్కృతిమార్గ విహార ధోరణు
ల్బోధఘను లక్కవు ల్విబుధులుం దగ మాకుఁ బ్రసన్ను లయ్యెడున్.

క. మేధాబోధకలాదుల
వేధం బురుడించువారి విశ్రుతకవితా
శీధురసావేశవశుల
నాధునికులఁ దలఁతు నే సమాధానమునన్. ౪

క. ఇప్పటికాలపు విబుధుల
గొప్పరమున్ మిగిలి యుంటఁ గొలిచెదఁ గృతులం
దెప్పుడు మదిఁ దిరుపతి వెం
కప్పను దప్పు లెడలించి కనుకనిఁ గనఁగన్. ౫

ఉ. భావము పాకమున్ ధ్వనితవైభవ మొన్నఁ డెఱుంగనట్టి నీ
చావలిలో జనిం గని ద్విజాతిమహత్త్వము వాయఁబెట్టి వి
ద్యావరు లారచించిన మహాకృతిఁ జాటునఁ బ్రౌఢబంధమం
చేవపడంగ నే మగు నిసీ మతిమాలిన కృష్ణకీర్తికిన్? ౬

శా. లంకం బుట్టినవారు రక్కసుల యేలా వారితో వాద మా
చింకం దూర మొలంగు చిట్టికొలముం జీకొట్టిన న్మామనునే?
శంకాతంకములం దొలంచి మహి త్రైశ్వర్యంబు సంధిల్ల నా
వంకం గన్గొను సద్గురూ త్తముల నిర్వర్ణింతు స్నిగ్ధాళితోన్.

సీ. ఓనమా ల్నేర్పిన యొజ్జల మాచిరా
జచ్చయ దండయ సాంబయలను
తాడికొండాన్వయోదధి సుధానిధి మంత్ర
గురునిఁ గేదారలింగుని శివపరుఁ
మహాతియా విద్య సమ్మతి నిచ్చి పుచ్చిన
పొదిలె సీతారామ బుధవరేణ్యుఁ
ముదిగొండవంశ జన్ముని నాగలింగాఖ్యు
మధురావిజయకృతి మానితాత్ముఁ
దలఁచి వాక్రుచ్చి మ్రొక్కి సంస్తవ మొనర్చి
భయము భక్తియు నెమ్మదిఁ బాదుకొనఁగఁ
బరిచరించెద మత్ప్రతిభాలతిక కా
కొక్క యల్లు నొసంగిన యూర్జితులను.

సీ. అత్రిమహాముని యావాప మొనరింప
ననసూయ పేరి క్షేత్రాంచలమున
నంకురించిన యన్వయలతిక యాత్రేయుఁ
డార్చనానసుఁడు శ్యావాశ్వుఁ డనఁగ
మువ్వురు మహానులు మూలభూతులు గాఁగ
నల్లి తాడేపల్లి యనుపదమునఁ
బ్రబలి సుబ్రహ్మణ్య పల్లవితం బయి
బుచ్చిశశికోరక పూరిత మయి
హనుమదవధానిపుష్పిత మగుచుఁ గాంచె
సరసరామకథామృతాస్వాద మొనఁగు

వేంకటకవీంద్రఫలము తద్బీజభవక
రీర మని నన్నుఁ జెప్పు మత్కృతిరసంబె. ౯

గీ. సూరివరులైన రామభట్టారకుండు
సింగభట్టాదిగాఁ గల స్వీయగోత్ర
మహితులం బూజ్యపాదుఁ డస్మజ్జనకుఁడ
నఘుఁడు పేర్కొనె రామకథాఽమృతమున. ౧౦

ఆ. నడిపెఁ బాఠశాల నలువదేనేండ్లు వి
ద్యార్థినిచయమునకు నన్న మింటఁ
బెట్టి యెందుఁ గన్న విద్వాంసులును దన
ననుచు శిష్యు లనఁగ నాజనకుఁడు. ౧౧

క. ఏతాదృశాభిజాత్యస్ఫీతుఁడు మత్తాతపాదు విద్యాగురు వి
ఖ్యాతుఁడు వేంకట కవివరుధ్యాతార్చితజపితసంస్తుతాభవుఁ గొలుతున్.

గీ. ఇంచుతమ్ముఁడు బాలకోటీశశాస్త్రి
వానియర్ధాంగి పర్వతవర్ధనమ్మ
శ్రోత్రియులు గుణవంతులు బుత్రవంతు
లైన వారల కగుత శుభాతిశయము. ౧౩

గీ. భక్తి నెంతు నన్నంభట్ల వంశ్యు సుబ్బ
మాంబపతి వేంకటప్పయ నమ్మయయ్య
నమలగుణశాలి మంగమాంబాధినాథు
శ్వశురుఁ దలఁచెదఁ బాపయశాస్త్రివర్యు. ౧౪

గీ. అల్ల పినపాటి వీరభద్రావధాయుఁ డురు
చిత్తుఁ జేలేశ్వరపుఁ బురుషోత్తముం డ
నూనసఖ్యులు నేత్రావధానమందు
సహచరులు శైశవమునాఁటి సభల నెందు. ౧౫

గీ. నాసహాధీతు లుభయభాషాసమర్థు
లాప్తు లా ముల్లు వీరభద్రయ్యశాస్త్రి

యల్ల మల్లమపల్లి నామాభిజాత
వర్ధనుండు జ్వాలానీరభద్రశాస్త్రి. ౧౬

గీ. అందె వేసెను బ్రాసీణ్యమందు నెందు
నంది వేసెను విద్యాలతాంతములను
జయము నొందెడు మత్పితృచ్ఛాత్రగణము
డానిఁ దలఁచెద నియ్యది తఱి యటంచు. ౧౭

సీ. తైర్థికు లొ మము దంపతులం బిల్చి
యింటికిఁ గొని చనె నేద్విజవరుఁ
డవ్వానియిల్లాలు నతిథిపూజ లొనర్చి
తొట్టిలో పట్టిఁ జేతులకు నొసఁగ
నేను గైకొన నవ్వ నినువుఁ జూపెట్టి యి
ట్లొల ననుం గని యితఁడు నవ్వె
ననుచు నే నడిగిన నల్లెదఁ బద్ద మం
చది నీవు మానితి వతఁడు నగిరెయు
నని తదంబ వచింపఁ బ్రఖ్యాతమూర్తి
మూఁడు మోములతోఁ దన మురువు సూపి
గ్రంథకరణంబునకు బ్రేరణము మొదల
స్వప్నమం దొనరించిన స్వామిఁ దెలఁతు. ౧౮

క. కృతి కొంతకొంత సాఁగ
నతిలోకుఁ డలోకవిభవ మాలోకస్మృతిన్
మతికిఁ గల నందఁ జేసిన
విత మే మని పలుకువాఁడ నెట్లు లుడుగుదున్? ౧౯

క ల మా ట

శా. పాదం బొత్తెద నాథ! తెం డిటు లెదో! భావించుచున్నార లే
మే ద్వైవప్రతిపత్తి నుంటిరొకో? నామేఁ గావుగా విఘ్నముల్?
శ్రీదేవీ! కలఁ గంటిఁ బూరుషవరు న్సిద్ధార్థ నవ్వానినం
వాద్యం బెంచి తలఁచుచుంటి, నది గోప్యంబా? వినం దెల్పెదన్. ౨౦

ఉ. బంగరువంటి యొంటి చెలువంబు రహించు దిగంబరుం డొకం
డంగన! పొత్త మొండు గొని యన్యుఁడు వెంబడి రాఁగ వచ్చి నా
చెంగటఁ గూరుచుండెను వచింపఁ దొడంగెను దంతధావనం
బుం గొఱఁ దీర్చి నేఁ మొగముం దనవైపునఁ ద్రిప్పి చూడఁగన్.

శా. వైరస్యంబునఁ బండితుండ! యొదియో భావించుచున్నాఁడ వి
క్లే రాఁ బల్కవదేమి? యేమనెద స్వామీ! స్వోపసర్గంబులన్
ధీరత్వం బుడివోవ సంసృతిఝరిన్ దేల న్మునుంగంగ నై
పారస్యం బెటు లందువాడ నపహాస్యంబు ల్మదాచారముల్. ౨౨

శా. సీతారామయ నాఁ బితృవ్యుఁడు సుతుం జేకొంచుఁ దా వచ్చి యి
ష్టే తత్తన్నిజగేహసంగతము లేవే నల్లకల్లోలముల్
ప్రీతిం జెప్పెడుభంగి దోఁప నని నిర్వేదించె నద్దాన నా
చేతంబే చెడె రాక మానఁ డెటు లేఁ జెప్ప న్వినం గానఁడున్. ౨౩

గీ. తాటియాకుల యీనెల తట్టలిచ్చి
చిరిగినవి రెండు నొకదాని చీరికలన
యొకటి గట్టిగ నల్లుమం చొక ముసలిది
కాదు పొమ్మన్న వినక నగ్గాసిఁ బెట్టె. ౨౪

క. అక్కడికి మొఱకివైపునఁ
జక్కనివై పమరునట్టి జాడ నొకటిలో
నొక్కటి ఘట్టించి యిడ
న్మక్కులు మూతులును విఱిచె ముసలిది యనఘా! ౨౫

క. మాయత్త చాలుఁ జా లిటు
లాయన కివి యీయ వచ్చునా? యని యార్వన్
బాయని రొద నది మరలె ని
సీ యని వెస సస్యసింపఁ జిత్తము పుట్టెన్. ౨౬

చ. బయలున కేగ నధ్వమున వాకు లనేకము లేవొ? యేవొ? తె
ల్పి యటు నిటు ల్పదంబు గదలింపఁగరాని విలంబ మౌనటుల్

ప్రియమునఁ దల్లి చెల్లెలు వివేకపుసూటికిఁ ద్రిప్పెఁగాని నా
నియమవిధానకాలము చనెన్ వినవో? మహితార్థసాధనా! ౨౭

క. ఎడనెడఁ జేయ న్వలసిన
వెడపనుల మనంబు చిక్కి వెడఁగు నొనర్పన్
వోడిబడు నే నెక్కడ? నె
క్కడ యోగము సాంఖ్య మని దిగంబడితి ననా! ౨౮

చ. హరిపదమందు హంసునిమహం బపరాగతఁ గానరయ్య నీ
సరి కిదె దంతధావనము స్నానము సంధ్య యిఁ కెప్పు డంచు ని
వ్వెరపడి లాగుచుండఁ గనిపించితి వీవు మహానుభావ! య
చ్చెరువుగ నిట్లు చూచుడు వచించితి నున్నది దేవ! నీదరిన్. ౨౯

చ. మునమునలాడ కేది యెటు పోయినఁ జేయుచుఁ గృత్య మీవుమా
జనకునిఁ బోల నుండుము, నిజం బటు లుండు నొకప్డు నేనుమా
జనకునిరీతి మాజనకసామ్యమునన్ జనకప్రసక్తి నె
య్యనువున లాగునో ప్రకృతి యట్టిటు సేయు నిఁ కేమి సేయుదున్?

చ. ఇది యిటు లుంచు మీశ! యది యేమి? క్షణక్షణ మట్టె చూచుచున్
హృదయమున స్మరించుచు సహేలముగాఁ గయికొంటి వెద్దియో?
యిది యొక పిచ్చినక్కడకు వహింపఁగఁ జేసిన సొమ్ము సుమ్ము మ
న్నది యిపు డెందుఁ బోయెనో? నరయం గనేఁ బిచ్చి సన న్స్వరూపమున్

చ. అయినఁ బ్రసాద మిద్ది మహితాత్మ! యొసంగుము నాకు, నీకు ని
చ్చియె యొక సొమ్ము చెప్పినది చెప్పఁగఁ దగ్గది చిన్నతల్లి, ని
శ్చయ మది నెమ్మనమ్మున వశం బయి నిల్వ ద దేమొ? దైవప
ర్యయమున మేలియబ్బెనన మారఁగఁ జూపు నిజాచలత్వమున్. ౩౨

శా. సంకల్పం బెడసేసి చూడు మునుపే సన్న్యాసి వైనాఁడ వా
శంకం దక్కుము పిన్ని చెప్పినది శాస్త్రంబుం దగ న్వింటి వే
నింకం బల్కెద బారి నీకొనినదే యీశాభిముఖ్యంబుతో
సంకోచం బడఁగ న్సమీరధృతిఁ దత్సంపత్తి కా దర్భకా! 33

గీ. అర్జునున కచ్యుతుం డెదు రై నయట్లు
సతము ధ్యానించెదే? యదే సరణి గాఁగ
మొదల సవికల్ప మవికల్పము తరువాతఁ
బ్రాప్తమై వచ్చు వరుసఁ దత్త్వానుభూతి. ౩౪

క. అత్తటి మై గఱుపారఁగఁబొత్తము గొని వచ్చినట్టి పురుషవరుండున్
దత్తాహితబోధాయాపత్తివిరహితాయ తేఽస్తు స్వస్తి యని యనెన్.

శా. దత్తాత్రేయవిభుండె? యీతఁ డని తద్వ్యాహారముం గొన్న యా
సత్తిం దత్పదపద్మమందు నిజహస్తద్వంద్వము న్మోపి నే
నొత్తం గొక్కరొక్కో ఒ ఓ యను రవం బుత్పన్నమై కన్ను లి
ట్లెత్తన్ జిత్త గనంగనైన మన మెంతే సొమ్మసోయెం గదే. ౩౫

ఆ. పిన్నతల్లి యెవరు ప్రియ! ద్వాదశాబ్దంబు
లపుడ గురులవలన నాదృతిఁ గొని
ప్రత్యహంబు నే నుపాసించు దేవత
బాల యనెడు పేరఁ బరిఢవిల్లు. ౩౬

క. కవ ముసలు లెవరు నాథా!
ప్రవృత్తియు నివృత్తియు నని భావించెదఁ గు
క్కవిధ? మతఁ డల యలర్కుం
డవనీశుఁడు సొమ్ము? వాని యమ్మ యుడదొక్కో? ౩౭

గీ. అత్రివలె నుండు మని యొక యర్థము గల
దనుచుఁ దోఁచెడు నిపుడు వాక్యార్థమందు
మాజనకుఁ డన్నచోట నో మానిని! కల
మాటయే యిది గనఁ గలమాట గాని. ౩౮

క. అని మురియుచు నావిరచించిన కృతి లింగోద్భవాఖ్య శివునకు మద్గ్రా
మ నివేశున కర్పించెదననువారఁగ ననుచుఁ దద్విధాదృతి నుండన్. ౩౯

ఆ. ఇంతలోనె వినిరి యీపని మాపని
యంచుఁ బూనుకొనిర యస్మదీయ

నగరవైశ్యవరులు భగవంతు లిరువురు
వారిమనములందుఁ జేరిరొక్కో? ౪౧

గీ. చందవోలుపురస్థుఁ డీసత్కృతికిఁ బతి
చందవోలు లింగోద్భవస్వామియె పతి
చందవోలైశ్యసంఘ మీసకలనిర్వ
హణ మొనర్చెడుఁ దద్భాగ్య మనఁ దరంబె? ౪౨

గీ. నాకుఁ బరిచర్య సేసెద రాకుమార
మనఘ నామాటఁ గాదన రనుపదంబ
కాన నాయాత్మసంతృప్తికై మహేశ!
తలఁచి విడిచెద నవ్వారిఁ దద్విశీర్ణి. ౪౩

| | |
|---|---|
| 1. నీలి సాంబమూర్తి గారు. | రు. 116-0-0 |
| 2. ,, విష్ణుమూర్తి గారు. | 116-0-0 |
| 3. తాడేపల్లి బ్రహ్మయ్య గారు. | 116-0-0 |
| 4. ,, చెంచుపున్నయ్యగారు. | 116-0-0 |
| 5. అడ్డేపల్లి వెంకటేశ్వర్లు గారు. | 100-0-0 |
| 6. ,, వెంకట్రావు గారు. | 100-0-0 |
| 7. వనమా వెంకటసుబ్బమ్మ గారు. | 100-0-0 |
| 8. తూనుగుంట్ల వెంకటరమణయ్య గారు. | 100-0-0 |
| 9. నీలి సాంబశివరావు గారు. | 58-0-0 |
| 10. ,, నాగేంద్రం గారు. | 58-0-0 |
| 11. ,, సుబ్బారావు గారు. | 58-0-0 |
| 12. ,, శ్రీరాములు గారు. | 58-0-0 |
| 13. ,, రంగారావు గారు. | 58-0-0 |
| 14. ,, పెదబంగారయ్య గారు. | 58-0-0 |
| 15. ఆలపాటి రాధాకృష్ణమూర్తి గారు. | 58-0-0 |
| 16. కనికెచెర్ల నాగభూషణం గారు. | 35-0-0 |
| 17. వనమా వెంకటరత్నం గారు. | 35-0-0 |

18. మాటూరు భూషయ్య గారు. రు. 29-0-0
19. వనమా పేరయ్యగారి భార్య రత్తమ్మగారు. 29-0-0
20. ,, సీతారామయ్యగారి భార్య వెంకటరత్తమ్మ గారు. 29-0-0
21. ,, పేరయ్య గారు. 29-0-0
22. నీలి రామమూర్తి కొ. భోగేశం గారు. 25-0-0
23. ,, రామమూర్తి భార్య అన్నపూర్ణమ్మ గారు. 25-0-0
24. ,, సత్యనారాయణ భార్య కనకవల్లితాయారమ్మగారు. 25-0-0
25. మాటూరి వెంకటశాస్త్రులు గారు. 25-0-0
26. అమరా సత్యనారాయణ గారు. 20-0-0
27. అద్దేపల్లి నరసింహారావు గారు. 20-0-0
28. వనమా వెంకటనాగభూషణం గారు. 20-0-0
29. నీలి క్రిష్ణయ్యగారి కొ. శ్రీరాములు గారు. 20-0-0
30. గ్రంధి సుబ్బారావు గారు. 20-0-0
31. పొన్నూరు శేషావతారము గారు. 20-0-0
32. వనమా పే. కొ. వెంకటేశ్వర్లు గారు. 15-0-0
33. ,, రామమూర్తి గారు. 15-0-0
34. పల్లపోతు కోటేశ్వరరావు గారు. 15-0-0
35. నీలి గోపాలక్రిష్ణయ్య గారు. 15-0-0
36. ,, రాఘవనారాయణ గారు. 15-0-0
37. ,, శంభులింగం గారు. 15-0-0
38. పెనుగొండ కోటేశ్వరరావు గారు. 15-0-0
39. అన్నవరపు లక్ష్మీనారాయణ గారు. 15-0-0
40. ,, చెంచయ్య గారు. 10-0-0
41 పొన్నూరు నారాయణరావు గారు. 10-0-0
42. వనమా అన్నపూర్ణమ్మ గారు. 10-0-0
43. బొగ్గవరపు వెంకటేశ్వర్లు గారు. 10-0-0
44. కనికెచెర్ల వెంకటరత్నం గారు. 10-0-0

45. మాటూరి గుర్నాథరావు గారు. రు. 10-0-0
46. వక్కలగడ్డ సుందరరామయ్య గారు. 10-0-0
47. ఆలపాటి అంజయ్య గారు. 10 0 0
48. వనమా సుబ్బారాయుడు కొ. వెంకటేశ్వర్లు గారు. 10-0 0
49. రొండూరు సుబ్బారావు గారు. 10-0-0
50. వనమా వెంకయ్య గారు. 5-0-0
51. ,, పాండురంగారావు గారు. 5-0-0
52. ,, పూర్ణచంద్రరావు గారు. 5-0-0
53. పెనుగొండ వెంకటరత్నం గారు. 5-0.0
54. కొల్లిపర సుబ్బారావు భార్య సీతమ్మ గారు. 5-0-0
55. నందిపాటి అంజయ్య భార్య వరలక్ష్మమ్మ గారు. 5-0-0
56. గంగిశెట్టి వెంకటసుబ్బారావు గారు. 5-0-0
57. ,, ఆంజనేయులు గారు. 5-0-0
58. నందిపాటి నరసింహారావు గారు. 5-0-0
59. చిలంకూరి వెంకటనరసయ్య గారు. 5-0-0

మొత్తము 1946 0-0

గీ. చేయలేదు పాపం బని చెప్పఁ గలమొ?
పుణ్య మున్నది యింతని యెన్నఁ గలమొ?
శాస్త్రముం బట్టి నీసేవ చాలు నిదియె
యుభయలోకంబులను మము నుద్ధరింప. ౮౮

గీ. తవిలి లింగోద్భవేశుఁ డేతత్కృతిపతి
తత్కథానాయకుండు దత్ప్రభుండు
నన్ను నా యీ బలగము సంతతముఁ బ్రోతు
రాలకింతు రభిముఖులై యీలలి గృతి. ౮౯

# వి ష య సూ చి క

షష్ఠ గుచ్ఛము



సప్తమ గుచ్ఛము



అష్టమ గుచ్ఛము

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## ప్రథమ గుచ్ఛము

శా. శ్రీవిద్యామహనీయయోగమున నిర్ణిక్తాంతరంబైన చే
తోఽవస్థానమునన్ నిరంతరము సోహంహంసభావంబుతో
భావింపంబడు నమ్మహేశ్వరపరబ్రహ్మమ్ము మమ్మోము స
త్త్వావష్టంభ సుఖానుభూతి భవభావాభావభానమ్ములన్. ౧

శా. శ్రీచందోల్పురి వాసవాశ గుడి వాసిన్ రాజ్యలక్ష్మమ్మతో
శ్రీచెన్నాదిమకేశవప్రభుఁ డవాచిం బార్వతీదేవి స్వో
దీచిం గంగ తల న్మెలంగు సిరి నర్థిం బెంచు లింగోద్భవే
శా! చేకొమ్ము భవత్ప్రసాదితనవాచాపేటి సర్పించెదన్. ౨

గీ. ప్రాభవంబున వినుము పరాకు మాని
మానితస్వస్వరూపనిష్ఠానుభవము
భవము వెనుఁబడఁ గలిగింపు మవఘటింపు
మింపుమెయిఁ గావ్యకన్య నిలింపవంద్య! ౩

గీ. అని నిజపురస్థుఁ డఖిలేశుఁ డభిముఖుండు
గ, విరచించెద దత్తభాగవతముఁ గృతి
గరిమ రామకథాఽమృతకవితనయుఁడ,
నందు రాఘవనారాయణాభిధుండ. ౪

### గ్రంథావతరణము

ఉ. భోగము యోగమై ప్రకృతిపూరుషపక్షములన్ విదిర్చి స
ర్వాగమమూల షాఁదల తిరంబుగ బిందుతృతీయలోచనం
బై గమనాగమోజ్ఝితమునై గమనాగమకారణస్థితిం
ద్యోగతి మించు హంసము సముజ్జ్వలశక్తికి భక్తి నేసెదన్. ౫

ఉ. మూటికి వేఱ యైన మునిముఖ్యుఁడు తా ననసూయఁ జెందనా
చోట స్వయంప్రదత్తుఁ డగుసూటికి దత్తవిధేయదేయుఁ డౌ
పాటికి దత్తనామమున భాసిలనా జగమేలువాని యా
నాఁటివిశేషవేషము మనమ్మున మాకుఁ బ్రసిద్ధ మయ్యెడున్. ౬

చ. సకలము నైజభావమున సంతతమై వెలుగొందఁగాఁ బుర
త్రికములు శాశ్వతమ్ము లొనరించి తలంచి యనుప్రవేశసం
ప్రకటిత జీవభావ శివభావములం గనిపించి మోక్షుల
క్ష్మికి భజనీయుఁడైన విభుఁ గేవలు నవ్యయు వానిఁ జెందెదన్. ౭

చ. శ్రుతులు స్మృతుల్ వచించు సువిశుద్ధకృతుల్ మను పాచరించి శో
ధితమలమానసాబ్జమున దేవునిఁ బట్టిననాఁటఁగోలె సం
తతము భజించుచు న్స్వసపథంబున నిలిమువోలె దృశ్యము
న్వితథముగాఁ గనుంగను మనీషికిఁ జెప్పెద నున్నతత్త్వమున్. ౮

గీ. వాసుదేవుం డజుఁడు భగవంతుఁ డొకఁడె
వస్తు వదె శబ్దములఁ బ్రతిపాద్య మనుచుఁ
దా ననుభవించువాఁడె విద్వాంసుఁ డనఁగ
నట్టి విద్వాంసుఁడే గురుఁ డచ్యుతుండు. ౯

గీ. అని ప్రసంగించి యిట్లనె వ్యాసమౌని
వేదవిద్యావబోధార్థ మాదిదేవు
నంశమున నవాంతరతముఁ డనఁగఁ బొడమి
యుగయుగంబుల కొకఁడైన యుజ్జ్వలుండు. ౧౦

## మునుల ధ్యానయోగము

ఉ. చిత్తము సుస్థమై యొకటఁ జేరి మహర్షు [illegible] నిత్యనై
మిత్తికసత్క్రియా కృతుల మేకొని లోకగురుల్ స్వధర్మని
ర్వృత్తివిచారశీలు లయి వృత్తుల నొత్తెడువృత్తి నెత్తి యీ
వృత్తిఁ జొచ్చి చో టయి నివృత్తి నెసంగెడి నిశ్చలాంగులై. ౧౧

సీ. కదలి కదలనిదై కాయమ్ముల ధరించె
నా ధ్యాత్రి తా దేని నందఁగోనెనో?
అప్పుల నిప్పులో? నిప్పుల నప్పులో?
కార్యకారణభావకలన లడఁగె
హృదయంబు లోఁగొన నొదవించె నొకధాటి
దివ్యగంధంబులఁ దేలి గాలి
గాలి కురంగాలికాలికి నెడమీఁక
నిరవకాశం బయి నిండె నింగి
అనఁగ వినఁగఁ గనఁగ నైనయదియ లేమి
నారఁ గనుగొన్న వాఁడేని నను నెవనికిఁ
జెప్పినను జెప్పకున్నను జెప్పినట్లె
కాకముల జెందకుండునేకాకి యొకటి. ౧౨

క. ఆనందమొ విజ్ఞానమొ
తానై యటు లుండి యుండి తటుకున మాసీం
ద్రానీకము గ్రమ్మరె ఫల
మానైన పురాసుకృతము లిట్టటుసేయన్. ౧౩

తే. అంతఁ గను లెత్తి కాంచి రనంతమయముఁ
గోటిరవిరశ్మికోటిసంఘాటితఖము
నన్నిమహములను హరించు నాదిమహము
మోఁగులెడఁదలఁ గోరిక లూరుచుండ. ౧౪

గీ. చూచిరేగాని వెంటనే చూడలేక
కనులు వెనుదీయ నెది సేయఁ గలరు వారు
కాని యటు నిటు గాంచి నిక్క మని తలఁచి
రాతఁ డంతర్బహిర్వ్యాప్తుఁ డన్నచదువు. ౧౫

ఉ. కన్నులు మూసి లో మొలచుకాంక్ష లనంగు సహాంగుఁ జేయ నా
సన్నుతు లంతరింద్రియముసన్నిధి మా కని లాగులాడ నా

యున్న తదింద్రియంబు లటు లుంచి హరి న్వినుతించి వేడి రో
యన్న! కృతంబు లున్నఁ గనులార నినుం గన నిమ్మటం చిటుల్. ౧౬

చ. కనఁబడి మందభాగ్యునకుఁ గానిదయై నిధి యేగులాగు మా
కు నిచటఁ దోఁచె లోకజనకుండవు నీ విటు తోఁచి దేవ! లో
చనముల కందకుండుట వశంవదమాయ! పరేశ! యెట్టులో
పనుపడఁజేయు మీ యనదపాలుల ప్రార్థిత మర్థిసమ్ముఖా! ౧౭

గీ. అనుచు నున్నవి స్వీయమాయాంబరంబు
గప్పుకొని యచ్యుతుండవు నీకాననోట
మానసమ్ములు హర్షాబ్ధిమగ్నము లయి
మాట లేటికిఁ గొఱత లుంపకు మధీశ! ౧౮

క. అని కొనియాడుచు విని రా
ఘను లోక ఘననిస్వనమ్ముఁ గన్నులు తెఱువుం
డనఘాత్ములార! యని య
య్యనువున మెలఁగఁ గని రున్న యా కలి వారల్. ౧౯

## దత్తగురు విశ్వరూప సాక్షాత్కారము

చ. కనుఁగొని రన్న యాసులు వికస్వరలోచనపుండరీకు లు
న్మను లతిశుద్ధబుద్ధు లయి మానసము లెన్నియుఁ జెప్పలేని చి
ద్ఘను సదరూపు రూపయిన దైవము సూచ మహామహోంతరం
బునఁ దెలిసొని యొక్క రుచి ముందల సందిన విశ్వరూపునిన్. ౨౦

సీ. మూఁడురంగులపోడుములు మొల్లములు గాఁగ
ముగురుమూర్తులరూపములు పొసంగఁ
దొలిచదువుల మూఁటి వెలయించుటీకగాఁ
ద్రియుగధర్మంబులు దేజరిల్ల
మూఁడు తేజమ్ముల మొదలింటిదుంపగా
ముల్లోకములచందములు మెలఁగఁగ

శక్తులు మూఁడు సంసక్తి భాసింపఁగా
వర్గత్రయం బపవర్గముఁ గొన
నాదిమధ్యాంతరహితం బనంతరంబు
ముక్తికాంతాస్యశుద్ధాంత ముక్తిదూర
మైన విభువిశ్వరూపమం దవధరించి
రెల్లయర్థంబు లర్థి మహర్షివరులు. ౨౧

ఆ. మూఁడుతలలతోడ ముగురుసాములమేల
మెలపు లొప్ప నొకట మెలఁగుచుండ
వేఱువేఱ నెవరి వేసము ల్వా రంది
యందు నందుఁ దోఁప నరుదు వెరసె. ౨౨

చ. ముని ఘను దివ్యవారిపరిపూర్ణకమండలుధారి రక్తచం
దనపనితాంగు హంసగతి నచ్యుతు సంభృతయజ్ఞసూత్రు బ్రా
హ్మణవిభునిం జతుర్భుజు స్వరాంచితనాము నవాము వేదవా
ది నఘహరుం బ్రజాపతిపతిం గని రందుఁ గ్రతుప్రవర్తకుల్. ౨౩

గీ. అత్రి పులహా క్రతు పులస్త్య లంగిరో మ
రీచి సవసిష్ఠ కర్దమ భృగులు దక్షుఁ
డాత్మజులతోడ మనువులు నన్యమాను
లతని జయ జయ యని కొనియాడనైరి. ౨౪

సీ. వైనతేయాంససౌవర్ణాద్రికూటమం
దంబుదాంబుదరూఢి నమరినాఁడు
శంఖచక్రగదాబ్జశస్త్రహస్తుం డయి
యిందిర కఖిలాంగ మిచ్చినాఁడు
అపరంజిజన్నిదం బౌమణి వనమాల
శ్రీవత్సము నలంకరించినాఁడు
ఆకసమ్ము గ్రసింపనౌ ముకుటచ్ఛవి
భువనత్రయంబును బొరటినాఁడు

కొదువ లే దనఁ గటిసూత్ర కుండలాంగ
దప్రముఖములు నందందుఁ దాల్చినాఁడు
తాను ప్రోత్ఫుల్లవదనపద్మమునఁ బొల్చి
భక్తచింతామణి హరి చూపట్టినాఁడు. ౨౫

క. పద్మకరుఁ బద్మనాభునిఁ బద్మాపద్మేక్షుఁ జార్చ్యపదపద్ము లస
త్పద్మాత్ముఁ బద్మవికృతిం బద్మాసనునంతలేసివా రెనయఁగనై. ౨౬

క. సనకుఁడు సనందనుండును
సనాతన సనత్కుమార సంయములు ద్వ్యాస
న్మని నారదుఁ డటు కపిలా
ద్యను శౌనకగురులు నల బృహస్పత్యానుల్. ౨౭

గీ. జయ విజయ నందక సునందసంజ్ఞు లాది
పార్షదులును విష్వక్సేనపరివృఢుండు
నొదలల నంజలులు వన్ని యన్నిలింప
వరదు విభుఁ బరివారించి పలికి రెలమి. ౨౮

చ. జయజయ దేవదేవ! దనుజప్రకరాపనయాపహా! రమా
నయనసుధానిధీ! హరి! యనాథజనార్తిహరా! దయామయా!
వ్యయరహితా! పరాత్పర! పరాయణ! భక్తిపరాపవర్గదా!
జయజయ యంచు సత్యనుతిజాలముల న్విభుఁ డిచ్చ మెచ్చఁగన్. ౨౯

గీ. ఇంతలో నెంతలో యన నెదురువడియె
నయములటు ము న్నొనర్చిన నయనములకు
మానితానందసందోహమంథరుండు
శంకరుండు విశ్వజనవశంకరుండు. ౩౦

ఉ. శ్రీరజతాచలంబుపయి శ్వేతమహావృషభంబు దానఁ గ
ర్పూరపరాగపాండురుడు భూతివిభాసితుఁడై న తాను కో
టీరమున న్సుధాకిరణడింభకుఁ డంతకుఁ బై న శుద్ధగం
గారసమైన శంభునిప్రకాశము ముమ్మరమయ్యెఁ జూడ్కికిన్. ౩౧

సీ. పులితోలు గట్టినాఁ డలికాంబకము సాము
తెఱచినాఁ డాశల మెఱుఁగు లీన
గజకృత్తి మెత్తగాఁ గడియించినాఁ డహి
వలెవాటుగాఁ బైన వైచినాఁడు
పంచాననస్ఫూర్తిఁ బ్రబలినాఁ డిటు నటు
దశభుజంబుల మేల్మిఁ దాల్చినాఁడు
బ్రహ్మకపాలంబుఁ బట్టినాఁ డొకచేత
నన్నియే నాయుధా లెత్తినాఁడు
పాపజందెంబు లందియ పాములదార
హారకేయూరకంకణాద్యములు త్రాఁచు
లమర నొవ్వనివారినేత్రములు కమర
హు మ్మనుచు నుగ్రమూర్తి వెల్గొందినాఁడు. 32

ఆ. సత్త్వమూర్తి తామసవ్యవహారియై
యెన్నరానికల్మి నెనసినాఁడు
దేహమందు సగము దేవేరి కిడినాఁడు
నున్నసగముమీఁద సున్న మమత. 33

ఉ. ఎక్కటి వీరుఁ డెప్పుడు మహేశ్వరశబ్దము వాని వీడి వే
ఱొక్కనిచాయఁ బోదు తన కొక్కఁడు లేదు సమస్త మిచ్చు నే
యక్కఱ కేరు పిల్చిన సహాయ మగున్ నెఱతెల్విబిచ్చ మా
యొక్కఁడె పెట్టఁగావలె నహో యిటువంటి ప్రభుం డెవం డికన్! 34

ఉ. ఈశునిఁ జేరి భక్తినిభృతేక్షణులై వినుతింపనైరి నం
దీశ గణేశ కిన్నర వరేశ మునీశ దిగీశ దేవసే
నేశులు వీరభద్రుఁడు దధీచుఁడు దుర్వాసనుండు రాక్షసా
ధీశులు బాణరావణులు వృద్ధులు పాశుపతవ్రతాస్థితుల్. 35

క. ఒకచోట రక్తవర్ణుం
డొకచోఁ దెలిరంగువాఁడు నొకచో శ్యాముం

పోకచోట నిన్నిరకములు
నొకఁడైన మెఱుంగుమేల నుమముగఁ దోప్పెన్. ౩౬

క. అశరీరుం డన నయి సర్వశరీరములందు నింగిభంగి వెలయుచున్
సశరీరుఁ డయ్యెఁ బహువుల భృశముస్థులఁ జేయ వానిసెర నొకవిధమే?

ఉ. ఎందఱు చంద్రులో తపను లెందఱొ పాకవిరోధు లెందఱో
యెందఱు పద్మజులో శమను లెందఱొ నైరృతు లబ్ధిపాశు లిం
కెందఱొ మాతరిశ్వలు ధనేశగిరీశులు నెందఱెందఱో
యుండఁగ నొక్కొక్కఁ గోన నం దొకఁ డుండెను చెప్ప నెట్లగున్. ౩౭

క. వసురుద్రాదిత్యాదులు నసురాసురమానవులును సగ్రహతారల్
విసుమానవు నానాజంతుసమాజం బద్భుతముగఁ దోఁచె నచటంబున్.

గీ. భూర్భువస్స్వరాది భువనంబు లేడును నేడుగాక మఱియు నెన్నియేని
గానవచ్చె నందుఁ గానంగరానిది లేనిదైన లేదు లేదు ఘనము. ౪౦

ఉ. భూత భవిష్య దాధునిక భూరి చరాచర భూత భావిత
వ్రాతమయంబు దివ్య మతిభవ్యము నా విభువిశ్వరూపపుం
జ్యోతిఁ దలంచి కాంచి శిరసు ల్ధర మోపి నమస్కరించి సం
జాతసుభక్తిగద్గదవచఃప్రచయంబుల నెత్తి రుత్సవుల్. ౪౧

మునులు విశ్వరూపుని స్తుతించుట

ఉ. ధన్యుల మైతి మాత్మకృతధర్మము లెల్ల ఫలించె జన్మమా
నాన్య మనంగ నొప్పెఁ బ్రభువా ద్యతిశం గనుటైతి మన్య సా
మాన్యము కాని రూపుఁ గని మంటి మటంచుఁ బ్రహర్ష మొప్ప న
న్యోన్యముఁ జూచుచున్ జయజయాంతభవా యను చని పాను లానరిన్.

ఆ. షోడశోపచార సురుచిరపూజల వేదభేదమంత్రవిధులతోడ
సరవిఁ గూర్చి తమ సంసారతాపం బడంగ సంస్తుతించి రింగితజ్ఞు. ౪౩

క. కారణకారణునకు నిష్కారణునకు విక్రమప్రదర్శనకున్ శా
ర్ఙ్గారిగదాస్యాద్యాయుధధారికిఁ బురుషోత్తమునకు దండనమ్ము లబా!

క. శారీరారణి నిమిడి విచారంబున నౌ చిదగ్నిసరణికి సత్య
ప్రారబ్ధోద్భవముఖలీలారసునకు నీకు నతు లలక్ష్య! పరేశా! ౪౫

క. పరమాత్మ యనుచు యోగులు
పురుషుఁడు ప్రకృతియు నటంచు ముఖ్యత సాంఖ్యుల్
పొరి బ్రహ్మం బని వేదాం
తరహస్యజ్ఞులును బొగడు తత్త్వమ! జోతల్. ౪౬

ఉ. మానితయజ్ఞరూప మని మంత్రమయం బని ధర్మ మంచు వి
జ్ఞాన మటంచు శూన్య మని చాలినవారలు చాలినట్లు స్వ
జ్ఞానస్మృతిన్ వచింప శ్రుతిసంతతి విశ్వముఁ జెప్పి కాదు కా
దీనెరి యం చవాఙ్మనసమే యని తెల్పిన తత్త్వమా! నతుల్. ౪౭

క. కొందఱు గుణవద్ద్రవ్యం
బందురు మఱికొంద ఱగుణ మందు రెవ రిఁకే
చందమునఁ గొన్న నందున
కుం దగు నాధారమ వని కొలుతుము నిన్నున్. ౪౮

గీ. కనులు వీనులు లేకుండఁ గాంచు వినును
గాలుసేతులు లేకుండఁగాఁ జనుఁ గొను
నని శ్రుతులు సెప్పు నెవ్వని నగ్ర్య మహితు
నట్టి పురుషోత్తమునకు మా యానతు లివె. ౪౯

గీ. జీవు లనన్నై నవారి సంజీవనమవు
జ్యోతులకు మూలమౌ నొక్క జ్యోతి వనుచు
నే నిను వినాగ లే దన్య మెందు ననియె
శ్రుతిశిరము లట్టి నీకు సంస్తుతులు నతులు. ౫౦

ఉ. పచ్చనిపట్టుచీర కటి భాసిల బంగరువంటి యంగమం
దచ్చనిబూది పూసి తఱచైన రవీందురుచు ల్వొసంగఁగా
నిచ్చఁ దనుం దలంచిన నిరీహులసంసరణామయమ్ములన్
బుచ్చెడు నెజ్జ దత్తమునిపుంగవరూపు భజింతు మెప్పుడున్. ౫౧

గీ. తాను చేష్టింపఁ జేష్టింత్రు ధాత లెల్ల
వెలుఁగుతనతోఁ వెలుఁగుఁ జిత్తవృత్తులెల్ల
విశ్వవిశ్వజ్ఞు లలవిభువిధ మెఱుంగ
రఖిలమును దా నెఱుంగు నం చను నిను శ్రుతి. ౫౨

గీ. ఏవిరాగు లనుదినంబు నెంతు రెదల
నమల మలసీపురాణసూ నస మసమము
పాచి దుస్త్యజ మంధకూపంబు గృహము
నట్టివా రందుదు రపావృతామృతు నిను. ౫౩

ఉ. ధ్యాస మొ నర్తు రెవ్వ రెడఁద న్నిను నొక్కటి సేసి రూఢి న
ర్చానిరతాత్ములై యెవరు నన్గుణు వీడి గొనాలు గొల్తు రా
మహాను లు జ్ఞానిపిత్తము సమం బఖిలప్రలయాస్పదంబు నౌ
నీనెల వంది రారు మఱి నీరసనంసృతి బంభ్రమింపఁగన్. ౫౪

గీ. యోగు లయి వాయుమానసవేగ మాఁగి
యమల మేకంబు చైతన్య మనుభవించు
నట్టివా రెల్ల శమలంబు నపుడ విడిచి
బ్రహ్మభూతులై యుందు రెప్పటికిఁ జెడక. ౫౫

ఉ. రాజస మాకృతిం గొని చరం బచరంబు సృజింప విష్ణునా
భీజలజంబున న్వెలసి విస్తృతజీవచయాశ్రయాంబనై
భూజనభోజనాగజనిప్రాంజలకై మునిసిద్ధరాజని
ర్వ్యాజనుతిప్రకాశితనిజాత్ముఁడవౌ నజుఁ గొల్తు మానినున్. ౫౬

చ. వినినఁ దలంచినం గొనిన విభ్రమ మెవ్వనినాను మాన్చు నె
వ్వని ప్రభ కెల్ల లే దెవని భక్తులు చిత్తమలంబు తో భవం
బునఁ బడకుందురో భువనపూజ్య సురేశుఁ బరేశు నిమ్మహే
శుని విడఁబోము దుర్జనవిశోధను విష్ణు భవార్తిశాంతికిన్. ౫౭

చ. మహిసురబాలుఁ డర్థి నుపమన్యువు కోరినపాల కిచ్చె నే
మహితుఁడు పాలవెల్లి యొ సమాధిఁ దనుం గొను శ్వేతుఁ జంపుమృ

త్యుహతకుఁ జంపి భక్తు దయ నూర్జితుఁ జేసె ప్రమత్తప్రసన్ను దు
స్సహామహు నంతకాంతకు భృశం బెడఁ దాల్తు మనీశు నీశునిన్. ౫౮

ఉ. అందఱయన్నియాకృతులు నక్కట యొక్కటఁ గానవాట మా
డెందము లెందునుం దడఁబడెన్ మది కుత్తికి నందఁబోని నీ
విం దిటు లెట్లు తోఁచితివి? యియ్యది స్వప్నమొ? జాగరంబొ? లే
దిందు సుషుప్తి యెట్లయిన నేము కృతార్థుల మీశ్వరేశ్వరా! ౫౯

సీ. నీదయ కైతిమి నిరతిశయ మ్మవు
పరమగతిం బొంది మరలఁబోము
త్వత్ప్రాప్తిధన్యమూర్ధన్యుల మైన నీ
యంతఃకరణ మింక నడఁగకుంటఁ
గలుగువికల్పము ల్వాలికెద మోదేవ!
యవధరింపుము దివ్యమా మనమున
నెవఁడ విక్కడ కిట్టు లేల వచ్చితి విశ్వ
రూపం బ దెట్లు నీరూపునకును
జన్మకర్మము ల్విజ్ఞానసరణి తావు
నాత్మ యాకార మాధార మభవ! యెవియొ
ముగురుమూర్తులమూలమా భూరితేజ
మని తలంచెద మేము ని న్నౌనొ కాదొ? ౬౦

ఆ. నిన్నుఁ దెలిపి మమ్ము నిర్వృతులం జేయు
మాత్మసాక్షి వని మహాత్మ! తలఁతు
మిన్ని మాట లేల? యెవ్వఁడవో నీదు
నోటిమాట వర మనుగ్రహింపు. ౬౧

గీ. అని మును లభిష్టుతింపఁగా నలరి పలికె
సజలజలదస్వనమున విశ్వప్రభుండు
సమనిజాకృతిఁ బరికించి సంభృతార్థు
లైతి రనఘాత్ములార! సంయమనులార! ౬౨

చ. యమమున బ్రహ్మచర్యమున యజ్ఞమునన్ నియమంబునం దపం
బమలముగా ననేకజనులందుఁ బొనర్చినదానికిం బ్రసా
దమునఁ గనంగనై త్రిఁ బ్రమదం బవుఁగావుత మీకు యోగిబృం
దములకు మార్గదర్శకుఁ డన న్విహరింతు జగద్గురుండనై. ౬౩

ఉ. ఊరును పేరు బుట్టువనియు న్వినఁ గోరెద మంటిరేని వినుం
డారఁ బురాణశాస్త్రములయం దవి దోఁచు ననంతరూపముల్
ధారుణి మోయఁగా నయినఁ దద్విధ మంతయుఁ జెప్పలేఁడు మీ
కోరిక నిర్వహించు నొక కొంత పరాశరభూవినేయుఁడే. ౬౪

ఉ. వానికి నా ప్రసాదమున వ్యాసవరంబున నెల్లఁ దెల్ల మే
దేని వచించుఁ బ్రష్టుఁ డయి యీతఁడు సూతుఁ డనంగ ఖ్యాతుఁడై
దా ననలంబునం బొడమెఁ దత్త్వముఁ జెప్పుత నర్థ మింక నో
మౌనివరేణ్యులార! వినుమంతన మున్న వినుండహో ప్రీతితోన్. ౬౫

ఉ. పూనినదీర్ఘసత్త్రమను పున్నెముఁ బూర్తిగ నిర్వహించి క
ర్మానుగతం బనుత్తమము నౌ బహుభోగతతిన్ భుజించి వి
జ్ఞానయుతంబు జ్ఞానమును నాదయు నంది శరీరశాంతిపై
మానసవాగగోచరము మత్పరభావము నందువారలన్. ౬౬

శా. యోగాదేశకరుండనై విభుఁడ నయ్యున్ సంతతాంతర్మహా
యోగప్రాభవుఁ డత్రిమౌని కనసూయాగర్భమునం దర్భక
శ్రీగూఢంబుగఁ దోఁచి యోగిచయము ల్సేవింపఁగా నాత్మనం
త్యాగాత్తం బవు దత్తనామమున సఖ్యాత్ముండనై యుండెదన్. ౬౭

గీ. మీ రొనర్చిన యీస్తుతి మించుభక్తి
నాఱుమాసంబు లిరుసంజలందుఁగాని
యబ్ద మొకసంజ నైన నిత్యముఁ బఠింప
భుక్తి ముక్తియు నగు స్త్రీపురుషుల కని. ౬౮

గీ. స్వప్నదృష్టపదార్థంబుచాయ మునులు
విస్మయం బందుచుండ నవ్విశ్వవిభుఁడు

తై జననిధాన మపుడ యంతర్థి నెనసె
వచ్చి రల మునిశిష్యులు వనమునుండి. ౧౯

క. దున్నక పండిన ధాన్యము
లు న్న వనవకుసుమఫలములుం గందములుం
జున్నులు కుశసమిదాదులుఁ
గొన్నయటులె వచ్చి భక్తి గురుల కెరఁగనై. ౨౦

చ. మన వనసన్నివేశములమ్రాది గురూత్తములార! వింటిరా?
మును పతినిష్ఠురాగములు ముళ్లు భుజంగమవృశ్చికాదు లు
త్స్వనములు కీచురాల్ కపులు శ్వాపదముల్ వెడపక్కు లొక్కటన్
గనులకుఁ గాక కాళు లిడఁ గాక మనంబున భీతి వెంచెడున్. ౨౧

శా. ఈనాఁ డేలొకో మాతె నిన్నియుఁ గనుం డీ సూనవల్లీగణం
బీ నవ్యప్రియసత్ఫలాగనిచయం బీ శాంతపక్షివ్రజం
బీ నానాకమలాకరోత్కరము నీ యింపౌ మృగానీక మి
ట్లై నాకప్రమదావిహారసదనం బౌ నందనం బౌ ననన్, ౨౨

క. ఈనాఁడు మేము తెచ్చిన
సూనఫలపదార్థజాతిఁ జూచితిరా? యి
ట్లేనాఁడు దొరకినవి మును
కానీ తెలియంగలేము కారణ మెదియో? ౨౩

గీ. అను వినేయులపలుకుల నాలకించి
కాంచి యటు నిటు కలకించుకౌతుకమున
నీశునిప్రసాదవైభవం బిది పొదమని
గురులు చెప్పిరి శిష్యులకు న్సకలము. ౨౪

క. వారలు దమయాశ్రమమున
కారీతి న్వచ్చి చనిన యచ్యుతు విని త
త్కారుణ్యము నిజభాగ్య
శ్రీరాహిత్యంబుఁ దలఁచి చింతించి రొగిన్. ౨౫

సీ. అడవిలో సంవాస మాచార మొక్కటి
యాచార్యసేవాపరాయణులము
అధ్యయనించిన యట్టి వేదంబుల
యర్థంబె చింతింతు మనుదినంబు
అగ్నిశుశ్రూషణం బటు బ్రహ్మచర్యంబు
నేమములంబో మెది యొట్టులైన
భాగ్యంబు లేదయ్యె భగవంతుఁ డింటికి
వచ్చినఁ గన్గొనఁ బడయమైతి
మకట! విధినిఁ గాంచి యంధులఁ బో నిర్భాగ్యుఁ
బాత్మచరితమట్టు లయ్యెఁ గాక
మేల పుట్టువలయు? నిది మేలిపుట్ట న
సమయమున నటువిఁ జనెడు బుద్ధి. ౭౬

ఉ. వ్యర్థుల మైనాతి మింకఁ బలుపల్కులలోఁ బనేమి? యంచు ని
వ్యార్థులు శోభ మొప్పఁగ మహాత్ములు వారల నూరడించి మా
యర్థము సన్నిధానమున నక్కట నీ యది కాదొ? యింతకే
వ్యర్థత లెంచ నేల యని వారి సగీ యనిపించి రల్లనన్. ౭౭

గీ. అంత నానాదిశార్మ్యం బసంతరాయ
ముగ మునీంద్రులు గడిపి రామోద మొసఁగ
వచ్చె మఱునాఁడు వారిసంబరము వెనుక
వ్యాసశిష్యుండు సూతమహర్షి వరుఁడు. ౭౮

ఆ. సంధ్య స్నానహోమజపములు తపములు
నిత్యములు వొనర్చి నియతి వొసఁగ
నఖిలమునిసమాజ మాసీన మయ్యె స్వ
యాంబకములు సూతునందుఁ జేర్చి. ౭౯

ఉ. నిన్నటిదేవు చెప్పినపనిం బరమాదరలీల మాను ల
భ్యున్నతభక్తియుక్తిఁ గుతుకోర్జితబుద్ధ్యనురాగసంపదం

గ్రన్నన సూతు మెచ్చి యడుగం దొరకొనయి రన్న! బుద్ధిసం
పన్నత లెన్న మాకుఁ దరమా? కొనమా భవదుక్తిరత్నముల్? ౧౦

క. ఇతిహాసములు పురాణము
లతివిశదములైన పూర్తయాగాదివిధుల్
శ్రుతిగతము లయ్యె నీతో
నుతింప లేకున్నవా ర్కినను న్మునిముఖ్యుల్. ౧౧

ఆ. వ్యాససుప్రసాదభరితుండ వని కాక
స్వామి నిన్నుఁ జెప్ప సరణి నెంచి
ప్రహ్వులైరి మునులు భవదుక్తిరముఁ గొన
నవధరింపు వీరి యాశయంబు. ౧౨

సీ. అనసూయ కత్రికిఁ దనయుఁడై యెట్లుత
ద్దత్తనామప్రాప్తి తగవు బిగువు
బాలజడోన్మత్తలీలాచరణములు
తద్దిగంబరచరితంబు డంబు
నన్నిలోకంబుల నాదేవుభక్తుల
కథలు యోగాదేశకలన లోలిఁ
దత్ప్రసంగంబులు దత్ప్రసక్తంబులు
దన్మహాత్త్వంబులు తద్గుణములు
అసలు వాసుదేవుఁ డఖిలసమాశ్రయుం
డేల యిట్టిలీల లెనయవలసె?
లోకసంగ్రహంబు లోనుగ నీయెఱిం
గినవిధ మ్మఖిలము వినుచు మనఘ! ౧౩

గీ. సచ్చిదానందఘనుఁడైన స్వామిబోధ
విధము చెప్పిన తలఁచిన వినినవారి
తాపము హరించు సంపదఁ దార్చుఁ బెంచు
జ్ఞాన మానంద మెలయించు సంగ మొసఁగు. ౧౪

గీ. మునిఁ బురాణు నచింత్యరూపునిఁ గవివరు
నాదిదేవు ననంతమాహాత్మ్యు నతుల
భువనహిత మెంచి తప ముగ్రము నొనరించు
నబ్జనాభు నారాయణు నభినుతింతు. ౯౧

క. నారాయణగుణయోగో
దారతపఃప్రాభవునకు దంభోద్భవదు
ర్వారాహంకృతిహర్తకు
హారిసుశీలునకు నరున కానతు లిడుదున్. ౯౨

సీ. బ్రహ్మాండమునకు నావరణంబుగా నుండి
లోకేశునికమండలువునఁ జేరి
విష్ణుపద మంటి విష్ణుపదస్థయై
స్వర్గంగ నాఁ ద్రిదివంబు నెసని
విశ్వేశుమౌళి నువ్విళ్లూరుచుండి వి
శ్వాఘౌఘహరణకార్యప్రసక్తి
నవనికి డిగి తుహినాద్రిసంభవ జహ్ను
కన్య భగీరథఖ్యాతిలహరి
యన నెగడి భోగవతిపేర నహిపదమున
నమరి కన వినఁ దలఁప స్నాన మొనరింప
నంతరంగమలంబుల నపహరించు
తల్లి గంగమ్మఁ గొలుతు వాగ్ధార లొలుక. ౯౩

క. శ్రీసురభిళవాఙ్మదధా
రాసారసుగంధచర్చితాఖిలలోకున్
వ్యాసుం గవిమాతంగము
నా సాత్యవతేయుఁ దెలఁతు నర్పించి నతుల్. ౯౪

క. స్తంబేరమ మొక్కటి హే
రంబపదం బంది రాగరమఁ బంబి గుణా

లంబం బయి దోలఁచు న్వి
ఘ్నంబుల దానికి నమస్య ఘనమతిఁ గూర్తున్. ౯౫

గీ. తల్లి! నతుఁ డైతి నర్థింతుఁ దత్ప్రసత్తి
విషయవాహిని యెడపడ వెలయుఁగాక
వాగ్విభూతి చేతస్సరస్వతి పొసంగ
నోసరస్వతి! మముఁ గాంచు మొక్కకంట. ౯౬

క. గురులకు మునులకు మ్రొక్కెదఁ
బరమేశుం దెలఁచి మీకు వర్ణింతు జగ
ద్గురుదత్తచరిత మంతః
కరణము కరణములు పోలిచెఁ దద్గతగతులన్. ౯౭

సీ. దత్తదేవుని గుణతత్త్వవర్ణన మేడ?
మందుండ నామందమతియు నేడ?
అజముఖాంతరమున నమరునే కూష్మాండ
మిల మేరు వావలోఁ నిముడఁ గలదె?
కుంటి యెక్కఁగలఁడె కుధర? మంధుం డెందు
వస్తుపరీక్షకు వలనుపడునె?
పొడవువానికి నందఁబోని ఫలంబుకై
చేతు లెత్తిన పొట్టిచెయిద మయ్యె
ననుకొనం దగ దే నుపాయంబుకలిమి
స్వాయము లేనట్టి జగము యత్సత్యమునను
సత్యముగఁ దోఁచుచున్నది సంస్మరింతు
నట్టి భగవంతుఁ దచ్ఛక్తి ననువదింతు. ౯౮

క. కొనియాడుదు జనహృత్ప
ద్మనివాసు నధీశ్వరు నమితశిరఃకరపా
దనయనహృదయోదరనా
భినలినభవు విశ్వరూపు విష్ణున్ జిష్ణున్. ౯౯

మ. అనసూయాత్రులపున్నెము ల్వొరుగ దత్తాత్రేయసంజ్ఞ న్విరిం
చనవేషం బొకకొంత కొంత హరివేషం బీశువేషం బొకిం
త నితాంతస్పృహణీయమై కనుల కానందంబు సంధింప భ
క్తనికాయంబుఁ బ్రబుద్ధముం జలుప నద్దైవంబు మా కయ్యెడున్.

సీ. కర్పూరగౌరుండు కాలాబ్దనిభుఁడు జ
పారక్తుఁడైన త్రివర్ణకునకు
శ్వేతాంబరుండును బీతాంబరుండును
వ్యాఘ్రాజినియు నౌ త్రివాససునకుఁ
పక్షీంద్రవాహనుం డుక్షవాహుఁడు హంస
వాహుఁడు నైన త్రివాహనునకు
స్వర్ణసూత్రధరుండు బ్రహ్మసూత్రియు నాగ
సూత్రధారియు నౌ త్రిసూత్రకునకు
నభ్రగంగఁ దాన మాడి లక్ష్మ్యాలయ
మందు భైక్షముఁ గొని యాశ్రితాళి
కొలువ సహ్యకుధరకోటి నాసీనుఁడౌ
వశికిఁ ద్రిశిరున కివె వందనములు. ౧౦౧

క. ఒకచో బాలుఁడు వృద్ధుం
డొకచో నొకచోఁ గుమారుఁ డొకచోఁ దరుణుం
డొకఁట జటి యొకఁట ముండితుఁ
డొకఁట శిఖావంతుఁడౌ త్రియుగు ఘనుఁ గొలుతున్. ౧౦౨

చ. వినతసురాసురుండు మదవిహ్వలలోచనుఁ డామరాంగనా
జనవృతవామభాగుఁడు లసత్కుసుమాంబరరుక్మదేహుఁడై
కనఁబడు నొంట మద్యచషకంబు ధరించి మహానుభావ మె
ప్ప నెవఁడు యోగసృష్టవిభవంబున మించు నతం డితుం డగున్. ౧౦౩

శా. బాలోన్మత్తపిశాచవేషుఁ డగుచుం బానావశేషాసవ
వ్యాలిప్తుండు దిగంబరుండు నయి నంగాంగంబులం దీఁగ లే

వేల నెన్నంగఁగ నొక్కచో నొకట భావిస్ఫూర్తి భక్తాలికిం
బోల న్బుద్ధులు సెప్పుచుం గనఁగ నా పుణ్యాత్ము ధ్యానించెదన్.

ఉ. చేతులు లేని యర్జునుఁ డశేషగురు న్నినుఁ జెంది శిష్యుఁడై
చేతులు వేయుఁ గల్గి సహసింధుసకాననసాంతరీపమౌ
భూతల మెల్ల నేలెఁ బరిపూర్ణుఁడు సిద్ధుఁడు సర్వసాక్షి వి
ఖ్యాతుఁడు వాయుభూతుఁ డనఁగా నెగడెంగదె దత్తనాయకా! ౧౦౫

గీ. యద్వచోఽమృతపానహృష్యన్మనుఁ డయి
యల్ల ప్రహ్లాదుఁ డపుడె మోహ మెడలంగఁ
బరమపద మందఁ గలిగెనో? ప్రస్తుతింతు
నట్టి యోగీశు నిన్ను నహర్నిశంబు. ౧౦౬

మ. పితృశాపంబున భ్రష్టుఁ డయ్యు యదుఁ డానేగంబులో నొంటిమై
గతవస్త్రాంగములోఁ జరించు నినుఁ గాంతుం జేరి సేవించి సం
భృతభక్తి స్మరణంబు సేఁడి కృతియై విజ్ఞానియై. వంశవి
స్తృతిఁ జేయం దగె నట్టి యట్టి నిను నేఁ జింతింతు దత్తప్రభూ! ౧౦౭

ఉ. వ్రేలుజటాకలాపము లె వ్రీడఁ గొన న్నిలయందు నుండి మా
దాలసుఁడౌ నలర్కవసుధాపతి పాదము నట్టె సేఁడనో
వేలనె స్వస్వరూపపరివేదనయోగము సిద్ధిఁ గూర్చి మో
హాలయసంభవాబ్ధిని దయాబ్ధి నడంపవె? దత్తసత్తమా! ౧౦౮

క. యోగపతి! యోగసిద్ధిద!
యోగాత్మ! పరేశ! యోగయుగ్యోగము! సం
యోగవియోగాదికసం
త్యాగలసదమూర్తమూర్తి! త్ర్యధినాథ! నతుల్ ౧౦౯

గీ. బలము బలవంతులందు విద్వాంసులందు
జ్ఞాన మోజస్వులందు నోజంబు మునుల
యందు మౌనంబు తపసులయందుఁ దపము
చల్వ శీతమ్ములందు నుష్ణముల వేఁడి. ౧౧౦

గీ. శాంతి శమములందు క్షమములందు క్షాంతి బుద్ధి
బుద్ధిమంతులయందు ధర్మవు సధర్మ
లందు భూతభవిష్యభవ్యమ్ము లెవియు
నీవు కాక నిరూపింపరావ కదవె? ౧౧౧

క. ప్రకృతివి ప్రత్యయమవు నై
ప్రకృతికిఁ బురుషునకు సమవిభక్తుల నుక్తుల్
సుకృతమునఁ గూర్చి సర్వ
ప్రకారముల వెలుఁగు నీకుఁ బ్రణతులు దేవా! ౧౧౨

గీ. ఒకమునికుమారకుండ నే నొప్పు నెట్టు
లిట్టికొనియాట లనెదవో? యేకమూర్తి!
మునిసుతుండవై కాక వామనుఁడవట్టె
బలిఁ గికురువెట్టి త్రిభువనిఁ గొలుచునాఁడు? ౧౧౩

సీ. పాణియందు జలంబు పడెనొ? లేదో? చిట్టి
పొట్టివేసం బెందుఁ బోయె దేవ!
లోకలోకంబులు లోకేశులును నీకు
లోకువగా నతిలోకుఁ డైతి
నాభిప్రదేశంబునం గటిదేశంబు
నం జానుభాగంబునం దడఁబడి
నలగరే సూర్యచన్ద్రము లీ వడుగు చాచి
ముల్లోకములు కొల్వ మొనయువేళ?
నాఁడు నీకాలిగోరంటి నలువగుడ్డు
పెంకగలి చెమ్మరించిన వెలుపలిజల
ధార గదె వ్యోమ కేశునితలకు దారి
యబ్ధిఁ జొరఁబాఱె ముల్లోక మాక్రమించి? ౧౧౪

క. నాలుగుమొగములవేలుపు
నాలుగువేదములనతుల నతులర్ నుతులర్

బోల నినుఁ గొలిచి పేరిడ
నాలలి గాంగతకు గంగ యను నక్షరముల్. ౧౧౫

క. ఎక్కడ నెపు డె ట్లన్ని ప్ర
థక్కులనల యోగమాయఁ దవిలి రమింతో
యక్కొల లెఱిఁగి వచింపఁగ
నొక్కఁడు గలఁడే యఖండ యోగేశానా! ౧౧౬

ఉ. కావున నాదిదేవుని నఖండుఁ జిదాత్ము నశేషరూపు స
ద్భావు నమాను ద్వైతరహితప్రకృతిన్ స్వసుఖానుభూతిసం
భావితుఁ బ్రత్యగాత్ముఁ బరమప్రభు నిత్యము సంశ్రయించి నీ
పావననామరూపగతివర్ణన నిట్లు కృతార్థుఁ డయ్యెదన్. ౧౧౭

క. అని కొనియాడి హృషీకే
శుని బౌరాణికుఁడు స్థిరవిశుద్ధాసనుఁడై
మనమున నింద్రియగతిఁ గొని
ప్రణిధానం బొప్ప నుండెఁ బ్రాణం బాఁగన్. ౧౧౮

ఉ. అప్పటి కప్పుడే వెలసె నాతనిమానససీమ నెన్నసొ
చొప్పున మూఁడు మోము లినసోమకృశానువిలోచనమ్ము లా
రొప్పు భుజమ్ము లుజ్జ్వలజటాగ్రితమాళి రహింప నింపుమై
నప్పరమేశుఁ డాముని నిజాంఘ్రినఖాంశుధుతాజ్ఞతాఘుఁడై. ౧౧౯

గీ. వికచవదనాంబుజుఁడు దివ్యపీతవసన
ధరుఁడు దత్తేశ్వరుండు ప్రత్యక్షముండి
వర మిడఁగ వచ్చినాఁడ నీవాఁడ ననుడు
సూతుమెయి స్వేదరోమాంచసహిత మయ్యె. ౧౨౦

క. ఆనందసాత్త్వికాప్తిన్
డా నేమియుఁ బలుక లేక తడఁబడుసూతున్
మానించి దేవుఁ డనియెన్
భానునిభుఁ డనుగ్రహం బుపజ్ఞము గాఁగన్. ౧౨౧

ఉ. మాపయి భక్తి నీరచితమంజులసంస్తుతి నెవ్వరేనియున్
రేపును మాపుఁ బూజ లొనరించుతఱి స్మరియింతు రట్టివా
ర్పాపము లూడ్చి యైహికశుభంబులు గోరిన వెల్లఁ జెంది దే
హాపరమంబునాఁడు నను నొందుదు రస్మదనుగ్రహంబునన్. ౧౨౨

ఉ. నీవును నామహాత్త్వము మునిప్రవరు ల్విన విన్చి శుద్ధిసం
భావితబుద్ధియోగము సమభ్యసనం బొనరించి యంతమం
దావరణాదు లూడ్చి ఘనమా మహిమస్థితి నుందు వంచు నా
దేవుఁ డదృశ్యుఁ డయ్యె ముని తృప్తి వహించి యెలర్చుచుండఁగన్.

క. నూతుం డప్పుడ కన్నుల
మూతల నెడలించి చూచి మునిపుంగవులన్
బ్రీతిలి వారలు మెచ్చఁగఁ
జేతోముద మెల్లరియొడలఁ జిందు లిడ ననెన్. ౧౨౪

గీ. దత్తదేవపదాంభోజదత్తచిత్తు
లై వినుఁడు తత్ప్రసత్తి నే ననువదింపఁ
బోవు గురుశిష్యసంవాదము మహాత్మ్య
దత్తత త్తపానుత్తేష్టసంత్యక్తులార! ౧౨౫

గీ. నియతుఁ డై యందు నధ్యాయ మయిన శ్లోక
మయిన శ్లోకార్థ మైన నొం డక్కరంబ
యైనఁ జదివెడు వినెడు మహాత్ముల కది
మొనయు ముంగొంగు బంగరుముడియ చుండు. ౧౨౬

గీ. విజనకాంతారములయందు విషమదశల
దీన నే నైన నొక నుతి దేవుఁ దలఁచి
యేడు వారమ్ములు పఠింప నెడసిచనును
సంకటంబులు దత్తప్రసాదమునను. ౧౨౭

క. పరమర్షు లడిగి రనఘా!
గురుశిష్యపదద్వయమునకుం దగు నర్థం

బరిదముగఁ దెల్పుము మొదలం
దరువాత వినియెద మర్థిఁ దత్కథ లెల్లన్. ౧౨౮

## బ్రహ్మ కలి సంవాదము

ఉ. దానికి సూతుఁ డిట్లనె సుతవ్రతులార! వినుం డపూర్వ మా
ఖ్యానము పద్మకల్పమున నచ్యుతునాభి విరించి తోఁచి ని
ర్మాణము సేసె విశ్వము చరం బచరంబును నందు సన్మతిన్
మానవులందు నేర్పఱిచె నాలుగు వర్ణము లాశ్రమంబులున్. ౧౨౯

ఉ. వానికి ధర్మనిర్ణయ మవారిగఁ జేయు మనువ్రజంబు నా
నైన యుగత్రయంబు గరిమం గలిగించి స్వకాలయుక్తిఁ దో
జా నగు ధర్మసంతతిఁ బ్రచారము సేయఁగ భూమి కంపె నా
పై నొకని సృజించెఁ దలవంచెను వానినిఁ జూచి రోయుచున్. ౧౩౦

గీ. పేరుపెట్టెను గలి యని పెద్దతనముఁ
బూర్వులకుఁ బోలె నిచ్చె నప్పు డతనికిని
శీఘ్రఫలద మ్మది వివేకశీలుర కని
చారులకు నధఃపతనంబు సంతరించు. ౧౩౧

గీ. వాఁ డతిక్రూరుఁడు పిశాచవదనుఁ డిష్ట
కలహుఁ డానాఁడె యాఁడె నాల్క నొకచేత
నొండుచే మగఁడుఁకి గొని బెండుపడుచు
నవ్వు చేష్టుచు నున్నాఁడై నలువయెదుట. ౧౩౨

ఉ. అట్టివిధంబు చూచి నలినాసనదేవుఁడు చిన్నినవ్వుతో
నెట్టన నిట్టివేసమున నృత్యము సేసెద వేమిరా? కలీ!
గట్టిగ నీపనిన్ నెఱపఁగాఁ జను మర్వర కన్న వాఁడు నా
కిట్టి నియోగ మేల యిడె దీశ్వర! యంచు వచించె ధృష్టుఁడై. ౧౩౩

సీ. నన్ను నంపకు మీశ! నరతండములమీఁదఁ
బెత్తనంబు నమర్చి వేసు నట్లు

సర్వవిచ్ఛేదంబు సలుప నౌవాని ని
రానందు నదయు నిరంకుశగతిఁ
గలహానిద్రాప్రియుఁ గలుషాత్ముఁ బరదార
పరధనహరణతత్పరహృదయుని
మాత్సర్యలోభదంభప్రియజనసఖు
స్వోదరపూర కైకాదరు ఖలు
నేను ప్రభుఁడ నైన నేకాంతయోగసం
న్యాసకై తవముల నందు నందుఁ
బరులఁ దమ్ము నొకట వంచించి వెడఁగు లై
యుందు నందుఁ జెడుదు రెల్లవారు. ౧౩౪

క. అనుటయు నీపైఁ గన్నిడి
తన యాయువుఁ దలఁచి పుణ్యతత్పరుఁ డౌ వా
ని నొకొక్కని వర్జింపుము
కొను మితరుల రాగపరులఁ గుత్సితమతులన్. ౧౩౫

క. అను విధి కి ట్లనియెం గలి
ఘనశాస్త్రవు లున్నవారు తన్మాతలమున నా
కు నడు గిడవచ్చు నెట్లు స
వనాదులం బొల్చు భరతవర్షమునందున్? ౧౩౬

గీ. మరల విధి వల్కె నెవ్వ రం దరులు నీకు?
నిన్ను వా రేమిసేసిరి? నిర్భయుఁడవు
కాలరూపుఁడ వజ్ఞేయగతి వెలుఁగరు
పండితులుకూడ దుర్ధర్ష భావు ననుచు. ౧౩౭

క. అది విని కలి యను దేవా!
మదరుల వర్ణింతు వినుము మాపును రేపున్
నదయు లగు నెవరివలనన్
సదరుఁడ నై సుఖము లేక జ్వర మొనయుదునో. ౧౩౮

క. శివనామము హరినామము
శివకథ హరికథయు గంగ శ్రీకాశి తదు
త్సవములు సవములు సత్సం
గవదాన్యత్వాదు లెన్నఁగాఁ దర మగునే? ౧౩౯

గీ. ఎవ్వఁడేనియు శాంతి నొక్కింతసేపు
ప్రాకృతుం డైన దంభంబువలన నైన
నుండెనా? గుండె లదరి నే నుడుకుచుందు
నీయెదుర నే మనంగల నే మహాత్మ! ౧౪౦

ఉ. పండువు కాదె? నాకు నొక వ్యగ్రుని దారసుతాదిరాగని
త్యుం డవువాని వేదమత మొల్లనివానినిఁ గల్లరిం గనం
బండితులు న్జితేంద్రియులు వైష్ణవశైవజపార్చనాపరుల్
ముండితముండు లున్న నటు పోదునె? భీరుఁడ వారికిన్ విభూ! ౧౪౧

ఆ. అనుడు నీప్రభావమునఁ దత్ప్రచారంబు
విరల మగును భయము విడిచి చనుము
సందియంబు లేదు క్షమ సుఖముండు మం
చాన సేయు నజున కతఁడు మ్రొక్కి. ౧౪౨

గీ. ప్రభుఁడ! వారికి మూఁరు స్వభావము లిటు
లేటికి విరుద్ధరూపంబు లెనయవలసె?
నన్ను వారలు వారి నే నెన్నఁడేని
యును సమున్మాలితులఁ జేయ కుండలేము. ౧౪౩

గీ. అని యడుగ నప్పితామహుం డనియె నోరి!
కాలమల మీవు మలమునఁ గలదె శుద్ధి?
నీరిపుల కెందు నది లేమి నీకు వారి
కెపుడు కలహంబు తప్ప దొం డేమి వలయు? ౧౪౪

చ. వివదిష నీస్వభావము వివేకవిచారుల కీవు మంచివాఁ
డవె భగవత్పరు ల్బుధు లెడందఁ గలిం జనిఁ గోరుచుందు రే

కవులు విశుద్ధధర్మము వికారము లాఁగి గడింపనేర్తురో?
భవ మిఁక లేదు లేదు కలిబాధయు వారికి లేరు శాత్రవుల్. ౧౮౫

సీ. కాశికావాసంబు గలుగువారికి జనా
ర్దనుఁగాని శివుఁగాని తలఁచువారి
కాచార్యసేవాపరాయణులకుఁ బితృ
మాతృద్విజన్మసంభావనులకు
ధేనుశుశ్రూషావిధివశంవదులకును
దులసీవనుల నెప్డు నిలుచువారి
కీశ్వరార్పణబుద్ధి నిజ్య సల్పెడువారి
కతిథిదేవత లైన యట్టివారి
కెడము కలుగంగఁ బొమ్ము నీ వడఁచి తేని
నడఁగ దవ్వారి మహిమ రవ్వంత యేని
నట్టివారికి వెస నభయప్రతిష్ఠ
గలుగుకాలంబు సుహితంబె కాదె తలఁప? ౧౮౬

సీ. పున్నె ముండిన శాస్త్రముల సక్తి జనియించు
గురుసేవ దానితోఁ గూడివచ్చు
సంప్రదాయజ్ఞాతశాస్త్రసారాసార
సువివేకమునఁ దత్త్వశోధన మవు
నాత్మసారత్వాంశ మది కెక్కినా? కృత
కృత్యుఁ డై కాశి కేగ కుండఁ
డివ్విధంబునఁ గాశి నెఱిఁగి సేవించెనా?
పరమశాశ్వతపదప్రాప్తుఁ డగున
యింతకును మూలము పురాణసంతతశ్ర
వణము నాచార్యసేవాప్రవణత చువ్వె
వాన సాధనసంపత్తి వరుసఁ గలుగు
సుకృతహీనున కభయమ్ము సుఖము లేద. ౧౮౭

క. మరలం గలి ప్రశ్నించెను
గురు వన నెవ్వం డెవనికి గురు వతఁడు స్వరూ
పరహాస్యం బెయ్యది త
ద్గురుపదతాత్పర్య మనుము గురువర! యనుచున్. ౧౪౮

గీ. సిద్ధి నిచ్చు గకారం బనిన మడంచు
రేఫము హరి యుకార మీ త్రితయము గురు
వన గణేశాగ్నిబీజమధ్యమున నున్న
యచ్యుతుఁడె ద్వ్యక్షరాత్మక మ్మదియె మనువు. ౧౪౯

క. ధర్మార్థకామమోక్షము
లర్మిలి నొసఁగఁగ సమర్థ మగు గురుమను వా
నిర్మాత మాత పరశివ
భర్మాంబరు లజుఁడును గురుపదనిష్ఠేయుల్. ౧౫౦

గీ. శివుఁడు కోపించెనేని? రక్షించు గురుఁడు
గురుఁడు కోపించెనా? లేఁడు కుతలమందుఁ
ద్రాత యొక్కండు గాన తత్పదము హార్ద
మరసి గురు నాశ్రయింప నౌ నభయ మెనయ. ౧౫౧

గీ. హరి ప్రసాదింతు నని వచ్చెనా? వదింత్రు
వైష్ణవోత్తము లురుగురుభక్తి నెందు
గురు ప్రసాదంబు కలిగెనా? సుధరధరుఁడు
సర్వసిద్ధిదుఁ డీశుండు సంతసించు. ౧౫౨

క. గురుసేవవలన శాస్త్రపు
సరణులు తీర్థవ్రతములు సద్యోగతపో
భరవర్ణాశ్రమభక్తివి
వరపరమాచారముల విభవ మెఱుఁగ నగున్. ౧౫౩

ఆ. దేవదేవ! సర్వదేవమయుం డని
శివునిఁ జెప్పినట్లు చెప్పితి గురు

మనుజమాత్రుఁ డాతఁడును శివునంత లె
ట్లయ్యె? సంశయంబు నపనయింపు. ౧౫౪

క. అను కలిమాటకు ద్రుహిణుం
డని శాస్త్రశ్రవణ మెట్టు లగు గురుఁ డెడ గా?
ఘనశాస్త్రశ్రుతి లేకయె
నిను గెలువన్ ముక్తి గాంచ నేర్తురె యెరుఁగ? ౧౫౫

## గురుశిష్య సంవాదము

క. విను మితిహాస మ్మొక్కటి
మును గోదావరిపరిసరమున నంగిరుఁ డ
న్మునియాశ్రమ మొక్కటి కల
దనుత్తమతపస్వు లుందు రందు నియతు లై. ౧౫౬

గీ. వారిలో వేదధర్ముండు పైలతనుజుఁ
డుండెను మహర్షిసత్తముఁ డూర్జితుండు
వేదవేదాంగపారగుల్ వీనిశిష్యు
లెందఱెందఱో యజునంత లేసివారు. ౧౫౭

గీ. దీపకుం డందు నిజకులదీపకుండు నిగమశాస్త్రపురాణము ల్నేర్చి పేర్చి
నైష్ఠికబ్రహ్మచారి యైననిచె నందె గురుసమర్చారతిం దృప్తిఁగూరకున్న.

చ. అతఁ డొకనాఁడు చేరి గురు నంజలిఁ గూర్చి మహానుభావ! ప్రొ
క్కితి నిదె శిష్యదీపకుఁడఁ గించిదుపేయ మెఱుంగఁ గోరి యా
నతికయి వేచియుంటి గురునాథ! యటం చని సన్నతో నమ
స్కృతి మరలం బొనర్చి గురుశిష్యపదంబుల కర్థ మే? మనెన్. ౧౫౮

చ. గురుఁ డను మేలుమేలు జనకుం డన లోకముమంచి గోరి యి
ట్టిరకము ప్రశ్న మెత్తితి గడించితి పున్నెము దీన వత్స! యు
ర్వర గురుభేదము ల్గలవురా బహులంబుగ నైన సర్వసం
పరిచిత మైన లక్షణము భద్రముఖా! విను మున్ను చెప్పెదన్. ౧౬౦

## గురుశబ్ద నిర్వచనము

ఉ. తాను గృణాతి ధాతువునఁ దద్గురుశబ్దము పుట్టె నెవ్వఁడే
వ్వానిహితంబుఁ గోరుకొను వాఁ డగు వానిగురుండు వారిలో
మానిత మాత తండ్రి గరిమం దదనంతరుఁ డాప్తి చెప్ప నా
నేని నతండు మామయుఁ బితృవ్యుఁడు మాతులుఁ డన్నయు న్గురుల్.

ఆ. తల్లితండ్రి తండ్రితండ్రియుఁ దండిరితల్లి తల్లితల్లి తల్లిచెల్లె
లింతవట్టువారు హిత మెదఁ గోరుట గురువులైరి మిత్త్రుఁడురుగురుండు.

చ. కొమరునిఁ గాంచి పెంచి జనకుం డుపనీతు నొనర్చి సాంగవే
దములు పదక్రమాఖ్యములు దర్శనము ల్మహితార్థయుక్తి బో
ధ మొనరుపన్ మహాగురుపదం బెసయుం బరుఁ డైన నప్పదం
బమరు గురుత్వమందు గురు లందురు శిల్పము లెవ్వి నేర్పినన్. ౧౬౩

గీ. ఐహికాముష్మికములు విద్యలు కల వి
లందు నొక యక్షరము చెప్పునతఁడు గురువ
తారతమ్యంబు కలదు తద్గౌరవమున
వేదవేదాంగవక్త ముఖ్యుఁ డడఁ బెద్ద. ౧౬౪

ఉ. అంతకు నెంత కైనఁ గడు నగ్గల మైన గురుండు వేదవే
దాంతరహస్యము ల్దెలిపి యంబుధిబోని భవంబు దాఁట నే
శాంతికిఁ గూర్చువాఁ డతఁడె శర్వుఁడు కేశవుఁ డబ్జజుండు తే
దంతకు మించు తత్త్వ మిల నాతఁడె కర్తయు భర్త హర్తయున్.

గీ. ఉభయదేహబంధంబుల నుజ్జగించి
బ్రహ్మ మెసయుంగ నగు నేని భవ్యకరుణ
నతని నాతండె పరము బ్రహ్మమ్ము పరము
గతియు నంతకు మిక్కిలి కలదె యెందు? ౧౬౬

శా. శ్రౌతస్మార్తపురాణశాస్త్రపంచకాధీశుల్ శైవశాక్తాదు లి
ట్లై తత్తన్మనుసంతతము త్రివిధము క్షేమానురూపైహిక

శ్రీతాంతంబులు సద్గురుం గొలువకే చెందంగరా వందుచేఁ
జేతోమోదము గూర్చు సద్గురుని వాసిన్ సంశ్రయింపం దగున్. ౧౬౭

మ. మతి నాచార్యపదారవిందముల సంవర్జించి మోక్షాప్తి క
య్యతిలోలంబు మనస్తురంగమము వాతాపాదిరోధంబుచేఁ
బ్రతిరోధింపఁగరాని దానిఁ గొన నై ప్రాల్మాలి నిర్యోగు తా
యతు లబ్ధిన్ గతకర్ణధారతరణివ్యాపారులై పోవటుల్. ౧౬౮

మ. నరదేహంబె సుతార మౌ పడవ దానం గర్ణధారుండు స
ద్గురుఁడే దేవుఁడె మేలి గాలి ఘన మౌ తోయాకరం బాత్మసం
సరణంబే యిది నిస్తరింపఁ గన రీసామగ్రియుం గల్గి యే
నరు లాయాత్మహాలం దలంపఁదగునా సత్యత్వశుప్రాయులన్? ౧౬౯

సీ. సరవి వేదంబులే "స గురు మే వాభిగ
ఛ్ఛే త్సమిత్పాణి" రం చుత్సుకమతిఁ
దా మొక్కచో నొంట "తర్కేణ మతి రాప
నేయా" యటంచుఁ దామే యిఁక నొక
పరిపాటి "నాచార్యవాన్ పురుషో వేద"
యని యి ట్లనేకసంస్త్వాయనముల
బహువిధంబులఁ జెప్పె భగవంతుఁ డతిగురు
భావభావితుఁ డవు వాసుదేవుఁ
డనియె శ్రీదాముఁ డనెడు ద్విజాధికునకుఁ
బ్రియున కాత్మహితునకు నిర్వికృతిమతికి
దాని వివరింతు వినుము ఛాత్రప్రకాండ!
దీపకాఖ్యుండ! స్వకులసందీపకుండ! ౧౭౦

## శ్రీకృష్ణ శ్రీదామ సంవాదము

చ. మన గురువాసవాసమును మాన్యచరిత్ర! తలంచుచుంటివా?
జనులు తమఃపరం బెనయు జాడకు జ్ఞేయ మెఱుంగ సంశ్రయిం

ననవలె సద్గురుఁ గనినవాఁ డాకఁ జింకాకరుండు వేదశా
స్త్రనిగదనుండు నన్నువలె జ్ఞానము పూఁడవువాని నన్న నా. ౧౭౧

గీ. గురుఁడనై నావచించు సంగరము చేత
సాగరము భవ మెవ్వారు సంతరింత్రొ
వారు వర్ణాశ్రమాచారవంతులగుదు
సర్ధకోవిదు లనఁదగు సత్క్రివారు. ౧౭౨

గీ. సర్వభూతాత్ముఁ డగు నేను సంతసింప
బ్రహ్మచర్యగృహస్థవ్రతసన్న్యాసముల
సంతసించెద సంతతాచార్యసేవ
నమున నిస్సంశయము లోకనంద్యచరిత! ౧౭౩

సీ. ఒకనాఁడు గహనమ్మునకు సమిత్తులు దేర
గురుదార బుత్తేర నరిగినాఁడ
మేఘముల మెఱుపుల మెఱపు ఘటించుచు
గాలి సోనయు వచ్చెఁ గానినేను
నస్తంగతుండయ్యె నా లోకబాంధవుం
డింతలో దెస లెల్ల నెసఁగెఁ దమము
పల్లంబు మెఱకయుఁ బాగోనుయుం బయ్యె
నేమియుఁ దెలియ దెంతెండుఁ గన్న
గాలి యమరఁగిన జలధారఁ గాయ మగలఁ
గాన్పు తెలియఁగక జానుదఘ్న మగు నీటఁ
గరము భయమున నన్యోన్యకరము లూఁది
మనము కలఁగితి మది మిత్రమా! స్మరింతు ౧౭౪

క. ఇది యెఱిఁగి మఱుదినము రవి
యుదితుండై నంత గురుఁ డనుత్తముఁ డొండున్
వెదకుచు వచ్చెం జూచె
న్విదారితుల మనలఁ గరుణ నెసవత్సలుఁ డై. ౧౭౫

క. నా చిన్నికూనలారా!
యీచెయిది మదర్థ మెంత లెంత లిడుమలఁ బా
సై చితిరి ప్రాణ లొడఁబలఁ
గాచికొన నలయుట వదలఁగా నయితి రహో! ౧౭౬

గీ. గురుఋణవిమోచనం బిదె కూర్పఁ దగిన
దన్ని విధముల గురున కాత్మార్పణంబు
శిష్యులకు శుద్ధభావంబు చెన్నుమీఱ
సంతసించితి మీకోర్కి సఫల మగుత. ౧౭౭

చ. చదువు లయాతయామతఁ బొసంగునుగావుత మీకు ధర్మమం
దెద గలవార లై గృహసమేధితు లర్థులఁ బుత్త్రవంతు లై
బ్రదుకులు సాల గల్గి శుభభాగిత కౌదురుగాత మం చనెన్
గదిసెఁ గవుంగిలించెఁ బులకంబులు జాదుకొనం దలంచెదే? ౧౭౮

గీ. గురుకులంబున నున్నప్డు కోవిదుండ!
యిట్టివె సువృత్తములు గల్గె నెన్నియేని
గురునెనరుతోఁ బ్రశాంతి కోఁ బురుషుఁ డెందు
నను జగద్గురుఁ గొలిచి బ్రాహ్మణుఁడు పలుకు. ౧౭౯

సీ. ఏమేమి సాధింప? మేము విశ్వంభర!
నీతోడ గురువాసనియతి కయితి
మావసనంబు శ్రేయస్సంహతులకు ని
స్తులము నీ మేను ఛందోమయమ్ము
కొనియాడఁ గలరె లోకులు? మాకు నినుఁ గూడి
కొనియాడఁ గలెగఁ గా కనఘచరిత!
లో వెలి నైక్యసంభావన నినుఁ జెంది
విస్మరింపఁగ నగు విధము కలదె?
గురువులను మమ్ము నెందఱఁ బరమకరుణ
సంతరింపఁగఁ జేయ నాచంద మంది

నాఁడవో? జగద్గురుండ వైన నాటకంబు
గాక గురువాసమా సత్యకామ! నీకు? ౧౮౦

గీ. అనుచు నన్యోన్యమునుం బొంగి రామహాత్మ్య
లిది సదా మదిఁ దాల్ప నౌ సదమలులకు
మొదల గురుభక్తి యీశుతో ముక్తి పిదప
సరవి సముపస్థిత మగు నిస్సంశయమ్ము. ౧౮౧

మ. గురుశబ్దార్థము వింటివా? యిదె యొసంగున్ శిష్యశబ్దంబునన్
గురుచేతన్ హితశాసితుం డతఁడు సెందున్ భోగమోక్షంబు లం
దురు భోగంబులు నిందు నందు బహువిద్యోద్యోతితంబు ల్శ్రుతి
స్మరణీయాగమసంప్రచోదితము లాచార్యానుబద్ధంబు లై. ౧౮౨

చ. ఇవి యెవి యెల్లకే శమముఖేప్సితసాధనసంపదాస్థితుం
డవహితుఁ డై గురుం గొలుచునాతఁడు తత్త్వ మెఱుంగ నైన వాఁ
డవనికి సొమ్ము మోక్ష మనఁగఁ గలఁ డుత్తముఁ డింత చెప్పితిన్
భవదనుయుక్తి కుత్తరము భవ్య! యిఁకేమి వచింతుఁ గోరరా! ౧౮౩

చ. అనిన నమస్కరించి స్వకృతార్థతఁ జాటెడు శిష్యుతో గురుం
డనుగతనైజకర్మపరుఁ డై యొసలారె నటంచు బ్రహ్మ చె
ప్పెను గలితో నినుండు మునివిశ్రుతులార! గురుండు శిష్యుఁ డన్
ఘనపదభావ మిద్ది యదుగ న్వివరించితి నేను మీ కిటుల్. ౧౮౪

క. గురువు పరబ్రహ్మం బీ
శ్వరుఁడు హరుఁడు హరి విరించి స్వస్సదులు గురుల్
గురువులు పితరులు సర్వము
గురుప్రసాదాప్య మఖిలగోలములందున్ ౧౮౫

గీ. ఎంతవానికి నైన నెం తెవనికైన నఁ
జిన్నపని యైనఁ బెద్ద వాంఛితమె యైన
గురువు లేకుండ నొంటఁ దోడఁ గూడఁబోవ
దనుచుఁ జాటి వచించెద ననఘులార! ౧౮౬

చ. అనవుడు మేలు మేలు మనుమా యమితాబ్దము లిట్లె సూత! తృ
ప్తి నెనయలేదు నీపలుకుఁ దేనియఁ గ్రోలియు దీపకుం డిటుల్
విని గురు నెట్లు గొల్చె? గురువృత్తము సొప్పడె నెట్లు? సెప్పు మా
మనువులు సెల్ల నాఘనులమాటల నన్న మునీంద్రు లా నన౯. ౧౮౭

గీ. అనియె సూతుఁడు కలికి బ్రహ్మ యనినట్లు
వింటివా? గురుశిష్యుల విధములఁ గలి!
వారి సంవాదకథ విన్నవారు నూరు
జనుల వృజినమ్ములఁ బాఁకార్పఁ జాలువారు. ౧౮౮

మ. ఒకనాఁ డాగురువర్యుఁ డాదరముతో నోనాన్న! నాజీవిత
మ్మ! కులాలంకృతి! యిందు ర మ్మనిన సమ్మానమ్ముతో మ్రొక్కి దీ
పకుఁ డోయయ్య! యనుజ్ఞ యే? మనుడు నా భావిజ్ఞుఁ డిట్లాడె స్వీ
యకృతిం జిత్తమునం దలంచి యనుభావ్యం బంచుఁ దచ్ఛాత్రుతో౯.

చ. అనఘ! పఠించినాఁడ వఖిలాగమసార మెఱుంగ నైతి విం
క నిచట నేల? వత్స! చనఁగా నయి గేస్తువు కమ్ము మే లవు౯
మనమున కించు వాని మతిమంతు మఱొక్క కలార్థి నేనుఁ గై
కొనవలె స్వార్థ మెంచి వెసఁ గోవిద! యన్న నతండు ని ట్లను౯.

గీ. ఏమి యానతి? గురుదేవ! యేను గలుగ
నింక నొరుఁ జూచికొనుపని యేల మీకు?
స్వార్థ మని కల్ల దుండిన నర్థిఁ దీర్ప
నితఁడు చాలఁడె? తప్పు సేసితినె? యనుప? ౧౯౧

క. పోవుదు నని నే ననవలె భావించి యనుజ్ఞ యీయవలె దేవర కా
కీవిధి తరుమంజనునే? పావన! హేతు వెది? యన్నఁ బలికె గురుండు౯.

సీ. పూర్వజన్మసహస్రముల సమార్జితములు
కలవురా శమవిఘ్నకరము లఘము
లవి యెల్ల నొయ్యన నా యాయి కృతములఁ
గడిగివై చితి మనఃకాయజముల

నవశిష్టములు కల వనుభవింపక తీఱ
వది శాస్త్రనిశ్చయం బని యెఱుఁగవె?
యల్ప మైనను గాశియందుఁ బ్రాయశ్చిత్త
మధికపాపమ్ముల నవలఁ ద్రోచుఁ
గాన నటఁ జేరి ఘనపాతకద్వయంబు
ననుభవింపఁ దలంచితి ననఘచరిత!
యంకసదుఁ బొందు శావలె ననుచరింప
నాత్మవిద్యనకన్న విద్యార్థి మేలు. ౧౯౩

క. అనవుడుఁ బిలిచిన వచ్చును
జనుఁ జను మన్నంతఁ బాపజాలమ్ములు మీా
కును నేల దుఃఖసంగ్రహా?
మను ననుగున కనియు మరల నాచార్యుఁ డిటుల్. ౧౯౪

చ. మనుజుల మౌనుల న్సురల మానక చేయుఁ గృతంబు లెప్పుడున్
వినుము నశింపఁబో వనుభవింపక కావునఁ దద్విదుండు చ
య్యన నవి నిష్ఫలంబులుగ యత్న మొనర్పనగున్ వివృద్ధిఁ జెం
దును దన మన్న వేళ నవఘాతములం బొనరింపకుండినన్. ౧౯౫

క. అనుచుండ నేన కొలిచెద
ననఘవిధానమున శక్తి కనుగుణముగ నా
జ్ఞ నొసంగుఁడు సంకోచ
మ్మొనయఁ జన దటన్న నురగ ని ట్లనెఁ దనియోన్. ౧౯౬

గీ. సువ్రతుండ! నే నగుదుఁ బట్టారహితుఁడఁ
గుష్ఠమున నొడ లెల్ల సంగూహిత మగు
నేకవింశతివర్షమ్ము లెట్టు లీవు
మచ్ఛరీరంబుఁ బాలించుమాట కగుదొ? ౧౯౭

గీ. అనఘ! నే నుండ మీా కేల? యట్టిమాట
కుష్ఠి నయ్యెద నయ్యెద గ్రుడ్డి నిట్లు

గురువరుండ! నాతలకుఁ దద్భరముఁ దార్చి
కుశలి వగు మను శిష్యునకుఁ గురుఁ డను. ౧౯౮

గీ. శిష్యునకుఁ బుత్త్రునకు నెట్టి చెడుగు లైన
నఘఫలం బీయ నౌదురా? యదియుఁగాక
కర్త బాధించుఁ బాపభోగ మొరు నెందుఁ
జెంద దటుగాన ననుభవించెదను నేనె. ౧౯౯

ఉ. భూషితసద్గుణా! తగని పోకడలన్ వెడఁ గైన వీని శు
శ్రూష మెలంగరా యదియ చు మ్మధిక మ్మవు కష్ట మింతకున్
బ్లోషితదోషుఁడౌ భుజగభూషణుపీటికిఁ గాశి కేగ నా
శేషము లందుఁ బొందె మఱి చెందెద మోక్ష మవిక్షతంబుగన్. ౨౦౦

చ. అనుడు నవశ్య మేగఁదగు నావిభు ధూర్జటిఁ గానఁ గాశికా
వనికి భవత్పదాబ్జపరివస్యకు నైన శివార్థి కిట్టి నా
కనుచుఁ బ్రయాణ మై గురుఁడు నాతఁడు నోయి రమేయభామయం
బనుగతగాంగవిప్రుషము నంబరకేశుపురంబుఁ జేరఁగన్. ౨౦౧

సీ. సుఖ ముండి రందు నా సుశ్లోకు లుత్కూ లై
కంబలాశ్వతరాంతికంబునందు
మణికర్ణికోత్తరమహితకూలంబున
జహ్నుకన్యాజలస్నాతు లైరి
విశ్వతో విశ్వేశు వీక్షించి సేవించి
రయ్యాయియాత్రార్థ మనుగమించి
రమరులఁ బెతరుల నర్థితోఁ దర్పిత
స్వాంతుల నొనరించి రింతలోన
వచ్చిపడెను బ్రారబ్ధం బవార్య మగుచు
నార్త్తుల మహార్తిఁ దోలఁప నౌ నంతవాని
కంధుఁ డై కుష్ఠరోగంబు ననుభవింప
నైనసందున నెన్నియో నయ్యో రుజలు. ౨౦౨

## కుష్ఠి యైన గురు శిష్యుఁ డుపచరించుట

ఉ. ఆశ్రమముఁ గోడ దీపకుఁ డహర్నిశమున్ గనిపెట్టి పూయపు
మ్మూత్రము లెత్తిపోయుఁ దనమూపున చీరము నొత్తి యొత్తి ని
ర్మాత్రము సేయు నుమ్మి మది రంజిల మాటలు సెప్పుఁ జేరి త
ద్గాత్రము సోఁకనీఁడు మశకమ్మునకుం జలిచీమ కీఁగకున్. ౨౦౩

ఉ. ఇంటికి నింటి కేగి వెస నిష్టము మిష్టము శుద్ధ మిద్ధ మౌ
వంటక మక్రియంబుఁ గొనివచ్చి సమాదరమేదురధ్వనిన్
మింటికి మంటికి న్మనసు మెత్తపడన్ గురుఁ బిల్చి భక్తితో
నొంటరమింటరంబు లను నొజ్జకుఁ బెట్టు నతండు భక్తమున్. ౨౦౪

గీ. ఆకఁటం గడు నాతురుఁ డా గురునకుఁ
బ్రాణసముపాసనావిధులందు నెందు
నందు నోర్వఁడు వాఁడు సచ్ఛాత్రుఁ డనఁగ
నిట్టి పరిచర్య మే ల్మాట గట్టుకొనియె. ౨౦౫

సీ. ఒకవేళ ననుఁగు వత్సక! తండ్రి! నాయనా!
యని ప్రేమ మొలయ నోరారఁ బిలుచుఁ
బాపపూరుష! నాకు దాపరమ్మైతి వె
ట్లో? పోకాలు మని తిట్టు నొక్కసారి
యొకనాఁడు తెచ్చిన యోదనం బంతయు
మెచ్చుచును భుజించు మిగులకుండ
రుచ వేప నొకతఱి రుచి లేదు పచి లేదు
పో మ్మని గొణుఁగు స్వల్పమ్మె మెసవు
నట్టివానికి రోగగ్రహమ్ము వట్టి
యాగ్రహము మేర మీఱి మే లరయఁడయ్యె
నవిజితేంద్రియుండు నసాధు వనఁగ నయ్యె
సాధు వయ్యె నింద్రియజయశాలి యయ్యె. ౨౦౬

చ. అరసము దైన్యయుక్తము శుభాశుభచింతన మింత లేక మ
చ్చరమున దోగుచుం గటుకషాయవిషాచిత మైన పల్కు ని
బ్బర మడఁగించుచు న్వెడలుఁ బ్రాక్కృతపాతకపంక్తిచేత నే
పురుషుల కెట్టి దుఃఖములు పోలవు దాని కలన్ గణించినన్. ౨౦౭

క. ఆవేదధర్ముఁ డెప్పుడుఁ దా వెదకును శిష్యదోషతతి దైన్యముతోఁ
దే వెస నని యడుగడుగున నావేదన దోఁప నడుగు నదనీయములన్.

గీ. సర్వము సహించి ఛాత్రుండు శ్రద్ధ మివుల
గురు మహేశ్వరుఁ గా నెంచి కొల్చుచుండెఁ
దనమదికి దుఃఖకరముగాఁ దార్పఁజాయ
నొజ్జలొసరించు నేరము లోర్పు దేర్ప. ౨౦౯

ఆ. ఎట్టు లెట్టు లిచ్చు యిష్ట మిష్టాన్నంబు
లందుఁ దవులుచుండు నయ్యవారి
కాతఁడంబె యనుగు భిక్షించి భిక్షించి
తెచ్చిపెట్టుచుండుఁ దియ్య మలర. ౨౧౦

ఆ. చీఁ కశక్తుఁ డతని శ్రీనాయకుని సర్వ
గతుని సర్వవంద్యుఁ గాఁగ జూచు
స్మృతిపంథబు మీఱు శివుని సాక్షాత్పూర్వ
తీశుఁ గాఁ దలంచు నా శుభుండు. ౨౧౧

ఉ. ఆత్రముతో దివానిశము నన్యము వీడి గురు న్హరాదిమూ
ర్తిత్రయము న్వలెం గొలుచు దీపకు నెమ్మది దివ్యదేవతా
యాత్రయుఁ దీర్థయాత్రయు నిజాంగికయాత్రయు లోకయాత్రయుం
బాత్రతఁ గాంచ వన్న వెలిఁబాలివకావె సమస్తభోగముల్? ౨౧౨

గీ. విసువ కింటింటఁ దెచ్చిన భిక్షమెల్ల
నయ్యలకు నాదృతిం గడుపారఁ బెట్టు
నున్నఁ దినుఁ దాను లేకున్న నుపవసించు
నిదురవోఁ డెప్డు డవహితహృదయయుక్తి. ౨౧౩

గీ. అడుగఁ దగినది తగనిది యనక యొజ్జ
లడిగినవి యెల్లఁ దాఁ దెచ్చి యప్పగించుఁ
దల్లి తండ్రియు నిసువున కుల్ల మలర
నెల్లవియుఁ బరమాదృతి నిచ్చినట్లు. -౨౧౪

చ. సొగియఁడు మాఱువల్కఁడు ననూయకుఁ గాఁడు దయ న్విడండు ద్రేఁ
గగు ననఁ డార్తిఁ జెందఁడు నయం బెడఁజేయఁ డెడ న్విరాగముం
దెగులు పొరంగనీఁడు వెలితిం బడఁ డెందును గందు గుందు నం
దు గతికిఁ బోవఁడు న్విసువుఁ దోఁకొనఁబోఁడు పరాకు సెందఁడున్.

మ. శుచిశీలుం డయి యిమ్మెయిం గురుని దాసుండట్లు సేవించుచున్
శుచిఁ గాలం జరియించు వానిచరిత ల్శుశ్రూషులౌ వారి పా
పచయమ్ము ల్నశితమ్ముఁ జేయునె కదా స్వాంతమ్ము నాశ్చర్యసం
ప్రచితమ్ముగఁ బొనరించు నింక నొకఁ డే వాక్రుచ్చెదన్ దృష్టమున్.

విశ్వేశ్వరుఁడు వర మీవచ్చిన గురుశిష్యులు వల దనుట

శా. చేతన్ సీవిరిఁ దాల్చి శ్రీగురు నుపాసింపంగ నై యున్న యా
చాతుర్యైకనిధానముం దరిసి యాస్థం దర్శనం బిచ్చి వి
శ్వాతీతుండు కృతార్థుఁ డైతి విటు వత్సా! సద్గురూపజ్ఞ! యీ
నేతు న్మెచ్చితిఁ గోరు మిద్ది యయినన్ నీ కంచు వాక్రొంటయున్.

గీ. ఓమహాదేవ! యభవ! మృత్యుంజయుండ!
దయకు లో నయి కాదె యీదారిఁ దోఁచి
పసదనం బిచ్చెద నటంటి భావజహర!
యేమి కావలెః నా కెద కెఱుఁగరాద. -౨౧౮

క. అయినను శ్రీగురు నడిగెద
నయమహితా! క్షణము సైపు మని చని యనిమెన్
దయితాచార్యుం డతఁ డీ
నయమున నతి సేసి నిజవినయ మెసలారన్. -౨౧౯

సీ. సువిముక్తిసర్వస్వ! యవిముక్తనాథుండు
వర మొసంగెద నని వచ్చినాఁడు
ఏది కోరఁగ నౌనొ? యెది వరింపఁగరాదొ?
నా కేమి తెలియు మనఃప్రియుండ!
యర్థింతునా? తమయాన నేత్రరోగ
హానంబు భవదర్థ మర్థవిదుఁడ!
నేను శుశ్రూషింపనేరక కా దిది
ముమ్మాటికి నెద నమ్ముము మదీశ!
దివ్యచిత్తమ్మునఁ దలంచి దేవతుల్య!
యస్వతంత్రుఁడ నైన నా కాన తిమ్ము
ఊర్జితుఁడ! భగవంతుఁడా! కర్జ మనిన
ఛాత్రుతో వేదధర్ముఁ డీ చాయ ననియె. ౨౨౦

చ. అనఘుఁడ! దేవదేవుఁడు స్వయంప్రభుఁ డిమ్మయి శ్రద్ధనీయుఁడా?
చను మది కాదు తీఱదె? యసత్కృత మీ యనుభూతిఁ బాప మా
ఱిన మఱి రోగ మున్నదె? యెఱింగి యెఱింగి భవామయమ్ము వా
పు నిగదుఁ జిత్తశోధను శివుఁ వెడకోర్కికి నాశ్రయింతునే? ౨౨౧

గీ. ఆత్మరోగము ల్బాపెడు నభవునిదయ
గేహదేహాదులకు వెచ్చగించి పిదప
నేది సేయంగ నగువాఁడొ యాదరిద్రుఁ
డంత కింత పడఁగనేల? యరయుమయ్య! ౨౨౨

చ. అను గురువర్యు మాటఁ గొని యాతఁడు దేవునియొద్ద కేగి మ్రొ
క్కి నిగమవంద్య! యేవరము కేవలుఁ గోరెద నిన్నుఁ బొమ్మట
న్న నుతుఁడు మాటిమాటికి నన న్గొన కాతఁడు వద్దు వ ద్దనన్
జనియె గణంబులుం బెరయ శంకరుఁ డాత్మవిహారవాటికిన్. ౨౨౩

ఆ. ముక్తిమంటపమున మునులతో సురలతోఁ
గొలువు దీర్చి దేవి కూర్మిఁ గొసర

నై మహేశ్వరుండు శ్రీమంతుతో ననె
వినెడువార లెల్ల విస్మితులుగ. ౨౨౪

క. నారాయణ! మధుసూదన! వారిజదలనయన! వింటివా? యొక చిత్రం
బారంభించెను నామన మారం గురుగౌరవము మదానందకరా!

క. గురుఁ డెవ్వఁడు శిష్యుం డెవఁ
డరయంబడి రెచట? నెట్టిఁ డల భక్తివిధం?
బరుదేని న్విననలతుం
బరిణతవృషభాంక! యనెడు పక్షిధ్వజుతోన్. ౨౨౬

ఆ. అనియె విశ్వనాథుఁ డై కాగ్ర్యమున విను
మచ్చెరు వగు నిది జనార్దనుండ!
బాలుఁ డొక్కరుండు భావ ముద్దీపింపఁ
జేసె స్వగురుభక్తిచేతఁ దనకు. ౨౨౭

గీ. దీపకాఖ్యుం డతఁడు వంశదీపకుండు
దీపకుఁడె కాదు ధర్మసందీపకుండు
తనదు నాచార్యవరు వేదధర్ముఁ డనెడు
వాని సేవింప నై చొచ్చె వారణాసి. ౨౨౮

ఉ. ఆవిదితాఖిలార్థుఁడు మహాతపుఁ డొల్లమి యెందుఁ జెల్లఁ గా
శీవిభవం బెఱింగి మును చేసిన దుష్కృత మిందుఁ జెంద గో
దావరితీరవాసి వెసఁ దా నిట వచ్చి యనూనరోగపూ
గావిలుఁ డయ్యె శాసితనిజాత్ముఁడు శిష్యుఁడు భక్తిసేసెడున్.

గీ. అఖిలవిదుఁడ సర్వద్రష్ట నైన నేమి?
యిట్టి గురుభక్తి కని విని యెన్నఁ డెఱుఁగ
దోప నేల? వరం బీయఁ దలఁచి నేను
పలుకరించితిఁ జని గురుపరుఁడు గొనఁడ. ౨౩౦

గీ. చెవుల కురు పురుషార్థము ల్చెప్పి చూపి
చవులు మివ్వులంగ నా పల్కుబాయ కెలయఁ

డాస్తికుం డయ్యె నిశ్చయగ్రస్తహృదయుఁ
డగ్గురుం గాక కానఁ డన్యంబు నెదియు. ౨౩౧

గీ. కాయ మర్పించె గురుని కైంకర్యమునకు
దేవపితృదేవమహీదేవతీర్థధర్మ
ముఖ్యముల నిన్ను నన్ను నమూర్తియందె
యరసి భావించుచున్నవాఁ డర్భకుండె? ౨౩౨

క. పలుపలుకుల పని యేలా?
కలుషాపహా! పోయి చూడు ఘను దీపకు స
త్కులదీపకు భవసంతమ
సలయనదీపకు నిశాంతసందీపకునిన్. ౨౩౩

గీ. సద్గురునివల్ల చదివిన శాస్త్రధర్మ
రాశి భావించియె తదాచరణమునందు
బద్ధకంకణుఁ డైనాఁడు వసుధ దుర్ల
భుండు సు మ్మట్టివాఁడు పో భోగిశయన! ౨౩౪

చ. అని శివునోట వెల్వడు మహార్థము మాధవుఁ డాదరంబునన్
విని సకలార్థధర్మకృతివిశ్రుతుఁ డప్పుడ యొప్పు వేషముం
గొని చనె భక్తవత్సలుఁడు గుర్వనుగు ల్కులనేల కోలి చూ
చెను గురుభక్తు శంకరుఁడు చెప్పిన వాక్కును మించు లెక్కకున్. 

ఆ. మాన్యుఁ గాంచి మఱచె మాటపొం దెట్టిదో?
మరల ననియె నొక్కమార్గ మెనసి
యోరి బిడ్డ! యనఘ! యుత్సుకుఁ డైనాఁడ
వరము గొనఁగఁ దగినవాఁడ వనుచు. ౨౩౫

చ. అను నమృతాయమాన మవు నానుడి శ్రోత్రక మందియాయఁ ద
న్మన మది గొంచు నేత్రముల మార్గమునం జని రూప మెంచి యో
మని మునిమానసీయ మవు నచ్యుతు వ్యక్తిగ నిశ్చయించు ల
క్షణములఁ గొంచు వ్యగ్రతకుఁ గాక నతుం డయి దీపకుం డనున్.

చ. పిలువను లేదు నేను నిను పీతలసద్వసనా! యెడందలోఁ
దలఁపను లేదు సంతతము దన్నొగి సాధనకోటికోటులం
గొలిచెడువారి కన్నుల కగోచర మాత్మ కెఱుంగరాదు నీ
విలసితరూప మేవిధికి వీనిఁ బ్రసన్నత నాదరించితో? ౨౩౮

ఉ. పుట్టిననాఁటగోలె నొకపూటయు మిమ్ము స్మరింపలేని యీ
వట్టి యదిక్కు బాలకు విభావు భవుం డపు డిష్టు డీవుఁ జూ
పట్టి వరంబు లిచ్చెదము పట్టి! యటంచును పట్టి పట్టి యి
ట్లుట్టిపడంగ నైన స్వరసోదయము న్వెలయించు టబ్రమా. ౨౩౯

క. అనుమానము కల దది వా
ననుమా నముచిరిపువందితాంఘ్రిసరోజా!
యనుమానముదితసత్త్వా!
యను మానసమువాని కనియె ననుమార్చితుఁడున్. ౨౪౦

శా. శ్రద్ధాభక్తులతోడ నీవు గురుని న్సంతర్పితుం జేయవా;
తద్ధర్మంబున నేను మెచ్చితిని వత్సా! త్వాదృశుల్ నాకు న
స్సిద్ధాత్రిం బరిపాలనీయు లను లక్ష్మీశాను వీక్షించి యు
ద్బుద్ధుం డిట్లనె దీపకుం డను నవ్వున్ దోఁచ స్వపుణ్యాం బిటుల్.

క. వేదము వేదాంగము తర్కాదికముం జదివి చదివి యాలోచనతో
నేది నెఱనమ్మితినొఁ దామోదరుఁ డద్దాని సౌఖ్యము వచించె బలే.

మ. పరమార్థంబు పరంబు తీర్థము పరప్రారంభ మల్ల పరా
త్పర మా మేలి తపంబు సద్గురుఁడె నా తాత్పర్యమే కాక వే
దరహస్యం బిది కానిచో కలదె? శుద్ధం బిద్ధమున్ బుద్ధముం
బరమానందద మైన తేజ మిటు మత్ప్రత్యక్షముం జేయఁగన్. ౨౪౩

క. కాన గురు వీడె యన్నియు
నే నే మని కోరువాఁడ నిమ్మదె యతియున్
మానాథ! దయకుఁ బాత్రమ
నే నుపదేశింపుము గురుహృదయ మ్మనినన్. ౨౪౪

## గురుహృదయము

గీ. తెలిసికొంటివి మునుమున్న తీర్థమహిమ
బ్రహ్మపదదం బటంచు నమ్రముగఁ దాత!
యైన వాత్సల్యమున నీకు ననెద వినుము
గురుహృదయ మడిగితి కాన గుణనిధాన! ౨౮౫

ఉ. లౌకికబుద్ధి నిచ్చు నొకలాగు హితుండె గురుండు ధర్మ క
ర్మాకృతి వ్యాకరించునతఁ డంతకు మిక్కిలి సాంగవేదవి
ద్యాక్రమపాఠకుం డతనికన్నఁ దదర్థనిరూపకుండు త
చ్ఛీకరు మించు నందఱ విశిష్టుఁడు నా స్థితిఁ దెల్పువాఁ డనా! ౨౮౬

గీ. శుద్ధ మవు నా స్వరూపంబు బుద్ధి నెఱిఁగి
శ్రవణముఖముల బోధించు నవహితుఁ డన
నేన సుధఁ జిందు నెవని గీర్నిష్ఠ మగుచు
ననఘులమనమ్ము ననుఁ బాయ దతఁడు నేన. ౨౮౭

ఉ. పాముల మించుఁ గ్రౌర్యమున బాములఁ బెట్టును జెట్ట పీడఁబో
దేమియు నైన దుర్గతి నయించును గామరుషాదిదోషముల్
వేమఱుఁ బుట్టు పుట్ట మది విశ్రుతశాస్త్రపురాణగాథలం
దోమి మలంబుఁ గాల్చి దయతో వెలయించుగురుండె వేల్పనన్.

గీ. మంచిచెడుగులఁ జూపి నేమించి కృత్య
మిది యకృత్యం బటంచు వారి పరిఁ జేయు
భవ్యు నెప్పుడుఁ గొల్చుటే పరము వర మ
నుగ్రహము పర మదె స్వార్థ మగ్రగణ్య! ౨౮౯

చ. పరముఁడ! యెప్పుడే శివుఁడు బ్రహ్మయు బ్రహ్మ మనుగ్రహింప నా
తరమున కెక్కునో నరుఁడు తత్సమయమ్మున సద్గురుం డిలన్
దొరకును దత్ప్రసక్తితరితోఁ దఱితోడఁ దరించువాఁ డిదే
గురుహృదయం బెఱుంగుదువు కుత్స! వరింపుము ప్రస్తుతం బనన్.

గీ. అనుచు నీప్రసాదమున జనార్దనుండ!
మెఱిఁగితి నెఱుంగఁ దగినది యిచ్చితి.వర
మరుగుము యథాసుఖ మ్మింతకన్న నాకు
నర్థ్యమును లేదు లేదు దేయమ్ము నీకు. -౨౫౧

గీ. అనుడు నమ్రుడు గదుర నై యరిగెను హరి
యంతలోఁ బిల్చె గురుఁడు నయ్యంకసదుని
వాఁడుఁ దొల్లింటికంటె నవ్వారి గాఁగఁ
గొలుచుచుండంగ నిట్లనెఁ గోవిదుండు. -౨౫౨

గీ. వత్స! దీపక! యెవనితో వాద మింత
సేపు సేసితి వేమి? వానిఁ గన నైన
సుఫల మీవు ప్రాపించితి శుభము నాకుఁ
జెప్పు మన దోయి యొగ్గి యా శిష్యుఁ డనియె. -౨౫౩

క. ఇందాక శివుఁడు వచ్చిన
చంద మెఱుంగుదురకాదె? సరసిజనయనుం
డిం దిప్పుడు విజయము సే
సెం దను దయ నైన వీనిఁ జేరి వర మిడన్. -౨౫౪

ఉ. ఏమి వరంబు కోరవలె నెవ్వరి నేఁడి వరమ్ము లున్నవే?
యోమహనీయ! నాకు భవదుజ్జ్వలభవ్యపదాంబుజద్వయం
బామున్ కొనంగ నైన నయనాంజనసర్వము నిర్వహింపఁగా
నేమము మీఱ నింక నిదె నీదయ నెప్పుడు సిద్ధ మయ్యెడున్. -౨౫౫

క. అన ననుగుం గొని మురిసెన్
ఘనుఁ డాతం డంతలోన కడచిచనె నొకం
డను నిర్వాదియును నబ్దము
లనూనదుఃఖదము లనుభవాంతరితము లై. -౨౫౬

శా. ప్రారబ్ధకృతియు మాట భోగసమయుం బై పోవ నమర్త్యాని వి
స్ఫారాక్షిప్రతిమప్రకాశుఁ డయి నిస్సంతాపుఁ డై శాంతుఁ డై

ధీరుం డై స్మరకాంతవిగ్రహుఁడు నై దీపించి యుద్దీపకుఁ
స్వారంభప్రియకారిఁ జేరి యనియెన్ వ్యాసద్ధసంమోదుఁ డై. ౨౫౭

శా. ప్రారబ్ధం బను కర్మపాశకసముద్రం బేల? సంసారమే
తీరం బందఁగ నైన దింక నను బంధింపంగఁ దాఁ జాల దో
ధీరాత్ముండ! సుశిష్య! తో డయితి వృత్తీర్ణుండఁ గాఁ గాశికే
శారాధప్రియతాసమాశ్రయణపద్యం బద్య మై చెల్లఁగాన్. ౨౫౮

గురువు శిష్యునకుఁ గాశిమహిమ సెప్పుట

క. ఈకాశికఁ బడు జంతువు
లా కష్టము లేనయ వింక నని నిత్యము సు
శ్లోకుఁడు మహానుభావుఁడు
చేకొని ప్రోవంగ శివుఁడు సేసెం బాసన్. ౨౫౯

క. కాశీప్రదీపకాంతికి
నాశ మెనయు నగణితవృజినతమోఘట వి
శ్వేశు నలికాక్షవహ్నిశి
ఖాశిత మగు జగముభంగి నపరూపం బై. ౨౬౦

గీ. ఏగతిని బాపములు వెను లాగుచున్న
నుండవలెఁ గాశిలో సాహసోజ్జ్వలుఁ డయి
మోక్షకాంక్షి సంసిద్ధిని బొందఁగలఁడు
నియతమానసుఁ డై యొకనిముస మున్న. ౨౬౧

గీ. లౌకికము లఘుపుణ్యము ల్సాహసైక
సాధ్యములు గల విందు విశాలములుగ
నయినఁ బోలవ యవి షడింద్రియజయంబు
నట్టు లుండ్రదు జీవన్ముక్తు లౌ నరు లిట. ౨౬౨

గీ. ఇందు వినుము వత్స! విశ్వ విశ్వేశ్వరుండు
గంగ భైరవుఁడును ఢుంఠిగణపతియును

దండపాణియు నారంగఁ దర్శకాము
లకు షడంగయోగం బిది సుకర మగును. ౧౬౩

సీ. జైగిషవ్యాదులు జాబాలిముఖసిద్ధు
లా దధీచ్యాదిదీక్షాంచితులును
నారంగముల యోగ మార్గించువార ల
ట్లష్టాంగముల యోగ మమరువారు
శంకరాన్వితమానససరోభవులును నా
రాయణాధీనచిత్తాంబుజాలును
సాక్షాద్ధరిరఁగ దత్తాత్రేయు ధ్యానించు
తత్పరాయణు లవు తాపసులును
జ్ఞానవిజ్ఞానసంపన్నులై నిరతము
సచ్చిదానందఘనస మను స్వస్వరూప
మారఁ గనుచుందు రిం దెందఱో? రసమున
స్థాణువన్నిశ్చలాత్ములై ధన్య! కంటె? ౧౬౪

క. ఓచిన్నివాఁడ! సుమతీ!
యీ చర్మాంబరుని వీటనే నిలు నాతో
నీచేసినశుశ్రూషకు
నాచేతము మెచ్చెరా ఋణం బెట్లు తీర్తు? ౧౬౫

ఆ. నిన్నుఁ బట్టి కాదె? నేఁ బట్టి! పట్టింప
[illegible]
విష్ణు లక్ష్మితోడ విశ్వేశు విశ్వేశుతోఁ
గూడ దేవవరులఁ గోవిదుండ! ౧౬౬

ఉ. ఏ మని మెచ్చువాఁడ? భవదీయచరిత్రము మప్పరుండవై
యామహనీయమూర్తుల నయారె వరింపవ బ్రహ్మభూయమో
భూమి సుఖంబొ స్వర్గమున భోగమొ? బిడ్డఁడ! యింతకన్న నీ
భూమునిఁ గాఁ గడించితివి పో యెదొ కోరు మదేయ మున్నదే?

క. అను గురు నడుగులఁ గొలుచుచు
నను గనియెఁ దపస్వి! నీదయాదరమహిమన్
గనరాని సిద్ధు లున్నవె?
మనుభువనములందు వచ్చె మా కవి యెల్లన్. ౨౬౮

మ. పురుషార్థంబులు నాల్గు నాల్గుల ద్వయంబు న్సిద్ధ లేవేళ దే
వర సేవాదరవృత్తి వోవు నను సంపన్నాంగయోగంబుతో
నరుదార న్వెనువెంట నంటి కన నౌ నన్యాసపేక్షస్థితిన్
గురుపాదాబ్జనివేశితాశయత నాకుం జూడరాకుండినన్. ౨౬౯

సీ. నినుఁ గాక యన్యు వర్ణింపఁ బూనదు వాక్కు
ఘ్రాణంబు గంధంబు రసము రసన
గోరవ కన్ను గన్గొనఁబోదు వినఁబోదు
చెవి స్పర్శనమ్ము స్పృశింపఁ దలఁప
దంఘ్రులు వోవు సేయవు చేతు లిన్ని మా
టలఁ బని యేమి? యెడంద దేవ!
యిందు నందును నంతొ యింతొ చింతింపఁబో
దేపరార్థము నేని ని క్కలిమికి
నేఁ గృతార్థుఁడ నైతి సందియము లేదు
సాంఖ్యయోగాధ్వములబడి జాలిపడుచు
నీద నక్కఱ లే దింద్రియేరితాబ్ధి
దీనఁ దోఁచెను గురుపూర్ణధీసమాధి. ౨౭౦

ఉ. బాలకుఁ డైన నాకు మునివల్లభ! యట్టి ప్రసత్తి గల్గినన్
మేలి వరంబు లీఁ దలఁపు మేకొనెనేని శుభం బతర్క్య మా
క్షాలితపాపపంకము వచశ్చయమ్ము న్భవదీయము న్వినన్
శీలము కద్దు శ్రావ్య మెదొ? చెప్పెద మీర లనుజ్ఞ యిచ్చినన్.

క. అని పలికి వివక్షితము
న్వినిపింపుము నీకు దాతునే? యెదియేనిన్

క. స్వామి! ప్రసాదింపుము శ్రో
త్రామృత మిది గ్రోల చిత్త మాసక్తిఁ గొనెన్
నామీఁది వత్సలత్వము
తో మన్నింపుఁ డను శిష్యుతో గురుఁ డనియెన్. ౨౭౭

మ. కృతకృత్యుండవు భాగ్యవంతుఁడవు ధాత్రిన్ ఖ్యాతిమంతుండ వా
తతసౌజన్యుఁడ వైతి ధన్యమతి! దత్తస్వామిమాహాత్మ్య వి
స్తృతి సంస్మారిత మయ్యె నా యెడఁదకు న్స్వీగాంగభంగీభవ
ప్రతివర్ణంబులు నై పరోపకృతికిం బ్రాల్గొన్న నీ పల్కులన్. ౨౭౮

క. నీ మాటల హృషితం బగు
నా మానస మిదుగొ తనువునన్ రోమాంచ
శ్రీమహిమఁ దోఁచెఁ గన్గొను
మా మహితుని పాపహరము ననెద మహిమమున్. ౨౭౯

శా. ఆ యోగీశ్వరుపాదపద్మముల నిధ్యానించి మ్రొక్కంగ నై
స్వాయత్తత్వద వైభవంబు ననుఁ బొప్పం గా ర్తవీర్యాదు లే
యే యోగంబుల సిద్ధు లైరొ, యవియున్ హేరాళలీలాకృతుల్
నా యీ బుద్ధికిఁ దోఁచినంత వినుతుల్ శక్యంబె సర్వం బనన్? ౨౮౦

ఆ. ప్రాణపదము వీవు పరమశిష్యుండవు
తెలుపు మంటి దత్తదేవు విభవ
మింతొ యంతొ యెఱిఁగి యే నూరకుందునే?
యశుభ మెడయు మేలి యాయ మొదవ. ౨౮౧

క. దత్తాత్రేయ! జగద్గురు
సత్తమ! సితకమలనయన! సంనతిఁ గొనుమా
తత్తత్సిద్ధేశ్వరులు న
నుత్తమ మవు నీప్రసత్తి నొందిరి సిద్ధుల్. ౨౮౨

క. అని తన్మనుఁ డున్మనిఁ బొం
దిన విధ మావిధి కలికి ననెం జు మ్మని చె

ప్పిన సూతుఁ బొగడి శౌనక
మునిముఖ్యు లనంతరకథ ముచ్చట కైనన్. ౨౮౩

శా. నిత్యానిత్యవివేకపూర్వకజగన్నిరాగతాని త్తస్సా
హిత్యప్రత్యయ! సత్యచిత్సుఖతనూ! హేత్వంతరాభావసాం
తత్యాన్యార్థకృతప్రయత్న! బహుశాస్త్రప్రక్రమానూదితా
ప్రత్యగ్ధ్యేయనిజాత్మతానుభవసంపద్రమ్య! విశ్వేశ్వరా! ౨౮౪

క. మునిమానసనిత్యధృతా!
వినతాఖిలఫలవిధానవిశ్రుతచరితా!
ఘనపావనబోధనస్మృతి
ప్రణయభరిత! చందవోలుపౌరజననుతా! ౨౮౫

మా. ప్రణమదమరమౌళిస్రఙ్మరందప్రసారా
స్నపితచరణపద్మస్ఫారభృంగాయమాన
గుణచయభజమానాఖండసంపత్ప్రదానా
ఘనమహిమవిభాస్వద్ద్యావదాలోకలోకా! ౨౮౬

సీ. ఆంధ్రీల రామకథామృతమ్మున నింపి
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనె నవయు విత్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ జానపల్లి
వాసుప పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయచేగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవసుఖములఁ
త్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదుగో
ప్రథమ సుమగుచ్ఛము గ్రహింపు పాణి రాణ. ౨౮౭

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## ద్వితీయ గుచ్ఛము

క. శ్రీమద్గౌరీమయజగదామోదకరస్వరూపకార్థస్ఫురణో
ద్దామప్రకృతివిరామదృశామానితమానమేయ! శాంభవమూర్తీ! ౧

గీ. అవధరింపు మనియె నక్కథకుండు తచ్ఛ్రోతృవరులతో విధాత కలికిఁ
బలికి సల్లు పయి శివంకరగురుశిష్య తత్ప్రసక్తి వేదధర్ముఁ డపుడు. ౨

ఆ. నామమంత్రములఁ బ్రణామపూర్వకముగా
దత్తదేవు నంఘ్రితామరసము
లెడఁదఁ జొనిపి కొలిచె నీకముందువారికి
నదియ దారి కాఁగ నధికభక్తి. 3

### శ్రీ దత్తదేవుని యష్టోత్తర శత నామావళి

వ. శ్రీదత్తుఁడు, దేవదత్తుఁడు, బ్రహ్మదత్తుఁడు, విష్ణుదత్తుఁడు, శివదత్తుఁడు, అత్రిదత్తుఁడు, ఆత్రేయుఁడు, అత్రివరదుఁడు, అనసూయుఁడు, అనసూయాసూనుఁడు, అవధూతుఁడు, ధర్ముఁడు, ధర్మపరాయణుఁడు, ధర్మపతి, సిద్ధుఁడు, సిద్ధిదుఁడు, సిద్ధిపతి, సిద్ధిసేవితుఁడు, గురువు, గురుగమ్యుఁడు, గురోర్గురుతరుఁడు, గరిష్ఠుఁడు, వరిష్ఠుఁడు, మహిష్ఠుఁడు, మహాత్ముఁడు, యోగుఁడు, యోగగమ్యుఁడు, యోగాదేశకరుఁడు, యోగపతి, యోగీశుఁడు, యోగాధీశుఁడు, యోగపరాయణుఁడు, యోగిధ్యేయాంఘ్రిపంకజుఁడు, దిగంబరుఁడు, దివ్యాంబరుఁడు, పీతాంబరుఁడు, శ్వేతాంబరుఁడు, చిత్రాంబరుఁడు, బాలుఁడు, బాలవీర్యుఁడు, కుమారుఁడు, కిశోరుఁడు, కందర్పమోహనుఁడు, అర్ధాంగాలింగితాంగనుఁడు, సురాగుఁడు, విరాగుఁడు, వీతరా

గుఁడు, అమృతవర్షి, ఉగ్రుఁడు, అనుగ్రరూపుఁడు, స్థవిరుఁడు, స్థవీ
యుఁడు, శాంతుఁడు, అఘోరుఁడు, మూఢుఁడు, ఊర్ధ్వరేతుఁడు,
ఏకవక్త్రుఁడు, అనేకవక్త్రుఁడు, ద్వినేత్రుఁడు, త్రినేత్రుఁడు, షడ్భు
జుఁడు, అక్షమాలి, కమండలుధారి, శూలి, ఢమరుధారి, శంఖి, గది,
ముని, మౌలి, విరూపుఁడు, స్వరూపుఁడు, సహస్రశిరుఁడు, సహస్రా
క్షుఁడు, సహస్రబాహుఁడు, సహస్రాయుధుఁడు, సహస్రపాదుఁడు,
సహస్రపద్మార్చితుఁడు, పద్మహస్తుఁడు, పద్మపాదుఁడు, పద్మనాభుఁడు,
పద్మమాలి, పద్మగర్భారుణాక్షుఁడు, పద్మకింజల్కవర్చుఁడు, జ్ఞాని,
జ్ఞానగమ్యుఁడు, జ్ఞానవిజ్ఞానమూర్తి, ధ్యాని, ధ్యాననిష్ఠుఁడు, ధ్యాన
స్తిమితమూర్తి, ధూళిధూసరితాంగుఁడు, చందనాలిప్తమూర్తి, భస్మో
ద్ధూలితదేహుఁడు, దివ్యగంధానులేపి, ప్రసన్నుఁడు, ప్రమత్తుఁడు,
ప్రకృష్టార్థప్రదుఁడు, అష్టైశ్వర్యప్రధానుఁడు, వరదుఁడు, వరీయుఁడు,
బ్రహ్మ, బ్రహ్మరూపుఁడు, విష్ణువు, విశ్వరూపి, శంకరుఁడు, ఆత్మ,
అంతరాత్మ, పరమాత్మ, శ్రీదత్తాత్రేయుఁడు. ౪

క. అను పదములకుఁ జతుర్థియు
ననుపదము నమఃపదంబు నమరిచి మొదలన్
బ్రణవమ్ము నిమ్ముకొలిపి స
వనములు మూఁడింటఁ జదువ భవ్యము లొదవున్. ౫

క. అష్టోత్తరశతనామాభిష్టుతి యిది వింటివా? నిసిష్టాంతర! నీ
ప్రష్టృత ముద్దిష్యం బవు దృష్టి విలోకించి పలికితిని స్పష్టముగన్. ౬

క. ఏతత్పరిచయవంతుఁడు పాతకములు నడల విమలభావాంచితుఁ డై
శ్రీతుం డీప్సితభోగప్రీతుండు నై బ్రహ్మముం దభ్రసేతుఁ డగున్. ౭

సీ. ఒకచోట యోగి యై యొకచోట భోగి యై
త్యాగి యై యొకచో సదామదుఁ డగు
సంగి యై యొకచోఁ బిశాచవేషంబున
నగ్నమూర్తియు నయి నానటించుఁ

గృహుఁడు తుష్టుఁడు పుష్టుఁడు శిఖి ముండి జటాలుఁ
డుత్తూన్మత్రుఁ డై యుండు నొక్కొక్కచోట
సూత్రియు దండియు సూరి యున్మత్తుండు
నౌ భిక్షు వై తిర్గు నచ్చటచట
గంగలోఁ డానమాడి భిక్షఁ గమలాల
యంబునం గొని నిద్ర సహ్యాద్రిఁ జెంది
నిత్య మెవ్వఁ డొసంగు సన్నిధి తలఁచిన
మాత్ర నట్టి ఘనుం గొల్తు నత్రిపుత్రు. ౮

గీ. తలఁచుటయె సేవ తనయింటఁ డాను తినెడు
దాని నర్పించుటే మేలి దానము ఫల
మింద్రచంద్రాదిదుర్లభం బిట్టి వేల్పు
భక్తరక్షాకృతక్షణం బుక్త మెందు? ౯

శ్రీ దత్త కవచము

క. ఈనామమ్ములఁ గవచం
బూనెడు వారలకు భయము లుండ వడవులన్
భూనాథులిండ్ల నరుల శ్మ
శానములం బ్రేతతతులఁ జౌర్యకరులెడన్. ౧౦

గీ. అంఘ్రిహస్తంబు కడిగి తా నాచమించి
దత్తదేవుఁ దలంచి బుధప్రవరుఁడు
సొరిది నారింట నారింటఁ గరములందు
నంగములయందు న్యాసంబు లాచరించి. ౧౧

క. శిరము లలాటము నేత్రము
లిరుబొమ లెడబొమలు నాస లిరుచెవు లధరో
త్తరములు పెదవులు హనుకం
ధరాకకుద మంటి పల్కుఁ దగుఁ బదము లొగిన్. ౧౨

గీ. జత్రుకుచచక్షువు లెడంద సరవి నాభి
మూల మాధారము స్ఫిచోరుపూర్వజాను
జంఘికాగుల్ఫమునయందు స్వామిపేళ్ళ
చదివి చదివి న్యాసంబులు సలుపవలయు. ౧౩

గీ. ప్రపదతన్మూలతత్తలాస్పనములందు
వాని పెనుబ్రేళులం గేల వరుస నంటి
స్కంధభుజమూలకరసంధికరతలాగ్రి
మాంగుళుల నంట వలయు నామావళిఁ గొని. ౧౪

గీ. ఆహృదయ మాకరం బట్లె యూపదంబు
వ్యాపకచతుష్టయముఁ గూర్పవలయు నోలి
గుణములు పదింట సంతఃకరణచతుష్ట
యమున నది సేయవలయు నియమము నూది. ౧౫

గీ. ఏక మనురోమ మైప్రొద్దు హృదయ మంటి
నామకాష్టోత్తరశతంబు భూమభక్తి
నెవ్వఁడు దలంచు దత్తేశు నెడఁద నిలిపి
వాఁడు కృతకృత్యుఁ డగు ముక్తిఫలముల కయి. ౧౬

శా. ధీమంతుం డవు జాపకుఁడు గురుతో దీక్షాత్తుఁ డై చేయఁగా
నామంత్రంబు లొగిం బురశ్చరణముల్ ధ్యానించుచున్ దత్తక
స్వామిన్ దత్తప్రినామమంత్ర మధిలక్షంబందు జప్యంబు త
ద్ధోమంబుం ఘృతపాయసంబుల దశాంశోద్బ్యాయ మై చెల్లెడున్.

గీ. పీతధౌతాంబరాంచితపృష్ఠభాగు
భవ్యభస్మావగుంఠసౌవర్ణ దేహు
నాద్య విద్యుత్పిశంగజటాభిరాము
దత్తయోగీశు నెడఁద నిత్యమ్ముఁ గొలుతు. ౧౭

క. అని ధ్యానించుచు నిత్యం
బును జప ముపదశ మొనర్చు పురుషున కీశుం

డనుకూలించును సిద్ధికి
ననుగ్రహము నూపు వరము లందించు బళే. ౧౯

క. రేపు న్మాపును గవచం బోపి పఠించినను జాలు నున్మత్తుఁ డగుఁ గా
పాపములచే దివారాత్రాపితములచేత సందియము లే దిందుఁ గా. ౨౦

క. భక్తున కుపదేశింపు మభక్తునకుం జెప్పకుండు మతియత్నముతో
నుత్తరహస్యపదస్తవ ముత్తిపరా! గోపనీయ మురుతరగరిమన్. ౨౧

గీ. దత్తచిత్తుఁడ వై విను దత్తదేవు
మహిమమును జెప్పుచున్నాఁడ సుహితచరిత!
యనుచుఁ దనశిష్యు ననుచు న చ్చనవునఁ గొని
వేదధర్ముఁడు తపసి యీ విధమున ననె. ౨౨

వేదధర్ముఁడు శిష్యునకు దత్తదేవుని చరితంబు సెప్పుట

సీ. అత్రి కపత్యార్థి కాదరంబునఁ దోఁచి
దత్తోఽహ మనుటచే దత్తుఁ డయ్యెఁ
బ్రహ్లాదయదువలర్క-కృతవీర్యజముఖ్యు
ల కొగి నాన్వీక్షికి సుకృప నొసఁగె
ననసూయగర్భంబున ననూయ లేకుండఁ
బొడమె లోకమ్ములు పున్నె మెన్నఁ
బాదపంకజరజస్స్పర్శమాత్రంబున
నెంద ఱెందఱో సిద్ధు లిత్థు లైరి
వాఁడు వాసుదేవుఁడు భగవంతుఁ డొరుఁడు
కాఁడు సాక్షాత్స్వయంప్రభుం డేడుగడయు
జగతి కని పురాణచయమ్ము చాటుచుండె
నజుఁడు నారదమునికి నియ్యనువె తెల్పె. ౨౩

చ. అ యిడె నీవు న న్నడిగి త్రత్రి య దెంత తపంబుఁ గూర్చె? నా
శ్రీయుతునింట నె ట్లవతరించె? స్వయమ్ముగఁ జక్రి యంచు, మై

త్రేయుఁడు మున్ను దన్నడుగు ధీపరముఖ్ విదురు న్సమాహితుం
జేయఁ దలంచి చెప్పిన విశిష్టకథానక మేనుఁ జెప్పెదన్. ౨౪

మ. మనుకన్యాన్వయసంప్రసంగమున సమ్యఙ్మన్వ్యంశు వాక్రుచ్చె శ్రో
త్రనుకూలం బఖిలాఘనాశనము సర్వాభీష్టసంధాయకం
బన నొ ని య్యితిహాసమంగళము తీర్ణాచార్యసర్వజ్ఞ! శి
ష్య! నితాంతప్రియ! యాలకింపర మనశ్శాంతిప్రకాశార్థ్యముల్.

సీ. శతరూప మనువుగో నుతులఁ బ్రియవ్రతో
త్తానపాదు లనంగఁ దనయులఁ గనె
నావల నాకూతి దేవహూతి ప్రసూ
తులఁ గూఁతుల నిరస్తతులలఁ గాంచె
నాకూతి రుచిపత్ని యయ్యె ప్రసూతియు
దక్షప్రజాపతిదయిత వినవె?
కర్దమునిల్లాలు ఘన మధ్యమ సమధ్య
యది కపిలాచార్యు హరి విభు నొగి
భవ్యసర్వాంగు లఖిలసౌభాగ్యయుతలు
నైన నవకన్యకలఁ గడుపారఁ గనియె
వారలు మరీచి మొద లగు బ్రహ్మపుత్రు
లను సమువ్రత లైరి తత్ప్రకరణమున. ౨౫

ఆ. అత్రిపత్ని యైన యనసూయ ప్రసవించెఁ
ద్రితనయుఁ బ్రియంత్రితతతసునయు
స్వామి దత్తు దుర్వాసను సోముని హరీశ
ధాతృమూర్తులం బ్రధానగుణుల. ౨౬

ఆ. వారి కేల వొడమవలసె? నమ్మునియింట
నంటివేని? విదుర! యదియు వినుము
బ్రహ్మచోదితుఁ డయి పత్నితో నత్రి ఋ
క్షాద్రి కేగి తపము నాచరించె. ౨౭

గీ. నలుదెసలఁ బాఱు నిర్వింధ్య జలముల బులు
బులు రవమ్ములు చెవుల కింపులు సృజింపఁ
జివురులుం బూలగములు నాసించు కనుల
కలిమిఁ బెంపఁగ నగు నశోకవనమందు. ౨౯

ఉ. గాలి సమాహరించి చలిగాలికి నెండకు జంకకుండి ముం
గాలి ధరిత్రి మోపి యవికంపితచిత్తముతో శరచ్ఛతం
బోలిఁ జన న్సమాధి నటు లుండె మహాముని యెవ్వఁ డింతకుం
జాలినవాఁ డొకొండొ? యల సామి యజించెద నంచు నెంచుచున్.

గీ. ఆత్మసమసంతతిని నాకు నాఁత డొసఁగు
నెవ్వఁ డొక్కఁ డిజ్జగముల కేడుగడయు
నని తలంచి ప్రాణాయామ మాచరించె
నాది న క్కోర్కు లంతంత నడుగునఁ బడె. 3౧

చ. తనువులు మూఁడు నొండొకటిఁ దార్కొని యాత్మని సంసృతిప్రవా
హనియతుఁ జేయు నెందు నవి యంటక యొంటిగ నుంట నాతనిన్
మునులు సురేను లత్రి యని మోదమున న్వినుతింప నైరి య
మ్మని కదె వేదవాదములఁ బోరనఁ బేరు సహార్థమై చనెన్. 3౨

శా. జ్ఞానానందమయప్రవాహవహుఁ డా సన్మౌని మూర్ధోద్గత
ప్రాణాయామమయమైధసాగ్నికి జగం బట్టిట్టు గాఁ జొచ్చినన్
వాణీశానవితాయమానభు లపర్ణానాథమానాథవా
ణీనాథు ల్వెసఁ జొచ్చి రాశ్రమము నిర్ణీతార్థు నర్థార్థమై. 33

గీ. ఏకపాదంబున న్నిల్చి, యేగుదెంచు
సురమహోర్ముల ముప్వురఁ జూచు సిరికి
మురియు మనమున మునిఘనుం డరసి మ్రొక్కి
సంస్తుతించె సమర్ఘ్యాణాంజలి ఘటించి. 3౪

చ. తమ తమ చిహ్నము ల్వెలయఁ దార్క్ష్యునిపై వృషభేంద్రుపైని హం
సముపయిఁ బన్ని దోఁచితిరి సన్నుతు న న్నొనరింప నింపునన్

విమలదయావలోకననివిష్టహాసవ్వదనాంబుజంబులం
దు మహితకాంతికిం బ్రతిహాసు ల్గాని కన్నులు చిన్నవోయెడిన్. ౩౪

ఉ. ఐనను జిత్త మున్నది మహత్తరసాధన మెన్న నద్ది నా
తో నొసరెన్ సగే జగము నోఁచి యొలగ్చి లయించు నప్పను
ల్వాని యుగాల మాయ గొనము ల్విభజింప విభిన్నమూర్తులన్
మానితు లైన మీకు శివమాధవవాక్పతులార! మ్రొక్కెదన్. ౩౫

చ. ఒకని ననేకసద్గుణగణోపహితు జ్జగదీశు నాత్మ నెం
చి కొలువఁగంటి నిమ్మెయి విచిత్రము జంతువ్రాదంతరాళచిం
తను సతిదూరభూమి లవు నాథులు మువ్వురు గాన నై తి రా
రయుకఁ దన మీర మీర లన నొక్కఁడ యంచు మదిం దలంచెదన్.

చ. దొసఁగుల నేర్చు సాములను దోయిషు లయ్య! ప్రసన్ను లయ్యెదన్
వెస వికయంబు నొ నను మునిన్ గని మెత్తని వాని యున్నడిన్
సుసుమసమానముం గొని వినోదితమానస లై ప్రభుత్రయం
బసుకర మౌ సదుత్తరము నాతని కిచ్చెఁ బ్రహాసభాసి లై. ౩౬

సీ. ఎట్లు సంకల్పించి తీ వది యట్టిద
కా దన నిం కొంచు గలదె జగతి?
బ్రహ్మభూతాత్మ! నీ పరమనిధ్యానమ్ము
కుఱి యైన దొకఁడె ముగ్గురము మేము
సంకల్ప ముడిగిన సమ మైనతత్త్వమ్ము
తత్కల్పనావిభక్తత్వ మందు
నెఱుఁగుదు రీ కీటు కెల్ల జాయాపతు
లిరువురు మీరు మీ కెలయు సుసుఖ
మింక నీ యమ్మ గర్భమం దెలమి మేము
యంశభూతుల మై చొత్తు మవతరింపఁ
గామితం బగు వర మీయఁగా వలదొకో?
దాన మీ కీర్తి విస్ఫురణ దరతరంబ. ౩౭

చ. అని వివరించి దంపతులయందు సభాజితు లౌచుఁ జూచుచుం
డ నయనగోచరత్వమున డం బెడఁ దార్చుచు నంతరించి య
మ్మునిసతిగర్భగోళమునఁ బున్నెముతో నుదయించి రెంచ నిం
దునిభము దత్తుఁడై ఖరియు దుర్వసనాకృతిఁ గాంచి యంచితుల్. ౪౦

శా. వింటే యత్రిమునీంద్రుదుశ్చరతపోవిష్టంభముం దుష్టులై
తంటా లెంటు దొర ల్సుతత్వ మెసయం దార్కొంటయు న్దీపకా!
గొంటే? యింకిట దత్తయోగవిధిభంగు ల్బోధము ల్సెప్ప నై
యుంటిన్ బుత్రక! దత్తచిత్తుడవు నై యుంటే? శుభం బయ్యెడున్.

క. రాజర్షి పాండవేయుఁడు
భ్రాజిష్ణుయశుండు ధర్మరాజు కొలువునన్
రాజులు పౌరులు మానులు
నా జిష్ణుఁడు విష్ణుఁ డమర నై యుండంగన్. ౪౨

క. నారదుఁ డొకపరి నిల నరు
దారఁ జరించుచును వచ్చెఁ దత్సభ కతఁడున్
వారిజసంభవసంభవు
నోరిమిఁ బూజించె వారిజోదరునిదరిన్. ౪౩

క. ఆ వాసుదేవుఁడును సం
భావింపఁగ నారదుండు పరిగతతత్త్వుం
డా విష్ణుదేవుఁ బొగడెం
భావించెన్ మ్రొక్కె మాటిమాటికి నంతన్. ౪౪

నారదుఁడు ధర్మరాజునకుఁ బ్రహ్లాదాజగరసంవాదము సెప్పుట

సీ. పాండునందనుఁ డబ్జభవనందను సనాత
నర్షిఁ గవిం ధర్మ మడిగె మ్రొక్కి
భగవంతుఁ డఘమర్షి వాసుదేవుఁడు విన
వానికి నాతండు వరుసఁ జెప్పె

భోగమ్ము లమరని పురుషుల దేహమ్ము
లే వెరవుననేని నెలయఁబోవు
నుద్యమము లేదు పడియుండు నొకట దేవ!
కాని యెటు వచ్చు? భోగ మాకాశసుమము
కద ద్విహీనుఁడ వగు నీదు కాయ మిట్టి
బలుపుఁ గొనె మాకు విన నైనఁ బలుకు మనఘ! ౪౯

గీ. కవి సమర్థుఁడు నిపుణదృక్కలితుఁడు సముఁ
డిష్టచిత్రకథుండు నా నిట్టి యతికిఁ
గర్మవశమునఁ బోవు లోకమ్ము ననుట
గొనుటయును గల్గ వెదనేనిఁ గోవిదుండ! ౫౦

క. అను దైత్యనాథు వాగమృ
తనియంత్రితుఁడై మునిపతి తథ్యము పథ్యం
బును నైన వచన మెత్తెను
స్వనయవివిదిషునకు నాత్మ స్మయమానుం డై. ౫౧

గీ. అసురసత్తమ! నీవు తత్త్వార్థవేత్త
వొనరు నధ్యాత్మదృష్టి నీహాపరతుల
వలన జను లెట్టి ఫలములఁ బడయఁగలరో?
యెఱుఁగుదువ యొరు లన నిం దిఁ కేమి కలదు? ౫౨

ఉ. పాయని భక్తితో హృదయపద్మమునం దిరవొంది యున్న నా
రాయణదేవుఁ డెప్డుఁ దిమిరంబు దినేశుఁడు వోలె నజ్ఞతం
బాయఁగఁ జేయు నీ కయినఁ మాన్యుఁడ! నీ వొనరించు ప్రశ్నముల్
నా యెఱుఁగంగ విన్నటు లనా! వివరించెద నాత్మశుద్ధికిన్. ౫౩

ఉ. జన్మజరాప్రవాహముల జా లెడవెట్టక నిర్వహించు ను
ద్యన్మతు లైన దీని దరిదాటఁగలే రుదరంబు నిండ దే
యున్మతికామభోగముల నుద్ధత తృష్ణ ననుం గ్రసించి క
ర్మోన్ముఖుఁ జేసి త్రిప్పెను ముహుర్ముహురాపిత జాతిజాతులన్. ౫౪

గీ. కర్మములచే భ్రమించు చాకస్మికముగ
నిందుఁ బొందింపఁబడితి వి న్నిక్క నరభవ
మనఘ! స్వర్గాపవర్గంబు లంద మరల
నింద చెందఁ దిర్యక్త్వంబు నేసయు దారి. ౫౫

చ. అసుఖనివృత్తికి న్సుఖము లందుటకు న్మదిఁ గోరి కర్మము
ల్వెసువక చేయుచు న్విపరివృత్తఫలంబుల నందుచున్న మా
నిసిగమిఁ జూచి చూచి గనునించిన బుద్ధి నివృత్తిఁ జెందు మా
ననము స్పృశించు భోగము లనం దలిపోందియు నిద్ర నోయెదన్. ౫౬

గీ. అఖిలకామోపరతి తాను నందుఁ జెంది
యాత్మ సుఖరూప మున్నాఁడ నలరుచుండు
ననుభవించెద భోగంబు లప్పుడెప్పు
డేచి ప్రారబ్ధ మందింపు నీపాఁ దక్క. ౫౭

శా. ఓరా సౌఖ్యము తాన స్థైన మఱచి పేయుం బైజస సంసారమున్
ఘోరంబున్ మది లేపి దైవ్యతమున నక్కో గ్గాంచి చేవుండు నా
చారం గప్పిన నీరు మాని మృగతృష్ణాబద్ధి దైవ నోవ్రు దు
ర్వారుం బోలి యనర్థ మర్థ మని సంభావింపుఁ జిత్రంబుగన్. ౫౮

గీ. తనుముఖంబులు దైవ నతంత్రములు నాన
నాత్మ దుఃఖాత్యయము సుఖ మందఁ దలఁచి
మాటిమాటికి కర్తలగుచు క్రియలు
కృతములు కృతమ్ము లకృతము లింకఁ గృతములు. ౫౯

గీ. అష్టకష్టమ్ములగు నై క్రియాఫలములఁ
దెచ్చికొని యేమి సేయు మత్కృత్య ముర్వి?
నవియు నాధ్యాత్మికాదితాపాభిభూత
మైన మది కింపు నింప వియ్యది నిజంబు. ౬౦

సీ. అజితాత్ములును లుబ్ధు లగు ధనవంతుల
యర్థ మనర్థ కరా టరయ మొకొ?

చోరులు రాజులు వైరులు స్వీయులు
నపహరింపఁ దలంతు రద్ది యర్థ
మదిగాక దినదిన మ్మనుభవమున నది
క్షయ మౌచు భయము దుఃఖమును జేయుఁ
బశుపక్షు లర్థులు పరిజనమ్ములు గాల
మతనికి నొదవింతు రతిభయమ్ము
బ్రాణమున నర్థమున స్పృహఁ బట్టి వచ్చు
మనుజులకు శోక మోహ శ్రమభయ దైన్య
రాగరోగాదు లెన్నెనిఁ బ్రాజ్ఞుఁ డెనయు
దాని విడనాడి యనపరాధీనసుఖము. ౬౧

గీ. సర్వకామ్య వైరాగ్యమ్ము సంతరించి
నాఁడ మధుకరగురువృత్తిఁ బాడి వేఁడి
సుమసుమమ్మునఁ దెచ్చి దాచుకొనుఁ దేనె
దానిఁ దలఁ దన్ని యొరు లందు దారిఁ జూచి. ౬౨

క. తహతహపడక యదృచ్ఛో
పహితం బవుదానఁ దృప్తిఁ బడసెద లేదా?
బహుదినములు పడియుండెద
సహిపతిఁ గని నేర్చుకొన్న యది యిది వింటే. ౬౩

ఉ. సత్త్వముకల్మి నే క్రియయు సల్పకయుండుదు నేమఱి న్స్వసం
విత్త్వము దైవలబ్ధముల మేలను కీడను మాట లేక యే
స్వాత్త్వము మాని కైకొనెదఁ జాల భుజింతు భుజింతు స్వల్ప మ
ర్థార్థ్య మనర్హభావ మవు నన్నము రుచ్య మరుచ్యముల్ ఘనా! ౬౪

క. తినియెద శ్రద్ధోపాహృత
ము నమానాపితముఁ దినెద మును దిని మరలం
దినియెద దివానిశంబును
నొకొకచోట నొకొకతేప యదృచ్ఛన్. ౬౫

బునఁ బ్రీతి గూర వీడ్కొని
తన యింటికి నేగె నసురదాయాదుండున్. ౨౨

క. అని నారదముని వినిచిన
వనజాక్షు సమక్షమందు పార్థాగ్రజుఁడున్
విని తృప్తి నెనసె దత్తే
శుని బోధము చొప్పడి యనుచుం గురుఁ డనినన్. ౨౩

గీ. దీపకుం డను గురువర్య! దీన లేదు
దత్తనామం బొకింతయు దైత్యపతికి
నజగరుండు గదా తెల్పె నతఁ డితఁ డని
యనుకొనుట యెట్లు సంశయం బపనయింపు. ౨౪

చ. అనుడు గురూత్తముం డను స్వయంహరిదేవుఁడె దత్తదేవుఁ డై
యనియతనామరూపముల నక్కడ నక్కడ సంచరించుటన్
మును పనినాఁడఁ గాదె? మనముం గృతసంశయముం బొనర్పకే
విను మతఁ డర్జునాదుల కవిద్య వెలార్చిన లాగు సెప్పెదన్. ౨౫

కార్తవీర్యని ప్రసంగము

క. ఆదత్తవిభు దయ సమా
సాదితకరయోగభూమసామర్థ్యముతో
మేదినిఁ గృతవీర్యజు నా
రాదవనముఁ జెప్పె బాదరాయణి పతికిన్. ౨౬

క. రేణుసుతఁ బెండ్లియాడెన్
రేణుక జమదగ్ని కనె నరేణుల సుతులన్
బ్రాణాయిలఁ దల్కనిష్ఠుఁడు
రాణ నెనసె రాముఁ డన నరాతిదమనుఁ డై. ౨౭

ఉ. ఆ మహితుండు కేశవునియంశమున న్మహిఁ దోఁచి యేచి యం
హోమముగాజవంశముల హోమము సేసె స్వవీర్యవహ్ని యం

గీ. యాగ యోగ తపో దాన భోగములను
విశ్రుతి శ్రుత శీలోరు వీర్య జయ వి
లాసములఁ గార్తవీర్యుని లాగు లేఁడు
లేఁడు లేఁ డనిపించె నానాఁడు వాఁడు. ౨౫

క. వానికొఱ కవతరించెన్ శ్రీనాథుఁడు రాముఁ డన ననిందితుఁడౌ నా
జేనికి దుర్మతి వాఁడముడు నానెపమున హతమొనర్చె నది పతికులమున్.

గీ. సంగ్రహించి వచించితి సార్వభౌమ
తాప్రదాన మనంగ దత్తవిభువిభుత
ననెద యదున కతఁడు సెప్పినట్టి యోగ
ముద్ధవున కెట్టు లనెఁ గృష్ణుఁ డూర్జితుండు. ౨౬

గీ. లోకతత్త్వవిచక్షణు లై కృతమునఁ
దఱచు నశుభాశయమువల్లఁ దమ్ముఁ దామ
యుద్ధరింతురు మనుజు లిం దుద్ధవుండ!
యాత్మ సువివేకచతురమ్ము నవధరించి. ౨౭

గీ. మంచిచెడుఁగుల నెఱిఁగింప మనసె గురు వీఁ
కెందు నిందు విశేషించి యిది పురుషున
కతఁడు ప్రత్యక్ష మనుమాన మను తెరువుల
శ్రేయ మొనయఁగ నగు దీనిచేతఁ గాదె? ౨౮

చ. మనుజశరీరమంద మతిమంతులు సాంఖ్యము యోగ మాది స
ర్వనియతశక్త్యనూదితుఁ బరాత్పరు జ్ఞానమయుం గ్రహింతు ర
య్యనువున నారసర్గ మపదైకపదత్రిచతుష్పదాది సృ
ష్టినిచయమందు సుప్రియము శ్రీయుత! నాకు మనంబునం గదున్. ౨౯

## అవధూతయదు సంవాదము

సీ. స్వప్రకాశ మొకండు వస్తు వుండక యహం
కారాదిజడతత్త్వకప్రకాశ

మొనరదు పో వ్వుని యనుపప త్తినిఁ గొని
బుద్ధ్యాదికరణము ల్పురుషుఁ డెడగ
పనిచేయఁజాలవు పాస్యాదులుం బోలె
నని యనుమానంబు ననుసరించి
యూపనిషద మైన యాత్మత త్త్వము నిందు
నెదకుదు రా త్మవివేకయు క్తి
నీ విధంబు నచించు మహేతిహాస
మనువదించెద నవధూత యదు నివాద
మనఁగ నకుశోభయుం గని సనఘుఁ దరుణుఁ
నొక్క ద్విజుఁ గాంచి యడిగె యదూద్వహుండు. ౯౧

ఉ. ధర్మము నర్థకామములఁ ద త్త్వవిచారము సంతరింతు రిం
దర్మిలిఁ గీ ర్తినో, సిరినో, యాయువునందో, వహించియే జనుల్
నిర్మమ! దక్ష! కల్ప! కవి! నీవు పిశాచజడాదిపద్ధతిన్
గర్మమునందుఁ గ ర్తవును గామివిఁ గాక చరించె దెట్లొకో? ౯౨

గీ. కామలోభదవాగ్నిఁ బొకాలు జనులఁ
గనుఁగొనుచు గంగలో నున్న కరివిధమునఁ
దాప మొందఁగకయున్నావు త త్త్వయు క్తి
నెవరు నూపిరి యీ మార్గ మిాశ! నీకు? ౯౩

మ. విషయస్పర్శము లేని యింద్రియముల స్వేచ్ఛాప్తి సంకల్ప మ
న్విష మాలం దిర మైన చి త్తమున నిర్వేశంబు నీ కెట్లు ల
బ్బె మహాధ్వజ్ఞ! మహాత్మ! బ్రాహ్మణ! నను న్విన్పింపవే యంచుఁ గా
రుమసద్గౌరవ మెంచి తన్నడుగు చారుప్రజ్ఞతో నిట్లనున్. ౯౪

గీ. గురువు లున్నా రనేకులు కువలయేశ!
బుద్ధ్యుపాశ్రితు లవ్వారిబోధ మొనసి
తిరుగుచుంటి విమోక్షంబు తెరువుఁ గాంచి
పరిగణించెద వారి భావజ్ఞ! వినుము. ౯౫

సీ. భూమి వాయు వాకాశ మంబువులు వహ్ని
చంద్రరవులు కపోతం బజగర సింధు
వులు పతంగము మధుపేభములు మధుహారి
హరిణ మీన కురర పింగలార్భకులును. ౯౬

గీ. నాగ శరకృ త్కుమా ర్యూర్ణనాభు లనఁగ
భ్రమరయుతముగ నాకు నిర్వదినలువురు
గురువు లవ్వారిఁ గనుఁగొన్న చరితములకుఁ
జిత్తమును మున్న నేను శిక్షించుకొంటి. ౯౭

క. ఏ యే విధంబు నేర్చితి
నే యే భూతములవలన నేఁ బురుషవరా!
యా యా విధంబు నొడివెద
నాయతముగఁ దెలిసికొను యయాతితనూజా! ౯౮

క. దైవవశానుగ మౌ భూ
తావళి యెటు లాక్రమింప నైన నిజపథం
బావంత తొలఁగకుండుట
భూవర! భూవ్రత మటంచు బుద్ధి నెఱిఁగితిన్. ౯౯

క. తన పుట్టువు తన వ్యాపృతి
యు ననాత్మాధీన మని పరోపకృతిపరం
బనియు నగనగాత్మిక యగు
ననంతఁ గని నేర్చుకొన్న యన్నియు మన్నా! ౧౦౦

సీ. నానారసాంచితాన్నము పేయ మని యెల్ల
నింద్రియలౌల్యసమీహితమ్ము
లాహార మెది యైనఁ బ్రాణంబు తృప్త మౌ
బడలు నిరాహారు వాఙ్మనసము
విక్షిప్త మది యవు విధమునఁ గోరమి
జ్ఞాన మ్మడంగని సరణిఁ దినుట

యీ యుభయముఁ బ్రాణవాయువు నారసి
గని కొన్న విజ్ఞానగమనిక యిఁక
బాహ్యపవనమ్ము నేర్పిన పద్ధతి యిది
నైకవిధధర్మముల విషయముల నెందుఁ
జొచ్చి వెడలెడు యతి వాని సుగుణవిగుణ
ముల నిషక్తుఁడు గాఁడు నా బోల్కి ననుచు. ౧౦౧

గీ. వెండియుం బార్థివాంగప్రవిష్టుఁడయ్యుఁ
దద్గుణాశ్రయుఁ డయ్యుఁ నాత్మప్రసక్తి
గాఁడు తత్సంగమునం జేసి కంటె గంధ
వాహుఁ డయ్యు నగంధుఁ డౌ వాయువుఁ గని. ౧౦౨

గీ. అమరు బ్రహ్మత్వభావసమన్వయమునఁ
దన్ను యోగి చరాచరాంతస్స్థిత మయి
వితత మయి సంగరహిత మై విడుపు లేని
నభముగతి నెన్నుకొనవలె ననుచు వ్యాప్తి. ౧౦౩

క. వాతేరితమేఘాదుల
చేత నభం బెట్టు లాస్పృశింపఁబడ దా
భాతిం బురుషుఁడు కాలిక
భౌతికగుణభావశక్తిఁ బడయఁడుఁ గంటే. ౧౦౪

గీ. నీరము స్వభావమధురంబు స్నిగ్ధ మచ్ఛ
మన్యవిధములు దేశదేశాసిలములు
నని యెఱుఁగు యోగి యది గురు వై వచించు
నాత్మ యగుణము గౌణము లనాత్మ వనుచు. ౧౦౫

సీ. తేజస్వి తపమున దీప్తుండు దుర్ధర్షుఁ
డుదరభాజనుఁ డైన యోగయుక్తుఁ
డఖిలభక్షణుఁ డయ్యు నంటఁడు దోసమ్ము
జ్ఞానాతిశయమువశంబున నని

యొకచోట ఘనున్డై యొకచోఁ బ్రకాశుఁడై
శ్రేయోర్థుల కుపాసనీయుఁ డగుచుఁ
బ్రాగుత్తరాశుభప్రధ్వంసియై దాత
లిడు భోజ్యములఁ దిను నెల్లెడ నని
దైవవశమున దొరకు నేధములఁ దవిలి
తత్తదాకృతి నందు న దహనుఁ జూచి
విభుఁ డొకఁడు స్వీయమాయ నా వివిధతనువు
లెనసి తద్రీతిఁ దోఁచుటయును జదివితి. ౧౦౬

గీ. ఆత్మభూతాకృతులఁ దోఁపు లడఁగుటలును
నోఘ మనఁ బొలు కాలనియుక్తి నవియు
నిత్యముల యయ్యుఁ గనఁబడని విధ మగ్ని
కీలలం జూచి నేచిన కీలు యదుఁడ! ౧౦౭

గీ. హానివృద్ధులు కలలకే కాని వశికి
లేమి యారసి షడ్భావలీల లెల్ల
దేహసమితివ లేనివి దేహి కనుచుఁ
జంద్రమునివల్లఁ గైకొన్నచంద మింత. ౧౦౮

గీ. ఇంద్రియముల విషయము గ్రహించుఁ గాక
విడుచుఁ గా కాత్మ తిదుభయాస్పృష్టుఁ డనుచు
జలములం గిరణంబుల సమయయుక్తిఁ
గాని వదలు రవిఁ గని నేర్చుకొన్న నయము. ౧౦౯

గీ. మఱియు నర్కునితోఁ గొన్న మతియ యిదియు
నతఁ డొకఁడు నైకవిధత నుపాధివశతఁ
దోఁచు న ట్లాత్మ యేకమై స్థూలమతికి
వ్యక్తిభేదచిదాభాసబహుళత నని. ౧౧౦

క. అతిసంగ మతిస్నేహము
కృతంబు కారాద యెందునే నెవనికినేఁ

గృత మైనఁ గపోతమువలె
నతిదీనతఁ బరితపింప నగు విను మనఘా! ౧౧౧

సీ. ఒక్కవనమ్మున నొక్కవనస్పతి
పొంత నుండె నొక కపోతపోత
మాత్మకపోతితో నాబద్ధనీడ మై
గృహధర్మమున స్నేహగళితమతి
దృష్టిని దృష్టితో దేహమ్ము దేహమ్ము
తో బుద్ధి బుద్ధితోఁ దా ద్రవించి
యా జోడు శయనాసనాటనస్థానవా
ర్తాక్రీడితాశనాద్యము లెనయుచు
ననుభవించెను వనవీథులందు సుఖము
నెఱయు విస్రంభమున మిథునీభవించి
తృప్తి నెలయించుచుఁ గపోతి చేనిఁ గోరు
దాని దెచ్చి యిడుఁగ గపోత మోటుపడియు. ౧౧౨

గీ. పట్టెలేకింద్రియాశ్వాలి పగ్గములను
వదలి వనలక క్రీడించు వరువశమునఁ
దఱి యగుటఁ దొలిచూలు బ్రాల్చి ధవువగిఁ జూచి
నీడమున నండములను గనెం గపోతి. ౧౧౩

క. అవి యవిసి విరచితము లవు
నవయవముల దుర్విభావ్య యావు హరిమాయన్
నవ మైన పిల్ల లయి యు
త్సవ మన నూనూగుఱెక్కల సంగతి నొప్పెన్. ౧౧౪

సీ. మొదలికూజితముల కెదఁ బంచి కలభాషి
తముల మేలిమి చెవు ల్దవులఁ దార్చి
మెత్తని ఱెక్కల పొత్తున సోగియుచు
ముగ్ధచేష్టితముల మురిపె మరసి

పడుచు లేచుచు నెదు ర్వచ్చు నదీనమ్ము
లవు వాని గతుల కంతంత లగుచుఁ
జీమ చిటు క్కనఁ జేటు వచ్చె నటంచు
నిదురలే కల్లంత నెలవు లరయు
చల కపోతదంపతులు తుల లేని స్నే
హానుబంధ మెగువ నజునిమాయ
మోహితాంతరంగము లయి సుఖం బెంచి
పిల్లకదుపుఁ బెరిమ బెంచుచుండి. ౧౧౫

క. కాలక్రమమునఁ బెరిగెడు
నాలలికాన్పునకుఁ దగిన యాహారముఁ దే
నోలి విపినములఁ దిరుగుచు
నాలస్య మొనర్చె నవి యనా! యొక్క తిథిఁ. ౧౧౬

సీ. ఇంతలో నెక్కడ నీక్షించెనో? పిసాసి
వ్రాత యట్లుండఁ గిరాతుఁ డొక్కఁ
డనుకొనకుండ న య్యవనికి నేతెంచి
పొంచి వలం బన్ని పున్నె మెన్న
కాత్మనీడాంతికమం దిటు నటుఁ బొలు
వాని నన్నింటినిఁ బట్టె నట్టె
యాహారముం గొని యల కపోతి కపోత
మింటికి వచ్చు నావెంట వినియెఁ
జిక్కి యాక్రోశ మొనరించు చిఱుతల కయి
యందు సైరింపఁజాలక య క్కపోతి
పనవి పనవి జాల మెనసి చెనయఁబోయి
తాను నబ్బంధమునన నిష్టబ్ధ యయ్యె. ౧౧౭

సీ. తనకన్నఁ బ్రీతిపాత్రము దైవముచేత
వలఁ బడ్డ బిడ్డల వలనుఁ గాంచి

కాంచుచుండఁగ స్నేహవంచితస్మృతి యగుచు
సుతు లైన ప్రాణప్రియుం బ్రియఁ గని
దానితోఁ దనకుఁ గృతమ్మునఁ గృత మైన
సంబంధబంధంబు సంస్మరించి
కన్నులఁ గట్టిన ట్లన్నిసువుల లీల
లందాక దోఁచిన నవధరించి
యార్తు లవు వాని యుటిస్వుల నాలకించు
చార్తి దల ముంప నన నైన యా కపోత
మేమి సేయంగలదు? మొద లెత్తికొనియె
నజితునకు నింతకన్నఁ గార్యంబు గలదె? ౧౧౮

గీ. ఔర నా పాప మేమందు! నరయుచుండ
నల్పభాగ్యుఁడ దుర్మతి నైన నాదు
ధర్మకామార్థబద్ధసద్మంబు గూలెఁ
జేయలే దొక్కపని తృప్తిఁ జెందలేదు. ౧౧౯

ఉ. దీనుని వీని వీడి పతిదేవత తుల్య మనోనుకూల యీ
సానియు సాధు వైన తనసంతతితోడ దివ మందఁ బోయెడిన్
గానికిఁ గాని పాడ్వడు నగారమున న్విధురుండ నుండఁగా
నా నేమి? దుఃఖజీవితుఁడ నై గమికరుండ నై యుండఁగా? ౧౨౦

ఉ. అలి సుఖాలకా? శిశువు లందు విలాసములందుఁ జిక్కఁగా?
యేల? గృహాలు వీని కని యేడ్చుచు దీనత దిక్కుమాలి యా
జాలమునందు మృత్యుముఖసంస్థము తద్వ్రజముం గనంగ ను
త్తాలము శోక మాకఁగొనఁ దత్త్వ మెఱుంగమిఁ దానును బడెన్.

గీ. క్రూరమతి యైన యా లుబ్ధకుఁడు కపోతి
నల కపోతకపోతకములను గొనుచుఁ
బోయె సిద్ధమనోరథుఁ డై యిటులఁ జౌర
నెవరి సుఖదుఃఖములు వారివే జగమున. ౧౨౨

ఉ. కానఁ గుటుంబభారమునఁ గాని మనంబున సాధుబంధుఁ డై
కానఁ గపోత మట్లు చెడఁగా నగు దీనుఁ డపండితుండు వి
జ్ఞానికి మర్త్యలోక మనఁగాఁ దలుపెత్తిన ముక్తిద్వార మం
దూనియు జన్మ మెవ్వఁ డెడయుం జ్యుతుఁ డయ్యె నతం డితోర్ధ్వగుఁ డై.

గీ. నిలువ కెచ్చోట నెవనితో స్నేహ మనక
బంధములఁ ద్రెంచుకొనుచుఁ బోవలె బుధుండు
క్షణము తవిలెనొ విడవు సంసారవార్ధి
వీచులు కపోతముం గని నేచిన దిది. ౧౨౪

గీ. నరకము నైంద్రియకము దుఃఖరస మెట్లొ?
నాకమున సౌఖ్యరస మట్లె యైంద్రియకమ
యగుట బుధుఁ డాదరింపఁ డా యుగము నెప్పు
డప్పుడె సుఖాత్ముఁ డగుట సిద్ధాంత మింత. ౧౨౫

క. సరసమొ విరసమొ యల్పమొ
గరిష్ఠమొ యదృచ్ఛ నొదవు గ్రాసముఁ దినుచున్
గరణీయరహితుఁ డై యజ
గరముక్రియం బరగువాని కైవల్య మురున్. ౧౨౬

గీ. గ్రాస మొదవక యున్నఁ బ్రారబ్ధభోగి
భోగివలెఁ బెక్కుదినములే పోక లేక
యుజ్ఝితాహారుఁ డై పడియుండవలయు
నిదురవోకుండ మది వెట్టి నిజసుఖమున. ౧౨౭

క. ఏ కర్మమునకు నొదవని
దా కాయముఁ దాల్చి యోగి యైంద్రియహ్లాదయాం
గాకలితబలుం డయ్యుం
గై కొనఁ డెది యూహా నాజగరసువ్రతుఁ డై. ౧౨౮

చ. అజగరశిక్షితం బిది మహార్ణవముల్ స్తిమితోదముం గనం
గ జనిత మైన బుద్ధి విను కామవశంబున నాపగాప్తి న

మ. కరిణీసంగతి బంధ మొందు నిభముం గామించి దానిన్ బలో
త్తర నాగంబులచేతఁ దా నిహత మౌ తద్ధర్మముం గాంచి సుం
దరినిం దారవి నైన నశ్మమయి నైనం దాఁకరా దంచుఁ ద
త్పరిభోగంబుల కగ్గ మౌట మృతికిం దార్కొంట యం చెంచితిన్.

ఆ. వేటకాని గీతి విని యురిఁ బడు హరి
ణమ్ము వలన శిక్షితమ్ముఁ గొంటి
వనచరుండు యోగి వినరాదు కనరాదు
గ్రామ్యగీతనృత్యకలన లెందు. ౧౩౭

క. మృగి కొడుకు ఋశ్యశృంగుఁడు మగువల వాదిత్రగీతమంజులనటనా
నుగమనవశ్యమనుండై మొగి వారలచేతి యాటబొమ్మ యనఁ జనెన్.

మ. రసనాశ న్బడిశంబు మ్రింగి యెర కై ప్రాణార్థము ల్వాయు మ
త్స్యసమాజంబునఁ గొంటి గెల్వవలె జిహ్వా న్మందుఁ దత్ప్రీతిమో
హాసమావిష్టుఁడు మృత్యువక్త్రగతుఁ డౌ నంచున్ నిజం బట్ల కా
దె? సుధీవర్యుఁడ! దాని నాఁగు గతి యేదీ? యెంత చింతించినన్.

మ. తినకున్న న్బలహీనుఁ డౌఁ దినఁ దినుం దీ పెక్క యింకింత య
ప్పనిఁ బోఁ బాడ్వడు యోగి కాన నది తప్పం దక్క నక్షుంబులం
దినకుండం గెలువంగ వచ్చు ననుటన్ దీ ర్పౌనె? ముమ్మాటికిన్
విను జిహ్వా న్మను గెల్చునా? గెలిచె నన్నింటిన్ యథార్థంబుగన్.

గీ. అన్ని యింద్రియముల గెల్వ నగును గాక
యంతదాఁక జితేంద్రియుం డతఁడు కాడు
జిహ్వ యెందాఁక యజిత యౌఁ జేప చెడుట
చూచి యిది చిత్తగింప నో సుమతి కెందు. ౧౪౧

సీ. మున్ను విదేహుల పుర నుండెఁ బింగళ
పేరి రూపాజీవ ప్రియమతి నది
యొకనాఁ డలంకృత యుత్సుక యును నయి
వాకిలిఁ గాచె సొంపుగఁ జని నొకని

తొమ్మిది కల్గి మూత్రమలతుందిల మై క్షుర మైన కొంప వి
త్త మ్మిదుఁ గాంతుఁ డంచు నిది తప్ప మఱొక్క-తె చెంతఁజేరునే? ౧౪౭

గీ. ఈ విదేహాలపురమున నేన మూఢ
మతి నొకతెఁ గాక యన్య కామమునఁ దవిలి
యింత యొసఁగి నిరీక్షించు నినుని వదలి
యపరు నెడ నమ్ముకొనునట్టి యసతి కలదె? ౧౪౮

గీ. అంతరాత్మ శరీరుల కచ్యుతుండు
ప్రియతముఁడు నాథుఁడు సుహృత్తు వెలుఁగుచుండె.
నిండె యాత్మార్పణమున నయ్యాశుఁ జెంది
రమ యన రమింతు నింక నిరామయముగ. ౧౪౯

గీ. కామములు తత్ప్రదులు నరు ల్కా-మినులును
గాలవిద్రుతు లల దేవతాలితోడ
మొదలు తుదియును గల యిట్టి మూఁకఁ దవిలి
యేమి యార్జించితిమి ప్రియ మింతదాఁక? ౧౫౦

సీ. ఏసుకృతముననో యీ మందభాగ్యకు
విష్ణుఁ డీశుండు సుప్రీతుఁ డయ్యెఁ
గాకున్న నిర్వేదకారణంబులు క్లేశ
ములు మున్ను పెక్కు-లు బొడమలేదె?
యీనాఁటి నిర్వేద మీ మహాశకు సుఖా
వహ మగుచు వచ్చిన వరుసఁ దోఁచెఁ
బురుషుఁ డెద్దాన సంసరణానుబంధసం
బంధంబు విడనాడి పడయు శమము

నట్టి దైవదత్త మా నుపకార మాఁ
దల ధరించి చెడ్డతలఁపు లుడిగి
శరణ మందుదాన సర్వాధినాథు న
వ్వాని నొద్దనున్నవాని విభుని. ౧౫౧

యోగి స్వాత్మసుఖము నొంద నౌ నని పింగ
లకథ నెఱిఁగినట్టిలాగు రాజ! ౧౫౮

గీ. ఏది యేది ప్రియం బని యెంచి మర్త్యుఁ
డాహరించునో యది సేయు నధికదుఃఖ
మది యెఱింగి యకించనుఁ డైన వాని
యనుభవించు సుఖంబు నిరంతరంబు. ౧౫౯

క. సామిషకురరము సబలని
రామిషకురరములు సంప నై పైఁ బడన
య్యామిషము వైచి యది సుఖ
మామునొనెఁ దానివల్ల నధిగత మిదియున్. ౧౬౦

చ. మహిఁ విచరింతు మాన మవమానము లేక కుటుంబచింతతో
రహితుఁడు నైన బాలు నమరం గని యిర్వురె యుర్వి సౌఖ్యధూ
ర్వహులు విముగ్ధుఁ డైన పసిపాపయుఁ దద్గుణపారయాతుఁ డౌ
మహితుఁడు నంచు నెంచి గరిమన్ స్వరతి న్స్వవిహారినై ధృతిన్.

సీ. తనవారెటో చన్నతఱిఁ దన్ను వరింప
వసతికి వచ్చిన వరునివాగి
స్వయముగఁ దగు గౌరవము సేయవలసిన
పెండ్లికూఁతు రొకర్తు విందుకొఱకు
శాల్యవహననమ్ము చాటుగా నొనరింప
ముంజేతి వలయము మ్రోఁయఁ జొచ్చె
నది జుగుప్సిత మంచు మది నెంచి సిగ్గిలి
యూడ్చె నొకొక్కటి యుండె రెండు
మరల దంచుచుండ మొరయు నా రెంటిలో
నొకటి దూయ మెదలకుండె నొకటి
లోకతత్త్వ మెఱుఁగ లో నెంచి తిరుగుచుఁ
గన్నెవలన నేర్చుకొన్న దిదియు. ౧౬౧

జాత్మ కైవల్య మన బ్రహ్మ మనఁ బర మన
నాఖ్యఁ దస్మదాదివిభావితాఖ్యఁ డెందు. ౧౬౭

గీ. త్రిగుణమయి నిజమాయ యద్దేవుశక్తి
సంక్షుభిత మౌచు సూత్రాత్మ సంసృజించె
నాది నదె విశ్వతోముఖం బై జగంబు
సలిపె దానఁ బురుషుఁడు సంసారి యయ్యె. ౧౬౮

ఆ. ఊర్ణనాభి హృత్స్థ మూర్ణ నోట మెలంచి
చెలఁగి యాడి తుది గ్రసించు టరసి
య మ్మహేశుఁ డిట్లె యని యనుసంధాన
మాచరింప నిదియు నన్వయించె. ౧౬౯

గీ. సగము సంపి గూడునఁ బెట్టి సంభ్రమించు
భ్రమరముం గని భయమున భ్రమరరూప
మున్నయునికిన కను కీటము న్నయించి
కొన్న నయ మున్న దిదియు వాకొందు వినుము. ౧౭౦

క. స్నేహద్వేషభయాదుల
దేహి మనం బేకముఖత దేనియెడ నిడున్
మోహమున నేనిఁ దాద్రూ
ప్యాహితుఁ డవు భక్తి నీశతాప్తి వొసఁగదే? ౧౭౧

క. ఇమ్మెయి గురువులఁతో నా
నెమ్మది శిక్షఁ గొనినట్టి నీతి యితివిధం
బిమ్మెయితో ననుభూతిం
బమ్మిన బోధంబు వినుము పార్థివముఖ్యా! ౧౭౨

ఉ. ఇట్టి విబోధసాధ మొనయించు విమర్శము మూల మైనఁ దాఁ
బుట్టుచుఁ జచ్చుచున్ సతతము న్బహులార్తులపాలు సేయు నే
పట్టుననేని దీనిఁ దినఁ బాఱుఁ గ్రిమిశ్వసృగాలకాదు లం
చట్టి వివేకము న్విరతి నంది యసంగుఁడ నై చరించెదన్. ౧౭౩

ఉ. దేనికి మేలు గూర్చెద మతిం దనుధారి కలత్రపుత్రమి
త్రానుగపశ్వసంతధనయానముఖంబులఁ బ్రోవుసేయు నెం
తేనియుఁ గష్టి వై తుదకు నింకొకమేనికి బీజ మిందె సం
స్త్యాన మొనర్చి సృష్టిగతిఁ జా నగు మే నిది యేల కాల్పనే? ౧౭౪

సీ. జిహ్వ యొక్కెడఁ బోటుఁ జీలు నింకొకెడను
గుహ్య మట్లుదరంబు గోరు నెదియొ
శ్రవణ మొక్కెడ లాగు ఘ్రాణ మిగ్గడ యను
చపలదర్శన మన్నిచాయ లరయుఁ
ద్వక్శక్తి యొకవెంటఁ బట్టుపడేవి నాఁ
బలు తెఱంగుల నాశ బంభ్రమించు
పలువురు సవతులు పతి నట్టులు శరీరి
నట్టిట్టుసేయు నై యాతురుఁ డవు
వృక్షముల పశుపక్షిసరీసృపముల
దంశమశకమత్స్యాదుల తనువు లెన్నొ
యారచించి యతృప్తి నాత్మావలోక
ధిషణ నరుఁ జేసి ముద మందె దేవుఁడు తుది. ౧౭౫

ఉ. ఎక్కడను పుట్టువు ల్పనఁగ నెన్నఁడొ వచ్చు మనుష్యజన్మము
న్నిక్కిలి దుర్లభంబును ననిత్యము నర్థద మందు ధీరుఁ డిం
దక్కట మిత్తినోటఁ బడు నంతకుముందర ముక్తిఁ గై కొనం
గ్రక్కున నత్తనో విషయగంధము లింత కెఱుంగకుండెనే. ౧౭౬

క. ఇమ్మెయిఁ గ్రమ్మిన వైరా
గ్యమ్మున విజ్ఞానసుప్రకాశాత్మసనా
భిమ్ముకొనియె సహంకా
రమ్మున సంగమ్ము వదలి రస విచరింతున్. ౧౭౭

గీ. జ్ఞాన మిది సుస్థిరమ్ము పుష్కలము కాదు
గురుఁ డొకం డెంత చెప్పిన నరయవలయు

లోకతత్త్వమ్ము తత్త్వమ్ము లోక మగుటఁ
గాదె మును లన్ని విధములుగాఁ బలుకుట? ౧౭౮

గీ. అన్వయవ్యతిరేకదృష్టాంతగతులఁ
జింతనము సేయవలె గురు చెప్పినవిధ
మనుట కిది వ్యాఖ్య కాని వీరా గురువులు?
నిక్కమున కొక్కఁడె గురుండు నిగమవాది. ౧౭౯

సీ. యదున కివ్విధి బోధ మొదవించి వీడ్కొని
చనియె నెం దే సంతసమున విభుఁడు
నతులు నుతు లొనర్చి కృతకృత్యుఁ డై మన
పూర్వుల కటఁ బూర్వపురుషుఁ డలరె
సర్వసంగము లూడ్చి సమచిత్తుఁ డై యుండి
యడిగినవారికి నుడివె దీని
నది మొద లవధూతయదునాథసంవాద
మన నిది విఖ్యాతమయ్యె సభల
ననుచు వాసుదేవుఁ డనువదింప ధరించి
యుద్ధవుండు సెంది నున్మన_స్త్వ
మాదరమున వింటివా? శిష్యకులదీప!
దీపకుండ! ధీరధీవరుండ! ౧౮౦

క. తత్త్వాదృగ్విభవుం డవు
దత్తాత్రేయుఁడు నొడివిన తత్త్వము వినె నా
యత్తులకును వినిపించిన
యుత్తము లిరువురకు ముక్తి యొదవుఁ దదిచ్ఛన్. ౧౮౧

క. అని చెప్పె గురుఁడు శిష్యున
కని సూతుఁడు మునులతోడ ననె ఘనులారా!
విని శ్రద్ధ నిది ధరించినఁ
జను బోధము సర్వవేదసమ్మత మనినన్. ౧౮౨

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## తృతీయ గుచ్ఛము

క. శ్రీమహితాశ్రితజనచయ! శ్రీమత్సింహాసనేశ్వరీపరివృఢ! మ
తాకామాదిరిపునిరాకృతిసామర్థ్యవిరాజమానసన్మాత్మకథా! ౧

ఆ. అవధరింపు మనియె నమ్మునులకు సూతుఁ డాదరమున దీపకాభిధుండు
స్వాత్మగురునివలన నవధూతచరితంబు విని వినతులు సేసి వెండి యడిగె.

సీ. తలిదండ్రు లెంతటి ధన్యులో? గురుపాద
నలినషట్పదునిగ నన్నుఁ గనిరి
తత్సుకృతమ్మున దత్తదేవుమహత్త్వ
మాచార్యముఖగళితామృతమ్ము
సురదుర్లభమ్ము సంబరమునఁ ద్రావెదఁ
బరితృప్తి కలుగదు బ్రహ్మభూత!
యత్రిదత్తాత్మ పవిత్రము లన్యచా
రిత్రము లనుము నా యాత్ర మడఁగ
నతఁడె స్వయముగ నామది నాఁకగొనెనొ?
కన వినఁ దలంపుఁ గొన నన్యమున కెలయదు
కానఁ దత్కర్ణపీయూష మానినిమ్ము
సదయ! దవతప్తునకు గాంగసలిల మట్లు. 3

పితాపుత్ర సంవాదమును గురుడు శిష్యునకుఁ జెప్పుట

చ. అన నని వేదధర్ముఁడు మహాత్ముఁడ వైతివి లేర గెల్చి తీ
వనయము సంస్మృతిన్ వినుమనంతర మద్భుత మాత్మశుద్ధి కా

రణ మఘహారి యర్ఘ్య మమరన్ జనకాత్మజ సంవివాద మా
నిన సరుఁ డింకఁ జెందఁడు జనింపఁ బ్రసూందరగోళనాళముల్. ౪

సీ. మధ్యదేశనివాసి మహితగుణాఢ్యుండు
వేదవేదాంగసంవేది కలఁడు
భార్గవబ్రాహ్మణవరుఁడు వానికిఁ జాల
కాలము కడచనఁ గలిగె సుతుండు
బధిరాంధజడవిధు వాని సుమతినామ
నుపనీతు నొనరించి యుచితవేదిఁ
జలుపఁ దలంచి తజ్జనకుండు స్నానా
ద్యంగకముం జేసి యనియె వత్స!
చదువరా ముందు గురుఁ గొల్చి సక్రమముగ
వేదవేదాంగముల సంతఁ జెంద్లియాడి
జన్మము లొనర్చి సుతుఁ గను చను వనమున
కాశ్రమాంతరమున ముక్తి నందు మనుచు. ౫

గీ. మాటిమాటికి నాడిన మాటలాడి
మధురమధురాక్షరముగఁ గుమారవర్గ
మున వివిధముగ నేమేమొ బోధసేయు
నార్జితుని యెద్ద జడుఁ డన నుండి యుండె. ౬

క. పలుకఁడు గులుకం డులుకఁడు
కలికితనము లేని యిట్టి కాన్పేటి కటం
చలుచుగ నాడెడు నోరులకు
నలుకం డని నట్టి నవ్వి యాంతనికిఁ దుదిన్. ౭

క. మన కొక కాలము గలిగిన
యనువున మాటాడెదవు మహాత్మా! తేఁకెం
బును బుద్బుదోపమము ని
త్తనువును గోని యిన్ని సేయు దార్ఢ్యము గలదే? ౮

సీ. ఇన్ని పలుకు లేల? యీ నీవచించిన
చదువు లెన్నియొ సార్లు చదివినాఁడ
నివి గాక శాస్త్రము ల్వివిధము ల్శిల్పము
ల్నేర్చితి నన్నింట నేటుగంటిఁ
దఱికి నొక్కటియు నక్కఱకు రాదయ్యె న
ట్లొక్కట పుట్టుచు నడఁగుచుండఁ
బదివేల కెక్కుడు భవముల పా ల్లెల్ల
స్మృతము లై యుండు నిర్వేదపెట్టెఁ
దల్లు లెంద ఱేఁ కెందఱో తండ్రు లెంద
అన్నలుం దమ్ము లాప్తులు నరులు నెంద
ఱాత్మజులు దార లెంద ఱధ్వస్తు లైరి
మాటిమాటికి నిపు డవి మఱపురావు. ౯

గీ. అనుభవించితి దుఃఖసౌఖ్యములకలల
ముందరఁ గ్రియాసమభిహారముగ నిపు డవి
గంత కట్టిన య ట్లుండెఁ గనులు తెఱచి
నేఁడు చూడ విషాదంబు నివ్వటిల్లె. ౧౦

ఉ. అక్కట యింతకన్నఁ గలదా? యమవేదన వేదవాది నై
మొక్కల మౌ విధిం గొమలమూత్రమలావిలగర్భగోలముల్
పెక్కులు దూఱి దారిఁబడి విస్మృత మై యది యౌవనంబు రా
నక్కునఁ జేర్చి యక్కులము నాఁడనె యాడిన దాట మై చనెన్. ౧౧

ఉ. పుట్టితి విప్రగోత్రములఁ బుట్టితి క్షత్రియవైశ్యజాతులం
బుట్టితి శూద్రయోనులను బుట్టితిఁ గీటమృగాండజాతులం
బుట్టితి భృత్యులందు మఱి పుట్టితి నాహవశూరులందు ని
ప్పుట్టువు నీదుగేహమునఁ బుట్టితినట్టి విమోహ మేటికిన్? ౧౨

ఉ. ఇచ్చితిఁ బుచ్చుకొంటిఁ దఱి నేడ్చితి నవ్వితి నూరివారికై
ప్రముచ్చిలి జూదమాడి ధనముం గొని గెల్చితిన్ బ్రభు

సీ. చదివితి వేదశాస్త్రపురాణముఖ్యమ్ము
లెన్ని విద్దెలు కల వన్ని యెన్ని
స్నానసంధ్యాదులు జపతపోహోమాదు
లాచరించితి నాశ్రమానుగతము
లమ్మెయి సాధుసంగమ్మున సమకూరె
సతతాత్మవిద్యావిచారనిష్ఠ
సంతతాభ్యాసంబు సంతతయోగంబు
సుఖవిభావన తత్త్వశోధనంబు
మఱిగి యెడయకున్న మనసు పరాత్మని
యందుఁ జేర్చు ప్రీతి యతిశయించె
నంతఁ జాలకాల మరుగ నేకాంతిత్వ
నిష్ఠ నెనసినాఁడ నియతినియతి. ౨౦

మ. పరిపూర్ణానుభవప్రకాశ మెడగాఁ బ్రౌమాదికప్రక్రియన్
మరణింపన్వలసెం దదాది వెలసెన్ జ్ఞానం బొకింతేని వి
స్మరణం బే నెఱుఁగన్ బురాభవసహస్రవ్యాపృతిప్రాయసం
స్మరణం బిప్పుడు కల్గె నిమ్మెయిన మోక్షం బంద యత్నించెదన్. ౨౧

శా. సర్వోద్వృద్ధయ జ్ఞానదానఫల మీ జాతిస్మరత్వంబు నేఁ
బూర్వాభ్యాసముచే జితేంద్రియుఁడ నై పూర్ణత్వ మూహింతు నీ
పర్వం బబ్బదు ధర్మసర్మరతికిన్ భాస్వత్స్వరూపజ్ఞతా
నిర్వాహంబున విప్రవాఁడ నిదె గ్రంథిగ్రంథసంతానమున్. ౨౨

గీ. హృదయమందలి సందేహ మెల్ల నడఁగ
నడుగుము మహాత్మ! యేది యర్థ్యంబొ నీకు
జనక! ఋణము దీర్చుకొనెద నొనరునుడులఁ
బ్రశ్నముల కిచ్చు ప్రత్యుత్తరముల ననిన. ౨౩

చ. మరల ననెం గురుండు సుకుమారక! నీకథితంబుచొప్ప యం.
తరమునఁ దోఁచె సంస్కృతిశిఖం బఖిలంబును దీనిరూపు సు

స్థిర మనరాదు నిర్ఝరముతీరున నేతిసుమాళిఁ దెంపు పెం
పరయఁగరాక నాటి నది యట్టిద యే మనువాఁడ నిట్టిదో? ౨౪

సీ. నయనముల్ తెఱవని నసిగందు పిల్లు నం
సారపారముఁ జేర నైరహింప
నేకపుత్రుఁడ నైన యే నింద యుండునా?
యది ప్రేంచుకొని పోదునా? యటంచు
నిన్ను యొకింగిన యీనె తెల్పర వత్స!
కర్తవ్య మేది? యీ యార్తున కనఁ
గోడు కను తండ్రి! నాయెడ సంశయింపక
శ్రద్ధ కల్గినయేని సంశ్రవింపు
మనఘ! యింకేటి గార్హస్థ్య? మనుచు కేగు
మందు విధిగ వానప్రస్థ మాచరింపు
మనల వహ్నిపరిగ్రహం బూర విడిచి
సన్యసింపుము మనము వశ్య మగునాఁడు. ౨౫

సీ. ఆత్మ నాత్మను చేర్చి యద్వంద్వుఁడవు నిష్ప
రిగ్రహుండవు నతంద్రితుఁడ నగుము
బాహ్యసంస్పర్శ వివర్జితాత్ముఁడవు నే
కాంతశీలుఁడ నగు మట్టి యోగ
మమరినాఁడె బ్రహ్మాత్మైక్య మను దుఃఖ
యోగ శేమజ నైన యోగ మనయు
దది ముక్తికారణం బది పోల్క లేనిది
విషయసంగులకు నిర్విషయ మగ్వ
మందుఁ జెందిన భూతకార్యములఁ బూర విఁ
కెన్నటికిఁ గృతకృత్యుఁడ వన్న! యప్పుడు
యిచ్చటున నిల్లు పర సిద్ధి నెసఁగువాఁడ
వన్నఁ జిన్నకు ననియె నాయన నయమున. ౨౬

క. భూతపరాభూతుఁడ నై యేతాదృశదుఃఖయోగ మెనయక యుండం
దాత! నొడువు మోక్షశ్రీహేతు వనఁగ నైన యోగ మెడఁద సుఖింపన్.

సీ. ఆత్మవిజ్ఞాన విద్యాంబువుల్ గురియుచు
సంసారదావసంజ్వలితునందు
బ్రతికింపు నిజవాగమృతపాన మిచ్చి య
విద్యాఽహిదష్టుని విషము విఱిచి
మందిరదారాదిమమతానిగడబద్ధు
బంధ మూడ్వుము బోధపరిఘవమున
నాప్యాయితు నొనర్పుమా విషాదార్కతా
పార్తుఁ బ్రబోధ చంద్రాంశుతతుల
నెట్టి యభ్యాసమునఁ జిక్కనేని నాదు
మనము విక్షిప్త మిదియు సంసారబంధ
నముల మరలఁ దవులొక్కను నయము దక్క
నట్టి యోగ మిప్పుడు చెప్పవయ్య పుత్త్ర! ౨౮

క. అని యడిగినఁ గొడుకనియెన్
విను దత్తగురుం డలర్కవిభుముఖ్యులకున్
వినిపించినయోగం బిది
యనూన మింకొకటి యిట్టి యధ్వమె? యనుడున్. ౨౯

గీ. అధిరాజ్యంబు విడిచి యోగార్థి యయిన
యయ్యలర్కుఁ డెవం డెట్లు లడిగె గురుని?
దత్తగురుఁ డన నెవ్వానితనయుఁ డతని
కెట్టి మార్గంబు నొడివె? నాయి మ్మనుచు మన. 30

సు మ తి చ రి త్ర ము

ఉ. కానుపు తండ్రి కిట్టు లనుఁ గౌశికసాన్వయుఁ డుండె మున్ ప్రతి
ష్ఠానపురిన్ ధరామరుఁ డసత్కృతుల న్మను పాచరించి యి

ఉ. అజ్ఞుఁడు గాన యిట్టిసని యాలికిఁ జెప్పును యేమి సేతు? నా
యాజ్ఞకుఁ దప్ప వెప్పుడు నుపాయము నాకును వేఱ లేమి ధ
ర్మజ్ఞ! వచించుచుంటి వినుమా యనుమాన మిఁకేల? దానముల్
యజ్ఞము విజ్ఞకుం బ్రియుఁబ్రియం బొనరించుట కాక యన్యమే? ౩౬

ఉ. చూచుచునుండఁగా నెడఁదఁ జొచ్చెను గా దనఁ బాయదట్టె వి
శ్వాచి! ఘనస్తనాంచిత విశాలనితంబ లతాంగిఁ గూడఁగా
నోచిన మేలు కానియెడ నూరుచునుండెను బాకు మూరుఁ ద
ల్లోచినవాఁడు చంపి తినఁడే? యదయుం డతఁ డబ్జలోచనా! ౩౭

గీ. మనుజులకు వామఁ డట్టె కామవిభుఁ డెందు
నదియు సామాన్య బహుజను లర్థి విడరు
నాకు గమనాగమనశక్తి లేకపోయె
నిట్టి సంకట మే నెట్లు లీఁదువాఁడ? ౩౮

గీ. ప్రొద్దు ప్రొద్దునఁ జూచితిఁ బ్రొద్దుపోయె
నిముస మేనియు నెడయదు నెమ్మది నది
యోపతివ్రత! కూర్పు నీ యోర్పు చూత
మాలసించితివేని న న్నతనుఁ డడఁచు. ౩౯

మ. అని కామాతురుఁ డౌ మగం డనెడు కు య్యాలించి చాలించి త
క్కిన తత్కాలకృతు ల్పతివ్రత పతిం గీలించి యంసంబునం
గనకంబు న్మడిఁ బన్ని పోయె నిసి మేఘచ్ఛన్న మౌ నాకసం
బున విద్యుల్లలితాంగి చూపెడు పథంబుం గొంచు భర్త్రర్థమై. ౪౦

గీ. అబల మందగామిని తన యంసపీఠి
నుగనిఁ గొని యట్లు పోయెడు మార్గమందుఁ
జోరశంక శూలప్రోతుఁ డై రహి నెడి
యుండె మాండవ్యుఁ డను మునిమండనుండు. ౪౧

గీ. అసలు కామాంధుఁ డామీఁద నంధకార
మాలిబుజ మెక్కి పోయెడు నా ద్విజవరుఁ

చ. ఖగవిభుమండలం బటులు గ్రక్కున నాఁగుడుఁ జిక్కియున్న యా
ఖగతుల మండలంబులు నొకం డొకఁ డెక్కడ వక్కడ న్నిలన్
ఖగములు కూయకుండెఁ గడకం గడియారము ద్రిప్ప వేఁగునా?
ఖగవరులే భయంపడ జగం బనిశమ్ము నిశామయమ్మె కాన్. ౪౯

గీ. గోష్ఠిలో నున్న హరి కొల్వుకొట్టమందు
రసపరవశత నున్న సురప్రభువులు
కాదు కా దౌను గా దని కళవళపడి
నిలిచెను ఖగోలగతు లని నిశ్చయించి. ౫౦

శా. ఎట్లెట్లూ? గడియార మాఁగినటులే యీ సృష్టి సర్గంబునన్
జట్టె మ్మెల్ల నొకప్డె యొడ్డగడ వై సంస్తంభముం బొందెనే?
పొట్టల్నిండునె మాకు మానవుల కీ పో రెప్పు డిట్లున్న నా
కట్టైన్ లోకము నాకె యోర్తు దొసఁగా? కాదెంచ సద్ధర్మ మౌ. ౫౧

గీ. కాలమునఁ బ్రోతుఁ డైన సచ్ఛీలి మౌని
నతఁడు దన్న శపించె నోరాడు నెట్టు?
లదియుఁ దప్పనఁ దన్నినయతని తప్పు
నెన్నఁ గడఁగిన నింతకు నెంత లౌనొ? ౫౨

సీ. పగలు రేయును లేక పక్షమ్ములును నెలల్
బుతువులు జ్ఞాతమ్ము లెట్టు లౌను?
ఆవి యవి యవి లేక యబ్దసంఖ్య యదెట్టు?
లది లేక కాలమే యాఁగు నకట!
స్వాధ్యాయములు లేవు స్వాహాస్వధలు లేవు
లేవు వషట్కారభావుకములు
నల పతివ్రతమాట కదుగు దాఁటఁగ రామిఁ
బడియుండె నెందొ దివాకరుండు
వాని యుదయము లేకుండ స్నాన మెట్లు
సంధ్య యెట్లు దానము లెట్లు సవన మెట్లు

హావన మె ల్లెట్లు లస్మదాప్యాయనంబు
పుడమి బ్రదు కెట్లు సర్వమ్ముఁ బోయెఁ బోయె. ౫౩

గీ. ఏము దివినుండి వర్షింప నిల ఫలించుఁ
బుణ్యపురుషు లందు యజింపఁ బోరు గడచు
మాకు నిట్టి పరిస్థితి మనుచు మూల
మల విభాకరుఁ డతనికే యడ్డు వచ్చె. ౫౪

సీ. నిత్యనైమిత్తికనిష్ఠులు వర్జించి
క్రతుభాగముల మాకుఁ గాంచ నీక
మా వృష్టి నొదవిన మంచి పంటలచేతఁ
దనపొట్ట నిండించుకొను జనమ్ము
సహింపఁ దోయసూర్యాగ్నిమారుతతతి
క్షితితోడ దోసదూషిత మొసర్గు
మద్దాన దుష్కృతు లగువారు మరణింప
నుత్పాతములు దోఁచు నుర్వియందు
నందుఁ గొందఱు యజ్ఞశిష్టాశు లుందు
రనిన వారల కేము పుణ్యమ్ము లైన
లోకములు భోగములు నిచ్చి సాకుచుందు
మిన్నిఁటికి మూల మిప్పు డ య్యినుఁడె రాఁడె. ౫౫

గీ. అని యమరు లెల్ల నొయ్యఁ దాతయ్యఁ జేరి
యజ్ఞవిచ్ఛిత్తి శంకించి యఖిలలోక
ముల కనర్థము వాటిల్లు మోస మొదవె
నని మనవి సేయ వారల కనె నజుండు. ౫౬

చ. దిన మొనరింప నా కృతి పతివ్రత మాటను దాఁటలేక పో
యెను వినుఁడీ సురేంద్రు లిది యిట్టిద యుచ్ఛ్రితతేజ మట్టి తే
జునఁ దప మత్తపంబునన సూ గెలువంబడు నిప్పతివ్రతా
ఘనమహిమంబు నట్టి సతి గట్టిమహత్త్వముఁ బెట్టి యోర్వఁడా. ౫౭

ఉ. సూనృతుఁ డత్రి వాని యనసూయఁ దపస్విని నాశ్రయింపుఁడా
భానునిఁ దోఁపఁజేయు నల భావిని నైజమహత్త్వ మేర్పడన్
సూనులఁ గోరి వారలు విశుద్ధతపం బొనరించుచున్న వా
రా నెఱి నద్రిసానువులయందుఁ జిరం బని యానతిచ్చినన్. ౫౭

ఆ. నతుల నతులనుతుల నాకవాసులు గొల్వ
సుప్రసన్న యగుచు సుదతి యర్థ్య
మెద్ది? యనుడు వార లిను నుదయం బన
సాధ్వి యనియె సారసమితితోడ. ౫౮

ఆ. ఉచిత మరసి సాధ్వి యుత్తమభావంబు
వెలయ నామతించి విశ్వమునకు
మేలు కలుగ మీరు మేలములాడంగ
పగలు లేకయుండఁ బగలు సేతు. ౬౦

అనసూయ మాహాత్మ్యము

చ. అని సురపంక్తితో నని రయంబునఁ దచ్ఛుభమందిరంబు మె
ల్పునఁ జొఱఁబాఱి యర్హ్య మవు పూజలకు న్మది మెచ్చి యా పతిం
దనువున ధర్మమందు దయితప్రియతాదులయందుఁ గౌశల
మ్మునఁ గుశలమ్ముచొప్పరసి ముద్దియ యాఁదల యాప నిట్లనున్

సీ. పతి మోముఁ జూచి సంతత మనుమోదింతె
కల్యాణి! యెదెకదా కల్య మువిద
కళలదివ్యులకన్న నభ్యధికుండుగా
నీమతి విభుఁడు మన్నింపఁబడునె?
భర్తృశుశ్రూషాశుభవిధానమునఁ గదే
నే నెనసితి నెంచరాని ఫలము
నాకైకా దమ్మ! యేనాతికేని సమగ్ర
కామఫలాప్తికి గమనిక యిదె

పంచఋణములఁ దీర్పంగవలె మనుష్యుఁ
డన్నిఁట శ్రమంబుపడి కూర్చు నతఁడు సుకృత
మందు సాఁబాలు ముడిపైనె దనది పురంధ్రి
మగని మెప్పించినా నలుమాట లేల? ౬౨

సీ. మహితాత్మధర్మధర్మంబున మానవు
ల్ధనము లార్జింప నౌ ననిఁ గానవలె
సంపాదితార్థంబు సత్పాత్రములయందు
సవిధిదానమ్ములు సలుపవలయు
నహరహంబును శక్తి ననుసరించి వానర్ప
వలయుఁ గర్మములు సర్వమ్ములు శ్రద్ధ
శాస్త్రనిర్దిష్టస్వజాతిధర్మమ్ముల
ననుసాగరోషు త్రై యాలుమువలయు

నష్టకష్టమ్ములకు నోర్చి యాచరించి
నట్టి సుకృతవిశేషమ్ము లమరఁ బురుషు
లెనయు పుణ్యలోకమ్ముల నింతు లొందు
వారు కేవలభర్తృసేవావ్రతమున. ౬౩

ఉ. లే దిల వేఱ యాగములు లే దుపవాసము లట్లె శ్రాద్ధముల్
లేవు పతివ్రతాంగనకు లేవు పృథగ్వ్రతనిష్ఠ లెవ్వియున్
భావిని భావ మొప్ప పతి భక్తి యొనర్చుచుఁ దద్ధితార్థసం
భాసన నిష్టలోకములఁ బంచికొనుంగదె యాశ్రమంబుగన్! ౬౪

గీ. సురలఁ బితరుల నతిథులఁ బరుల నరులఁ
గొలుచు విభు నాన్యచిత్తయై కొను మహిళకు
నన్నిఁటి ఫలంబు సాము సా మధిగత మగు
దానిపున్నెము వినుతింపఁ దరమె విధికి? ౬౫

ఉ. కావున నీవు సాధ్వి! పతికంటెను లోకము వేఱ లే దటం
చే విధినైనఁ గొల్వుమని నేమఱకుంటివె? యుందు మట్లు నీ

సేవకు విశ్వవిశ్వము వశీకృత మౌ నది యేల ముక్తికిం
ద్రోవయు నిద్ది యే పెరగతుల్గలవే యిది కాక యాంద్రకన్? ౬౬

చ. అను ననసూయమాట మహితాదృతితో విని మెచ్చి యల్ల మా
నిని మహనీయఁ జూచి యనె నిర్మలమానస! ధన్యురాల నై
తిని సమనుగ్రహింపఁబడితిన్ నను దేవత లెల్ల మెచ్చినా
రనితరభావ! నీ పలుకు లాత్మనయమ్మున శ్రద్ధఁ బెంచెడిన్. ౬౭

గీ. ఎఱుఁగుదు నధీశుకన్న లే దింతి కొండు
గతి యిహమ్మునఁ బరమున నతిసుఖకర
మనియుఁ దదనుగ్రహమ్మున నస మసమము
దయిత కని వాఁడె సతి కాదిదైవత మని. ౬౮

గీ. ఐన నీ బోధమునను మహాత్మురాల!
శక్తివంచనలేకుండ శ్రద్ధ గలిగి
సంచరించెదఁ బూజ్య నా సద్మ మెనసి
తేమి సెల వేను మత్పూజ్యుఁ డే నొనర్ప? ౬౯

క. ఈ లలి పతిదేవత నుడు
లాలించి సుతుష్టహృదయ యై విదితలస
చ్ఛీల మహాభాగ తపో
లోల యనియె నత్రిపత్ని లోకము మనుపన్. ౭౦

సీ. వీరె దివ్యులు దేవవిభునితో దుఃఖితు
లై రామ! తోడ్తెచ్చినారు నన్ను
వారిమాటలు వినవలదొకో? మనబోంట్ల
కతివ! లోకార్థ మిట్లర్థులైరి
యాచించుచున్నా రహర్నిశాసంస్థ య
ఖండిత మామూలుగా నొనర్ప
సత్కర్మదిననక్తసంనిరూపణ మది
త్వద్వాచికాయత్తతం బరగెడు

నమ్మ! నేనుఁ దదర్థ మాయాంత ర్నైతిఁ
జూచ్చె నా నుడి వినుము మను శోభనమ్ము
లార్య! విశ్వమ్ము నిపుడాపదబ్ధినుండి
యుద్ధరింపఁగ నీవు గా కొరులు గలరె? ౨౧

చ. సమయవిభాగ మేర్పడమి స్నానము సంధ్యయు సత్వరమ్ములున్
సమయఁగఁ బుష్టి లేమి సురసంఘము నేడ్పడ నాస లేమి మా
నము యగుఁ బాడిపంటలను సర్వము దాన నశించు నట్టి దో
స మయము గాఁగ సాధ్వి! రవి సమ్మతి రమ్మను మమ్మ మున్నటుల్.

క. అనవిని మహానుభావా!
ముని మాండవ్యుఁడు శపించె మును మత్పతి న
య్యెనుఁ దుదయు మనయుచుండఁగ
వినాశ మొందఁగల నని విదిత! యది యెటుల్? ౨౩

చ. అన ననసూయ పల్కె మగువా! యిది నీ మది క్లిష్టమైన నే
నొసరిచెదన్ రవిం బిలువు ముజ్జ్వలుఁ డా మునిమాట సాఁగని
మ్మనఘ! పతివ్రతంబు గలయట్టి పురంధ్రుల పుణ్యభాగము
ల్గాని భవదీను నన్ను నగుఁ గోమలి! యింతకు నింత యేటికిన్? ౨౪

గీ. మేలి మేను రోగమ్ముల గోల లేక
క్రొత్తవయసున మను సాధుచిత్తుఁ డగుచు
నేలు నిను వల్లభుం డని యింతిచేఁ ద
థైవ యనిపించి పిలిచె నర్యము సుచరిత. ౨౫

మ. దశరాత్రైకనిశీథ మట్లు గడవం డా సత్రియిల్లాలి యా
జ్ఞ శిరంబందు వహించి యంత యొకా శీతుం బచ్చగుత్తాలఁ బ
న్ని శతాంగం బటు దేర నెక్కి రవి సెందెన్ ఫుల్లపద్మారుణా
భశుభాంచన్నిజబింబుఁడై యుదయశుంభత్పర్వతాధిత్యకన్. ౨౬

గీ. చెప్ప నోరాడునా? వ్రాయఁ జేతులాడ
వయ్యె మాండవ్యమునిమాట యన్నయట్లు

క్రింద కొఱఁగుచునున్న శరీర మపుడు
పట్టుకొనెఁ బడకుండ నవ్వాని చాన. ౨౨

మ. అవిషాదంబున నుండు భద్రముఖి! భర్త్రారాధనం బొన్న పు
ణ్యావిశేషంబునఁ జూడు మిప్పు డబలా యాలస్య మేలా! భవ
ద్ధవుఁ బ్రత్యాగతజీవుఁ జేసెద నటం ధ్యానించె న య్యత్రిప
త్నీ విశేషించి వచించె నంచితముగా దివ్య ప్రశంసింపఁగన్. ౨౩

మ. ఒకనాఁడేనియు నాథుతో సరిగ నన్యుం బూరుషున్ రూపశీ
లకలాబుద్ధివిభూషణప్రియకథాలాపాదులం దెన్న లే
దకలంకంబు మనంబు సాక్షి యిది సత్యంబేని నీ విప్రు మే
నికిఁ బ్రాణంబులు వచ్చుఁ బొల్చు సతితో నీరోగి నూఱేండులున్. ౨౪

మ. దయితుంబోలిన దైవతంబు నొరు నాత్మ న్నే నొకప్డేని నే
భయమం దేనిఁ దలంపకున్నయది భవ్యం బై నిలింపేశది
వ్యయమీంద్రాదుల కెక్కియుండుట నిజం బైన న్సతీశుం డనా
మయుఁడై విప్రు డితండు జీవయుతుఁడై మన్నించు నూఱబ్దముల్.

క. మనమున వాక్కునఁ గర్మ
మ్మున నా యుద్యమము భర్తఁ బూజింపంగా
మొనయుట సత్యం బగుటన్
ఘనుఁ డీ విప్రుండు బ్రదుకుఁ గడు దీర్ఘముగన్. ౩౧

క. అనసూయావాక్యమ్ముల
కనంతర మె మేనఁ బ్రాణ మది రాణింపన్
దనకాంతుల నిలు మెఱయం
గనుచుండఁగ ద్విజుఁ డు దివ్యకరణి నెలర్చెన్. ౩౨

చ. కురిసెను బుష్పవర్షము లకుంఠముగా దివి దేవవాద్యముల్
మొరసెను సంతసంపడిరి భూచరఖేచరు లెల్లవేల్పులున్
హరిహరులం బితామహుని నగ్రగులం బొనరించికొంచు నా
దరమునఁ జేరి యత్రిసతి ధర్మము నర్మిలిఁ బ్రస్తుతింప నై. ౩౩

గీ. వరము గోరుము కల్యాణి! వరదు లగుచు
వచ్చినా రీ సురలు నిన్ను మెచ్చినారు
దేవకార్యంబు మహిమ సాధించి తీవు
బ్రదికె నీవల్ల లోకము బ్రతికె ద్విజుఁడు. ౭౪

మ. అనుచో న య్యనసూయ భాగ్యమె వరార్హత్వమ్ము నా కున్న మీ
కును దాత్పర్య మిటున్న మత్పతి మదిం గుర్తించి యోచించెదన్
ఘను లీ బ్రహ్మహరీశ్వరు ల్మువురు నా గర్భంబునం జొచ్చి నం
దను లైనం దప మస్మదీయము కృతార్థం బౌ జగం బౌ ననన్. ౭౫

ఆ. అదియుఁగాక వేల్పులార! హరీశాదు
లార! క్లేశముక్తి కయిన యోగ
మేను నా విభుండు నెనయంగఁ జేయుఁడా
యింతకన్నఁ గోర్కు లెవియు లేవు. ౭౬

క. అని కోరిన సాధ్వి వరం
బనూన మది యట్లు లగుత మని యా ప్రభువుల్
చనిరి నిజమ్ములకుఁ దప
స్విని గౌరవ మొనరఁ జేసి వింటివె? తండ్రీ! ౭౭

అనసూయ గర్భమునఁ ద్రిమూర్తులు పొడముట

సీ. బ్రహ్మద్వితీయపుత్రికుఁ డత్రి భగవంతుఁ
డనసూయఁ దనపత్ని ననఘ స్నాత
శోభనసర్వాంగి లోభనీయతమాకృ
తిం గని మనములో సంగ మొంచ
నూర్ధ్వగతము సేసి యుంచిన శుక్రంబు
కనుగొలుకులనుండి కాఱుటయును
బవనుఁడు తిర్యగూర్ధ్వప్రసృతము సేయ
నది గొని గర్భిణు లయ్యె దెసలు

రజమునం దోఁచి బ్రహ్మాంశరాజితుఁ డయి
సోమరూపపరిణతుఁ డై సోముఁ డనఁగ
నత్రిమానసపుత్రత్వ మందెఁ దొలుత
సర్వసత్వాయురాధారసంస్థకు నయి. ౮౮

శా. చిత్తంబందు సుతుష్టిఁ జెందు హరిచే స్వీయాంశ మీయంగ నై
దత్తాత్రేయుఁ డనం ద్విజోత్తముఁడు సత్త్వప్రాయుఁ డై తోఁచె నా
యుత్తేజం డవతీర్ణుఁడౌ హరి ద్వితీయుం డత్రిపుత్రాళి స్వా
యత్తుం డై కడు ధన్యఁ జేసె ననసూయన్ స్తన్యపానంబునన్. ౮౯

సీ. తల యెత్తె రుద్రుని తామసాంశంబున
నలనాఁటి తద్వరం బనధరించి
తల్లి యుదరములోఁ దా నుండె నేడు నా
ళ్ళుదరుఁ డై దరగళాంకాంకితుఁ డయి
యింతలోపల హైహయేంద్రుఁ డుదావర్తుఁ
డును ప్రమాణదుఁడు రూఢుండు నగుట
వీక్షించి సైరించు వెరవు లేని మనంబు
దారిఁ దీయఁగ గర్భధరఁ దొఱంగి
పొడమెను ధర దుఃఖామర్షములు వలఁగొన
వానినిఁ బరాభవించి కాల్వ నగునెలమి
నతఁడె దుర్వాసుఁ డనఁగ విఖ్యాతుఁ డయ్యె
నత్రిపుత్రులలోఁ దృతీయతకు నమరి. ౯౦

ఉ. హాయి నొసంగు చేతుల నయంబున స్థావరజంగమంబు నా
ప్యాయితముం బొనర్చుచును స్వర్గమునందు వసించి సోముఁ డే
చాయకుఁ జాయ వెట్టుచుఁ బ్రజాపతి యై ద్విజరా జనంగ బ్ర
హ్మాయితనై జభావమున నత్రికిఁ బేరును బెంపుఁ గూర్చెడిన్. ౯౧

క. శిష్టానుగ్రహకరుఁ డై
దుష్టనిబర్హణ మొనర్చు క్రోధ నెఱుఁగ నై

యష్టైశ్వర్యయుతుం డై
స్వేష్టి న్విష్ణుండె దత్తుఁ డిల వెలసిల్లెన్. ౯౨

ఉ. ఆసలు మాని సంగ మెడయం దన తల్లిని దండ్రి వీడి దు
ర్వ్యాసుఁడు పిచ్చివానివలె వానిరి నెందుఁ జరించుచుండు ని
శ్వాసము మాన్పు వాక్కు మది వర్తన ముద్ధతముల్ సదా ద్రుఁ డ
భ్యాసము సేరరా దొరుల కర్థవిరోధుల నిగ్రహించుచున్. ౯౩

గీ. అంగడకుఁ గాక భువనము గ్రుంగి యుమియఁ
గలుగు సాములు కొమరు లై కాంతు దీర్ప
నంతకన్నను గలదె యర్థ్య మొకఁ డెందు
నత్రి తనపత్నితో విజితాశుఁ డయ్యె. ౯౪

సీ. అనుభవించెను విషయమ్ముల యోగస్థుఁ
డయ్యు దత్తాత్రేయుఁ డచ్యుతుండు
విను మది యెందటో మునికుమారులు తన్ను
బోధార్థు లై సతమ్మును వరింప
సహసంగితం దెల్ప సజ్జాకరంబున
మునిఁగిన యట్లుండెఁ గొని దినమ్ము
లై నను బ్రియదర్శనాత్ము సమ్మోహితాత్ము
వారలు విడ రైరి తీర మనసి
దివ్యవర్షశతంబు పూర్తిఁ గనునంత
సలిలము సలీలముగ ద్రోచి వెలికి వచ్చె
నొక్క కల్యాణి నారి రంభోరు నురుని
తంబ దివ్యాంబరధరం గరంబునఁ గొని. ౯౫

ఉ. ఈగతివాని మానిసుతు లేమని కొల్చెద మంచు వీడిరా?
యోగమున న్వసింతు మని యుజ్జ్వలు లప్పటి కైన వీడమిన్
భోగినితోడఁ గూడి యది పుక్కిటఁ బట్టి యొసంగినట్టి ది
వ్యాగమవారుణీరసము నానఁగఁ జొచ్చె సముజ్జ్వలంబుగన్. ౯౬

## దత్తాత్రేయుని చరితము

చ. తన కొక కాంత యంట సుర త్రాగుట యంట యజ్ఞసగీతవా
ద్యనికరసేవ యంట కొమ యంకము వామమునఁ జెంది సతతం
త్రిని మొరయింపఁ దన్ముఖము నిత్యము ముద్దిడుపద్దులంట చా
లు నితని శిక్ష లంచు మునులు న్మునిసూనులుఁ బాసి రా యతిన్.

శా. తుల్యాయాసవిధిక్రియుం డని మహాత్ము న్స్వాంతమం దెంచి ని
ష్కల్యు ల్వీడినమాత్ర వానియెడ దోసం బున్న దే? వారుణీ
మాల్యామూల్యవిభోగచిహ్నముల న మ్మాన్యుండు భాసించెఁబో
లౌల్యం బేది మరుద్గతిం గలవె? పోల న్స్పృశ్యతాస్పృశ్యతల్. ౯౮

క. తరుణిం గొని సుర ద్రావుచు
చిరతప మొనరంగఁ జేయు చిన్మూర్తి సురే
శ్వరు లట్లు మోక్షకాములు
బరువడి సేవించి రెఱిఁగి భావము వొంగన్. ౯౯

క. బీభత్సము రూపముఁ గొని
యా భవ్యుఁడు యోగచర్య నటు సాగించెన్
శోభనము లొదవుఁ బాపము
లో భస్మము వానిఁ దలఁచినంతం బ్రజకున్. ౧౦౦

గీ. దివ్యమార్గవిచక్షణు ల్దీప్రయోగ
విభవవిజ్ఞాను లై కార్తవీర్యుఁడాది
యౌ నృపాలుర తత్ప్రసాదాత్తమహిమ
నెంతలెంతలు సాధింప? రిల వినమొకో? ౧౦౧

క. అనుడు విచిత్రం బదియును
మునిసూనులు గొలువలేక మోహమునం బడన్
జననాథుఁ డెట్లు రాజస
ఖని వాని నెఱింగి మెచ్చఁగా సేవించెన్? ౧౦౨

క. వినఁ గౌతూహల మయ్యెడు
మనంబు త్వరఁబడెడు నోకుమారక! యిఁక నా
ఘనయోగిరాజచరితం
బనుమా యనుమాన మునుల నన సుతుఁ జనియెన్. ౧౦౩

క. కృతవీర్యుని కొడుకు కర్జునుఁ
డతఁడు దివం బెనయ నతని నభిషేకింపన్
హితమంత్రిప్రకృతిప్రరో
హితవర్గము పిలువ నతఁడు నిటుల నతఁ డనెన్. ౧౦౪

సీ. ద్వాదశభాగంబు దైత్యు లిచ్చెదరు స
స్యమ్ముల నమ్మ లాభమ్ములందు
నర్ధమర్ధం బిత్తు రాలమందలవారు
క్షీరదధ్యాజ్యాల కొనుటనందు
నా లవు భాగంబు వ్యవసాయుకు లిత్తు
రారు పండించిన పంటలందు
జపతపంబుల ద్విజజాతు లిత్తురు భాగ
మన్య లమ్మియు నిజాయమ్ములందు
నరసి రక్షింపకుండు గాదా? యటు గాని
రక్షణము సేయనేరని రాజు దొంగ
సచివులార! నేఁ బెల్ల రాజ్యము వహింప
నేను పనికొల్ల నారకకూపమునను. ౧౦౫

చ. తన కిడి యన్న్మనస వసుధాపతి కింకొకవాని కిచ్చి దా
రి నెఱయు దొంగ కిచ్చి బెదరించెడువానికి నెల్ల నిచ్చి నై
శ్యనికర మింత దండగ ప్రజాతతి నర్తినఁ గొట్టి ప్రోవునే
యు నది యుపేక్షసేసి యొనయుం బతి పున్న మదంగ నన్నిమున్.

గీ. కోమటులయందుఁ దా నొక కోమటి యయి
దొంగలందు మఱొక్కండు దొంగయు నయి

తనదు పరిపాలనాంశ మందఱకుఁ బంచి
పంచకరపాల్గుపడు రేపు పార్థివుండు. ౧౦౭

క. రక్షణవేతన మని కద
యీక్షోణీశులకుఁ బూర్వు లిమ్మనిరి ధన
మ్మక్షుమునకు నది చెల్లునె
రక్షింపఁగలేని దొంగ రా జెట్టు లగున్? ౧౦౮

ఉ. కానఁ దపం బొనర్చి నెఱకాన నభీప్సితయోగసిద్ధులం
బూని దివిన్ భువిన్ మెలఁగు భూరిమహత్త్వము గల్గునాఁడు నే
నే నిఖిలాస్త్రవేత్త నయి యింగితభంగు లెఱింగి యేలుదుం
గాని భవన్మతం బురివి కల్మషభాగి నొనర్తునే ననున్? ౧౦౯

క. అను వానినిశ్చయమ్మును
గనికొని మంత్రుల నెసంగు గర్గాచార్యుం
డనుకూలవాక్యముల నా
తనినెమ్మది కింపుసేసె దారి దెలుపుచున్. ౧౧౦

క. రాజకుమారక! మేలే
యోచించితి వట్టులైన యోగేశు మహా
తేజుని దత్తాత్రేయుని
భ్రాజిష్ణు భజింప నరుగు వాంఛ ఫలించున్. ౧౧౧

సీ. సహ్యశైలద్రోణి సంకల్పితాశ్రముం
డతఁడె లోకత్రయి కధిపతి యన
సర్వత్ర సమదర్శి సమవతీర్ణుం డయ్యె
జగతి జగద్ధాత చక్రధరుఁడె
యనసూయగర్భంబునం దారఁబండిన
యత్రిమునీంద్రు పుణ్యముల పంట
యమ్మహామహునిఁ గదా యాశ్రయించి స
హస్రాక్షుఁ డేలఁగా నయ్యె దివము

వరదుఁడు వర మిచ్చు వైరుల సమయింప
వచ్చు నద్దాన సంపదలు పొందలు
నడుగులఁ బడి యెట్టు లన్నను విడువక
య్యాప్రసాదం బుపాయమునఁ గొల్వఁ
డనుచు బోధం బనుచు వేల్పు లనుగమింప
నరిగి దత్తేశ్వరాశ్రమం బధిగమించి
కాంతితో లక్ష్మితోడ జాజ్వల్యమాను
న మ్మహాత్ముని దర్శించె నఘము లడఁగ. ౧౧౭

గీ. పాడుచున్నారు గంధర్వవరులు చుట్టు
నాడుచున్నా రెదురఁ బన్ని యాటకత్తె
లెత్తి కొమ యిచ్చు నాసవం బెడనెడఁ గొని
గ్రోలుచున్నాఁడు మునివరుం డాలి కిడుచు. ౧౧౮

గీ. అల్ల మునికిని మ్రొక్కి రయ్యమరవరులు
సురలు సురఁ దెచ్చియిచ్చి ర ప్పురమునకును
ఫలములును బలలంబు లుపాయనములు
గూర్చి సేవింపఁ జొచ్చి రాకూత మెఱిఁగి. ౧౧౯

క. నడచిన నడతురు నిలువం
బడుదురు నిలబడినఁ గాళ్ళఁ బడుదురు కనినన్
నుడువుదు రడిగిన నుడులకు
నడకువయును బత్తి వెలయ నర్చించి రొగిన్. ౧౨౦

గీ. ఇట్లు సేవింప సేవింప నిష్టుఁ డగుచు
నేల శుశ్రూష సేసెద రింతపడుచు?
నేమి కోరెద రెడఁదల నెలమిఁ దెలుపుఁ
డని మహాత్ముఁడు ప్రణతుల నడిగె సురల. ౧౨౧

గీ. మాని శార్దూల జంభాదిదానవౌఘ
మాక్రమించెను భూర్భువరాదిభువన

మాహరించెను యాగభాగర్థు లెల్ల
తద్వ్యథం బూది మము నోమఁ దలఁపుమయ్య! ౧౨౨

గీ. దైవతేశ! భవత్ప్రసాదముసఁ జేసి
మరల నమరులు త్రిదివసంప్రాప్తు లగుదు
రట్లు చింతింపవే యని యడుగు లొత్తు
నుత్తముల కిట్టు లను దత్తసత్తముండు. ౧౨౩

ఉ. వేలుపులార! యిట్లు గలవే యటనేని విచిత్రచిత్రముల్?
చాలినవారు మీరు దితిజప్రకరంబుల నోర్వలేరె? నే
నాలికిఁ జిక్కి యింగిలికి సంజక వారుణి మాటిమాటికిం
గ్రోలుచు నింద్రియార్థములకు న్వశ మాట యెఱుంగకుంటిరే? ౧౨౪

ఉ. అక్కట నవ్వులాట కిటు లంటిరొ? నామతిఁ ద్రిప్ప నైన యి
త్తొక్కఁడి బట్టినారొ? కలదో యిట విక్రమమేఁ దనంబయేన్
రక్కసికేంద్రు గెల్వఁగఁ దిరం బగు సాధన మెద్ది మాచి స
న్నిక్కలి నున్న పాఱుని నయించెదరో? యెఱుఁగన్ సురేశ్వరుల్!

క. అనుచుండ జగన్నాథుఁడ
వనఘుఁడ విది యెదియు నంటునా విద్యాతే
లనఘాద్ధాంతరవిజ్వల
దనూనవిజ్ఞానదీపితాత్మని నిన్నున్? ౧౨౫

గీ. అన్న వేల్పులతో నిజ మన్నలార!
యున్న దొక్కింత సమదర్శనోల్లసనము
కాని యీ చానతోడి సంగ మిటు లెనసి
యకట యెంగిలి మంగల మైతిఁ జుండు. ౧౨౬

శా. వాసిం బాపును వచ్చు వన్నెఁ జెఱుచుం బ్రజ్ఞల్ హరించుం దపో
భ్యాసప్రక్రియఁ గట్టిపెట్టు ధనవిద్యాకీర్తిశౌర్యాంగిక
శ్రీసౌఖ్యంబుల మట్టుబెట్టుఁ జనునే సేవింప నా వారికిన్
స్త్రీసంభోగము దుఃఖదుఃఖ మపురా రేఁబెట్టఁగాఁ బోకుఁడా. ౧౨౭

క. నన్నుఁ గొని మీరు శాత్రవ
సన్నాహ మడంచు టరిది చనుఁడా దివ్యుల్!
ము న్నోటిబోటుఁ గై కొని
చన్నె సంద్రముఁ ధరింపఁ జనుట యనుటయుఁన్. ౧౨౯

గీ. మునులు జేజేలు నెలమిమై మ్రొక్కి విభున
కనిరి చనునే కికురు వెట్ట నన్ను! మమ్ము?
నెఱుఁగుదుము నీ ప్రభావమ్ము నింతొ యంతొ
ప్రాఁతచుట్టాల మెవరి పా ల్పడుదు మయ్య? ౧౩౦

చ. మునివర! దోస మెంచు పని మోసముఁ దేదె? జగత్ప్రసూతి యీ
యనఘ హృదంతరాళగత యా భవదీయసువిద్య కాదె? హం
సనికరమాల మాలని ద్విజు న్మయి నంటె యపుణ్యపుణ్యముల్
జెనయనియట్లు నీ ప్రకృతి చెంద దఘం బిది యంచు నెంచమే? ౧౩౧

ఆ. మున్నె మమ్ముఁ జుట్టె ముప్పూరిఁ బెట్టకు
మన్న నిన్ను నీమె నమ్మఁ గొలిచి
యిందు నందు బంధమందు మోక్షమునందు
సుఖము చెందువట్లు చూడు మీశ! ౧౩౨

మ. అను జేజేల తెఱం గెఱింగి నగి దత్తాత్రేయ దేవేశుఁ డీ
క్షణ మింపారఁగఁ బాఱ నిట్లనె సురేశానుల్! మతం బిట్టిదే
ని నిరూఢం బది కా దనంగ నగునా? నేర్పొప్ప మీ మార్తురం
గొని రండీ యని యంచుఁ బిల్చె వెస నాకుం గోచరు ల్గా నిటన్. ౧౩౩

క. నా చూపుకోపులం బడి
నీచత బలమేది తేజు నిర్గతముగ దో
పాచరు లొఱపులఁబడి వడి
మీఁచే హాతు లగుదు రరులు మే లగు మీకున్. ౧౩౪

చ. అను విభు మాట విన్నపుడె యక్కడవోయి సురేశు లీసుతో
నని యని రంపు రం డని మహాధ్వనితో నెగిలింప రక్కసుల్

క. ఈలక్ష్మి దైత్యనాథుల
ఫాలముఁ దాఁటినది నెత్తిపై కెక్కి బలే
వేలుపులారా! మే లగు
కాలము వచ్చినది లయముఁ గను నరులయెడన్. ౧౪౦

గీ. ఏడు సంస్థానముల దాఁటెనేని లక్ష్మి
తొలఁగి చను లేదు మే లట్టి తుచ్ఛుల కన
నెక్కడెక్కడ నిలిచి యేయేఫలం బొ
సంగు సిరి యని సుర లపసంగు నడుగ. ౧౪౧

శా. దత్తాత్రేయుఁ డనె న్నరాళి సిరి పాదస్థానమం దుండి సం
పత్తిన్ సౌధముఖాధివాసవిధమున్ బ్రాపింపఁగాఁజేయు నం
కాత్తాసస్థితి వస్త్రరత్నబహుభోగావాప్తి కా గుహ్యాసం
సత్తిన్ గూర్చుఁ గళత్రసౌఖ్య మిదు వక్షం బంది సత్సంతతిన్.

చ. హృదయముఁ జెంది లక్ష్మి పొసరించు మనోరథపూరణమ్ము గ్రీ
వదరి వసించి భూషణము బాంధవసంగతి గల్గఁజేయు నా
వదనముఁ జేరి సత్కవిత వాక్యవిలాస మజావికమ్ము సం
పద రుచిరాన్నసంభవ మమందము నందముఁ జంద మీఁగనున్. ౧౪౩

క. తల కెక్కి సంత్యజించును
నెల వొండొకఁ డెనయుఁ గాన నిర్జరులారా!
చెలఁగి వధింపుఁడు దైత్యులఁ
గల శస్త్రాస్త్రములఁ దాల్చి గలితకమలులన్. ౧౪౪

చ. భయపడనేల? రక్షసులఫాలము దాఁటి శిరంబుఁ ద్రొక్కె ల
క్ష్మి యపగతౌజులై పడఁగఁజేసితి నేను బరాంగనాహృతి
క్రియ సుకృతం బపాస్త మగురీతికి నయ్యె నిఁకేల జాగనన్
జయరమ కాస్పదం బయిరి శత్రులఁ జంపి నిలింపు లింపునన్. ౧౪౫

గీ. దైత్యదానవనిహతి మోదమునఁ దేలు
వేలుపులు వినుతింప న వ్వాలుగంటి

మొగసి వచ్చి దత్తాత్రేయు నెలమిఁ జెందె
నంత మ్రొక్కి కొనియాడి రమరు లనఘు. ౧౪౬

సీ. జయజయ శ్రీకృష్ణ! జగదధీశ్వర! హరి!
యచ్యుత! నారాయణా! ప్రభుండ!
జయ వాసుదేవ! యమేయ! నిర్జర! యనంత!
జయ జనార్దన! శార్ఙ్గి! చక్రపాణి!
భక్తాభయంకర! త్వత్ప్రసాదమ్మున
సధిగత యయ్యె రాజ్యరమ మాకు
విశ్వరూపుండ! సతి విష్ణుండ! జోహారు
విశ్వోద్భవస్థితివిలయనిలయ!
యమలయశ! భగవంతుఁడా! యాసలితతి
సాక్షిభూత! సర్వాధ్యక్ష! సంస్తుతింతు
మఖిలయోగీశ్వరేశ్వర! యంజలు లివె
వందనమ్ము లాత్మారామ! వరద! ప్రోవు. ౧౪౭

గీ. అని యనేకవిధమ్ముల సమ్మనీషి
నత్రిపుత్రుని దేవేశు సభినుతించి
దండవత్ప్రణిపాతసంతర్పితు విభు
వీడుకొని నీ దెసని రక్షు వేల్పు లనఘు! ౧౪౮

ఉ. కావున నీవు కోరిన యఖండమహత్త్వము సంభవింప సం
భావితసర్వభావు సభవప్రభవుం బ్రభు దత్తదేవునిన్
సేవలఁ దన్పఁగాఁ జనుము సిద్ధుఁడ వయ్యెదుగాక యంచు గ
గ్గావని దేవమౌని యన నాదృతుఁడై యటపోయె నాతఁడున్. ౧౪౯

గీ. పోయి దర్శించె భక్తితోఁ బూజ సేసెఁ
గాళ్లు లొత్తె నడిగినట్ల కల్గొసంగె
మాల్యచందనగంధసంపత్తి గూర్చె
నమరు నుచ్ఛిష్టసముపాసనమునఁ గొలిచె. ౧౫౦

ఆ. ఫలము లాహరించుఁ బక్వాన్నములఁ గూర్చు
నుపచరించు ననయ ముచితసేవ
నట్టి రాజపుత్త్రి చెట్ట లున్నవి రెండుఁ
బాపవహ్ని మండిపడె జనకుఁడ! ౧౫౧

క. అది చూచి స్వభావముచే
త దయాశీలుఁ డవు దేవతావరదుఁడు నె
మ్మదిఁ బరితుష్టుం డై భూ
మిదయితసుతతోడ మెల్లమెల్లనఁ బలికెన్. ౧౫౨

సీ. ఏమిరా నాయన! యిట్టి యాపద కగ్గ
మైతివె? ననుఁ గొల్చు ననయమునకుఁ
గల్లు ద్రాఁగుచు మాంసఖండముల్ నంజుచు
నాడుదానికిఁ జిక్కి యన్వహంబుఁ
జెడిపోయెఁ బడిపోయె నీ యని జను లన
వెలియైతి నీ విశ్వవృత్తమునకు
నిట్టి యవిధిఁ దోడ నెవ్వరి బోధమో?
సంసర్గ మెనసితి చాలకాల
మకట విడువు మింకనైన నుపకరింపఁ
జాలనట్టివాని జాల మేల?
యాశ్రయింపవయ్య యర్థదానసమర్థు
నగడు వాయఁబెట్టు ననఘు ననుడు. ౧౫౩

ఆ. గర్గవచన మెంచి కార్తవీర్యార్జునుఁ
డార్జవం బెడయక యంఘ్రులఁ బడి
యైనదాని కించుకైనఁ జింతింపక
యాత్మవికృతి లేక యలయ కనియె. ౧౫౪

సీ. స్వామి! యేమంటివి నీవాఁడ దేవుఁడ వీవు
పౌరాణుఁడ వటె విశ్వంభరుఁడవు

ని న్నెడఁబాయని నీరజేక్షణ యిది
నిజమాయ నీవు నన్నెఱుఁగఁ దలఁప?
నసఘుండ వీవు నీ యానఘ నాయికయు న
నంతుండ వౌ నీవు నాత్మపత్ని
మున్నె ముగ్ధుండ నీవ! మోసగింపకు మింక
భాగ్యంబుసంగాద పడసితి నిను?
బోయెఁ బోయిన కరములు పోసనిమ్ము
కల యవయవముల్ గూడ నీకన్న దిక్కుఁ
గాన ముల్లోకముల నీకెఁ గాన గాన
లోల! ప్రార్థ మొనసెసఁ జాలు దీన. ౧౫౪

చ. అనెడు విధేయుఁ జూచి దయ యంతయు వానిదె యన్నయట్లు శ్రీ
తి నెనసి దేవదేవుఁ డను నీవరమానితవీర్య! కార్తవీ
ర్య! నయరహస్య మెంచితి వరమ్ము వరింపుము పార్థివేంద్ర! నీ
వినయము ధైర్య మెంచ నొదవె స్మృతి తుష్టి త్వదిష్ట మిచ్చెదన్.

గీ. మాంసమద్యోపహారము ల్మాల్యగంధ
ముఖము లిష్టమిష్టాన్నము లున్న గూర్చి
బ్రాహ్మణార్చనముల గీతవాద్యములను
వేణువీణానువాదనవిధుల నెలమి. ౧౫౫

గీ. లక్ష్మితో నన్ను నేఁటఁట లౌధ మెంచి
పూజ సేసెడువారికి పుష్టి నిడుదుఁ
బుత్త్రదారధనాదికమును నొసఁగెద
నీసడించెడువారల గాసిపఱుతు. ౧౫౬

ఆ. అని ప్రసాదసుముఖుఁ డై యానతిచ్చెడు
వాని కెఱఁగి యనియెఁ బార్థివుండు
దేవదేవ! నీమతికి నచ్చు దాసుండ
నని తలంచితేని మనవి సేతు. ౧౫౭

ఉ. రాజకుమారుఁడ న్నీను మరాజక మైనది రాష్ట్ర మయ్య వో
భ్రాజితశక్తి గల్గి పరిపాలనపద్ధతి లోక మెన్న ని
ర్ణేజితపాపలేశత భరింపఁగ నైన భరింతుఁ గాని లే
దా? జగ మెట్లు వోయిన నుతంబు తపం బొనరింతు న న్మతిన్. ౧౬౦

గీ. నిన్నుఁ గొలువంగ వచ్చితి నిర్మలాత్మ!
యుత్తమర్థి నొసంగుమా యొసఁగ దేని
దేనిచేతఁ బ్రజాపాలనానుగతము
నర్థధర్మం బనూనంబు నందఁగలనొ? ౧౬౧

సీ. ఎవ్వారియెడఁదల నేమేమి కలదొ? య
ద్దాని నెఱింగెడు జ్ఞాన మిమ్ము
ద్వంద్వయుద్ధప్రసిద్ధతయుఁ దలంపుతో
బాహాసహస్రమ్ము వడయ నిమ్ము
సిద్ధు లెన్మిది కల్గి చిత్తగించినచోటఁ
బ్రత్యక్ష మవు ప్రాభవమ్ము నిమ్ము
శైలాంబుభూమిపుష్కరరసాతలములఁ
గడమపడని రథగతుల నిమ్ము
అధికవిఖ్యాతుచేతఁ జా వమర నిమ్ము
దీన గర్వింప నుత్తము ద్దెలుప నిమ్ము
విత్త మేనాఁడుఁ దరుగని విధము నిమ్ము
శ్లాఘ్యు లగు నతిథులఁ గొల్చు లాభ మిమ్ము. ౧౬౨

గీ. నన్నుఁ దలఁచిన రాష్ట్రజనంబులకును
గావలయును నష్టద్రవ్యకలితలాభ
మమర నీయందు భక్తి ని మ్మాదిదేవ!
నిత్య మవ్యభిచారితాంచితము గాఁగ. ౧౬౩

గీ. అనుచుఁ బ్రార్థించు భక్తునిమన మెఱింగి
నీవు దలఁచిన వరము లిన్నియుఁ బొసఁగెడుఁ

చక్రవర్తివి కేవలేశ్వరుఁడ వగుము
నాప్రసాదంబుతో నని నాథుఁ డనుడు. ౧౬౪

గీ. అపుడె యంతటివాఁ డయ్యె న మ్మహాత్ము
నంఘ్రులం బడి యనుసంగ్రహము లొనర్చి
యానఁ గొని పిల్చెఁ బ్రకృతుల ననుభవించె
సిద్ధుఁడు స్వారాజ్యపట్టాభిషేకమహము. ౧౬౫

ఉ. సర్వమహీజనంబులకె సంబర మద్ది యనంగరాక గం
ధర్వులు పాడి రచ్చరలు నాడిరి నాఁడు త్రిలోకకౌముదీ
పర్వము పర్వె నర్జుననృపాలుఁడు రాజ్యమునందు వానిచి
త్తోర్వర యోగిపాదుకలు నొక్కటఁ గీల్కొన మేలు మేల్కొనన్.

శా. చాటంబంచెను హైహయోత్తముఁడు రాజ్యస్థేముఁ డై యెల్లెడన్
ఘోటీకుంజరసంజితార్భటుల నాకుం గాక యెవ్వానికి
నాఁటంగోలె ధరిత్రి నాయుధముఁ బూనన్ రాదు కా దన్న నా
మేటిం జంపెద దస్యు ఘాతుకునిఁ గా మీలించి యంచున్ రహిన్.

శా. దత్తాత్రేయవరానుభావమునఁ దత్తాదృక్సమృద్ధిన్ మహో
విత్తస్ఫారబలప్రసిద్ధిఁ గన నై పృథ్వీస్థలంబు న్మదా
యత్తంబుం బొనరించినాఁడ నిఁక నన్యక్షత్త్రియక్షాత్త్రసం
పత్తుల్ నాగవు పెట్టుఁ డాయుధము లేవారే నహింసామతిన్. ౧౬౮

గీ. సలుపరా దెందు పాపంబు జంతువులఁ
బుట్టఁబోయెడు సంకల్పములు నెఱుఁగుదు
సర్వభూతముల నుందు నీశ్వరునివరుస
జారచోరత్వములమాట సైప నను చు. ౧౬౯

గీ. అతనియానఁ దలంచి యే యధిపులేని
నాయుధము దాల్ప రైరి నాఁ డడఁగియుండి
రాతఁ డొక్కండు దక్కఁ బరాశ్రమమున
కన్యము రుచింపదయ్యె సమాశ్రయమ్ము. ౧౭౦

సీ. గ్రామపాలుఁడు వాఁడె భూమిపాలుఁడు వాఁడె
వాఁడె పశుక్షేత్రపాలకుండు
బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రాదిజా
తుల ధర్మ మరయ నౌ దొరయు వాఁడె
సంయములకు వాఁడె సార్థమ్ములకు వాఁడె
వానికి వాఁడె నిర్వాహకుండు
బహుయజ్ఞముల సమాప్తవరదక్షిణముల
సాగించెను దపించె జయము నెనసె
వ్యాలదస్యుదహనవైరిశస్త్రభయమ్ము
లందు నన్యము లగు నొందిలులను
మునుఁగు జనుల కెల్లఁబ్రొద్దు సముద్ధర్త
వాఁ డొకండె యనఁగ వరలెఁ దలఁప. ౧౭౧

గీ. అతఁడు రాజ్యంబు శాసించు నట్టివేళ
నష్ట మయ్యె నర్థం బను నరులు లేర
వాని యభిమానము సమృద్ధి వైభవంబు
నరసి కొనె నంగిరోముని హర్షగీతి. ౧౭౨

గీ. దానములఁగాని తపములఁగాని యనుల
గెలుపులంగాని ప్రజఁ బ్రోచు కీర్తిఁగాని
యనియెద నిజంబు కార్తవీర్యక్షితీశు
దారి నడుగిడలే రన్యధరణిపు లని. ౧౭౩

క. ఏనాఁ డా దత్తేశ్వరుచే నట్టిసమృద్ధి వడసెఁ జిరకీర్తి విభుం
డానాఁడు తదుత్సవములు దాను ప్రజలు సలిపి రెలమిఁ దగ నేఁటేఁటన్.

సీ. తా నొకనాఁడు శ్రీదత్తదేవుని సన్ని
ధికిఁ జని శుశ్రూషఁ దెలఁచివచ్చు
నంతిపురంబునయందె యొక్కొకవేళ
నాంగ్రతో సరసమ్ము లాడుచుండు

ధర్మశాస్త్రము లొక్కటఁ బరామర్శించు
యోగశాస్త్రము లెత్తు నొక్కతేప
తత్త్వశాస్త్రమ్ము లుత్తములొద్ద నొకసారి
వినుచుండుఁ దాత్పర్య మనువుపడఁగ
దత్తగురునొద్ద యెది యెది తా నెఱుంగుఁ
బలుకు నెల్లర కదియు గోప్య మని లేక
యన్నియెడలను దుష్టసంహారణ శిష్ట
రక్షణము లాచరించుఁ దత్ప్రహారణంబ. ౧౭౫

ఉ. అంతటివానిఁ జేసె విభుఁ డర్జును నా కృతవీర్యసూతి ధీ
మంతుఁ డనంతుఁ డాద్యుఁ డవు మాధవు నాద్యవతార మా నవి
ద్యాంతకు దత్తదేవు సచరాచరభావ్యు మహానుభావ మ
త్యంతము చింతితార్థద మిదంవిధ మంచు నుతించి యిట్లనున్. ౧౭౬

సీ. వినుమయ్య! జగముకారణ మవ్యయము సత్య
మద్వైతము పరాత్పరార్థ మమరు
నెద్దానికన్న నెం దితరమ్ము నరులకు
లేదొ మృగ్యతమ మ్మలింగి బ్రహ్మ
మదె యిది యనఁగ సదాధార మై వాసు
దేవుఁడు మాయతో భావితుఁ డయి
భువనములు సృజించుఁ బోషించును మలంచు
నజుఁ డీశుఁ డొకఁ డన నాతఁ డొప్పుఁ
గవు లెవనిధ్యానధారాసిఁ గర్మబంధ
కవలితగ్రంథివిచ్ఛేదకలన కొదు
రట్టి పరమాత్మ యా హరి యత్రి కాత్మ
దత్తుఁ డై దత్తదేవావతార మొనసె. ౧౭౭

గీ. అఖిలశక్త్యుదయాశ్రయుఁ డజుఁడు దేవుఁ
డమ్మహాత్ము భజించువా రమృతు లౌదు

రాత్మ నుడిఁ బని సర్వభావార్పణమునఁ
బ్రభు నతనిఁ గొల్చి భవి దేహబంధ మెడయు. ౧౭౯

మ. జనులారా! వెస రండు పుష్పమొ? పలాశంబో? ఫలంబో? జలం
బో? నివేదించెదువాని కిచ్చెదను నే మోక్షంబు భక్తిక్రమం
బును వీక్షించి యదే యభావ మయినం బొం డేల నాదాఁక మీ
ధనముల్ ధాన్యము లన్యముల్ గొన మదిం దాత్పర్య మూహింపుఁడా.

చ. అను పరమాత్మ వాక్యము ముదావహసంశపథంబు సర్వశా
స్త్రనిచయమందు విందుముగదా హరి ధర్మ మధర్మము స్ఫురిం
ప నడఁగఁ ద్రొక్క శిష్టపరిపాలన దుష్టవినష్టి సేయ మే
దిని నవతారము ల్గొనుఁగదే వెఱ పేల? సమాశ్రయించినన్. ౧౮౦

ఆ. అజుఁ డనాదినిధనుఁ డయ్యు నాయయ్య లో
కస్థితిం దలంచి భూస్థలి బహు
గతుల దోఁచుఁ బ్రథమగణ్యా మా దత్తేశు
నంశవిధము వింటివయ్య? తండ్రి! ౧౮౧

ఉ. ఎందఱికిం బలంబులు నహీనరమావిభవంబు లిచ్చె? నిం
కెందఱి యోగరూఢపరమేశ్వరభావులఁ జేసె వాసి బో
ధేందిర నష్టై ముక్తులుగ నెందఱ సల్పెను దత్తదేవుఁ డా
నందమయుండు తెల్పఁగలనా? విను మైన నలర్కసంభృతిన్. ౧౮౨

## అలర్క చరితము

సీ. ఎవని సోమాహుతి నింద్రుండు ముద మందె
వాఁ డొప్పు శత్రుజిత్పార్థివేంద్రుఁ
డరివిదారణుఁడు మహాబాహుఁడు ఋతుధ్వ
జుఁడు నా నతని కాత్మజుండు కలఁడు
బుద్ధి బృహస్పతిఁ బోఁడిమి నశ్వుల
శక్రు విక్రాంతి రాజసుతుఁ డోరయు

నతఁడు క్రీడించెఁ దుల్యవయఃపరాక్రమ
క్రము లవు నృపకుమారకులతోడ
నట్లు కొంతకాల మరుగఁగా నాగలో
కంబునుండి భూతలంబుఁ జెంది
యశ్వతరుని కొడుకు లాడ నై రనుదినం
బవనిసురకుమారు లై తదాప్తి. ౧౮౩

ఆ. సతము నట్లు లాడు సవయస్కు లగు నాగ
రాట్కుమారులందు రహి నదికిన
మనసు దివ్వరాక మనుజేంద్ర తనయుండు
దా రమింపఁ డెందు వారు వెలిగ. ౧౮౪

క. ఆరాజసూను నాగకు
మారులు విడువంగలేరు మఱి వారల నా
ధీరవరుం డెడఁబాయఁడు
భూరిస్నేహాకృతబంధమున సంగతితోఁ. ౧౮౫

నాగకుమారు లశ్వతరునితో మదాలసావృత్తాంతము చెప్పుట

క. ఒకనాఁ డశ్వతరుం డా
త్మకుమారులఁ బిలిచి సమ్మద మ్మొదఁ గదురక
సకులాశంసనముగ నను
సుకుమారకులార! కలదె చోద్య మేదేనిఁ? ౧౮౬

సీ. గుణవంతుఁ డగు రాచకొడుకుతోఁ జెలిమికి
సత ముర్వి కరుగుట సమ్మతమ్మ
సత్సంగమునఁ గల్గు సద్భావ మెంతేని
సామాన్యుఁడా యేమి యా మహితుఁడు?
నచ్యుతు నవతారమా యని శంకింతు
మారీతి లోకోపకారితఁ గని

యట్టివానికి మిత్రు లై తిరి బళిబళి
యేమి సాధించితి రీహితమ్ము
నాదరమ్మున మిత్రకార్య మ్మొనరుప
వలయు సత్సఖుల కవశ్య మలఘులార!
యెద్దియేఁ బెద్ద పని మీర లెఱిఁగి చేయ
నేరకుండినఁ జెప్పుఁడా నే యతింతు. ౧౮౭

మ. అనుడుం బుత్త్రిలు తండ్రితోఁ బలికి రయ్యా! చేయఁగారాని దె
వ్వనికి న్వానికిఁ గృత్య మొండు కల దేవాఁ డేమి చేయంగలాఁ
డనుభావాఢ్య మదాలసాఖ్య సతి గంధర్వాత్మసంజాత దై
త్యునిమాయం బతి చచ్చినట్లు విని మృత్యుప్రాప్త యయ్యె న్వెసన్.

మ. అనుకూలం బ్రమదం దథావిధ మృత న్వాంతంబునం దెంచి దా
నిన కా కన్యఁ బరిగ్రహింప నని పూనెం జూ వ్రతం బంచుఁ జె
ప్పిన దుర్దానవుఁ డాతఁ డెవ్వఁ డలసాధ్వీరత్న మేలాగు చ
చ్చెను రాట్సూతి యిటేల పూనె వ్రతముం జెప్పుం డనం దండ్రికిన్.

ఉ. నాగకుమారు లిట్లని రనా! ముని గాలవుఁ డేగుదెంచి య
ర్ఘ్యాగతపూజ లంది యొక యశ్వముఁ జూపి నృపాలుతోడ దే
వా! గతి యెందునుం జెడని వాహము దీని స్వసూతి కిమ్ము నా
యాగ మడంపుమా కువలయాశ్వుఁ డతం డగు దీనిసంగతిన్. ౧౯౦

చ. అసురుఁ డెవండొ వచ్చి తన యాశ్రమముం జెడఁగొట్టు నెప్పుడున్
విసివి నభంబుఁ జూచితిని వెంటనె దివ్యతురంగ మిద్ది నా
వసతికి నేగుదెంచెను దివంబుననుండి భవత్సుతుండు నా
వసమున దీని నెక్కి రిపుభంగమున న్ననుఁ బ్రీతుఁ జేసెడున్. ౧౯౧

ఉ. పంపుము నీకుమారకుఁ దపంబు సుఖంబుగ నాకు సాగ ర
క్షింపు మటన్న మానినుడికిం గృతకౌతుకమంగళున్ సుతున్
బొంపిరివోవు దీవనలఁ బోలఁ గుతూహలిఁ జేసి మానితో
నంపె నృపాలుఁ డాతఁడు తదాశ్రమ మొంది సుఖస్థితుండుగాన్.

ఉ. అంతట నొక్కనాఁ డసురుఁ డమ్మని సందియ వార్చుచుండ ధ
ర్షింతు నటంచుఁ బంది యయి చెచ్చెర వచ్చెను బాపఁడే యటం
చింతటిలో నరేంద్రసుతుఁ డెక్కెఁ దురంగము మెక్కవెట్టె వి
బ్లెంతయు నర్ధచంద్రశర మేసె నదల్చెను బాఱె దైత్యుఁడున్. ౧౫౩

ఉ. కాలికి బుద్ధి సెప్పు నరిఁ గైకొని పోయె ఋతుధ్వజుండుఁ బా
తాలము దూఱె వాఁ డితఁడు దద్గతిఁ దద్గతుఁ డయ్యె నింతలోఁ
జాలక వాఁ డదృశ్యుఁ డగుచాయ నృపాత్మజుఁ డారసెం దదీ
యాలయమందు విశ్రమము నందుచుఁ గన్గొనె నొక్కసుందరిన్.

క. ఎవ్వతె వీవు తలోదరి!
యెవ్వరిదాన వని యడుగ నెదియుఁ బలుకకే
జవ్వని ప్రాసాదాగ్రముఁ
జివ్వన నెక్కుటయు నచటు చేరెఁ బతి వెనన్. ౧౫౫

ఉ. కాముఁడు వద్ద లేని రతికామిని నాఁ దగు కన్నె నొక్కతెన్
భూమివిభుండు కాంచనవిభూషిత తల్పనిషణ్ణఁ జూచి ని
స్తామసరాజసుం డయి రసాతల దేవతఁగాఁ దలంచె నా
సామినిఁ గాంచి మైమఱపు సంగతిఁ జెందెను బాల లోలతన్. ౧౫౬

శా. చిత్రంబందలి బొమ్మయా యనఁగ మూర్ఛిల్లంగ నై యున్న యా
నేత్రానందకరిన్ గనుంగొని మహీనేత్రాత్మజుం డాలితో
నాత్రం బొప్పఁగ శీతలామృతమృదూద్య చ్చామరం బెత్తి స
ద్గాత్రి న్వీవ నొకింత యూరడిలి వేగం బుచ్చె నిట్టూరుపుల్. ౧౫౭

మ. భయమో? మోహమొ? యింక నొక్కటియొ? విశ్వాసంబుతోఁ జెప్పితే
నయముం గూర్చెద నూరడిల్లు ముదితా! యం చాతఁ డూరార్ప ము
ద్దియ నోరాడక స్వీయవృత్తమున రద్దిం బెద్ద చింతించి యొ
ద్దియొ చేఁ జాటొనరించి యాలిచెవి నూఁదె న్మందమందధ్వనిన్. ౧౫౮

చ. అది మది నూహసేసి యనె నాతనితో స్మరసుందరుండ! చె
ప్పుదు నెటు? లూరకుండు నెటు? పో నినుఁ జూపి యనంగుఁ డమ్ములం

గుదెఁగొని ముగ్ధ పేరురము గ్రుచ్చుచునుండె దయందొలంగి యం
గద కిటు లయ్యె నింతి విను గాథ యగాధధృతీ! వచించెదన్. ౧౯౯

సీ. విశ్వావసుండు నా విఖ్యాతనాముఁ డు
న్నాఁడు నాకమున గంధర్వరాజు
తత్తనూజాత మదాలస దీని పే
రనఘ! కన్నియ యిది యందకత్తె
దానవుండు ద్విషద్విదారణుం డాత్మజుం
డల చంద్రకేతుసమాహ్వయునకు
నీతండు పాతాలకేతుసంజ్ఞాతుండు
కొనివచ్చెఁ బాతాలకుహరమునకు
మా చెలిఁ దమోమయం బైన మాయసేసి
యుద్వహింపఁగ నుండెఁ ద్రయోదశిఁ దిథి
శూద్రశూద్రుఁడు వేదసంశ్రుతి కెటు లటు
తగడు చార్వంగి కసురుఁడు తగఁడు తగఁడు. ౨౦౦

ఉ. ఇన్నలినాక్షి యొప్పమి నతీతదినమ్మున మేను వాయ నై
యున్న వచించె నా సురభి యుగ్మలి! యీతఁడు నిన్నుఁ బొందలేఁ
డెన్నఁగ మర్త్యలోకమున కేగిన వీని నెవండు శస్త్రసం
భిన్ను నొనర్చు వాఁ డగుఁజుమీ పతి నీకు ద్రుతంబ యం చనెన్.

ఉ. కుండల పేరి దానఁ గొమకుం జెలి నేను మనోహరాంగ! నీ
చుం డితఁ డిష్ట పంది యయి చొచ్చె మహీతలమందు వీని నె
వ్వండొ శరాళి గ్రొచ్చె మునిపాలనకై జనపాలుఁ డొక్కఁ డ
చ్చుండత కోడి వాఁ డెనసెఁ జాటుగ స్వాలయ మేను జూడగన్. ౨౦౨

ఉ. అక్కడఁ జూచి యిక్కడకు నాగత నై నినుఁ గంటి నింతలో
నెక్కడివాఁడ వెవ్వఁడ వహీనకుమారుఁడవా? నరుండవా?
నిక్కము వేల్పువా? యిటకు నీ వెటు వచ్చితి మర్త్యుఁ డైన నీ
యిక్క జొరంగరాద మహితేచ్ఛ! భవద్విథ మానతీయవే. ౨౦౩

చ. సురభి వచించినట్టి కృతి చొప్పడెనో? యిఁక దాపనేల? నీ
సురుచిర మైన మేను గుణసుందర! తన్వి వరింప నెంచి చొ
క్కి రమణి యిట్టు లైనది విశీర్ణమనోభవబాణవేదనన్
వరవిభవా! వచింపు నిజవర్తనమున్ విధిసంవిధానమున్. ౨౦౪

చ. అన విని పల్కె నేఁ గువలయాశ్వుఁ డన న్మహి శత్రుజిన్మహా
వనిపతిసూతి గాలవునివాసమునన్ మునివిఘ్నకారిఁ బం
దిని దితిజాధముం బొడిచి దిక్కఱి పాఱిన వానివెంట ని
మ్మనికికి వచ్చితిన్ దురితు మాయికు నాతని ద్రుంపఁ దెంపుమై. ౨౦౫

గీ. ఇంతలో మీరు గాంచితి రే నరుండ
దానవుఁడఁ గాను దేవుండఁ గా ననవుడుఁ
గుండలయుఁ బల్కె భూవరాఖండలుండ!
సురభి చెప్పిన చొప్పిది సూనృతంబె. ౨౦౬

ఉ. పాపుఁడు దెబ్బ తిన్నది భవచ్ఛరయుక్తిన సందియంబు లే
దీపగిది న్నినుం బెరసి యీ తనుమధ్య సభాగ్య మయ్యె వీ
రా! పొలఁతిం గ్రహింపుము త్వదాశ్రయ ముందు సమాహితుండ నై
యాపయిఁ జేయ నా పనికి నాయితమయ్యెదుగాక యం చనన్. ౨౦౭

చ. వనితఁ గొనంగ నౌనె పరవంతుఁడ నా కిపు డన్నుమిన్న! మ
జ్జనకుఁడు స్వామి గల్గ నని తొమ్మివరనందనుఁ డంచు నుండ యో
గిని యగు కాంత నెచ్చెలి యొగిం దలఁచె న్మది శాంతు యోగివ
ర్యుని ఘనుఁ దుందిలాభిధు గురు న్గురుతుల్యుఁ గుమారమాన్యునిన్.

ఉ. అప్పుడ వచ్చె నా మునియు నాత్తసమిత్కుశముఖ్యవస్తుఁ డై
గొప్ప మదాలసాప్రియము కుండలగౌరవ మెంచి రాట్సుతున్
దప్పని దిద్ది దైవముపథం బనుచు న్వినిపించి పావకున్
దెప్పునఁ గూర్చి మంత్రసువిధిం గృతమంగళసంవిధానుఁ డై. ౨౦౯

గీ. పెండ్లి సేయించి కన్య నొప్పించి పోయె
దాను దుందిలమౌని యథాగతముగ

దంపతుల నిచ్చ దీవించి తప మొనర్పఁ
గుండలయుఁ జనెఁ దదనుజ్ఞఁ గొని ప్రియమున. ౨౧౦

ఉ. అంతట శత్రుజిత్తనయుఁ డాలి నిజాశ్వసమూఢఁ జేసి ని
ర్గంతుమనస్కుఁడై విను ఖరధ్వని దైత్యకులప్రభుండు స్వః
ప్రాంతమునుండి తెచ్చిన మదాలస పేరిటి స్త్రీణరత్న మా
గంతుకుఁ దక్కఁటా యెవఁడొ కైకొనిపోయెడు నడ్డుఁ డం చటన్.

వ. అది విని రాజసూతి తణ మాగి కనుంగొన నింతలో భయ
ప్రదదితిజప్రధానబలరాజులతో నెదిరించె వైరి యు
న్మదమున మర్త్యవీరుఁడు నమర్త్యులు మెచ్చ నరాతిసంహతిం
బ్రదరపవిప్రవర్షములపా లొనరించి కలంచియాజమున్. ౨౧౨

శా. పాప మ్మిమ్మెయిఁ బంటపండినది లే పాతాలకేతుండ ని
న్నేపారం దునుమంగ నడ్డపడలే రెవ్వార లిం దంచుఁ ద
న్నాప న్వచ్చిన వానితమ్ము నధిపద్యం దాలకేతు న్విచే
ష్టాపన్నుం బొనరించి యన్న తలఁకన్ వ్యాపాదితుం జేసి తోన్.

గీ. అడ్డపడు మూఁకలను దున్మి యాలి నశ్వ
సంస్థితం జేసికొని నిజస్థాన మెనసి
తాతపాదపదారవిందముల కెరఁగెఁ
బత్నితో వృత్తవృత్త ముపన్యసించె. ౨౧౪

చ. విజయరమన్ నవోఢ నతివిభ్రమతితోఁ గొని వచ్చి మ్రొక్కు నా
త్మజమణిఁ గౌఁగిలించుకొని తండ్రి ముదం బెసఁగెన్ గదన్ ఋతు
ధ్వజునకుఁ బ్రాప్తమైనది మదాలస యెన్న వశంబె వారి భా
వజనిజవైభవానుభవభావవిభావరసైకమత్యమున్? ౨౧౫

ఉ. యోగ మిదంవిధం బిఁక వియోగముమాటయు విన్మ తండ్రి! యా
భోగయశోఽనుకూలుఁ డొకపూట యమస్వసృతీరదేశమం
దేగుచుఁ జూచె సానుచరుఁ డీశసుతుం డొక తాపసాశ్రమం
బాగమభాగభావితశుకాలపనప్రియ మిష్టపుష్టమున్. ౨౧౬

సీ. పనస మందారచంపక కోవిదారాది
వల్లీతతద్రుమ ప్రోల్లసితము
హంస కారండవా ద్యబ్ధివిహగాకీర్ణ
సాబ్జసరోవరాభ్యంచితమ్ము
సంచారవన్మృగ శాఖామృగాప్లుత
భూభూజశాఖికాపూరితమ్ము
గోబ్రహ్మబృందాగ్ని కుశ మృగాజినముఖ
సుహితాధ్యయనరావశోభితమ్ము
నైన కృతకాశ్రమము సుకృతాశ్రమ మని
చొచ్చె మనరాజసూనుఁ డుత్సుకమతి యయి
తాను మును సాముచచ్చిన తాల కేతుఁ
డసురుఁ డం దుండె మునివేష మాక్రమించి. ౨౧

ఉ. వచ్చిన రాజపుత్త్రు నభివందితుఁ జేయఁ దలంచి రక్కసుం
డెచ్చుగఁ బూజసేసి యనియె న్మఖ మొం డొనరింప నెంచితిన్
సచ్చరితుండ! దక్షిణకుఁ జాలిన విత్తము లేమి నీ మెడన్
మెచ్చగు సొమ్ము ని మ్మనెద నే ననఁజాలకయుం గ్రియాదృతిన్.

చ. అది యిటు లిచ్చి నిల్వుము మదాశ్రమమందు ముహూర్తకాల మే
నిదె సలిలాధినాథుఁ గని యిప్పుడ క్రమ్మఱెదన్ వరంబు లి
చ్చెదన శుభంబు నీ కగు వశీకృతలోక! యటంచుఁ జాచెఁ గే
లుదితసురాయుధప్రభము నుజ్జ్వలభూషణ మిచ్చె నీతఁడున్. ౨౩

ఉ. వాఁ డది చేతఁ బుచ్చుకొని వారి మునింగి క్షణంబులోన న
ర్వ్వీ డెనయంగఁ బోయి మునివేషమునం గనిపించి యార్తి పై
తేఁడును నమ్మదాలసయు జెచ్చపడ న్గన మున్మలింప ని
ట్లాడె సువర్ణకంఠపరమాభరణం బటు వెట్టి సాశ్రుఁడై. ౨౪

సీ. వీరుండు లోకోపకారి ఋతుధ్వజుం
డున్నాఁడె? యట్టివాఁ డుర్వి నింక

నీ మాయదారిదై త్యామయ మెటనుండి
దాపరించెనో? యట్టితరమువాని
కక్కటా యే మని యనువాఁడ నే మని
యేమి లాభ మ్మోడ రిది యెనయనె?
చెప్పకుండుటకు వచ్చితినె? యే మైనఁ గా
నిమ్ము మహారాజ! యిట్టు లయ్యె
నొక్కతక్కనుచే సుతుం డుక్కమడఁగు
చుండి నా యాశ్రమముదరి నొసఁగె నాకు
నీకు నిమ్మనెఁ గై కొను శోక ముడుగు
హృత్సమాశ్వాసనం బిది యింకమీఁద. ౨౨౧

చ. వనమున శూద్రతాపసులు వాని దహించిరి తత్తురంగముం
గొని చనె దుష్టుఁ డయ్యసుర కో యని యేడ్చితి మెల్లవార మీ
పని యిది తప్పకుంట నిటు వచ్చితిఁ జేసెద నింతమాత్ర మే
నని భవదీయశోకముల నక్కట చూడఁగఁజాలఁ బోయెదన్. ౨౨౨

గీ. అనుచు నల కంఠభూషణ మచట నైచి
పోవనేపోయె వాఁ డెదఁ బొంగిపడుచు
రాజు మూర్ఛిల్లె మూర్ఛిల్లె రాజపత్ని
విన్న జనమెల్ల మూర్ఛిల్లె పీట బాట. ౨౨౩

ఉ. గుండె గుబుక్కు మంచు నొకకొంత తపింపఁగఁ ద్రోచికొంచు న
య్యండజయాన యల్లన మదాలస యత్తను మాను నత్తఱిన్
గొండొక యూరడించి క్రియకుం బురికొల్పి యమాత్యముఖ్యులన్
జండతరానలార్చుల నిజప్రియు నెంచుచు వేల్చె నంగమున్. ౨౨౪

చ. ఒడ లెఱుఁగంగనైన దనయుం డటు గా స్నుషసేగి క్రోర్చునే?
యొడయఁడు మంత్రిముఖ్యు లెటులో తను బోధితుఁ జేయఁజేయ నా
కొడుకునకుం జలాంజలులు గూర్చి మునింగి గృహంబుఁ జొచ్చె నీ
వడువున శోకవారినిధిఁ బాపపుదైత్యుఁడు ముంచె రాష్ట్రమున్.

ఉ. అంతటఁ బోయినట్టి సలిలాశ్వమున న్మఱివచ్చి వాఁడు దు
ష్టాంతకు రాజపుత్రుఁ బ్రణయమ్మును దియ్యముఁ దోఁపఁ బొమ్ము నా
స్వాంతము మెచ్చ సంతస మెసంగఁ గృతార్థుడ నైతి వత్స! నా
కింతకు సాధిత మ్మయిన దెల్ల యభీప్సిత మంచు నెంచినన్. ౧౨౮

గీ. కుత్సిత మెఱుంగకున్న య కువలయాశ్వుఁ
డతని నిక్కపుముని యని యాత్మ నెంచి
మంచిగ నుతించి లేచి నమస్కరించి
దివ్యము నిజాశ్వ మెక్కి పోఁ దివిరెఁ బురికి. ౧౨౯

చ. అనిలసుపర్ణవిక్రమము నశ్వము నెక్కి మదాలసం గనుం
గొనఁ బితృపాదపాదములకుం బ్రణమిల్ల నరంబ వచ్చు నా
జనపతిసూతి చూచె నలసం బపహర్ష మథుస్థ మా పురం
బునుఁ దను జూచి విస్మయముఁ బొంది ప్రహర్ష ము నొందుచుండఁగన్.

సీ. అత్యంతవికసన్నయన మై పరస్పరం
బుం గుతుకపుఁ బరిష్వంగములను
దిష్ట్యావచనముల "దీర్ఘాయు రేధతా"
మ్మను దీవనలను గల్యాణ మబ్బె
హాతు లై రి పరిపంథు లన్న! మమ్మేలుము
తలిదండ్రులమనంబు కలకఁ దేర్చ
మపకంటకం బవు నానంద మెనయించి
తయ్య యటన్న మే లౌ పలుకుల
వెనుక ముందును బ్రక్కల మొనసివచ్చు
పురజనముతోడఁ బితృగేహముం జొరంగఁ
దండ్రి తల్లియుఁ బాంధవుల్ తత్క్షణప్ర
ణయమునం గౌఁగిలించి రానంద మెసఁగ. ౧౩౦

గీ. కనుల బాష్పము లానందకలన కొలయ
వత్స "జీవ చిరం" బను పలుకు పలుకు

తాతునకు మ్రొక్కి యడిగెఁ దత్త్వ మతఁడు
వాఁడు వానికిఁ జెప్పె సర్వ మయినట్లు. ౨౩౦

ఉ. మాటలలో మదాలసకు మానినికిన్ హృదయేష్టుఁ డైన య
ప్పాటు వినంగఁబడ్డఁ బొరపా టని కా దని తండ్రిఁ జూచి డ
బ్బాటునఁ దన్ముఖంబున నపత్రప శోకము నిర్వచింప న
మ్మేటి దొఱంగఁబోని యసుమేలనముం గని యార్తమూర్తియై.

గీ. ఆ మదాలస మత్ప్రియ యంతరించె
నే మఱొక్కతెఁ గొన నింక నీ భవమున
నని ప్రియానృణ్యమున కని యల్ల ధీరుఁ
డుదకదాన మ్మొనర్చె నయ్యువిదకు విధి. ౨౩౨

ఉ. అప్పుడు తాదవస్థ్యమున కయ్యొ గతాగతశోకవిభ్రమం
బప్పతిదేవతామణికి నై జగ మంతయు నేడ్వ నేడ్వరా
యప్పతియుం దదీయులును హా విధి కెవ్వరు నేమి సేతు రా
యొప్పమిఁ దీర్ప నీశ్వరులు నోప రొరు ల్దలపెట్ట నే మగున్? ౨౩౩

ఉ. సంతతి లేదు ప్రేయసియొ చచ్చె మఱొక్కతె ముట్టఁబోఁడు వాఁ
డింతకు నన్వయంబు పనియే సరిపోయినయట్టు లుండె నే
మంత సుఖంతు రట్టిసుతు నట్టె కనుంగొని తల్లిదండ్రు లా
వంతకు బాహ్యబంధు పరివార మిఁకేమి సుమాళముం గనున్? ౨౩౪

గీ. సత్యసంధుం డతం డిట్లసంశయముగ
స్త్రీసమాభోగసుఖము నూరీకరించెఁ
దోడివారలతో నెప్పు డాడుచుండుఁ
గాలయాపన కయి ధర్మగతి దొఱఁగక. ౨౩౫

ఉ. కావున మాకుఁ జేయ నొక కార్యము కద్దె? సుహృత్ప్రియార్థ మం
చీవిధి నాడు పుత్త్రుల సమీహితము న్విని నాగరాజు కా
ర్యావసరమ్ము నెమ్మది స్వయమ్ముగ నెంచి వచించె ధర్మసం
భావన భావితాత్ముఁడు శుభం బని వారలు నుబ్బియాడఁగన్. ౨౩౬

గీ. పురుషుఁ డొనరింపవలె యత్నమును బరోప
కారమునకును దైవ మీఁగావలె ఫల
మిందిర ప్రసన్న యగు ధైర్యమందుఁ గాన
నింక నేను దపించెద నిందుకొఱకు. ౨౩౭

క. అని కొడుకుల కని యహిపతి
పనివిని హిమవంతమందుఁ బ్లక్షావరణం
బను తీర్థంబున దుశ్చర
మును దపము నొనర్చె సురలు మును లౌ ననఁగన్. ౨౩౮

గీ. నియమితాహారుఁ డై ధర్మనిత్యుఁ డశ్వ
తరుఁడు త్రిస్నాతుఁ డై ధ్యేయతత్పరుఁ డయి
మేలి పలుకులఁ బలుకులమేలఁత దెలఁచె
ఘన మహామాయ సర్వప్రకాశిక నిటు. ౨౩౯

అశ్వతరుఁడు సరస్వతిని నుతించుట

గీ. ఆరిరాధయిషుండ నై యఖిలధాత్రి
నిను మహాదేవిఁ గల్యాణి ననుమతింతు
బ్రహ్మయోని! సరస్వతి! ప్రణతులఁ గొను
మభిముఖివి కమ్ము నాకు నిత్యప్రకాశ! ౨౪౦

గీ. లేని మోక్షాదిధర్మముల్ లేని తత్క్రి
యాశ్రమమ్ము లసత్తు లౌ నన్నియు నిటు
దేవి! సంయోగసంబంధితావిధమున
వెలయు నీయందు నీకన్న వేఱుగాక. ౨౪౧

గీ. సంప్రతిష్ఠిత మెందు నీ సర్వ మట్టి
యక్షరపదంబ వీవె సత్యస్వరూప!
పరమ మక్షర మన బ్రహ్మపద మిది యన
విశ్వ మింతకుఁ గుదు రీవు వేద్యవిద్య! ౨౪౨

గీ. భూమములు పరమాణువు ల్వాప్తియు నెటు
లొక్కదారువునం దుండె నక్కరణిని
బ్రహ్మము నశేషజగముఁ జిద్భావభావి
తాత్మిక వగు ని న్నెనసి యనన్యత వెలుంగు. ౨౮౩

క. అక్షరసంస్థాన మ్మగు
నక్షరము త్రిమాత్రకము చరాచర మఖిల
మ్మీక్షింపంబడు న య్యో
మక్షరమునఁ గలది లేనియది నాదమయీ! ౨౮౪

సీ. మూఁడు లోకమ్ములు మూఁడు వేదమ్ములు
ముగురు మూర్తులు వర్ణములును మూఁడు
వహ్నులు మూఁ డట్లు వర్గమ్ములును మూఁడు
మూఁడు జ్యోతిస్సులు మూఁడు గోనము
లాశ్రమమ్ములు మూఁ డహర్నిశాసంధ్యలు
మూఁడు కాలమ్ములు మూఁడు దశలు
మూఁడు దోసమ్ములు మూఁడు శబ్దమ్ములు
మూఁడు స్వరమ్ములు మూఁడు సంధ్య
లిమ్మెయిం ద్ర్యాత్మకమ్మ విశ్వమ్మ సర్వ
మమ్మ! మాత్రాత్రయాత్మక మ్మక్షరమ్మ
సర్వ మిది నీదు రూపంట చాయబాట
బ్రహ్మపథమున నన్నె మల్ప మవు బాట. ౨౮౫

గీ. శ్రౌతములు స్మార్తములు నైన సంస్థ లెల్లఁ
ద్వత్స్వరూపంబ యవుఁ బ్రణవంబు నాది
నాది పలికి గదా బ్రహ్మవాదిచయము
చేతఁ జేయంగఁబడుచుండెఁ జిన్మయాత్మ! ౨౮౬

క. అవికార్య దివ్య పరిణామవివర్జితనిష్క్రియపరమార్థగత
త్వవిశేషాంచిత మొరులకు నవినిర్దేశ్య మవు రూప మది నీవ కదే?

క. అమ్మెయి జిహ్వాతాల్వోష్ఠమ్ముల జనియించు వర్ణశబ్దమ్ముల వా
క్యమ్ముల నా కనఁగ నశక్య మ్మవు పరలక్ష్యవాస్తవార్థము నీవే. ౨౮౮

ఉ. ఈవిధి నేక మై మఱి యనేకవిధ మ్మయి సూర్యచంద్రమః
పావకముఖ్యతై జనికభానితభావము పారమేశ్వరం
బీ వసుధాదిరూపము రహించెడు రూపపరూప మైన స
ద్భావము చిన్నిరూపితము భావిని! నీ పద మెన్న శక్యమే? ౨౮౯

సీ. మానసప్రేరిత ప్రాణాభిహత మయి
ప్రకృతిపూరుషపల్లవపుటమధ్య
మందు మంజరివలె నల నాభికందంబు
నం దుదయించి పరాభిధాన
మమరఁ బశ్యంతి నా నాహృదయముఁ బర్వి
యటనుండి మధ్యమ యనఁగఁ గంఠ
పర్యంత మెనసి తత్ప్రభృతి మూర్ధాంతంబు
వైఖరిపేర నిష్పన్నము నగు
శబ్దమే బ్రహ్మ మయ్యది సాగుచోటు
చొచ్చుచోటు పరబ్రహ్మ మిచ్చవెట్టి
దీనిఁ గనుఁగొనఁ జెందు నద్దాని ననుట
వర్ణితం బైన దీ నీ ప్రభావ మొకఁడె. ౨౯౦

గీ. వేదవేదాంగవేదాంతవివిధశాఖి
కాస్థిరీకృత మాద్యన్తకాలదేశ
తాఽపరిచ్ఛిన్న మసదాశ్రయ మగు సత్వ
రూప మని నిన్నుఁ జూతు మరూపణీయ! ౨౯౧

గీ. వాస్తవమున కనాఖ్య మై వైభవమున
షడ్గుణాఖ్యమ్మ త్రిగుణసంశ్రయతఁ గార
ణాఖ్య మయి లోకదృష్టి బహ్వాఖ్య మగుచు
మనములో వెలి వెలుఁగొందు నిను భజింతు. ౨౯౨

గీ. శక్తియుక్తపదార్థసంసక్త మస్తి
భావ మాధ్యానవిభవసంభావిత మవు
సుఖమునం దోఁచు సౌఖ్యమ్ముఁ జూచి దాని
బింబ మవు భూమసుఖ మెంచు విద్వరుండు. ౨౪౩

గీ. సకలమును నిష్కలంబు నౌ జగము దేవి!
వ్యాప్త మైనది నీచేత నిఖిల మిట్టు
లేది ద్వైతవ్యవస్థితం బేది బ్రహ్మ
భావనావస్థిత మవు నద్వైత మదియు. ౨౪౪

ఉ. నిత్యము లౌ పదార్థము లనిత్యము లౌ నవి స్థూలసూక్ష్మతా
ప్రత్యయగోచరమ్ములు నభమ్మున భూస్థలి నంతరిక్షమం
దత్యనుభూయమానములు నమ్మరో! నీవలన న్స్ఫురించుఁ ద
త్ప్రత్యయ మేని నీస్వరము వ్యంజనముం గమకంబు గా నగున్.

క. మూర్తామూర్తసమస్త
స్ఫూర్తిస్పృహణీయవిభవసూక్తిమయాత్మా!
కీర్తించెద భర్తవ్యుఁడ
నార్తులఁ బెడఁబాపుమమ్మ! యని కొనియాడెన్. ౨౪౬

చ. స్తుతవిధ విష్ణుజిహ్వ విధిసుందరి తోఁచి ధృతి న్వచించె న
శ్వతర! భుజంగవల్లభ! భవన్మతి వాఁడెడుచొప్పు విప్పిచె
ప్పు తగ నొసంగుదున్ వెస నపూర్వవిధంబు వరం బటంచు న
శ్వతరుఁడు దాని కుబ్బి యనె స్వామినితో నతితోఁ గృతార్థుఁడై.

శా. అమ్మా! కంబలుఁ డన్న నాయతని జిహ్వాగ్రంబుల న్నిల్చి నా
ద మ్మందమ్ముగ సస్వరప్రహితవిద్యాపద్య నైకోల్బమా
యమ్మాడ్కి న్భవదీయదేయవరసాహాయ్యంబుతోఁ బంచి యా
యిమ్ము ల్మాడును నాకఁ గొందుము సవిత్రీ! నాన్యసామాన్యతన్.

చ. అన నటు లయ్యెడు న్దురితహారి భవన్నుతి నెవ్వఁడేనిఁ బ్రొ
ద్దున నను నెమ్మది న్నిలిపి తోరపువేడుకఁ బాడు నట్టివాఁ

డును ధనధాన్యసంపదఁ గడుం గమనీయకలాకలాపితన్
ఘనుఁడవు నం చదర్శనతఁ గాంచె సరస్వతి చూచుచుండఁగన్. ౨౫౯

కంబలాశ్వతరులు శివునివలన వరములు గొనుట

సీ. కదలి రప్పుడపుడ కంబలాశ్వతరులు
కైలాసశైలేశుఁ గాంచి రచటి
గేస్తును దర్శించి కీర్తించి రనుగీత
తంత్రీలయప్రసాధన మదనము
గాఁగ సరస్వతి కైసేసి విహరించు
లాగు దోఁపఁగ భవ్యలక్షణముగ
రేపును మాపును ద్రిసమయసంధ్యల
నిమ్మెయి నారాధన మ్మొనర్చి
రట్లు బహుతిథ మగు కాల మపసరింప
హరుఁ డనంగాంగహరుఁ డరుదార దార
యుతముగా మెచ్చి యిచ్చెద నుల్లమునకు
నిష్ట మెది కోరుఁ డన్నఁ దా రిట్టు లనిరి. ౨౬౦

గీ. కువలయాశ్వునిసతి దైత్యకుత్సితమునఁ
జచ్చిన మదాలసాదేవి సంభవించు
నట్టి వయసున నా తెల్వి నల గొనముల
నా తనుజ యాచు విజ్ఞాతజాతి యగుచు. ౨౬౧

చ. మునినుత! నీ కెఱుంగనివి పుట్టులు పూర్వము లుండునయ్య? యో
గిని ఘనయోగమాత జనగీత సమజ్ఞ విబోధధీపరా
యణఁ దనుజాతఁ గాఁ బడసి యమ్మనుజేశ్వరసూతిఁ గూర్చు నె
మ్మనసమునఁ గాదె యిప్పుడుట మా కిది యిమ్మధిభాగ్య మం చనన్.

ఉ. తప్పక యా యథాభిలషితమ్ముగ నిప్పని నాగనాథ! యా
చొప్పున లేదు సందియము శూరుఁడు వాఁడు పరోపకారి యా

యప్పుడు నింత సేయఁ దగదా? చను శ్రాద్ధమునం బితృప్రియం
బొప్ప యజించి మధ్యమము నూర్జితపిండము నారగింపుమా. ౨౬౩

శా. ఆకల్యాణి తథావిధాఖిలగుణవ్యాపారవిజ్ఞాన యై
నీ కావేళ సముద్భవించు నిది నిర్ణీతార్థమే పో మ్మనన్
శ్రీకంఠాంఘ్రిమహిం బ్రణామములు వాసిం గూర్చి సంతుష్టచి
త్తాకారంబునఁ జేర్చి తత్ప్రహితు లై యావాసముం జేర నై. ౨౬౪

ఆ. కంబలాశ్వతరులు కామారి చెప్పిన
చొప్పు నాచరించి చూచుచుండ
నశ్వతరభుజంగు నిశ్వాసపద్ధతి
నుట్టిపడియె నప్పు డట్టి గరిత. ౨౬౫

చ. అల తనుమధ్య నన్యులకు నందఁగఁ జెందఁగ రాని చోట దో
హలమున గేహమధ్యమున నాంద్రయెడం దగ దాచి యొక్కనాఁ
డల భుజగేంద్రుఁ డాత్మజుల నర్మిలిఁ బిల్చి వచించె నేమమా?
సులలితుఁ డా నరప్రవరసూనున కిక్కడ కేల రాఁడొకో? ౨౬౬

క. రమ్మని మీరే పిలువరొ?
యిమ్మున కాతండె రాఁడొ? యిదియె విచిత్రం
బిమ్మాడ్కి రేలుఁ బవళులు
సమ్మతి నాడుకొను సఖుల సఖ్యము తెలుఁగే? ౨౬౭

క. అన్యోన్యార్థము లన్యో
న్యాన్యాన్యము లైన నాఁడె యది సఖ్య మగున్
మాన్యు నతనిఁ దోడ్కొని రం
డీ న్యాయము వెలయ నానుడి న్సుతులారా! ౨౬౮

క. మీయిరువురితోడియతం
డావత్సుం జూడ నెంచెరా చూపు లనన్
ధీయుతులు తండ్రి కెరఁగి త
థా యని చని రెనసి రల్ల ధరణీశసుతున్. ౨౬౯

క. ఆటలపాటలబాటల
నేటుకొనం గలసిమెలసి నెరి నున్నతఱిన్
మాటికిమాటికి మైత్రీ
పాటవ మొక రూపు దాల్ప వా రని రిట్టుల్. ౨౨౦

సీ. మా బహిఃప్రాణంబ! మనుజేంద్రతోకంబ!
యభిలషించెద మొక్కఁ డభిమతంబు
ము న్నెన్నఁడేనియు నిన్నుఁ గోరితిమొక్కొ?
యీ కోర్కెఁ జెల్లింప నేము తగమె?
ప్రణయిజనప్రియప్రార్థనాభంగంబు
కృత్యమా? యెట్టివారికినిఁ గాదు
చిరకాల మిట్టి వాంఛిత మిచ్చ నెలకొన్న
నడఁచియుంచితిమి మాటాడలేక
సఖుఁడు సఖుఁ డని మీరు నిచ్చలును గూడి
మాడి యాడుచునుంటి రా యీడుజోడు
రాఁడు మనయింటి కెపు డొకనాఁడ యేనిఁ
దోడితెం డేను జూడ నం చాడెఁ దండ్రి. ౨౨౧

ఉ. మాటను వీటఁబుచ్చ టను మానము కా దిది తండ్రితోడి మో
మోటము గూడ వచ్చెఁ బుయిలోటము వో సెలవిమ్ము మిత్రమా!
నేఁటికి మాగృహాంగణము నెక్కొన మజ్జనకుండు ప్రీతుఁడౌ
మాటికిమాటికిన్ వినుము మామన ముబ్బునఁ బ్రబ్బి యాడెదున్.

గీ. వినయభయభక్తిసఖ్యనివిష్టభావ
భావనాంచితముగ నిట్లు పలుకుచున్న
హితులఁ గని నవ్వె సంతసం బతులముగను
రాజ దనరంగ ననె నరరాజసుతుఁడు. ౨౨౩

ఉ. ధన్యుఁడ నాప్తులార! మన తాతుఁడు న న్ననఁ గోరెనా? సరే
మాన్యుఁడ నింతకన్న గరిమం బగు కార్య మొకండు గల్గునా?

యన్యునిఁగాఁ దలంపనగునా? నను రెండు పదుండు పోద మ
న్యోన్యసుఖాకరంబుఁ దదనుగ్రహము న్శిరసా వహించెదన్. ౨౭౪

క. అనుచుండ వారు లేచిర
యనఘులు మువ్వురును బ్రాతరారంభమునన్
ఘనపుణ్య గోమతిం గని
చని రన్నదిమధ్య మెనసి చయ్యన నయ్యా! ౨౭౫

ఆ. అంతదాఁకఁ దలఁచె నా రాజతనయుండు
వారి ద్విజసుతు లని వారి గీము
నదికి నపరతటమునం గల దని రసా
తలముఁ జేర్చి రట్టె తద్ధితులును. ౨౭౬

ఉ. పోవుచుఁబోవుచుం గనె నపూర్వఫణామణిఘృష్టిమంజరీ
భావితమూర్తులన్ హితుల భావజభావుల విస్మయించెఁ ద
ద్భావ మెఱింగి వారలు నుదంతము దెల్ప ముదంబు నొందె రా
జీవదళాక్షుఁ డా నవ విశిష్టరసాతలసంపదంబుధిన్. ౨౭౭

చ. సుహృదులతోడ నట్లు చని చూచెఁ దదీయునిఁ దాతు సంమదా
వహముగ దేవతాదరము భక్తియుఁ దోఁపఁగ మ్రొక్కెఁ దంద్రికి
ట్లహితనిహంత యతా కువలయాశ్వుఁ డితం డని చెప్పి చూపి రా
యహిపతికిం దదాత్మజులు నమ్మెయిఁ గాఁగిటఁ జేర్చె నాతఁడున్

ఉ. వావనచూచె మూర్ధమున వత్స! చిరం భువి జీవ యం చనెన్
నా సుతు లెప్పుడుం బొగడ నాయన! వింటినిరా భవద్గుణ
శ్రీసుకృతంబు సూప నినుఁ జెప్పినయట్టుల చూచి నిర్వృతం
బై సకలేంద్రియమ్ముల చయ మ్మిది యెప్పుడు నిప్డు చూచితే? ౨౭౯

మ. అని యవ్వీరున కర్ఘ్య మాసనము దివ్యాలంకృతు ల్గంధమా
ల్యానవీనాంశుకమందిరంబు లొసఁగెన్ హర్షించె లాలించె ని
త్తునురా కోరు వరం బభీప్సితము నీతోఁ గ్రొత్తసంధర్శనం
బనఘా! యూరక పోవరా దనుడు వాఁ డా పాముతో నిట్లనున్. ౨౮౦

ఋతుధ్వజుఁడు చచ్చి బ్రతికిన మదాలసతోఁ గలియుట

సీ. భగవంతుఁడా! పితృవసతి సర్ధములకు
లేదు కొదువ నీ ప్రసాదమునను
మతి యెన్నఁడేని ధర్మమున నిల్వఁగ నిమ్ము
నీ యనుగ్రహ మట్లు నెరసెనేని
బితృమాతృసద్గురుద్విజనులపైన నీ
పైన భావమ్ము భవ్యమ్ము నొసఁగు
మింతకన్నను వీని కేమి కావలె నన్న
యన్నరపతిసూతి కహిపతి యనె
వెన్నతోఁ బెట్టినవి నీకు నిన్నయంబు
లైన నటు లయ్యెడుంగాక యనఘ! యడుగు
మెంత దుష్కర మైన దురాప మైనఁ
జింత దక్కి సతంబుఁ గాంక్షించు వరము. ౨౮౧

మ. అని నాగేశుఁ డన న్నరేశసుతుఁ డాస్యమ్మందు లజ్జానుభా
వనవోల్లాసము హాస మొప్పఁగ సుహృద్వక్త్రాబ్జము ల్చూచినన్
ప్రణిపాతప్రణయప్రధానముగ వా ర్వాక్రుచ్చి రా యయ్యతోఁ
బనితం బైన తదాశయం బఖిలమున్ భావించి వాఁ డిట్లనెన్. ౨౮౨

క. భూతములతో వియోగము
భూతం బనుభూత మయ్యెఁబో తాదృశముల్
భూతములు మరలఁ గలియవె?
యీ తెఱఁగుఁ దలంచితేని నట్లగుఁ బుత్రా! ౨౮౩

క. చూపింతు మదాలస నన
నోపితృసమ! యట్టిదానినో? మాయికనో?
చూపెట్టెదేనిఁ దలఁచెద
నాపైఁ ద్వదనుగ్రహంబు నని చె నటంచున్. ౨౮౪

. అనుచుండం గొనిపోయి చూపె గృహాగుప్తాత్మక్ హారాభ్యర్చనా
సునయప్రాప్త మదాలస న్విభునకుఙ్ జూడంగ నై ప్రేయసీ!
యని చేరం జనువాని మానిచి రయంబారంగ నాగేంద్రుఁ డో
య్యన మాయామయిఁదాఁక మాయమగుఁజుమ్మా మున్నె నేఁజెప్పనే?
. అనుడుఙ్ హా ప్రియ! యంచు నేలఁబడి మూర్ఛాయత్తుఁ డై తేటి భా
వినికిఙ్ శోకపరిప్లుతుం డయిన యవ్వీరు న్సమాశ్వాసనం
బున ధీరుం బొనరించి యశ్వతరుఁ డా పుణ్యు న్సమీక్షించి వా
ణిని భర్గు న్భజియించి నీ కయి పురాణి న్దీని నార్జించితిఙ్. ౨౮౬
అత్యుత్కట మగు హర్షం
బత్యుత్కటశోక మట్లె యసువులఁ బుచ్చున్
సత్య మని నివారించితి
నిత్యగుణా! యెనయు మింక నీ సుందరినిఙ్. ౨౮౭
. అనుడుఁ బ్రహృష్టుఁ డై విధిగ నాలి గ్రహించి సుహృద్గృహంబునం
దు నమృతసమ్మితమ్ము రుచితో సరిచెప్పఁగరాని భోజన
మ్మును బొనరించి రాత్రి సుఖముం బ్రియతోఁ బితృసమ్మితాపిత
మ్మును సుహృదిష్ట మందఁ గని మోదము ముమ్మర మై రహింపఁగఙ్.
. ప్రొద్దున నాగరాజునకుఁ బూజ్యునకుం బ్రియతోడ మ్రొక్కి యే
ప్రొద్దును దన్నుఁ బాయని సుపుణ్యుల మిత్రుల వెంటఁగొంచుఁ దా
రద్దిర యంచు నూరిజను లట్టిటు చూడక చూడఁ జేరె నా
పద్దమనుం డలంకృతము భవ్యనిజాస్పద మాత్మ వొంగఁగఙ్. ౨౮౯
తలిదండ్రులపాదమ్ములఁ
గెలసమ్మున నంటి యాలికేని దనకును వా
రలు దీవన లిడఁ జెప్పెఙ్
సలలిత మగు న మ్మదాలసాప్రాప్తికథఙ్. ౨౯౦
. అమ్మహితోత్సవమ్మున కియత్త యనం గన మూరివారు రా
ష్ట్రిమ్ములవారు భూజగతి రాజిలువారలు గాక దేవలో

కమ్ములవారు నాగులు సుఖమ్మునఁ దోఁగఁగ స్వీయబంధువ
ర్గమ్ముల సమ్మదమ్ము వివరమ్ముగఁ దెల్పఁ గవు ల్ప్రవీణులే? ౨౯౧

ఆ. దేవళంబులందు దేవతలకు నిలు
వేలుపులకు నేలవేలుపులకు
నుత్సవములు పూజ లుపచారములు సల్పి
రిచ్చ మెచ్చ నట్టియెడ జనకుఁడ! ౨౯౨

గీ. గృహియు సన్యాసియుం గాని వహి రహించు
కొడుకునకుఁ జచ్చి బ్రతికిన కోడ లమర
నమరులకు లేని సౌఖ్యంబు లందు వారిఁ
గాంచి మురియుచుఁ జిర మేలె క్ష్మాపతి ధర. ౨౯౩

ఉ. అంతటఁ గొంతకాలమున కా నరనాథుఁడు శత్రుజిత్తు భూ
కాంత సుమాళముం బెనిచి కాలముధర్మము నొందె నష్ట సా
మంతులు మంత్రులుం బురముమానిసులుం గవగూడి కూర్చి ర
త్యంతధృతిన్ ఋతుధ్వజున కంచితరాజ్యరమాభిషేకమున్. ౨౯౪

మదాలస కొడుకులఁ గనుట

చ. ప్రజల నిజౌరసప్రజలభంగిఁ దలంచుచు నేలుచుండ నా
భుజవిజితారికిం గొడుకు పుట్టె మదాలసయం దతండు నా
ప్రజకు విఁ గూర్చి క్రాంతుఁ డని ప్రాభవ మొప్పఁగఁ బేరువెట్టె భృ
త్యజనము పౌరవర్గము సుఖాస్పద మయ్యె హసించె నంబయున్. ౨౯౫

గీ. బహుతిథం బగు కాల మావహి గడచిన
నొగి ద్వితీయుండు మఱి తృతీయుండుఁ బొడమ
మహిపతి సుబాహుఁ డని శత్రుమర్దనుఁ డని
పే రిడుచునుండ న న్నారి పెద్ద నవ్వె. ౨౯౬

క. తదనంతరము చతుర్థుం
డుదయించిన సుతునిఁ జూచి యువిదం గని భూ

మిదయితుఁ డడిగెను గారణ
మెది? సుదతీ! నవ్వ సుతుల కేఁ బే రిడుచోన్. ౨౯౮

గీ. వాఁడు విక్రాంతుఁ డితఁడు సుబాహుఁ డొరుఁడు
శత్రుమర్దనుం డేమి దోసంబు కలదు?
కానిచో నీవె పెట్టు మీ కాన్పు పేరు
చూత మెటు లుండునో? యది సురుచిరాంగి! ౨౯౯

చ. అను తననాథుతోడ సతి యంజలిబంధము మూర్ధ మంద ని
ట్లను హృదయాధినాథ! విను మాఖ్య నలర్కు నొనర్పు వీని న
వ్వనె మది సంతసం బొదవఁ బార్థివముఖ్య! సధర్ముఁ డీ సుతుం
డనుమతుఁ డా భవన్మతిఁ జిరాయురుపేతుఁడు నౌను నావుడున్.

గీ. చాలదూరము పోయె విశాంపతిమది
యేది యెటు లున్న నీ పేర నెది విశేష
మని విచారించి తదభిధేయమున మేల్మిఁ
గానకయు నట్టి పేర్వెట్టెఁ గలికిధృతికి. ౩౦౦

క. అని తనయుఁడు వినిపించిన
విని జనకుఁడు చిత్రితుఁ డయి వీనులవిం దా
ఘన మాదాలసవృత్తం
బనంతరవిధంబు నడుగనయ్యె నటన్నన్. ౩౦౧

చ. విభవసముజ్జ్వలత్స్వపర! విశ్వజనీనలసత్ప్రవర్తనా!
ఋభువిభుసన్మణీమకుటఘృష్టవిమృష్టపదాంతభూసతీ
సుభగత! బిల్వభూరుహ విశోభితనైజపదప్రకార! భ
క్తభయవిదారకా! భవవికారనివర్తక! సంవిదాత్మకా! ౩౦౨

క. నగజామనోహరా! దు
ష్టగజాహంకరణశమన శమనాయిత! వి
శ్వగజాగ్రన్మహిమా! పా
పగజాలీపంచవదన! భాస్వత్సదనా! ౩౦౩

మా. సుజనసజనచందోల్లుస్థసంపుష్టధర్మా!
స్వజనసదయచేత స్తజ్జనప్రాపితార్థా!
భజనపరవితీర్ణప్రస్తుతారోధికామా!
విజనకృతవిచారావిర్భవత్స్వాపరోక్షా! ౩౦౮

సీ. ఆంధ్రోర్వి రామకథాఽమృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెం దనయు వి త్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ మఖములఁ
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహాంచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదిగో
మూర్ధమునఁ దాల్పు మూ డవు పూలగుత్తి. ౩౦౯

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## చతుర్థ గుచ్ఛము

క. శ్రీరంగిత వేదివిభుస్తుతిభంగీభేదానుషక్తభవ్యస్వాంతా!
లింగోద్భవాభిధానా! సంగీతకృతావధాన! శబలవిధానా! ౧

ఆ. అవధరింపుమయ్య యటమీఁది వృత్తాంత
మాదరింపుమయ్య యభవ! శరణు
దత్తదేవు చరిత తత్ప్రసంగంబునఁ
దవిలి సంస్మృతిస్మృతిఁ దవులు వదలి. ౨

గీ. గురువు శిష్యుఁడు నటు చెప్పుకొను ప్రవహణ
మందుఁ దంత్రిక్షికొమారుల యలరు గోష్ఠి
న మ్మదాలసవృత్తాంత మవలితెలుఁగు
వినుచు మనుమాట పుట్టెను వినుతులార! 3

క. అని సూతుఁ డనఁగఁ జొచ్చెను
జనకుడు కొడుకు నిటు లడిగె సాధ్వీహసితం
బునకుం దగు కారణ ముం
డునుగద చిత్రించె మదిఁ గదుర దనయమణీ! ౪

క. ఆ కొడుకు లెట్టివారలొ?
యా కాంతామణిచరిత్ర మా విభుకథయున్
సాకల్యముగా నొడువుము
నాకు న్విన వేడు కయ్యె నా నతఁ డనియెన్. ౫

మదాలస కొడుకులను బోధించుట

శా. విక్రాంతుం డుదయింప నప్పటికె సాధ్వీతల్లజం బాతనిం
బ్రక్రాంతం బగు దోల నుంచి యతఁ డేడ్వం బాడె జోపాట లో

రీ! క్రీడాసక! నామరూపములు లేనేలేని శుద్ధు న్నినుఁగా
విక్రాంతుం డని పిల్తు రింక నృపసంవిత్కల్పితాఖ్యాస్మృతిన్. ౬

సీ. ఏడ్వకు మేడ్వకు మిది విను మో వెఱ్ఱి!
యెద్దాని కీ విట్టు లేడ్చుచుంటి
వట్టి మేనికి నీకు నసలు పొంతువ లేదు
పంచాత్మకం బది పరుఁడ వీవు
విశ్వజన్మస్థితివిలయాధికరణము
వకట నీ యేడ్పు మిథ్యయ తలంపఁ
బ్రాణాహతాకాశభవశబ్దము వివిధ
మయ్యె మహీసమూహమును బొంది
వివిధతద్గుణార్థకవికల్ప్యమాన మై
యింద్రియవిషయమ్ము లిన్ని గానము
లరయ భూతమయము లవి స్వస్వధర్మస్థి
తమ్ము లయి స్ఫురించు తథ్యములటు. ౭

క. భూతములు దుర్బలమ్ములు భూతములం గలసి వృద్ధిఁబొందును గనమే?
యీ తను వన్నజలాదుల స్ఫీత మగుట లేదు హాని వృద్ధియు నీకున్.

సీ. ఐన దుఃఖము దోఁచు టది యెట్టు లనెదవా?
లింగదేహము సూల మంగమందు
కలదు దానం జొచ్చి కంచుకం. నఁ బోలె
నధ్యాస, మూర్ఖత్వ మవధరించి
తధ్యాస యనఁగ నన్యగుణంబు లన్యమం
దారోపణముసేయు టదియె భ్రాంతి
కామవై రేచ్ఛాదికము లింగగతము స్థూ
లాంగస్థవామన్నోత్తుంగతాదు
లన్నియును స్వాత్మగుణములం చాత్మ నిత్య
సత్యతాదులు తద్ద్వయాసంజితములు

చేసి పేనిన సంచితోఁ జిక్కువడితి
పాత్రినూలికాయపురుషుఁ బోలి తౌర! ౯

ఉ. శుద్ధుఁడ వక్రియుండ వటు చూడు శరీరయుగాభిమానితన్
బద్ధుఁ డన న్శుభమ్ము లశుభమ్ములు నా పరకర్మము ల్స్వసం
బద్ధము లాచరించుకొని బాపురె పుట్టుచుఁ జచ్చుచుంటి వీ
పద్ధతి దేహదుఃఖములె పైఁబడి నీవిగఁ దోఁచి త్రోచెదున్. ౧౦

సీ. వెకివెక్కియేడ్చెద వకట నీ వెవ్వరి
వాఁడ వెచ్చోనుండి వచ్చినాఁడ
వెచ్చోటి కేగెదో? యెఱుఁగవుకద యింత
కాత్మాభిమానమే యంకురించెఁ
దల్లి యం చొక్కింత తండ్రి యం చొకకొంత
తనయుండ నని భ్రాత లని మఱింత
పరు లని మఱికొంత పరకీయ మని స్వీయ
మని కొంత కొంత యధ్యాసలతిక
యల్లిబిల్లిగ నీకమీఁద నల్లఁబోవు
చున్న దేమన భూతజాతోత్కరమునఁ
బెరుగనీయకు దానిఁ ద్రెంపియిడు మిపుడ
చాలుఁ జాలు లీలాలోల! బాలకుండ! ౧౧

గీ. వచ్చె దుఃఖము పోఁద్రోవవలె నటంచు
నడఁగె దుఃఖము భోగింతు నని తలంచు
మూఢుఁ, డవిమూఢుఁడో దుఃఖములు సుఖములుఁ
దనవి కా వని సహజమోదమున నెసఁగు. ౧౨

ఉ. ఆడుది కాదురా కనులయందము చూపులకోపు లెడ్డ నా
వేడుక మైనిగార మతివిస్తృత మా జఘనంబు డంబు జి
ట్టాడు చనుల్ వసాకలుష మా నొక మాంసముబొమ్మ కాదు కా
దేడుపు కాదు కాదు నిరయేల సుమీ తెగనీదు బంధమున్. ౧౩

ఆ. భూమిమీఁద గీము గీముతో యానంబు
యానమందు దేహ మందుఁ బురుషుఁ
డన్యుఁ డుంగ మమత యద్దేహమున దృఢ
బగుట మూఢభావ మంతె వింతె? ౧౪

సీ. జాతిధర్మములు ద్విజత్వాదికమ్ములు
కాణత్వముఖము లక్షగణగుణము
లరుణసితాదికం బగు రూపు పొట్టియుఁ
బొడవు ము న్నగునని యొడలివిధము
లిచ్ఛ ద్వేషము యత్న మివి యాది యైనవి
లక్షింప సూక్ష్మాంగలక్షణములు
మూల మజ్ఞానంబు ముడుచు నిన్నిఁటి నొంట
నిరతిశయంబు సాన్నిధ్యగరిమఁ
గేవలుం డైన తనయందుఁ గృతకము లివి
యన్నియును భ్రాంతిఁ దాల్ప నై యకట యూరి
వారికై యేడ్వనాయె నీవఱకు నింక
నెఱిఁగి యి మ్మెడు లెడలింప నెంచుకొనుము. ౧౫

ఉ. ఏదియు శాశ్వతం బయిన దిం దనరా దొక నీవ కాక సం
పాదితము ల్పదార్థములు పాడఱుఁ జూచుచునుండ నవ్వి య
మ్మాదిరి నుండఁ గాయ మిది మ్రందు మదిం గొని యిట్టిపాట నే
ద్వేద మనంబు వృత్తులు లయింపఁగ నుండు మఖండరూపతన్. ౧౬

చ. దినదిన మిమ్మెయిం జనని దెల్పెడు బోధముతోడ వృద్ధి నం
దిన నృపసూతి కింపవ పితృప్రతిపాదిత భోగ్యవస్తువుల్
ఘనమణిభూషణమ్ములు సుఖమ్ము లఘమ్ములు రాజవిద్యలుం
జెనకి గృహస్థధర్మమె రుచింపక యుండెను వెఱ్ఱియో యనన్. ౧౭

గీ. పాఠశాలకుఁ బోఁ డొకపాటఁ బోవ
వారిచదువులు వాని కవ్వారి గావ

యేవపడి తిర్గివచ్చి తా నెదురుసూచు
చుండు మాతృప్రబోధవాక్స్ఫూర్తి కతఁడు. ౧౮

గీ. చోద్య మెయ్యది యేనియుఁ జూడఁడెట్టి
చొప్పు బోధములును మదిఁ జొరవు వాని
విధము తల్లికి నా తల్లివిధ మతనికి
విదితములు లోకదృష్టికి వెఱ్ఱివాఁడు. ౧౯

క. అది యట్లు లయ్యెఁబో యిం
కిది యిటు కావలెనె? యనఁగ నీ సెనయు జనం
బదనున రెండవువాఁడును
దదనుజుఁ డనఁ దగియె జనని తద్బోధమునన్. ౨౦

క. ధర మేలుబంతి మేకొని
వరవడి వ్రాయనగు నట్టి వైభవ మిది నాఁ
బరువడిఁ దల్లి కొమారుఁ డ
వరజుఁడు నటుగా నెటు దదవరజుఁడు దప్పున్? ౨౧

గీ. ఆత్మవిద్యకుఁ బట్టుగొ మ్మల్లకొమ్మ
యందుఁ బొడమిన విక్రాంతుఁ డన్యుఁ డెట్లు
క్షుద్ర మానొ? సుబాహుసాముద్రికమ్ము
మడఁచె నరు లార్వురను శత్రుమర్దనుండు. ౨౨

సీ. బ్రహ్మవాదిని మాత రాజ్ఞి శిక్షింప సు
బ్రహ్మణ్యులై యున్న రాజసుతులు
చైతన్యమాత్రమ్ము సత్యమ్ము బ్రహ్మ ని
ర్గుణ మదియేని స్వరూప మరయ
మృగతృష్ణికానిభం బిది నశ్వరం బిందు
మదిఁ బెట్టి చదువు శ్రమం బదేల?
యని గురు లెప్పు నయమ్ములు పలకపా
టలు వాడుదురు మదిఁ దొలకనీరు

చెప్పి చెప్పి విసివి చెప్పి రాచార్యులు
రాజుతోడ రాజ్యరమకుఁ గాని
వంగడమ్ము పెంచు వైభవమ్మునఁ గాని
కానివారె వీ రొకం డ్లటంచు. ౨౩

క. సర్వత్రోపేక్షకు లై యుర్వీసామ్రాజ్య మెనయ నొల్లనివా రీ
యుర్వీపతి కేల వొడమిరో? యుర్వీసురులిండ్ల జనన మొందఁగరాదో?

క. అని ప్రకృతు లాడుకొనఁగా
వినివిని మదినెంచి దీనివిధ మెఱుఁగంగాఁ
జనె రాజంతిపురమ్మున
కనుకూల స్మహిషిఁ జేరి యనె నవ్వులతోన్. ౨౪

చ. లలన! చతుర్థపుత్త్రికి నలర్కునిఁ జేయుము పేర నంటి వే
మి లలిత మర్థ మం దొదవె? మే లవునా? పదిమందిలోన ని
న్నల కథఁ బృచ్ఛసేయు టని యాగితి నప్పటి కట్లు సేసితిన్
కలదొ? విశేష మిప్పు డనఁగాఁదగు నే విని సంతసింతు నాన్. ౨౫

గీ. పలికెను మదాలసాదేవి పార్థివేంద్ర!
వ్యావహారికకల్పన మరయ నిట్టి
దిందు నర్థమ్ము వెదకిన నేమి కలదు
ఉన్నదా? యుండనిమ్ము లేదో? సెబాసు. ౨౬

చ. మువ్వుర కీర లన్న పదము ల్సుహితార్థము లయ్యెనా? యెదో
నవ్వుల కట్టిపే రిడు మన స్మతి పుట్టెను బోవనిండు మీ
రొక్కవ్వకయుండఁ జెప్పు మన నూల్కొనుదాన వచింప వీరు పే
రెవ్వరి కిప్డు పెట్టవలె? నిందలివానికా? భూతజాతికో? ౨౭

ఉ. సొంతము భౌతికం బయిన యంగము దానికిఁ బే రిఁకేల? స
ర్వాంతరు నామరూపరహితాత్మునిఁ గా సమయమ్ము వల్కు వి
క్రాంతపదంబు తెల్పు గతిఁ గాదు జడమ్మున కద్ది పూర్ణుఁ డే
చెంతను నెందునుండి చను జ్యేష్ఠుని పే రిటు చెల్లదే కదా? ౨౮

చ. దేవ! సుబాహుఁ డంటివి ద్వితీయుని బాహులు మేనివే కదా?
జీవు డమూర్తుఁ డౌట నిది చెల్లదు వానికి పే రిఁ కొక్కఁడే
దేవుఁడు సర్వదేహముల దీప్తుఁడు లేఁ డరి లేఁడు మిత్త్రుఁ డే
భావన శత్రుమర్దను భవత్సుతు మూఁడవవానిఁ జేసితో? ౩౦

మ. వ్యవహారార్థము పేరుపెట్టితిని వేదాన్తార్థ మిం దేల యం
దువో? తాదర్థ్య మలర్కనామమున లేదో? వింత లింతేల? స
ర్వవిభేదమ్ములు కల్పితమ్ములె కదా? ప్రాప్తం బెదో పల్కితిన్
భవదాత్మం బొరపొచ్చె మెంచమికి సంప్రార్థింతు భూమీశ్వరా! ౩౧

గీ. భూతజాతమ్ము లెడలు సమూర్తమైన
వస్తు వెందును వాస్తవత్వంబు విడువ
దింత యెఱిఁగినవారల కిదియ మాయ
మాయురే యింత కింత విమర్శ మేల? ౩౨

గీ. అని మహీపతి మహిమచే నట్లు పలుకఁ
బడి మహామతి కావున పరమదయితఁ
దథ్యవాదిని మెచ్చి "తథా త దిద" మ
టంచుఁ దల యూఁచి చనియె నోయయ్య! వింటె? ౩౩

ఉ. ఇన్నిటఁ జూడ నోజనక! యేటికి నాకుఁ గ్రియాకలాప ము
త్పన్నయథార్థబోధునకు వైదికలౌకికయజ్ఞదానరా
జోన్నతనాకముఖ్యముల యోగము దుఃఖమ కాక సౌఖ్యమే?
యెన్నఁగ సంగముం దులిచి యే నపదుఃఖసుఖంబులఁ జెందెదన్. ౩౪

గీ. ఎప్పుడో కాదు చెందితి నిప్పుడిపుడ
నిర్గుణ మ్మైన బ్రహ్మమ్ము నిరతిశయము
నింక సాధనములతోఁ బనేమి నాకు
విను మనంతర మాలర్కవిభువిధమ్ము. ౩౫

ఉ. అంతట నొక్కనాఁడు సతి యంతిపురిన్ సుతు డోల నూఁచుచున్
సంతస మొప్పఁ బాడెడు పసందగు మున్పటి పాట తొ్మ

కాంతుచెవిం బడెన్ విని వికావికలైన మనంబుతో ననెం
జెంతకుఁ జేరి మూఢ! యిటు చేతురె సంతతి నెవ్వరేనియున్? ౩౬

చ. మును పిటువంటి బోధమున ముప్వురు బిడ్డలఁ బాడుసేసి తీ
వనుగతమైన దీతనికి నవ్విధమే యరు లెల్ల నవ్వఁ గాం
చిన చినవారి నెల్ల నిటు చెడ్డ విబోధము పాలుసేసి మా
నిని! కులరాజ్య సంక్రమ మనిందిత మొందిలి నొందఁజేసెదే? ౩౭

క. నా మేలు దలఁచె దేనియు
నామాటకు మీరవేని నారీమణి! యిం
కీ మన చివరకొమారు
న్నేమింపు ప్రవృత్తిమార్గనిష్ఠాగోష్ఠిన్. ౩౮

గీ. కర్మమార్గసముచ్ఛిత్తి కలుగఁబోదు
దేవి! యట్టులైన మేలుకాదే? వెరవునఁ
గాంత! త్రైపిండ్యకనివృత్తి కాని గతికిఁ
గూర్చి రక్షింపుమీ మనకుల మమలము. ౩౯

గీ. అతివ! శాస్త్రప్రసక్తి నియ్యఖిలమునకు
వ్యావహారికసత్యత్వ మవధరించి
యున్న ధోరణి చెడకుండ నెన్నవలయుఁ
బిన్నల కజోపదేశంబువిధ మదె కదె? ౪౦

సీ. భూతవర్గముల సంభూతులై కొందఱు
మానుష్యకముఁ జెంది మఱియుఁ గొంద
ఱమరలోకస్థులై యలరుచుఁ గొందఱు
పశుపక్షికృమిభావపరతఁ గొంద
ఱెందఱో? పితరు లిట్లుందురు క్షుత్క్షాము
లై తృట్పరిప్లుతులై యనిశము
సహాపుణ్యు లపపుణ్యు లిహానిజవంశ్యప్ర
దత్తపిండోదకాదానకాంక్షఁ

గర్మమార్గంబునం దున్న ఘనుఁడు నరుఁడు
దేవపితృతిథిప్రియదీనుల కిడు
వీరలే కాక కృమికీటవిహగజాతు
లెల్ల నరు నుపజీవించు నింత గనమె? ౪౧

. కనుక తన్వంగి! నా కొడుకునకుఁ జెప్పు
మైహికాముష్మికజ్ఞానవాహిక నొగి
క్షేత్రయోను లొనర్ప నా చేతఁ జేసి
యాతఁడును గ్రమముక్తికి నమరుఁగాక. ౪౨

చ. అని బ్రతిమాలి చెప్ప విభునానతి నాఁదలఁ దాల్చి ప్రీతిఁ జె
ప్పె నతనికి న్మదాలస ప్రవృత్తిపథంబున రాజనీతి స
ద్వినయముతోఁ ద్రివర్గముస్మృతిం జనరంజన మర్థ్యాయజ్ఞదా
ననయము శ్రాద్ధకల్పము ఘనంబులు సాశ్రమవర్ణధర్మముల్. ౪౩

చ. గురువులు చెప్పఁగావలయు గుణ్యము లెల్లను సర్వవేత్త్రి యా
తరుణి చతుర్థపుత్త్రునకుఁ దా నుపదేశ మొనర్చెఁ దాన న
ప్పరముఁడు సర్వవిద్యల స్వభావముచేత వినీతుఁ డయ్యెఁ ద
ద్గురువులు మెచ్చ నా తఱి నతుంతకలాగ్రహణంబు సొప్పడెన్. ౪౪

ఉ. అంతకుమున్న వోయిరి తదగ్రజు లా ముగురుం జటాలులై
స్వాంత మరాగమై యమర శాంతమహాటవులన్ జరింప భూ
కాంతున కాతఁ డొక్కరుఁడె కా న్పన నయ్యెను రాజకీయకా
ర్యాంతరసాధనంబుల సహాయత కయ్యె జనంబు లో ననన్. ౪౫

ఉ. దారల సంగ్రహించెను సుతప్రకరంబులఁ గాంచె నచ్యుతున్
భూరిసదక్షిణక్రతువిభూతులఁ గొల్చెను దండ్రియాన న
వ్వారిగ సర్వకాలములఁ బాడిమెయిన్ శిరసా వహించె నె
వ్వారును వీనిఁ బోల రన వైభవమందె నలర్కుఁ డర్కుతోన్. ౪౬

మ. చిరకాలం బటు నేల నేలి చన నెంచెం బత్నితోడ న్వనో
ర్వగ కుర్వీపతి మేల్తపం బొనరుప న్వాంఛం గుమారాభిషే

కరమూవై భవ మొప్పఁ గూర్చి కనులం గాంచెన్ మహీభార మ
క్కర స్వీయాంసమునుండి సూనుభుజ మెక్కం దార్చె నిశ్చితుం డై.

ఈలర్కునకు నొక యుంగర మిచ్చి తలిదండ్రు లడవి కేగుట

చ. దయితుని వెన్నడిం జను మదాలస త మ్మనుపంగ వచ్చు న
మ్మయితనయుం దగం బిలిచి మెచ్చుగ నూరడిలంగఁబల్కి యా
పయి నొక యుంగరం బతని పాణి కలంకరణం బొనర్చి యా
పయికమ్ము వేగ్మి నిట్టు లనె భద్రము దీని నెటు ల్ధరించెదో? ౮౮

చ. కొడుక! యశాశ్వతం బెదియుఁ గుత్సిత మంచు నెఱింగియుండి ప్రే
ముడి ముడి దీని నీ కిడెదఁబో యెది యెట్టులు పోవనైన నె
ప్పుడు నిది దాల్పు ప్రాణములు పో నవునంతకు నెంత కెంత లె
య్యెడములు వచ్చిన న్విడకుమీ పొరబాటుననైన నా మతిన్. ౮౯

మ. మమతాలంబనుఁ డౌ గృహస్థుఁడు విరామం బింతయు న్లేని దుః
ఖము నిక్షేపము గాన నీవు గృహసౌఖ్యం బొప్ప రాజ్యంబు సే
యుమహాకాలమునం దసహ్య మెపు డయ్యుద్దామదుఃఖమ్ము చే
తము బాధించునొ, యప్డు ని న్మనుచు నేతద్వస్తు వాత్మోద్భవా! ౯౦

గీ. ప్రియవియోగము గాని యప్రియకృతంబు
పీడ యెదియేనిఁ గాని నీ విత్తమెల్ల
నొక్కపరి నష్ట మగుయోగ మొకటి గాని
వచ్చెనా? మేలు గూర్చు నీ వస్తు వనఘ! ౯౧

గీ. ఉల్లకష్టమునాఁడు నీ యుంగరంబు
శుద్ధ మొనరించి చూడు తత్సూక్ష్మవర్ణ
పంక్తి నా శాసనంబు నాపదల నుడుపు
ననుచు దీవించె నతని గృహస్థితు నొగి. ౯౨

ఆ. కొడుకుఁ గౌఁగిలించుకొని తలిదండ్రులు
మేలి దీవనల సమీహితార్థుఁ

జేసి పోయి రెలమిఁ జెన్నొంద నటవుల
కాత్మనీనకృతికి నైరి వారు. ౫౩

ఉ. అల్ల యలర్కుఁడుం బ్రజల నాత్మజుల న్వలె నీతియుక్తి ధ
ర్మోల్లసనంబునం దగు మహోన్నతి నేలె స్వకర్మ మెవ్వరే
నొల్ల మనంగరాదు సుజనోచ్ఛ్రయసంపద దుష్టదండముల్
సల్లలితంబు లౌ సరణి సల్పె మఖమ్ముల వేల్పు లుబ్బఁగన్. ౫౪

ఉ. ధర్మముచేత నర్థమును ధర్మము నర్థముచేతఁ బెంచుచున్
ధర్మధనావిరోధముగఁ దా విషయమ్ముల నెమ్మిఁ జెందె నా
ధార్మికువల్లఁ బుట్టిరి సధర్మమహాబలవిక్రమక్రముల్
దుర్మదఘాతుకు ల్బహుసుతు ల్మహితాత్ములు వంశకర్తలై. ౫౫

ఉ. ఆవిధి వత్సరాయుత మహాం బొకఁ డట్లు చనంగ భూమిభా
గావనదీక్షతో సుఖము లందెడువానికిఁ జాలవయ్యె న
ర్థావహనమ్ముపద్ధతికి నక్కట పెక్కులు భూభువస్సువ
ర్భావితలోకముల్ విషయరాగవిరామము గల్గు టేమిటన్. ౫౬

ఉ. అంత సుబాహునాముఁ డవు నాతని భ్రాత వనాస్థితుండు గో
రంతయుఁ దత్త్వశోధనమునధ్వముఁ జెందక యింద్రియప్రియం
బెంతయుఁ బూని భోగములనే సత మెంచుచు నున్న తమ్మునిన్
శాంతు నొనర్పఁ బెద్దయు విచారమునం బడి నిశ్చయించుచున్. ౫౭

సుబాహుఁ డలర్కు నుద్ధరింప నెంచుట

గీ. కామ్యనాశవిషాదయోగమునఁ గాని
యొదవఁబో దెప్డు వైరాగ్య మొక్కనికిని
నద్ది లేకున్న బోధ మపార్థమె కద
వైరిసంశ్రయమున శ్రేయ మారఁ గూర్తు. ౫౮

గీ. అని తలఁచి బహుబలవాహనాఢ్యుఁ డైన
కాశికాధీశు శర ణని కానఁబోయెఁ

గృతసకలకృత్యుఁ డాతఁ డాకృతికిఁ గామి
కాని నిజ మెంచ నట్టి నిష్కాముఁ డన్న? ౭౯

ఉ. ఐనను గామికన్నఁ దన యాకృతి చూచెడువారి చూపులన్
దీనతఁ దోఁపఁజేయ నగు ధోరణిఁ బ్రార్థనఁ జేయఁ జొచ్చె న
వ్వాని నిరీహు లియ్యది యబద్ధ మటం చెఱుఁగంగనయ్యు ని
ద్దాన మెలంగుచోటఁ గడుఁ దక్ష్య మటం చొరు లెంచ నాడరే. ౮౦

శా. కాశీదేశమహేశ్వరా! వినుము మా కన్నయ్య రాజ్యంబు ని
శ్శేషింపం దప మెంచి మే మటవులం బ్రీతిం జరింపంగ న
భ్యాశావస్థితుఁ డాహరించుకొనె రాజ్యం బేలుచున్నాఁడు నేఁ
డాశ ల్గల్చెనా? లేదొ? నీ వెఱుఁగవా? యస్మత్కనిష్ఠుం బతిన్. ౮౧

గీ. రామ రామ యలర్కసనాముఁ డతఁడు
నన్నుఁ గొనకున్నవాఁడు నీ నయము నెఱపి
నాకు నారాజ్య మిప్పింపు నతులు నీకు
రాజులకు రాజె గతి గాక వాజి యగునె? ౮౨

క. నీ కతఁ డరియో? మిత్రుఁడొ?
నా కెఱుఁగఁగరాదు కాని నయ మని నిన్నుం
జేకొని పూనికిఁ దీర్పన్
శ్రీకర! శరణంటి నేమి సేసెదొ? యింకన్. ౮౩

చ. అని పలవించు నాతని తదర్థన మెల్ల నిజం బటంచు న
మ్మెను పరిఁ గూర్చె షడ్విధము మించు సముద్యమశాలి యయ్యెఁ బం
చెను ఘనబుద్ధివిక్రమవిశిష్టు నిజేష్టుని దూతుఁగా నల
ర్కున కతఁ డేగి పల్కెను బురోహితమంత్రిముఖుల్ వినన్ సభన్. ౮౪

సి. త్వన్మిత్రిదివేంద్ర! న న్గాశీశుఁ డంపినాఁ
డను మన్న వినుకుల యనెద వినుము
భ్రాత జ్యేష్ఠుండు సుబాహుఁడు వాని పే
రాశ్రయించె నతండె యర్థి నన్ను

బెద్ద లుండఁగ నీవు పిన్న వీ సామ్రాజ్య
మాక్రమించుకొనుట యనయము కదె?
యిష్టమ్ముమై దాని నిచ్చెదవా యన్న?
కకట రమ్మందువా యనికి నన్న?
నంచితులతోడ మఱి విచారించి నీదు
హృదయ మెఱిఁగించి పంపు మెయ్యది హితంబొ?
యని నొడివి తత్సమాధాన మరసి తెమ్ము
వార్త యనె నేమి పలికెదో? పలుకు మనఘ! ౬౫

క. అని యూరకున్న దూతకు
ననుమానము లేక తడయ కనియె నలర్కుం
డును ధర్మవినయనయవిదుఁ
డనూన మిది యంచు నరులు నభినందింపన్. ౬౬

శా. ఏమీ? యన్నకు భూమి కావలసెనా? యీ దూత లీ రాజు లే
లా? మే ల్మే లతఁ డేగుదెంచి కొనరాదా స్వీయ మా రాజ్య? మే
నో, మిన్నంది పదారవిందములు భృత్యుంబోలి సంవాహన
శ్రీ మానించుచు వానిఁ గొల్చి మననే? శీలంబుఁ దప్పింతునే? ౬౭

శా. ఈయం బొమ్మని పట్టుఁ బట్టఁ దనచే నిప్పించునే కాశిరా
జాయెంబోయెను గాదు న్యాయ్య మిది మధ్యం బంది సోదర్యులం
దా? యీ భేదముఁ దా నొనర్చుట సరే యా తెల్వియుం జూతు నే
చాయం జేయఁ దలంచె నాతఁ డటులే సల్పంగ నేఁ గాపురన్. ౬౮

గీ. ప్రాణభయమునఁ గాశీశుప్రతిభ కోడి
రాజ్య మీయ ననికి వాని ర మ్మనను మిఁక
ధర్మనిధి నన్న యడిగెనా? దాసుఁడ నిదె
యిచ్చుచున్నాఁడఁ గైకొను మిపుడ యనుము.

గీ. అని వచించిన వాని ధర్మ్య మవు మాట
దూతముఖమున వినెఁ గాశినేత మెచ్చె

మాటలో సందు లేదు మోమోట మేల?
సామమున వచ్చుపదవికి సాము లగునె? ౨౦

ఉ. తమ్ముఁ డొసంగు రాజ్యము సుతమ్ముగఁ గైకొని యేలఁబొమ్మఁటన్
నెమ్మిన యన్న కాశిపతినేరుపు మెచ్చక యా సుబాహుఁ డేఁ
దమ్ముని వేఁడికొందునె పథమ్మె నృపాలుర కిద్ది రమ్మటం
చెమ్మెయిఁ జేయనెంచెనో? మహీశుల నెమ్మది నమ్మవచ్చునే? ౨౧

గీ. రాజ్య మిచ్చెద నొంటిగా రమ్మటంచు
నన్నదమ్ముల నేస్తమ్ము లనుచు నమ్మి
యున్నచో నన్ను ముంచగాఁ బన్నినట్టి
యెత్తుగా కిది సామాన్యమే తలంప? ౨౨

గీ. చేతనయినంత సాహ్యమ్ముఁ జేయు మీవు
చేయఁ దలఁచినఁ గాకున్నఁ జెప్పు మదియు
నింకొకరిఁ జూచుకొనియెద నింతెకాని
వాని నమ్మెదనే? యను సుబాహుఁ గాంచి. 23

చ. అదియును సత్యమే యొకనయమ్మున నంచుఁ దలంచి సైన్య ము
న్నది సకలమ్ముఁ గొంచుఁ జనె నాధుఁ డలర్కునిరాష్ట్ర మాక్రమిం
చి దెసలు మ్రోయ నొక్కొకరిఁ జేరి జయించుచు వారిఁ గొంచు నె
మ్మదిఁ దదనంతరుం గెలుచు మాదిరి మాదిరి లేని పెంపునన్. ౨౪

గీ. వాని సామంతులను శత్రుపార్థివులను
వరుస నాటవికులఁ దన వశము సేసి
కొని సమస్తబలంబులఁ గొనుచు నేగి
ముట్టడించెను దుర్గమ్ముఁ బురముఁగూడ. ౨౫

గీ. పార్థివులఁ గొందఱను దానవైభవమున
సామమునఁ గొందఱను భేదశక్తి నొరుల
దండభయమున భృత్యులఁ దక్కు నృపులఁ
దన వశము సేసికొనియె నందఱ నతండు. ౨౬

చ. బల ముడివోయెఁ జుట్టు నరపాలురు నొత్తిగొనంగ రేఁగి రు
త్తలపడెఁ జిత్త మర్థము వృథావ్యయితం బగుచుండె నట్టి శ
త్రులు మెదలంగనీక పురరోధ మొనర్చిరి కాశిరాజుతో
లలితరమాప్తి తప్పిన నలర్కుఁడు సెందె విషాదయోగముల్. ౭౭

క. ఎవ్వరు తీర్చినఁ దీరని
యవ్విధ మవు వ్యసన మెనసి యార్తతముఁడు నై
చివ్వనఁ దలంచుకొనెఁ దన
కవ్వ యొసఁగి చనిన యూర్మికార్థము నరయన్. ౭౮

ఉ. స్నాన మొనర్చి శుద్ధుఁ డయి సద్ద్విజాలం బిలిపించి వారిచే
నూనము కాని దీవనల నొంది తదంతికమందు నుంగరం
బానెరి వుచ్చి యల్పకవితాక్షర మా జననీప్రశాస్తిఁ దా
పీనులదోయిఁ జూచి చదివించి వినెన్ విభుఁ డాదరంబునన్. ౭౯

గీ. ఉల్ల ముత్ఫుల్ల మయ్యె హర్షోపపత్తి
నంగకము లయ్యె నటు పులకాంకితములు
రాజపుత్త్రున కపుడు విరాజమాన
మాతృశాసనపఠనసంపత్తి వెలయ. ౮౦

గీ. విడువవలె సంగము సమస్తవిధముల నది
వదల రాకున్నఁ జేయఁగావలయు సుజన
సమితితో, సంగమునకు భేషజము వార
లట్టివానిమహాత్త్వ మన్యాదృశంబె? ౮౧

గీ. విడువవలెఁ గామమును సర్వవిధముల నది
విడువ శక్యమ్ము కాకున్న యెడ ముముక్షు
యందు దానిని సాగింప నగును జువ్వొ
దాని కది మందటంచు వేదములు సెప్పె. ౮౨

క. అను మాతృశాసనము విని తనివి సనక మరల మరలఁ దత్పఠనమ్ముల్
బొనరించెను వినియెను మనమునఁ దత్సార మిట్లు మనన మొనర్చెన్.

సీ. దారి డొంకయుఁ గలదా? మానవుల కెందు
 సంసారకాననసంపతితుల
కట్టి వారలు శ్రేయ మర్థించిరా? మన
 మ్మును ద్రిప్పవలయు ముముక్షుమీఁద
నన్యసాధనముల నది సులభ మ్మౌనె?
 సుజనసంగము సేయుచోరవఁ గాక
యన్నపు డెల్ల నయ్యది సమకూరునా?
 పూర్వపుణ్యము పొంగి పొరలకున్న
ననుచుఁ జింతించి చింతించి యవనివిభుఁడు
జాయపల్కులచాయఁ నిశ్చయ మొనర్చి
దనకుఁ గూర్చు దత్తాత్రేయుఁ డను మునీంద్రుఁ
డని సకుశుఁడై బయలుదేఱె నర్థి నపుడ. ౮౭

క. అతఁ డెంత భక్తసులభుఁడో?
యితనికి దర్శన మొసంగె నీ మధ్యస్మృతిక్
నుత మవు సహ్యాముతోఁ దన
యతిరూపముతో నిజాశ్రమాస్థితితోడన్. ౮౮

దత్తదేవుఁ డలర్కునకు దుఃఖాపహార మొనర్చుట

చ. శమఘను నమ్మహాత్ము నవసంగు నకల్మషు దత్తదేవుఁ జెం
 ది మొనసి మ్రొక్కి స్వర్చితు విధిం బొనరించి వచించె వాఁడు ది
వ్యమునినుతా! శరణ్యా! శరణార్థి వికర్మి సుదుఃఖతప్తు న
న్నమలిన హృత్ప్రసాదమున నారసి దుఃఖభరం బెడల్పుమా. ౮౯

సీ. అని యన ననియె దత్తాత్రేయుఁ డిప్పుడ
 యవనీశ! దుఃఖాపహార మేను
నీ కొనరించెద నేకారణమ్మున
 ముంచె ని న్నది సత్యమున వచింపు

మెవ్వనివాఁడవో? యెవ్వఁడవో? నీవు
నెవ్వానికో దుఃఖ మేర్పరింపు
మవయవమ్ములు కల వంగమ్ము కల దొండు
కలదు వీనికి మించు కలయు నిందు
దుఃఖ మెక్కడ నున్నది దొరవు నీవు
నిన్ను నది యేమి సేయుఁ జింతింపు మింత
యనిన గురుమూర్తి వాగమృతానుశాస్తి
బృథివినాథుండు నటు విచారింపఁ జొచ్చె. ౮౭

గీ. నన్ను వేధించుచున్న వెన్న బహుదుఃఖ
తతులు నే నెవ్వఁడ నటం చుదారబుద్ధి
మాటిమాటికిఁ దన్ను విమర్శసేసి
బుద్ధితో నవ్వి యి ట్లించె భూవిభుండు. ౮౮

మ. తనుసంఘాతమునందుఁ దోఁచు మును భూతమ్ము ల్విచారింప మే
దిని నీరమ్మును నిప్పు గాలి నభముᳵ దేవుండ నే నిందు నొం
డును గా నక్కట సాక్షిభూతుఁడ నఖండుండం జిరాజ్ఞానయు
క్తిని మే నే ననఁ దత్సుఖాసుఖము లొందె న్నన్ను నిన్నాళ్ళునుᳵ.

గీ. భూతపంచకమయ మంగము కృశ మైనఁ
బెరిగినను నాకు నవి లేమి విశద మయ్యె
నట్లె సుఖదుఃఖములు మనమందుఁ గలవు
గాక నా కవి లేవ తద్గతుఁడ నైన. ౯౦

సీ. ఈ కాయమునఁ గల వెన్నియో సుఖము ల
సుఖములు నే నిందుఁ జొచ్చినప్పు
డవి యెల్లఁ దన వని యనుభవించుచు నుంటి
మనమునఁ గలవు కామముఖవృత్తు
లచ్చోటఁ జేరి నాయవియే యవి యటంచు
వ్యవహరించెద సమహంకృతిస్మృతిఁ

గారణంబున నంధకార మజ్ఞానమ్ము
కల దందుఁ జెంది యక్కరణి నుందు
నెందుఁ జొచ్చిన నెది గన్న నింత భ్రాంతి
నే నెదియుఁ గానివాఁడ నిరతిశయుఁడ
నిత్యసత్యచిద్రూపుఁడ నిక్కమునకు
మమత యో లేదు పో విశేష మెదియేని. ౯౧

గీ. బుద్ధ్యహంకరమనసులు భూతసూక్ష్మ
గుణితములు నెందు నంతఃకరణము పేరు
నందు కల దెంతయేని దుఃఖామయమ్ము
నాది యగు నట్టు లది? యున్నదయముఁ గన్న. ౯౨

ఉ. కావున మూడుమేనుల సుఖమ్ములు దుఃఖము లుండనిమ్ము నే
నేవియుఁ గానివాఁడ నను నెమ్మెయి నంటెడు నవ్వితత్త్వపుం
ద్రోవ నెఱుంగకున్నపుడు త్రోచె ననుం బెడదారి కింక నా
కై వసమయ్యెఁ గార్యచయగర్భిత మాయ యమాయమానమై. ౯౩

మ. తనకాయమ్మున కాది గా నయిదు మొత్త మ్మైన య మ్మేని వాఁ
డనయం జూచుచునుండె రాజ్య మిది నా కేలా? గుణీభూత మీ
తనుసంతానముతోఁ బ్రసక్తి కనఁ దత్థ్సం బేను దేహమ్ము క
న్నను వేఱైన పదార్థ మొం డని నితాంతస్ఫూర్తిఁ గన్పట్టఁగన్. ౯౪

క. ఆ దేహాతీతున కిట
లేదు కరపదాదికావలికి సంబంధం
బేదీ? నాగతురంగర
థాదులకుం గోశములకు నది లేశంబేన్. ౯౫

చ. అరియును నాకు లేఁడు సఖుఁ డైన నను లేఁదు సుఖంబు దుఃఖముం
బురమును గోశముం దురగముల్ రథము న్మొదలైన విన్ని లే
వరయఁగ లేవు వానికిని నన్యునకున్ మఱి వేని కేని నే
కరస మఖండ మేక మె సుఖంబు స్ఫురించెడుఁ దా స్వయమ్ముగన్. ౯౬

శా. నానాకుంభఘటీకమండలుముఖాన్తస్సంస్థ మాకాశ మెం
డే నేకం బన నై యుపాధివశతన్ నైకాకృతిం దోఁచు న
ట్లేనుం గాశిపుఁడు న్సుబాహుఁ డొరు లా యీ మేల మేలంబులన్
నానాత్వమ్మన కైతి మింతె కన నన్యత్వంబు లేదాత్మకున్. ౯౭

క. అని తలఁచి యోగివంద్యున
కును దత్తాత్రేయవిభునకు మహాత్మున
య్యనఁ బ్రశ్రయావనతుఁడై
ప్రణిపాతపురస్సరముగఁ బార్థివుఁ డనియెన్. ౯౮

సీ. బ్రహ్మమూర్తీ! లెస్స పరికింపఁ బరికింప
దుఃఖ మింతేని లేదుసుమి నాకు
నసుఖార్ణవమున నిత్యమును మునింగితి
సమ్యగ్వివేకదర్శనము లేమి
నెందెందు మమతతోఁ జెందు బుంసంవిత్తు
దుఃఖమే యందందు దొడసి యిచ్చుఁ
బిల్లి పెంపుడుకోడిపిల్లను దిన శోక
మెంత లంతలు లేద యెలుకఁ దిన్నఁ
బ్రకృతికిఁ బరుండ నై యున్నవాఁడ నేను
దానిధర్మంబు లెందు ద్వంద్వము లరసిన
భూతములచేత భూతాభిభూతి సౌఖ్య
దుఃఖమయ మిప్డె దించి తాదోయి బరువు. ౯౯

క. అన నిది యింతియ నరవర!
కని పలికితి వున్నమాట కలిగె "మమ" యనం
గను, "న మమ" యన్నఁ బోయెను
ఘనసంసృతి, యదియె దుఃఖకారణ మన్నా! ౧౦౦

క. ఈ యుత్తమవిజ్ఞానము నా యడిగిన ప్రశ్నమున నొనరి యుదయించెన్
నా యనుబంధము దీనన్ బాయంబడిసితివి గాలిఁ బత్తిం బోలెన్,

సీ. ఘనవృక్ష మిది యహంకారాంకురోత్పన్న
మైనది హృదయాచలాంచలమున
మమతానుబంధసంబద్ధసుస్కంధంబు
గృహభూవిశాఖానుకీలితంబు
పుత్రదారాదిసముదితపల్లవనవ
మధిధనధాన్యమహాచ్ఛదమ్ము
పుణ్యపాపోత్ఫుల్లపుష్పమ్ము సుఖదుఃఖ
సుమహితఫల మతిసుచిరచితము
మోక్షమార్గమ్ము నరికట్టి మూఢసంగి
సేవితం బై విధితాపాళిభావిత మవు
దీనిచాయకుఁ జేరి భ్రాంతి సుఖదుఃఖ
వలితు లవు వారి కె ట్లపవర్గ మగుట? ౧౦౨

గీ. ఎవరు సత్సంగ మను తాఁత నెలమి నూరి
నట్టి విద్యాకుఠారంబు వెట్టి దీని
ఛిన్న మొనరింతు రవ్వారె చేరువారు
బ్రహ్మవనమును దత్త్వమార్గమున సుగతి. ౧౦౩

ఉ. శాంతము నీరజస్క మపసంకటకంటక మైన తోఁట వి
శ్రాంతి వహించి వృత్తిపరివృత్తివివర్జితనిర్వృతిం గనం
గాంతు రనాతురత్వమునఁ గావున నీవు నిదంవిధంబు నీ
యాంతరసీమ నెక్కొలుపుమయ్య కృతార్థుఁడ వయ్యె దిమ్మెయిన్.

గీ. భూతజాతేంద్రియమయమ్ము పోలుచు స్థూల
మీవు కా వేను గాను ఓ నృపతిముఖ్య!
కాము తన్మాత్ర మెవ్వరో? కాము కామ
యరయఁగ మన మంతఃకరణాత్మకులము. ౧౦౪

క. ఈ సంఘాతము గుణమయ
మే సాక్షిగ భిన్న మగుచు నిటు తోఁచెడు నో

ధీసచివ! వాని మనలో
నాసితునిఁ బ్రధానపురుషు నరయుచు నుంటే? ౧౦౬

క. ధర ముంజేషీకోదుం
బర మశక విసార సలలి పార్థక్యముభం
గి రహించు భేద మాత్మకు
శరీరమున కెందు విభుఁడ! సత్య మరసితే? ౧౦౭

క. అని చెప్పి దత్తదేవుఁడు
విని మోద మలర్పఁ డెనసి వివిధవినుతులన్
మునిమానితుఁ దెలఁచుచు నో
య్యన బ్రొక్కుచు నిట్టు లనియె నాతతభక్తిన్. ౧౦౮

సీ. భవదనుగ్రహమున భగవంతుఁడా! తత్త్వ
ధ్యానచిచ్ఛక్తిభేద మెఱిఁగించు
విజ్ఞానదీప మావిర్భూత మైనది
యీాదృశం బుత్తమ మెన్నఁ డెఱుఁగ
నైనను విషయసమాక్రాంత మవు మది
నిలుచుట లేదు నిశ్చలము గాఁగఁ
బ్రకృతిబంధం బూడ్చు పథము దోఁచకయుండె
నానతు లొనరింతు నర్చనీయ!
పుడమిఁ బొడమకయుందు నేవడువున? నెటు
గుణగతులఁ జెందకుండుదు? గురువరుండ!
బ్రహ్మతో నెట్టు లేకభావం బెనయుదు ?
నట్టి యోగంబు సెప్పవే యనఘ! కరుణ. ౧౦౯

క. అభియాచించెద శిష్యుఁడ
సభయుఁడ నభయం బొసఁగుము సజ్జనసంగం
బభితశ్శుభవర్షి గదే
ప్రభావమహితా! యటంచుఁ బ్రాంజలి యగుచున్, ౧౧౦

సీ. అజ్ఞానసర్పదష్టాత్ములపాలి జాం
గలికుఁ డై పొడమిన ఘనుఁ డతండు
యోగివంద్యపదాబ్జుఁ డాగమాంతవిహారి
విశ్వార్తిహరణనివిష్టచిత్తుఁ
డుత్తమ జ్ఞానమహోపదేశసమర్థుఁ
డ ద్దేవుఁడు దయామయాంతరుండు
ప్రాంజలి యయి తన్ను నర్థించు భక్తు నా
ర్తు నలర్కుఁ గని వాని వినయ మెంచి
సంస్థితిం జూచి యెడఁదఁ బ్రసన్నుఁ డగుచుఁ
బరమగుహ్యంబు సద్గురువరుఁడు వత్స
లత్వమున నుపదేశించెఁ దత్త్వయుక్తి
నడ లడఁగ యోగాదేశ మాదరించి. ౧౧౧

దత్తదేవుఁ డలర్కునకు జ్ఞాన మెఱిఁగించుట

గీ. ఎక్కడెక్కడి చైతన్య మేరి కూర్పు
మొక్కటిగ జడముల నెల్ల నొకటి సేయు
మింత సేసి మనమ్మున వృత్తి నాఁగు
ముండునది యుండు నపు డూడు నూడునదియు. ౧౧౨

చ. మిడుఁగురుఁబుర్వు వోలెఁ దన మేన స్ఫురించెడు తెల్వి నెంచి య
క్కడిమికి మూల మైనది యఖండము బోధ మొకండు గల్గు నం
చెడఁదఁ దలంచి య య్యుభయ మేకము గాని జడంబు లైన యీ
యొడళులు మూఁటి కా తెలివి కుండద యైక్య మటం చెఱుంగుమా.

ఆ. ఇట్లు నిశ్చయించి యే నది యది యే న
టంచుఁ జిత్తుఁ జిత్తునందుఁ జేర్చి
ప్రాకృతగుణచయము పారక్యము నెఱింగి
యుంటయే విముక్తి యోగకృతము. ౧౧౪

సీ. యోగం బమరకున్న నొదవఁబోదు విముక్తి
త్యాగమ్ము లేకున్న యోగ ముఱదు
సంగసంత్యాగమ్ము సమకూరదు మమత్వ వి
భ్రాంతివిజ్ఞానవిరతి లేక
నిర్మమత్వసుఖమ్ము నెమ్మది మఱగదు
దోషదర్శనవిరక్తులు వొడమక
జ్ఞాన మ్మొనయక దోసము నూపు వైరాగ్య
మొనర దిది రహింప కుండ దదియుఁ

గానఁ గష్టించి వైరాగ్యకల ఘటించి
డాన జ్ఞాన ముపార్జించి జ్ఞానశక్తి
నల విరక్తిని దృఢము సేయంగవలయు
వలయు మోక్షం బనెడువాఁడు వాఁడు వొలుచు. ౧౧౫

గీ. మమత గల మానసము గల మానవులకు
సంగదోషోద్భవంబు లైసంగు దుఃఖ
ము లటుగావున నెందు ముముక్షువులకు
దాని నెడఁబాయునట్టి యత్నమ్ము వలయు. ౧౧౬

ఉ. ఎక్కడ నుందుమో? యదియె యి, ల్లెది తిందుమొ యద్దె భోజనం,
బ క్కల ముక్తి కెద్ది యగు నయ్యదె జ్ఞాన, మబోధ మన్య, మీ
చక్కఁ దలంచి పూర్వకృతసత్కృతదుష్కృతసౌఖ్యదుఃఖముల్
పెక్కులు వొంద రా ననుభవింపు మవశ్యసమాగతార్థముల్. ౧౧౭

ఉ. అంతియ కాని కామమున నట్టిటు సేసెద నంచు నిశ్చయం
బింతయుఁ జేయకుండుము నశించును బూర్వకృతంబు లిట్టు లా
వంతయు నంటఁబో దిఁక భవత్క్రియమాణకరిష్యమాణముల్
చింత దొఱంగు మోక్ష మిది శ్రీయుత! బంధము లేతదన్యముల్.

ఉ. కర్మముతోడ బంధనముఁ గాంచును గాయము మాటిమాటికిన్
నిర్మిత మాఁ దదాదృతి వినిందితముం బెడఁబాచి నిత్యమా

కర్మ మకామతం జలుపఁగా నగు మోక్షము జ్ఞాన మిట్టి దే
నర్మిలిఁ దెల్పుదు న్విను మనా! యిఁక యోగముభంగి నర్థితోఁ. ౧౧౯

దత్తదేవుఁ డలర్కునకు యోగ మెఱిఁగించుట

గీ. బ్రహ్మతో యోగ మొనసి శాశ్వతికసిద్ధి
నొందు వేఱొకగతి లేదు ముందు దాని
కనఘ! యాత్మేంద్రియచయమ్ము వలయు
నదియె దుర్జయ మరయ యోగార్థి కెందు. ౧౨౦
గీ. యత్న మొనరింపవలెఁ దజ్జయమ్ముకొఱకు
వినుము నాచెప్పెడు నుపాయవిధము దోష
వితతి నొగిన ప్రాణాయామవిధి దహింపు
మడఁపు ధారణలం గిల్బిషాతిశయము. ౧౨౧
గీ. సాధిత మగు ప్రత్యాహారశక్తి నింద్రి
యార్థసంసర్గముల మాన్పు, ధ్యానయుక్తి
గుణముల ననీశ్వరమ్ముల నణఁచివేయు
మయ్యు స్వప్రకాశుండ వై యలరెద వట. ౧౨౨
గీ. ధ్మాయమానమ్ము లవు పర్వతప్రభూత
ధాతువుల మల మెట్లు నిర్దగ్ధ మవునొ
యింద్రియకృతాత్మదోషమ్ము లెల్ల నట్లె
ప్రాణనిగ్రహమున దహ్యమానము లవు. ౧౨౩
సీ. ఆదిఁ బ్రాణాయామ మలవరింపఁగ నగు
యోగ మాసించు న య్యురుగుణునకుఁ
బ్రాణ మపానంబు నాఁగు నిరోధమ్ము
మునులు ప్రాణాయామ మని యనిరెద
రదియు నుత్తమమధ్యమాధమసంజ్ఞలఁ
ద్రివిధ మా వినుము తద్విధము లెల్ల

ద్వాదశమాత్రామిత మధమ మగు మధ్య
మము తద్ద్విగుణ ముత్తమము త్రిగుణము
మాత్ర యనఁగ లఘ్వక్షరమాన మేని
గనులు మూసి తెఱచుచుఁ గరకలితము
తాలమే నగు నట్టి మాత్రల గణనల
నెఱిఁగి పూనఁగవలె మూఁటి నిటు క్రమమున. ౧౨౪

క. మొదలిది స్వేదము రెం డవు
నది వేపథువును విషాద మవ్వలియది మై
నొదవించును గ్రమమున న
య్యదనున యోగోపసర్గ లవియ యలర్కా! ౧౨౫

గీ. సింహశార్దూలకుంజరాశీవిషాదు
లోపయిక సేవ వశ్యమ్ము లగు నరులకు
నెట్టు లట్టు లెఱిఁగి యోగి యెలమిఁ గొలువఁ
బ్రాణమును మే లొనర్చు వశ్య మయి యనఘ! ౧౨౬

గీ. వశము నొందిన దంతి మావటి విధమున
సాధితమ్ముఁ బ్రాణమ్ము స్వచ్ఛందవృత్తి
నడుపుకొని యోగి సౌఖ్య మ్మొనయుఁ జిరముగఁ
బ్రాలుమాలినఁ గలదె యా ప్రాభవమ్ము? ౧౨౭

గీ. సాధిత మ్మగు సింగమ్ము చంపు మృగకు
లమ్ము నరులను విడుచు నాలాగున నొగి
యోగసంనిరుద్ధపవన ముజ్జ్వల మయి
కాయములఁ బెంచు నడఁగించుఁ గల్మషముల. ౧౨౮

గీ. జ్ఞాన నెపుడు ప్రాణాయామ మగ్నుఁడౌ యోగి
యుక్తుఁ డై వినుమవ్వాని ముక్తిఫలద
మగు నవస్థాచతుష్టయ మనువదింతు
ధ్వస్తి ప్రాప్తి సంవిత్ప్రసాదము లనంగ. ౧౨౯

చ. ఇనఘన! వింటె యిష్టము లనిష్టము లైన క్రియాకలాపము
ల్సను ఫలసంక్షయం బెనసి స్వాంత మెలర్పఁ గషాయపక్వ మై
యనుపద మొందు, ధ్వస్తి యని యందురు తద్దశఁ; బ్రాణరోధమం
దు నది యనంతరస్థితిఁ ద్రోవ నొసంగు నిజాదిమాస్థితిన్. ౧౩౦

గీ. ఐహికాముష్మికములు మోహమయలాభ
లోభముఖములు కామము ల్లోఁగొనఁబడు
సార్వకామికి తృప్తి యొసంగు నెందు
నట్టి రెం డవుదశ ప్రాప్తి యనఁగ నెగడు. ౧౩౧

శా. స్ఫాయచ్చంద్రరవిగ్రహర్క్షకలితజ్ఞానాతిరేకంబుతోఁ
దోయం బైన ప్రభావ మొప్ప నెఱుఁగున్ దూరస్థము ల్గుప్తముల్
జ్ఞేయార్థంబు లనాగతాతిగతముల్ జిజ్ఞాసు వై యోగి ప్రా
ణాయామంబున సంవిదాఖ్యము తృతీయావస్థ యం దాప్తుఁడై. ౧౩౨

చ. ధాతువు లైదు నెమ్మనము తచ్ఛ్రితసేంద్రియకేంద్రియార్థముల్
సాతిశయప్రసాద మొనయం జను నెందుఁ బ్రసాదనామవి
ఖ్యాతము త త్తురీయదశ యం దిరవొందు యతీంద్రుఁ డుండు ని
ర్వాతధృతప్రదీపమున భంగి నిజాకృతి నప్రకంప్యుఁ డై. ౧౩౩

క. ప్రాణాయామములక్షణ
మో నరపాలుండ! వినుము యోగాభ్యాసం
బూనెడువాఁ డేయాసన
మేనెఱిఁ బూనంగ నగునొ? యెది కార్యంబో? ౧౩౪

గీ. అర్ధపద్మాసనము గాని. యంబుజాస
నమ్ము గాని స్వస్తిక మాసనమ్ముగాని
పూని ప్రణవమ్ము నెమ్మదిఁ బొందుపఱిచి
యోగి యోగంబు యోజింపఁ జాగవలయు. ౧౩౫

సీ. సముఁడై సమానసస్థాయి యై చరణమ్ము
లాహరించి సుసంవృతాస్యుఁ డగుచుఁ

దౌడ లగ్రమునఁ బసందుగఁ జాచి . మడమల
వృషణలింగములు సంస్పృష్టములుగ
గదియించి దంతముల్ గలియకుండఁగఁ గించి
దున్నామితశిరుం డనుద్ధతుఁ డయి
తన నాసికాగ్రంబునన చూడ్కి నిలిపి యు
న్మ్యాశలఁ బడి చాని నరుగనీక
రజమునఁ దమమ్ము నడఁగించి రజము సత్వ
మున మలఁచి నిర్మలము సత్వ మొనర నమరి
ప్రాణముఖములు మన మింద్రియములు నర్థ
ములవలన నిగ్రహింప నౌ మునికి నియతి. ౧౩౬

సీ. ఎవ్వాఁడు ముడిచెడు నెల్ల కామమ్ములఁ
గచ్ఛప మాత్మాంగకములఁ బోలె
నాత్మ నాత్మనె కను చతఁ డాత్మరతియు నే
కస్థుఁ డాంతరబాహ్యకలితశౌచుఁ
డై దేహ మాకంఠ మానాభి గాలిఁ బూ
రించియు ప్రత్యాహారింపవలయు
నట్లు పండ్రెండు ప్రాణాయామములుధార
ణావిశేష మని యెన్నంగఁబడును
ధారణలు రెండు తత్త్వవేత్తల పథమున
యోగ మని చెప్పఁబడు నట్టి యోగయుక్తు
నాత్మనిశ్చయయోగంబునందు డిందు
సకలదోషమ్ము లమ్మెయి స్వస్థుఁడు నగు. ౧౩౭

గీ. పరము బ్రహ్మము గొనములఁ బాకృతముల
వ్యోమభూముఖపరమాణువుల నకల్మ
షాత్మఁ దన్నును వేర్వేఱ నరయుచుండు
నమ్మెయిన యోగవిజ్ఞాన మమరెనేని. ౧౩౮

క. ప్రాణాయామపరాయణుఁ
డైన నియమి యిమ్మెయిని మితాహారుం డై
యేనెలవు విజిత మవుఁ దా
నా నెలవున మెల్లమెల్ల నధిరోహించున్. ౧౩౯

గీ. అజితభూమి నధిష్ఠించెనా? జడతయు
వ్యాధు లాదిగ దోసమ్ము లలముకొనును
గాన నవిజితదేశ మెక్కఁగొన రాద
యారురుక్షువునకు నెందు నధిపపుత్త్ర! ౧౪౦

గీ. ప్రాణము లుపసంరోధింపఁబడునొ? యెందు
నట్టిద యవుఁ బ్రాణాయామ మను పదార్థ
మెడఁద యొద్దానిచేత వహింపఁబడునొ
ధారణ యటందు రద్దాని ధీరవరులు. ౧౪౧

క. రసగంధాదులఁ దవిలిన
యసదక్షము లాహరింతు రతినియతాత్ముల్
వెస నే యోగమ్మున నా
దెసఁ బ్రత్యాహార మంద్రు తెలిసినవారల్. ౧౪౨

శా. తోయాభ్యర్థులు యంత్రనాళముఖవస్తువ్యాపృతిన్ మెల్లగాఁ
దోయం బెమ్మెయిఁ ద్రావువారొ యతి యాత్మోయమ్మునన్ జేయనౌ
వాయూత్సారనిసారము ల్క్రమగతిన్ వ్యాధ్యాదిదోషమ్ము లే
చాయం దోఁపకయుండ నంచనిరి తజ్జ్ఞాను ల్మహోపాయమున్. ౧౪౩

గీ. నాభి హృదయ మ్మురమ్ము కంఠముఖనాసి
కాగ్రనయనమ్ము భ్రూమధ్య మవల మూర్ధ
[illegible]మైన [illegible]చోట్లు
ధారణాస్థానము లివి పెద్దలమతమున. ౧౪౪

క. ఘోరి ధారణ లీ పదియును ధరింపఁ దగ నభ్యసించి తత్క్షణమే య
క్షర మాత్మభావ మెనయుట పరమార్థ మ దాని కీమ్ము పరికింపవలెన్.

సీ. ఆధ్మాతుఁడై శ్రాంతుఁడై క్షుధితుండునై
చెలసి యోగం బభ్యసింపరాదు
అత్యుష్ణ మతిశీమత మతవాత మవ్రుతతేఁ
జెలసి యోగం బభ్యసింపరాదు
సహాశబ్ద సభయశ్మశానాదు లగు చోట్లఁ
జెలసి యోగం బభ్యసింపరాదు
సత్త్వం బొదవమి రజస్తమోవికృతులఁ
జెలసి యోగం బభ్యసింపరాదు
మఱియుఁ దిన్నవెంట మలమూత్రములఁ దాల్చి
చెలసి యోగ మభ్యసింపరాదు
కా దటంచు మూఢగతి నభ్యసించెనా?
దోసఁగు లొదవు యోగదూషకములు. ౧౪౬

క. స్మృతిలోపము జడతయు మూ
కత బాధిర్యంబు జ్వరము కాణత్వం బీ
గతిఁ గలుగు యోగదోషా
హతి నొనరింపంగ నేరనగు నతఁ డాదిన్. ౧౪౭

సీ. అత్యుష్ణమును స్నిగ్ధ మవు యవాగువు గ్రోలి
ధారణ లొనరింపఁ దగుఁ బ్రశాంతి
కమ్మెయిఁ గంపంబునందు మహాశైల
మాత్మ ధరింపంగ నగుఁ దిరముగ
వాగ్ఘతి వాక్కుమ బాధిర్యమున శ్రుతిఁ
దృష్ణార్తి నొగి రసనేంద్రియమ్ము
నెక్కడే దోసఁ గగు నక్కడ తదుపకా
రిణుల ధారణల ధరింపవలయు
శీత మొదవ విదాహిని శీత వేడిఁ
దగు ధరింప మఱియును లుప్తస్మృతికిని

స్మృతి కలుగు నెత్తిపై నొక మేకు వ్రాన్చి
కట్టెతోఁ గట్టిఁ గొట్టు నిక్వాణనమునకు. ౧౪౮

క. ద్యావాకుంభినులం గా
నీ వాయ్వగ్నులను గాని నీరముఁ గానీ
భావింప దేవతాస
త్త్వావిర్భూతములు రుజలు నౌఁ బ్రతికృతముల్. ౧౪౯

క. భూతాదు లతనిఁ జోకిన
వాతాగ్నిధృతిన్ దహింపవలె దాని మెయిన్
హేతువు వర్గచతుష్టయి
కీ తను విద్దాని బ్రోవు నేమఱరు కృతుల్. ౧౫౦

క. తన యోగము సిద్ధిని బొం
దిన చిహ్నము లితరులకును దెలిపిన గర్వం
బెనసిన విస్మయపడినన్
మునుపటి విన్ననువు విలయమును బొందుఁ జుమీ. ౧౫౧

చ. నిగదత సుష్ఠుగంధ మపనిష్ఠురభావ మలోల్యముం బ్రసా
దగరిమ సౌమ్య మా స్వర ముదారత కాంతి జనానురాగ మి
మ్ముగ గుణకీర్తనమ్ము మలమూత్రము లల్పము లౌట యుష్ణశీ
తగతుల బాధఁ జెందమి నుతం బగు యోగముసిద్ధిచందముల్. ౧౫౨

క. తనవలన సత్త్వములకుం
దన కా సత్త్వములవలన దర మింతయు లే
కునికి నుపస్థిత యవు సి
ద్ధినిగాఁ బలుకుదురు ఘనులు ధీగుణశాలీ! ౧౫౩

గీ. ఇన్ని పాటులు వడి యోగి యెట్టులెటులొ
యభ్యసనమున నధ్యాత్మ మరయుచుండ
నడుగొడులు సేయ నొదవు న య్యధ్వమందు
నేచి యోగోపసర్గమ్ము లెఱుఁగవలయు. ౧౫౪

సీ. కామము ల్మానుష్యకమ్ములు మొలతెంచుఁ
గామ్యక్రియలు సేయఁగాఁ దలఁ పగు
దానఫలములు విద్యలు మాయ లర్థమ్ము
లిష్టము ల్వ్యార్తమ్ము లింపు నింపు
నగ్నిజలానేశనాదులు దివము ది
వ్యత్వ మింద్రత్వమ్ము వాంఛ నొలయు
రసరసాయనకృతిరస ముదయించు నా
సించుఁ దనుమ్మాలలోకాంచనమ్ము
సంతరించును వానికై శ్రద్ధ నియమ
మనశనవ్రతదానదేవార్చనములు
మంత్రతంత్రతపోజపయంత్రచయము
లిన్నిఁటను మొదలిఁటినేల నెనయు యోగి. ౧౫౫

క. ఆయాఫలములకొఱకై
యాయాకర్మముల కెలయునట్టి మనము బ్ర
హ్మోయితవృత్తి నివృత్తి
ప్రాయం బొనరింప నడఁగు బహువిఘ్నమ్ముల్. ౧౫౬

గీ. ఈదృశోపసర్గముల జయించుచుండ
నొదవు నై దట్టియవి కటుకోదయములు
ప్రాతిభము శ్రావణమ్ము దైవమ్ము భ్రమము
ననఁగ నావర్త మన యోగ మడఁచుకొలలు. ౧౫౭

గీ. వేదశాస్త్రకావ్యాదులు విద్య లెన్ని
యెన్ని శిల్పమ్ము లన్నియు నెఱుకఁదోఁచి
జ్ఞానగర్వంబు నెలయించి స్వరస మెడచుఁ
బ్రాతిభం బగు విఘ్నంబు భంగురంబు. ౧౫౮

గీ. యోజనసహస్రకముల శబ్దోదయమ్ము
నెఱుఁగు నెఱుఁగును శకునిభాషేహితముల

సర్వశబ్దార్థము లెఱుంగు శ్రావణమున
దాని కెలసిన యోగి విజ్ఞాన మడఁగు. ౧౫౯

గీ. దేవదానవయక్షపితృప్రముఖుల
దేవయోనులఁ గను నెందు దైవ మదియు
భ్రమము యోగిమనమ్ము దోషమున నెందు
నాశ్రయతఁ ద్రిప్పఁబడు నది యనువు దప్పి. ౧౬౦

గీ. ఆంభసభ్రమ మట్లు మదాకుల మగు
వేదనావర్త మఘావర్తభేద మందు
రదియుఁ జిత్తమ్ము నడఁగించునంద కాన
స్వస్వరూపస్థితికి నుపసర్గ మయ్యె. ౧౬౧

క. ఈయోగవిఘ్నములచే
స్ఫాయద్యోగంబు నెడలి సకలదివిజా
తీయులు నావర్తించెద
రోయీ! సంభవజలధి ముహుర్ముహురాప్తిన్. ౧౬౨

ఉ. కాన మనోమయ మ్మగు జగజ్జనికారణవస్తువాస్తవ
ధ్యాన మొనర్చు యోగి మది తత్త్వగణమ్ముగఁ గంబలాదులం
బైన గదించి సాధకుఁ డుపాయముతో నెపుడుం జితేంద్రియుం
డై నియతి స్థిరింపవలె నాఁదల నేడు ధరాదిధారణల్. ౧౬౩

సీ. ధరియించు ధరణిఁ దత్సాత్మ్యమ్ము నొనయుఁ ద
న్నుర్విఁగాఁ దలఁచుఁ మాయు నట గంధ
మప్పుల ధరియించు నప్సాత్మ్య మొనయుఁ ద
ద్రసమును విడుచుఁ దత్త్వ మెద నిల్పు
తేజమ్మును ధరించుఁ దేజ సాత్మ్యముఁ జెందు
రూపమ్ము వదలుఁ దద్రూఢి నెంచు
వాయువును ధరించు వాయుసాత్మ్యం బందు
వాయువె తా నని స్పర్శ మాఁగు

వ్యోమము ధరించుఁ దత్సౌక్ష్మ్య మొనరఁ దన్ను
వ్యోమముగఁ గాంచుఁ దచ్ఛబ్ద ముజ్జగించు
మనముతో సార్వభౌతిక మనముఁ జొచ్చి
మనమును ధరించు వెలచుఁ దన్మననశక్తి. ౧౬౪

క. ఇమ్మెయి సర్వమ్ములు స
త్వమ్ముల బుద్ధినిఁ గ్రమించుఁ దాద్రూప్యమునం
బమ్మను దలఁపునఁ దత్సౌ
క్ష్మ్యమ్మును విడనాడు యోగి సంప్రాజ్ఞుండై. ౧౬౫

ఆ. ఏడు ధారణలను నిటు లొంగి సౌక్ష్మ్యమ్ముఁ
జెంది చూచి చూచి సిద్ధిఁ దజ్జ
విడిచి విడిచి పరము వెమ్మ సద్యోగి కా
వృత్తి లే దలర్క! విభుఁ డతండ. ౧౬౬

క. ఎందెందుఁ జెందు రాగము
నందందుఁ బరానుషక్తుఁ డై యతి నాశం
బందు నెఱిఁగి తత్సౌక్ష్మ్యము
లం దగులనివాఁడు మోక్షలక్ష్మి నెసంగున్. ౧౬౭

మ. సకలం బైన జగంబు భూతగుణసంసక్తంబ యాస్తంబ మా
నృకులం బౌసుర మాపితామహము నావృత్తిం గనుం బొమ్మటం
చకలంకాత్మపదం బెఱింగి విరతుం డై భూతతత్సూక్ష్మ స
ప్తకముం ద్రోచి విముక్తిభూమిక కగుం బ్రాప్తుండు వాఁ డొక్కఁడున్.

క. ఈ యేడు నలవడిన నాఁ
డే యే భూతముల లయము నెనయుఁ దలఁచునో
యాయాయి భూతచయముల
లో యోగి లయించు నెందు లోఁబడఁ డనఘా! ౧౬౯

సీ. అణురూపములకన్న నణుతరరూపుఁ డౌ
బహుశీఘ్రగతి లాఘవమునఁ జెందు

మహిమను నగుఁ బూజ్యమానుఁ డై జగముచేఁ
బ్రాకామ్య మెనయును వ్యాపనమున
స్వవశేంద్రియచయుఁ డై వశిత నొప్పారు తా
నీశ్వరుఁ డై యుంట నీశితఁ గను
నేమినీఁ గోరమి నిన్ని యుండుటఁ బ్రాప్తి
నందును గరిమ నయంబుఁ బంబు

సారిది నివి పరినిర్వాణసూచకమ్ము
లెనిమిది గొనమ్ము లబ్బిన నెడఁద నిడక
ముక్తభావమ్మె కనుగొను ముని పొడమఁడు
పెరుగఁ డొలుగఁడు చెడఁడు భావింపుమయ్య! ౧౭౦

గీ. ఎందు సర్వాశామావసాయిత ఘటిల్లు
నట్టి పద మంది పరిణామ మందఁబోఁడు
తెగుట నానుట మొండుట తగులఁబడుట
భూతసంగంబునను వానిఁ బొరయఁబోవు. ౧౭౧

గీ. అ వ్విభునియందు శబ్దాదు లసలు లేవు
ప్రకృతిశబ్దాదులెడ భోగభాగి యయ్యు
భుజ్యమానుఁడు కాఁడు తదుద్భూతజాత
గుణగణమ్ములచేత నిర్గుణుఁ డతండు. ౧౭౨

చ. వెలిఁగెడు దావవహ్ని దరి వేఁడి నపద్రవ మైన కానన
స్థలి మఱొకండుగూడ జ్వలితం బయి దోషము రూపడంగ ముక్
జ్వలితవనంబు దాను నొకసంగతి నున్నటు లెన్న యోగసం
జ్వలనవిదగ్ధదోషుఁడును బ్రహ్మముతోడ నఖండతం గనుక్. ౧23

ఉ. నీరము నీట నిప్పుకలు నిప్పున దార్చిన నీప్పు నీ రనక్
వేరును రూపు నొక్కఁ డయి వేరుగఁ దీయఁగరాని చంద మా
దారిఁ బరంబు బ్రహ్మము విదగ్ధమలుం డయి చెందు యోగియు
నోఁ గొనరింపఁ గాఁడ యొకవేళను నొక్కెడ నొక్కసారియుక్. ౧౭౪

గీ. అడిగె నరపతి భగవంతుఁడా! గురుండ!
బ్రహ్మపథమున యోగి యేనరహిఁ జరించి
చెడక దరిఁ జేరు నాచర్యఁ జెప్పు మనుచు
దాని కిట్లు బదులుసెప్పె దత్తవిభుఁడు. ౧౭౫

## యోగిచర్యానిరూపణము

ఉ. మాన మమానముల్ విషమమం బమృతాయిత మైన మేలు సం
మానము ప్రీతి నొందిలి విమాననఁ గూర్చు జగజ్జనాళి కే
మానముతోడ నంత లవమానము తుష్టి ననిష్టి మాన మె
వ్వానియెడం గడించు జనవంద్యుఁడు వానికి సిద్ధి దగ్గరుల్. ౧౭౬

చ. కనుఁగవఁ బూత మైనెడన కా లిడఁగావలె, వస్త్రపూత మై
చను సలిలంబు ద్రావవలె, సత్యవిశోధిత మైన వాక్యమే
యనవలె, బుద్ధి నారసిన యట్టిద చింతన సేయఁగావలెం,
జనదు మహాజనంబు గల చాయఁ జరింపఁగ సిద్ధ్యపేక్షికిన్. ౧౭౭

మ. అరుగంగాఁ దగ దెందు సిద్ధి కగువాఁ డాతిథ్యదేవోత్సవా
ధ్వరకల్యాణసభానుభావపదతీర్థశ్రాద్ధయాత్రాదులం
దరు దా చోటుల కట్టిపట్టులు జనవ్యాకీర్ణముల్ నిర్జనా
దరదేశమ్ములు యోగసిద్ధినెలవుల్ తద్ధర్మము ల్గాడునే? ౧౭౮

మ. అవమానింపఁ బరాభవింప నగు న య్యాకార మాకార మై
యువధూమం బపహాసకం బపరము న్వ్యస్తంబు సంభుక్తవ
ద్భవనం బా తతి నేఁగఁగావలయుఁ దా భైక్షంబు నర్థింప శా
స్త్రవిధు ల్మెచ్చవు పోయినిండులకె నిత్యం బేగు మోమోటముల్.

ఉ. ఆవిధి యోగి గేస్తుల గృహంబులు శ్రోత్రియు లిండ్లు శీలియా
యావర గేహసీమలు మహాత్ములు దాంతులు శ్రద్ధధాను లౌ
భూవిబుధు ల్వసించు నెలవుల్ గొని భిక్షకుఁ జొచ్చుటుత్తమం
బీవిధివారియం దయిన నెత్తెడు వృత్తి జఘన్య ధన్యుఁడా! ౧౮౦

సీ. పాలో? యావకమొ? యవాగువో? తక్రమో?
పరిపక్వఫలమూలపత్రకములో?
పిండియో? నూకలో? విహితసిద్ధికరమ్ము
లాహారములు యోగి కనుదినమ్ము
నతిసమాహితమతి యై మాటలాడక
యంబువు లొకసారి ప్రాశనించి
ప్రాణమ్మునకును నపానమ్మునకు సమా
నమున కుదానమ్మునకును వరుస
వ్యానపంచమముగ హోమ మాచరించి
వేరువేరఁ బ్రాణాయామ విధికిఁ గూర్చి
యిచ్చ మెయి శేషమును దిని యేకవార
ముదకముం ద్రావి వార్చి హృద్దేశ మంటు. ౧౨౧

గీ. వ్రతము లివి యైదు యోగికి బ్రహ్మచర్య
మఖిలసంత్యాగ మస్తేయ మటు లలాభ
మిన్నిఁటికి నొక్కఁడై న దహింస యరయఁ
బంచమిఁ బ్రమాదమున నేనిఁ బాయరాదు. ౧౨౨

క. నిత్యస్వాధ్యాయము క్రో
ధత్యాగము శౌచము గురుతత్పరభావం
బత్యాహారము మానుట
యాత్యంతికనియమము లివి యైదు నతనికిన్. ౧౨౩

ఉ. జ్ఞానము సేకరించుఁ గృతిసాధన మంచును సారభూతమున్
జ్ఞానబహుత్వచింతనము జ్ఞానికి యోగపథాంతరాయ మా
దీని నెఱింగితిన్ మఱియు దీని నెఱింగెద నంచు నర్థితోఁ
దాను సహస్రకల్పములు తారటలాడిన జ్ఞేయ మబ్బునే? ౧౨౪

ఉ. ఏరు నెఱుంగకున్న వన మిల్లు కుభృద్గుహ యిట్టిచోట్ల నా
హారలఘుత్వ మింద్రియజయం బసంగత యత్రకుథత్వ మా

చారము నిత్యయుక్తత యసంశయభావము వూని తా మతి
ద్వారము లార మూసి చను ధ్యానమునందు మనం బమర్పఁగాన్.

క. దండములు మూడు మానస
దండ వచోదండ కర్మదండము లనఁగా
నుండిన నియతిని బుధులు త్రి
దండిమహాయతి యటం ద్రుదారమనీషా! ౧౪౬

గీ. సర్వ మెవనికి నీ సదసజ్జగమ్ము
స్వాత్మమయ మరయ గుణమయములు గానము
లట్టివానికి నేది ప్రియం బనంగ
నప్రియం బన నేది నృపా! తలఁపుము. ౧౪౭

మ. అతిశుద్ధం బగు బుద్ధి గల్గి సమలోష్టాష్టాపదుం డై సమా
హితుఁడై భూతవితానమం దెపుడుఁ దన్నే కాంచు న య్యోగి శా
శ్వత మత్యుత్తమ మవ్యయమ్ము నగు నాస్థానంబునం బొంది సం
తతసౌఖ్యాత్మకుఁ డై జనింపఁ డింక నెన్నండున్ నరేంద్రోత్తమా!

గీ. వేదములకన్న మేలు యాగాదికృతులు
వానికన్నను జాప్య మద్దానికన్న
జ్ఞాన మంతకు ధ్యాన మాసంగరహిత
మధిక మది కల్గెనా? శాశ్వతాత్మసిద్ధి. ౧౪౯

క. ఏకాంతి యై జితేంద్రియుఁ
డై కడు శుచియై ప్రసాది యై బ్రహ్మమయుం
డై కైకొనునది యోగం
బేకమతి నతండు ముక్తి నెనయుం దానన్. ౧౫౦

ఉ. ఇమ్మెయి యోగి నెన్నఁటికి నెవ్వనికిం గదలింప శక్యమా?
సమ్ముఖమందు విశ్వము దెసం గల పాదశిరోభుజాదికాం
గమ్ములు వానివే యని యఖండుని విష్ణుని నెన్ని తన్నుఁ ద
త్వమ్మునఁ నొందఁజేయుఁ ప్రణవమ్ము జపింపవలె న్వధాని యై. ౧౫౧

## ప్రణవ స్వరూపము

సీ. ప్రణవస్వరూపంబు విను మకారోకార
ములు మకారము వర్ణము లవి మూఁడు
సత్వ రాజస తామసత్వ విద్యోతక
మాత్రలు గల దర్ధమాత్ర యందు
నిర్గుణ యోగివిజ్ఞేయ గాంధారి, గాం
ధారస్వరా శ్రయత్వకృతసంజ్ఞ
పలికి విడువ మూర్ధభాగమునఁ బిపీలి
కాగతి స్పర్శలక్ష్య మగుఁ జువ్వొ

గీ. యుచ్చరింపఁబడిన యోంకార మెట్లు మూ
ర్ధమునఁ బొఱు నక్షరస్వరూప
మట్లు యోగి సెందు నది ధను వాత్మ శ
రమ్ము వేధ్య మరయ బ్రహ్మ మెఱుఁగు. ౧౯౨

గీ. ముగురు మూర్తులు ముల్లోకములు గోనములు
మూఁడు మూఁడు విష్ణుక్రమము లనలములు
మూఁడు వేదమ్ము లవి మూఁడు మూఁడు మాత్ర
లర్ధమాత్ర పరమ్ము మనోఽవిషయము. ౧౯3

క. భూర్లోక మకారమ్ము భు
వర్లోక ముకార మది మవర్ణం బరయన్
స్వర్లోకము సవ్యంజన
మిర్ల కవలి వెలుఁగు తుర్య మిందు వెలుంగున్. ౧౯౪

ఆ. వ్యక్త ప్రథమమాత్ర యవ్యక్త రెండవ
నది తృతీయమాత్ర యనఁగ జితిమె
యర్ధమాత్ర పరమ మగు పదం బందు రి
ట్లివియె యోగభూము లెఱుఁగవలయు. ౧౯౫

ఆ. హ్రస్వ మాదిమాత్ర యవలిది దీర్ఘమ్ము
ప్లుతసమాఖ్య నొప్పు మూడవునది
వాగగోచర మయి వఱలుఁ దురీయార్థ
మక్షరత స్ఫురించు నక్షర మది. ౧౯౬

క. ఓ మనినంతన సదస
ద్భావార్థము సంగృహీతము నరుఁ డెఱిఁగి త
త్సామర్థ్యముఁ జింతించిన
స్థేమాత్ముం డగును సంసృతిభ్రమ ముడుగన్. ౧౯౭

క. అక్షీణకర్మబంధుఁడు
స్వక్షైణ్య మరిష్టకలన భావించుచు మృ
త్యుక్షణము నిది దలఁచు చు
పేక్షించును దనువు మరల నిల యోగి యగున్. ౧౯౮

ఆ. కాన సిద్ధయోగుఁ డైన నసిద్ధయో
గానుభవుఁడె యైన నరయువలయు
సంతతం బరిష్టసంతతి నుత్క్రాంతి
సమయమందుఁ జెడనిజాడ వడయ. ౧౯౯

కాలజ్ఞానము

సీ. శుక్రధ్రువసురాధ్వసోమాంకముల నరుం
ధతిఁ జూడ నొనరనితరమువారు
నపరశ్మిరవిబింబ మమ్మెయి ననల మం
శుచయానుబద్ధంబుఁ జూచువారు
రజతసువర్ణమూత్రపురీషముల నెదేఁ
గల మెలకువ నొండెఁ గ్రక్కువారుఁ
గాంచనాకారాగగంధర్వపురపిశా
చప్రేతముఖము లీక్షించువారు

బ్రదుకనైనవారు పంద్రెండు నెలలును
బదునొకండు నెలలు పది నెలలును
మాసనవక మిందు మఱి యొక్క క్షణమేని
నైన నిలువలేరు పార్థివేంద్ర! ౨౦౦

సీ. బలిసి చిక్కుట చిక్కి బలియుట యొండె నౌ
ప్రకృతికి వెస మార్పు వడయువాఁడు
పాంసుకర్దమములఁ బదము పాదాగ్రమో
మడమలో ఖండమో మాడ్కివాఁడు
కాకోలగృధ్రకాకకపోతదుఃఖగ
క్రవ్యాదములు తల వ్రాలువాఁడు
పంచవర్ణక కాకపంక్తుల నాహతుం
డౌ వాఁడు చాయ వేరైనవాఁడు
నభ్రరహితాభ్రమున మెఱుఁ గాంభసేంద్ర
ధనువు గని దక్షిణపుదెసఁ దలఁచువాఁడు
నెనిమిదియు నేడు నారు నాల్గు నొక మూఁడు
మాసములమీఁద నొకనాఁడు మనఁగఁబోఁడు. ౨౦౧

క. ఘృతతైలకృపీటాద
ర్శతలంబుల నాత్మతనువు చాయఁ గనమి ని
ర్గతమూర్ధం బది గనుటయు
మృతి నెలకుం గలుగఁ జేయు మెలపులు నృపతీ! ౨౦౨

గీ. గాత్రమున మాంసశవమయగంధ మెవని
కర్ధమాసంబ జీవించు నట్టి యోగి
స్నాతుఁడును బీతుఁ డగుడు హృత్స్థాన మెవని
కెండు పది దినములె యాతఁ డుండుఁ బుడమి. ౨౦౩

గీ. బూఁదె వెంద్రుక లంగారములు భుజగము
లజల మహి స్వప్నమునఁ జూడ నగు నెవనికి

నట్టి యోగికిఁ బదినాళ్ళ యవలిదినము
నందు మృత్యువు తప్పని దందు రధిప ! ౨౦౪

సీ. ఇందుసంస్పర్శంబు నెలయింప దెవని మ
ర్మస్థాన మలఁచునో మారుతంబు
ఋక్షవానరయుగ్య మెక్కి పాడుచుఁ బ్రయా
ణ మొనర్పఁ గల దక్షిణమున కెవఁడు
రక్తకృష్ణాంబర రామ నవ్వుచుఁ బాడు
చెవని దక్షిణదిశ కీడ్చును గల
నగ్నక్షపణకుఁడు నగుచు స్వప్నమునందు
నీక్షింపఁబడు మఱి యెవనిచేతఁ
బంకసాగరమందు నాపాదమస్త
మగ్ననిగఁ దన్నుఁ గలఁ గాంచు మనుజుఁ డెవఁడు
వాఁడు వాఁడును వాఁడును వాఁడు వాఁడు
నపుడ చచ్చెదువార లం చరయుమయ్య! ౨౦౫

గీ. జాలు రువ్వుచు నాయుధపాలు లెత్తి
పురుషులు కరాలనికటరూపులు తఱిమిన
నుదయమున శివ యఱచుచు నెదురు వచ్చి
యప్రదక్షిణముగఁ బోవ నపుడ చచ్చు. ౨౦౬

గీ. తిన్న వెంటనె యాకలి తీవ్ర మైన
దీప మాఱిన పొగ కంపు దెలియకున్న
నెదుటికంటను దనపాప యొదవకున్నఁ
దనకు దంతవ్రణం బైన మనఁడు రేపు. ౨౦౭

గీ. అర్ధరాత్రమునందు శక్రాయుధమ్ము
పవలు భగణమ్ముఁ జూచినఁ జెవులు వ్రాలి
నను నిలంబడినను వక్రనాసుఁ డైన
నెడమకన్ను స్రవించినఁ గెడసె నపుడె. ౨౦౮

ఆ. ముఖ మరక్తభావమును గొన్న నాలుక
యసిత మైన రాసభాష్ట్రియాన
మున నవాగ్గతత్వమును గలఁ బొందిన
మడియుకాల మయ్యె మానవునకు. ౨౦౯

గీ. చెవులు మూసినఁ బ్రాణసంభవరవమ్ము
వినఁబడకయున్న దృగ్జ్యోతి విగత మైనఁ
గలఁ బడినగ ర్తమున ద్వారతలము మూయఁ
బడి బహిర్గతిఁ గనకున్న బ్రదుకఁ డతఁడు. ౨౧౦

క. మిడిగ్రుడ్లు వడుట యవి తిరు
గుడువడుటయు నెఱుపు లగుట కుదురు గనమి యె
క్కు డగు ముఖోష్మము నాభియుఁ
గడు ఛిద్రప్రాయ మగుట కాయము చెఱుపుల్. ౨౧౧

క. కలలో నప్పాల నిప్పాల
వలఁబడి యె డ్డైనయకున్న వస్త్ర మమలమున్
నలుపుగ నెఱుపుగఁ గన్న
న్మెలకువ నాసన్న మయ్యె మృత్యు వతనికిన్. ౨౧౨

చ. వినయవివేకశీలు రయి పెద్దల ము న్నిజపూజ్యమానులన్
మునుల నిలింపుల న్గురుల బుద్ధుల సిద్ధుల నల్లువాండ్రఁ ద
ల్లిని బితృపాదు నీదృశుల లేఁతగఁ జూచినఁ దిట్టిన న్స్వభా
వనియతవర్జనంబున విపర్యయ మొంచి యమార్తిఁ జెప్ప నౌ. ౨౧౩

క. కనికొని యోగు లరిష్టము
లను మునుపుగ నెప్పు డవి ఫలమ్ముల నిడు రా
త్రిని దినమునఁ దన్నిశ్చయ
మొనఁగూర్చి భయంబు విడిచి యుత్థితమతు లై. ౨౧౪

క. ఏకాల మరిష్టముఁ గని
రాకాలము దినదినంబు నభ్యసమున సం

ధాకుశలులు నై తత్సమ
యాకలన నిరీక్షసేయునది కృతకృతు లై. ౨౧౬

ఉ. అంతటఁ గాల మాగతము నారసి స్థైర్యము గల్గుచోట నా
వంతయుఁ జింత లేక పరమాత్మ గొనాలు లయింపఁజేసి స్వీ
యాంతరవృత్తిఁ దన్మయత నంది యనంతర మట్టి వృత్తి వ
ర్జింతురు కాంతు లేరికి వచింప నెఱుంగఁగరాని నిర్వృతిన్. ౨౧౭

క. అడిగితివి చెప్పితిని నీ
యడిగినయంతయు నొకింత యనెద వినుము నీ
యిడుము లడఁగ సంసృతిస్సృతి
విడిచి పరం బెనయుజాడ పృథివీంద్రవరా! ౨౧౮

సారోపదేశము

ఆ. చంద్రసూర్యమణులు చంద్రసూర్యాంశుసం
యుక్తి జలము నగ్ని నుమియునట్లు
యోగియుఁ బరమాత్మ యోగమ్ముతోఁ బొందు
టభ్యసించి సిద్ధి నందు నెందు. ౨౧౯

మ. యజమానుం డిలుఁ గట్టియుండ గృహగోధాళ్యాఖుకాపింజల
వ్రజముల్ చీమలు దోమ లందు సుఖసంవాసంబుగా నుండి యా
డి జలాగ్న్యాదుల నల్ల యిల్లు సెడునప్డే యింతయుం జింత లే
కజవం బొప్పఁ గఁబోఉు నిం కొకెడ కా కాన్పుండ నా యోగికిన్.

గీ. చెదలుపుర వెంత దాని ము క్కదియు నెంత?
యెంతంతెంతలు మృద్భార మేర్చి కూర్చు
నదియె యుపదేష్ట యోగికి నభ్యసనము
నం దశక్తుఁడ ననక చేయనగు నంచు. ౨౨౦

క. గోవత్సవిషాణాగ్రము
భావించి తదీయవృద్ధిఁ బరికించి నిజా

త్మావేశితాత్మవృత్తి న
నావిలముగ నభ్యసింపనగు సిద్ధికి నై. ౨౨౧

క. పశుపక్షిమనుష్యాదులు
భృశ ముపజీవింపఁ దఱుగు వృక్షముఁ గని నై
జశరీర మట్ల యని త
ద్వశత వదలి యాత్మ యోగవశ మొనయఁ దగున్. ౨౨౨

ఉ. నిండిన నేతికుండఁ దన నెత్తిన నెత్తినయట్టి దెత్తుగాఁ
గొండకొ మేడకో మెరకకో తగ నెక్కుచు నెట్టి ప్రజ్ఞతో
నుండునొ? యట్లె యోగి యనిలోద్ధతి నాఁగెడుపట్టునందుఁ దా
నుండెడునున్కి నేమఱక యుండవలెన్ మనసప్రవృత్తితోన్. ౨౨౩

గీ. అఖిలజనులకు నెందు నిశాంత మందు
జీవనాయత్త మైనట్టి చేష్ట యెద్ది
నిదుర మానెడునెడఁ దోఁచు నియమి దాని
తత్త్వమెఱుఁగంగ నై కృతార్థత్వ మొనయు. ౨౨౪

గీ. ఎందుఁ దా నుండుఁ దన కదియే గృహంబు
దేనితోఁ దాను జీవించు దివ్యభోజ్య
మదియ తనయది యదియ యొం దర్థసిద్ధి
కాక మమతకు నెల వెందొక్కండు గలదె? ౨౨౫

క. దారాత్మజాదికరణ
ద్వారమ్మున గృహి తనపని నార్జించునటుల్
పారమ్యము సాధించును
ధీరుఁడు ప్రకృతిజము లైన ధీముఖములచేన్. ౨౨౬

క. అని బోధించు మహాత్మున
కును వినయావనతుఁ డగుచు గుణనిధి తేఁ డి
ట్లనెఁ దన మనమున నొదవిన
ఘన మగు ప్రమదంబు రూపు గైకొనె ననఁగన్. ౨౨౭

సీ. బ్రహ్మమూర్తీ! మేలు ప్రాణసందేహదం
బగు భయం బిట్లు దైవాప్త మగుట
పగఱ భూరిబలసంపత్పరాక్రమముల
మేలు నేమందు నీ మేలు గూర్చె
మందబలుఁడ నైతి మడిసిరి భృత్యులు
ప్రభుశక్తి వో నీతి పరిఢవిల్లె
నా వేళ కెంత మేలయ్యె! సంస్మృత మయ్యెఁ
ద్వత్పాదసరసిజద్వంద్వ మిదియు
నదికె నామది నీనుడు లన్ని మేలు
జ్ఞాన మావిర్భవించెఁ ద్వచ్ఛక్తి మేలు
బ్రాహ్మణోత్తమ! కారుణ్యవర్ష మిట్లు
మెఱసి వర్షించితివి మేలు మేలు మేలు. ౨౨౭

క. ఆర్యత్వము నెనయు న
నార్యుండును బున్నె ముదయమందెడు నెడ నా
చర్య యెటు వ్యసన మెక్కడ
నర్యమసమ! త్వత్సమాగమార్థ మమరదే? ౨౨౮

ఉ. కాశివిభుండు నాకు నుపకారి సుబాహుఁడు మూల మందు యో
గీశ! భవత్పదాబ్జ మెనయించెఁ బురాకృత మీ కృతమ్మునన్
నాశమునొందె మోహవృజినంబు భవత్సమనుగ్రహాప్తి ని
ర్వేశముఁ గూర్చితే నిఁకఁ జరించెద దుఃఖము లంటకుండఁగన్. ౨౩౦

శా. దుఃఖాగాటవి నీ గృహస్థతఁ ద్యజింతు న్సంచరింతు న్సదా
నిఃఖేదుం డననై యనుజ్ఞ యిడు మౌనీ! జ్ఞానదా! సద్గురూ!
స్వఃఖేలార్చిత! యన్న భద్ర మవు రాజా! పొమ్ము వర్తింపు మో
కఃఖాద్యాదుల నిర్మముండ వనహంకారుండ వై ముక్తికిన్. ౨౩౧

క. నా చెప్పినట్లు మెలఁగి సు
ఖాచితుఁడవు క మ్మటన్న యనఘాత్ముని ద

త్తాచార్యుఁ బ్రేమవిహ్వాల
ధీచతురత సాంజలి యయి తెలిచె నృపతియున్. ౨౩౨

చ. వివిదిషుబోధహేతుధృతవిగ్రహు నాత్మసుఖానుభూతితు
చ్ఛవిహితవిగ్రహున్ ససురచారణముఖ్యవృతాంఘ్రివిగ్రహున్
బ్రవిలసదంగనావయవభావనిషక్తసమగ్రవిగ్రహున్
స్థవిరయువార్భకత్వవిలసత్సమవిగ్రహుఁ గొల్తు నెప్పుడున్. ౨౩౩

సీ. అణువున కణువు మహాత్మునకు మహితుఁ
డౌ జ్ఞానధాము సమాశ్రయింతు
దివ్యచిత్రాంబర! దిగ్రచితాంబర!
యోగీశవంద్య! న న్నోమ్ముమయ్య!
సువిశాలదేహుండు సూక్ష్మశక్తి మహాత్ముఁ
డరిదారణుఁడు మాకు నగునుగాక
పురుషోత్తమునకు దేవునకు వాఙ్మనసవి
దూరునకు నివె నతుల్ శతములు
భవభయము వాయ నిర్జితవాయుమాన
సప్రచారు లెడఁద సదసత్పరమ్ము
తత్త్వ మెయ్యది ధ్యానింత్రో? తవిలి దేని
యందు నవరం బెఱుంగరో? యద్ది నీవ! ౨౩౪

క. విజ్ఞానఘన మ్మవ్యయ
మజ్ఞానవిదూర మైన యా బ్రహ్మము నీ
వే జ్ఞాతవ్యము యజ్ఞో
పజ్ఞ మ్మధిమహము నా యుపాస్తి వెలిఁగెడున్. ౨౩౫

సీ. వాచ్యవాచకశక్తిభావితవై భవ!
నారాయణుఁడ! నమస్కారము లివె
శరణాగతజనవత్సల! పూర్ణబోధుండ!
సర్వబీజమ! నమస్కారము లివె

నాగఘస్మరకేతనా! నిర్గుణాత్మక!
కమలనాభా! నమస్కారము లివె
శ్రీపతి! భూపతీ! గోపతి! యోగేశ!
శాస్త్రయోనీ! నమస్కారము లివె
మాటిమాటికి నివె నా నమస్కరణము
లందుకొనుమయ్య ప్రీతి వేదాంతవేద్య!
వ్యగ్ర మజ్ఞానకాజగరగ్రసితము
నుద్ధరింపుము జగము మానోద్గతుండ! ౨౩౮

మ. ననిరోధం బతిమూఢమానసము నజ్ఞానాంధకారాంధ మా
జనసంఘాతము జ్ఞానచక్షు విడి మోక్షక్షేమముం జేయు యో
గనయాహస్కర! మానశాలి! యకలంకా! బ్రహ్మవంశోద్భవా!
యనసూయాసుత! యత్రిపుత్ర! కొనుమయ్యా! నా నమస్కారముల్.

మ. అపలింగద్విజలింగత ల్వెలయ నిచ్ఛాధీననానావిహా
రపరుం డై విగతాశ్రమత్వము నవర్ణత్వమ్ము చూపొప్పు బ్ర
హ్మపథబ్రాహ్మణపాలనమ్మునకుఁ బూర్వాచారవిధ్వంసక
క్షపణంబుం బొనరించు దేవుఁడు మదాగమ్ము ల్తొలంగించుతన్.

క. జోతలు నీ కిడుదు మురా
రాతీ! కేశిప్రహారి! ప్రణతులు కృష్ణా!
చేతులజోడింపులు నా
కాదర్య మడంచితయ్య! కంసధ్వంసీ! ౨౩౯

గీ. త్వత్ప్రసాదమ్మునం గృతార్థతఁ బడసితి
దేవదేవ! జగత్పతీ! త్రికరణముల
మాటిమాటికి నీకు నమస్కృతు లిడు
చభ్యసించెద నీ చెప్పినట్టి తెరువు. ౨౪౦

గీ. దిక్కు సెడి నీకు దక్కె నీ పక్కె నింక
మఱవఁబోకు జొహార్లు సంభవవిదారి!

యనుచుఁ గొనియాడి కొనియాడి ప్రాంజలి యయి
జాతవేపథుఁ డై యుండె క్ష్మావిభుండు. ౨౮౧

గీ. చరణసరసీజములఁ గ్రియాసమభిహార
ముగఁ బడుచు లేచుచుం గొల్చు భూపతిఁ గని
స్వస్తి సాధింపు మిష్ట మ్మసంశయోఽ స్త
టంచు గురుఁ డాన యిచ్చి పంపించె విధిగ. ౨౮౨

చ. నిను విడనాడి పోవనగునే? మఱివచ్చెదఁగాక యంచు స
మ్మునికిఁ బ్రదక్షిణమ్ములు నమోవచనమ్ము లనుక్షణ మ్మొన
ర్చెను దగ వీడ్కొనెం జనియెఁ జెచ్చెరఁ గాశివిభుండు స్వాగ్రజుం
డును గలచోటి కిట్లొకరుఁడు న్భయసంభ్రమవైరశూన్యుఁ డై.

## అలర్కుఁడు సుబాహు కాశీశులఁ గానఁ బోవుట

ఉ. వచ్చెడు నయ్యలర్కుని సుబాహుఁడుఁ జూచుచు నుండెఁ గాశిరా
జచ్చెరు వొప్పఁ జూచి యతఁడా యితఁ? డంచు హసించి నెమ్మదిన్
మెచ్చక మెచ్చియుం దలఁచె మేదినినాయకుఁ డోడి పాఱఁడా?
పొచ్చెము లేదొ? కత్తిఁ గొని పోరఁడొ? యియ్యది యెట్టిరాకయో?

ఉ. ఆయుధధారి కాఁ డొకరుఁ డై నను బంటని వెంట రాఁడు చం
ద్రాయిత మైన మోము దెస దైన్యము దోఁపదు సుప్రసాద మి
ట్లాయత మై మదీయమతి నార్చుచున్నది వైరవహ్ని లే
దీ యతిశాంతి నిన్న నిపు డెమ్మెయిఁ బమ్మెనొ? యేమి సేయుదున్?

క. అనుకొనుచుండఁగనే వ
చ్చెను దన యన్నకును నెరఁగెఁ జిఱున వ్వొలయన్
వినుచుండఁ గాశినాథున
కనెను నలర్కుం డనూన మగు ధోరణిగన్. ౨౮౬

గీ. రాజ్యకాముక! కాశీశ! రాజ్య మూర్జి
త మ్మనుభవింపుమింపు మై సమ్మతమ్మ

యైన మా యన్న కిప్పుడెంత యైనఁ గొంత
యైన వచ్చితి నిమ్మాట యని చన నని. ౨౮౭

చ. కడు నరుదారు డెందమునఁ గాశివిభుం డపరంజియాసనం
బిడి యను నోయలర్క! నయమే? యిది యేమి పరిత్యజించితే?
పుడమి యఖండరాజ్యమును బోరెడగా నృపనీతివేత్త వై
నుడివెద రాచపాడి సతనుండవు నీ విటులాడరా దినా! ౨౮౮

ఉ. చచ్చినవారు సచ్చి రని చావుభయమ్మున మెత్తనానె? తేఁ
డుచ్చిచనంగ నా శరము లొవ్వనివారలపై విదుర్చఁ గా
కచ్చల మూది శాత్రవచయంబు జయించి హితేష్టభోగముల్
నిచ్చలు నొంది సిద్ధికి ననిందితయాగకరుండు గా నగుఁ. ౨౮౯

ఉ. అంతకుఁ జాలఁడేనియు నయమ్మున నింకొకదారి లేదె? య
త్యంతవిరాగమో? యలసతావిధమో? యిది నాకు నచ్చ లే
దంతకవిక్రమా! యను మహారిపుఁ గాంచి మదాలసాసుతుం
డాంతరభావముం దెలిపె నాతని కేల నృపాలకోపధుల్? ౨౯౦

ఉ. వీరుఁడ! నాకుఁగూడ మును వెట్టి యిదే కల దిప్పు మాటెఁ బో
కారణ మున్న దివ్విధి కకారణకారుణికుండు దత్తవి
స్తారుఁడు దత్తదేవుఁ డనుశాసనముం బొసరించెఁ జన్న రే
యారహి హేతుభూతు లగు నీతఁడు నీవు గురుప్రకారులే. ౨౯౧

ఉ. భౌతిక మైన స్తంబము స్వభావమున స్వరహితరంతరింద్రియ
వ్రాతముతోడ జంతునికరంబుల యంగచయంబులు న్గణీ
భూతము లౌచు సత్యముల వోలె క్షయంబును వృద్ధి నందుఁ ద
త్ఖ్యాతికి మూల మైన దొక యక్షరశక్తి తలంచి చూడఁగన్. ౨౯౨

గీ. వ్యావహారికసత్యము లైన జగము
లందు భాసించు జంతువులందు నెల్ల
నొక్క చిచ్ఛక్తి గాక వేరొండు లేద
స్వామిభృత్యారిమిత్రభావ మెటుఁ గలదు? ౨౯౩

క. ఇంతకు నజ్ఞానంబున
వంతలపాలైతి మీ యుభయుల నయమునన్
సంతమస మెడసె నింద్రియ
సంతతిని జయించుచు నీక సంగముఁ బాతున్. ౨౫౪

ఆ. ఇతరకరణముల జయించి నిరాధార
మైన మనసు బ్రహ్మమం దమర్తు
దానిజయము జయము గాని జయమ్ములా
మిమ్ముఁబోంట్లతోడి చుమ్మ లివియు? ౨౫౫

గీ. ఆత్మసామ్రాజ్యసిద్ధికి నర్థనీయ
సాధ్యముల చింత యొక్కింత సంభవింప
దెన్ని యుండిన నీరాజ్య మిదియు నశ్వ
రమ్ము వదలితి దీనిఁ దద్రక్తిఁ బడితి. ౨౫౬

ఉ. కావున నీవు నా కరివి కా వపకారి సుబాహుఁడేనిఁ గాఁ
డీవును నేను నీతఁడును నేకమయం చెఱుఁగంగనయ్య నీ
భావము మార్చు భావములె వైరులు తజ్జయ మాది నిల్తు నీ
వేవిధి నేనియు న్నమకు జంకొక శాత్రవుఁ గాశిభూపతీ ! ౨౫౭

మ. అనుమాట ల్విని కౌఁగిలించుకొని యేరా! తమ్ముఁడా! నాకతం
బున సంసారపథంబె తప్పిచనెనా? పో యింత కింతయ్యనే?
యని హర్షం బెద నిండ నాగమనకార్యం బెల్ల సిద్ధించె నిం
కను దాపం బని యేమి? బైటఁబడెదం గా కంచు లోనెంచుచున్.

చ. మరల సుబాహుఁ డయ్యనుజుమై నిమురం గని మేలు మే లటం
చరుదుగ మెచ్చి కాశిపతి నట్టె కనుంగొని రాజపుంగవా!
శరణని నిన్ను సేవనికి ఛద్మముతోడ సమాశ్రయించితిన్
పరమఫలంబు నొందె నది భద్రము నీ కగుఁ బోయి వచ్చెదన్.

చ. అని చన నెంచు వానికర మట్టులె పట్టి వచించెఁ గాశిరా
జనఘ! యదర్థ మాగతుఁడ వైతివి నీకు ...

దిశ నిజము సెప్పుమా విన మదిం గడుఁ గౌతుక మయ్యె నాకు నీ
వు నితఁడు నేక మై నను నబోధుఁ గదర్థితుఁ జేయలేదుగా? ౨౬౦

మ. పితృపైతామహ మా మదీయపద మా పిన్నాతఁడే కొన్నవాఁ
డతిధృష్టుం డది యీఁడు సామమున నీ వార్జించి నా కిమ్ము ని
ర్జితు వానిం బొనరించి యంచు నను నార్తి న్వేఁడవా? మున్నిదే
కృతమయ్యెం గృతి లబ్ధరాజ్యరమ భోగింపం దలం పొప్పదే? ౨౬౧

క. స్వకులోచిత మగు పద మే
నకటా నీకై కడువడి నార్జించి యిడన్
వెకలివె? విడిచి చనంగా
స్వకకపటం బున్నదంటె వర్ణింపు మనన్. ౨౬౨

చ. పకపక నవ్వి యిట్లను సుబాహుఁడు సాధితమిత్రకృత్య! దే
నికినయి యింత యుద్యమము నిన్నడఁబెట్టి పొనర్పనైతి బా
నిక విను మున్న దున్నటుల నే వివరింతును దుచ్ఛరాజ్యకా
ముకమతి నాశ్రయించితినె? పోయిన నీతఁడ దాని నీయఁడే? ౨౬౩

సీ. అమ్మదాలసగర్భమందుఁ దోఁచితిమి సో
దరుల మై నలువుర మరివిదారి!
ఆ యమ్మ నాకు నాయన్నకుఁ దమ్మున
కాది బోధము చెవి నాదట ముఖ
మందు స్తన్యమ్ము నా సందర్భమునఁ బెంచె
నితనికి నటు సేయ దతివ నాఁడు
వ్యావహారికస్మృతి భర్త్రాజ్ఞఁ గా దనఁ
బాడిగామి త్రివర్గపథమ తెల్పె
గ్రామ్యభోగములందె సక్తమతి యగుచుఁ
దత్త్వ మెఱుఁగక దరి లేని దారిఁ బడిన
వాని నా తమ్ముగుఱ్ఱ నివ్వానిఁ దేర్ప
వలసి యీ యెత్తు నెత్తితిఁ బార్థివేంద్ర! ౨౬౪

శా. దారింబోయెడు సార్థసార్థముల సార్థంబొందు భగ్నంబు గాఁ
గా రంజిల్లునె యున్న సార్థముల హ్రాత్కంజమ్ము లట్లే గృహ
స్థారంభంబున దేహబంధుఁ డితఁ డిట్లాపన్నుఁ డై యుండ నా
త్మారామత్వమ యేని మాకు సుఖదమ్మా? భ్రాతృకల్పం బిదే? ౨౬౫

ఉ కావున వీనికి స్సుఖము గల్గిననాఁడు విబోధ మంటునే?
యేవిధి నైన దుఃఖ మెద కెక్క విరాగము గల్గు నంచు నీ
చేవ యెఱింగి య ట్లనసి చింతితము న్నమకూర్చు కొంటి మా
త్రోవకు వచ్చె మా యనుజదుర్గజ మింకిట సేమ మయ్యెడున్.

ఉ. తమ్మునిమాటె కాకయు మదాలసగర్భముఁ జొచ్చి వచ్చి స్త
న్యమ్ము తదీయ మాని చెడ నోనె యితం డని యుత్తమాసుతుల్
నెమ్మది మెచ్చు త్రోవ గమనించినఁ జాలు నటంచు నీకృతిన్
సమ్మతి సార్థ మైనఁ జనసాగితి సంగము మాని సిద్ధికిన్. ౨౬౭

గీ. బాంధవ్వుం డైన సఖుఁ డైన స్వజనుఁ డైన
సీదమానుండు గా నుపేక్షించు నెవఁడు
సేంద్రియుం డైనఁ గాఁ డని యెంతు వాని
నప్రయోజకుఁ డగుట నరప్రవరుఁడ! ౨౬౮

క. తన కగు సమర్థు లుండఁగ
మును ధర్మార్థములఁ గామమోక్షంబుల నే
మనుజుఁ డపార్థుం డవు వా
నినిఁ జెందదు నింద నిందనీయులు వారల్, ౨౬౯

చ. అదియునుగాక వింటె మనుజాధిప! జ్ఞాతరసుండు చిన్నవాఁ
డోదవిసినవాఁడు వీఁడె పద మొల్లక యిట్లు విరాగి యై చనన్
ముదిరినవాఁడ ని ప్పైరువు పుచ్చుకొనన్వలె జుట్టు గూడ నే
మదిఁ దగు దంచు నేలుదు క్షమన్? జన ని మ్మెటొ చాలుఁజా లిఁకన్.

గీ. కష్టపడినాఁడ వకట నాకై నృపవర!
యేలుకొను మిది యది గూడ నెక్కుడగునె?

యీ యలరుక్కుండు సంతృప్తి నెనయుచుండెఁ
గద యెదో యబ్బెఁ దన కని పొదలనిమ్ము. ౨౭౧

మ. అనువానిం గని యక్కటక్కట మహాత్మా! నేను నీవాఁడ నై
తినకాదే? యుపకార మీ యనుజుభాతిం జెంద నర్హుండఁ గా
వునఁ జిత్త మ్మొక యింత త్రిప్పు మపునర్యాతుండ నౌ నట్టి తె
న్నున నన్ను న్నడిపింపు నాటకమునందుం బొమ్మన ట్లార్చెదే? ౨౭౨

గీ. సాధులకు సాధువులతోడి సంగమంబు
సఫల మాఁగాని యెందేని విఫల మవునె?
ఉన్నతత్త్వము వడసి మహోన్నతుండ!
నీసమాశ్రయమున నేను నెగడవలయు. ౨౭౩

గీ. అనుజబంధంబు త్రెంపుకో నను వెఱుఁగక
యింతసేసితివి కదె యిందేమి చెడియె?
సఖ్యబంధంబుఁ ద్రెంచుకోఁజాలుదు వెటు?
లదియుఁ జూచెద నిపుడు మహానుభావ! ౨౭౪

చ. అని యతఁ డంతఁబోక వినయంబు నయం బిడె నాఁ బదా
బ్జములఁ బడె న్వడిం దిరిగి వచ్చి "యనన్యగతిం విధేహి మాం
ప్రణిహితబోధ" మంచు నొగిఁ బ్రాంజలి యై నిలిచె న్సుభక్తిఁ గా
శినృపతియు న్సబాహుఁడును జేకొని యిట్లనె నాదరంబునన్. ౨౭౫

మ. తమశక్తిం బురుషార్థము ల్గొన నగు న్ధర్మార్థకామాపవ
ర్గము లిన్నాలుగు వర్గము ల్నరులకున్ గాశీశ! నీ కందు మూఁ
డమరె న్సత్ఫలదాయకంబు లయి యన్యంబొండె యట్లుండె నే
కమనస్కత్వము చొప్పడ న్వినుము వక్కాణింతు సంక్షిప్తమున్ ౨౭౬

క. విని చక్కగ నాలోచన
ము నొనర్చి యటు ప్రయత్నమును జలిపెదవే
నిని నిశ్శ్రేయస మెనసెద
వనఘా! యెవ్వారికి వార లటు నడువవలెన్. ౨౭౭

చ. అహ మని దేహమందును సుతాదులపై మమ యంచు నీకు న
న్వహమును దోఁచు ప్రత్యయము లారసి తోఁపఁగనీకు మింక నే
నహ నన నవ్వి ధర్మము లపాశ్రయము ల్తగు ధర్మి లేమి నా
నహత! యనాత్మ ధర్మి యగునా? కాన నాత్మకు ధర్మ ముండునా?

చ. ఎవఁడను నేను నే ననుచు నెప్పుడుఁ బల్కుచునుంటి నంచు నీ
వవహితబుద్ధి నారయు మనఘ్నుఁడ! వేఁకువలందు లేచి స
ద్మవసుసుతప్రియాదుల మమత్వముభంగి కథంవిథంబో? య
న్న వివర మట్లె యారయు మనారత మారయు మార సిద్ధికిన్.

గీ. జడము సవిశేషసవికారసప్రకృతిక
జగతి వ్యక్త మవ్యక్తంబు జ్ఞానవిషయ
మింతవట్టును నెఱుఁగుచు నెవఁ డహ మని
నిత్యమును నీయెడ స్ఫురించు నెమకు మతని. ౨౮౦

క. విజ్ఞాతం బిది ద్వైన న
విజ్ఞాతము లేదు విశ్వవిశ్వంబున నీ
కజ్ఞాన మనాత్మల నా
త్మజ్ఞానముకన్న లేదు మహనీయమతీ! ౨౮౧

ఉ. అవ్యయుఁడ న్నిరంతరుఁడ నై వెలుఁగొందెదు నేను రాజ! లో
కవ్యవహార మెంచి యిటుగా నిది చెప్పితి నీ వెఱింగితే
నవ్యతిరిక్తభూమమహితాత్ముఁడ వింత వివేకశాలి వై
భవ్యముఁ జెందు మేఁ జనెద వచ్చెదు పో విశయంబు గల్గినన్. ౨౮౨

చ. ఇది యిటు లుంచుమయ్యా! యవనీశ్వర! చేసితిఁ గార్య మెంతో పె
ద్దది భవదీయసంగమున ధార్మికసత్తమ! జ్ఞానభాక్కు వ
య్యెద విదె పోయివచ్చెద వహింపుము స్వస్తి యటంచుఁ బల్కి యా
సదమలుఁ డా సుబాహుఁడు వెసం దన తమ్మునిఁ జీరి యిట్లనున్.

శా. ధీమంతుండ! యలర్కుఁడా! పురికిఁ బో దృష్టిం గృతార్థుండ వై
తామోదం బొలసెన్ విషాద మెడసె న్స్వాత్మన్ వివేకీ! యిఁకన్

భూమీరాజ్యముఁ జేసికో, వలదయేనిఁ బో కాననావాసి వై
శ్రీమంతుండ! మెలంగు మిచ్ఛమెయి, వాసిం దెచ్చి తా తల్లికిన్.

మ. అని వాక్రుచ్చెడు నన్నకు న్వినతుఁ డై యాలింగితుం డై మహా
త్మ! నిజాంబాపితబోధు లై మువురు ముక్తప్రాయు లై నారు మీ
రనభిజ్ఞుండ జడీకృతుండ నయి రాజ్యంబంద యే నుండి నీ
యనుకంప న్వినిమోచితుండ నయి నేఁ డా దాయముం బొందితిన్.

గీ. తల్లిదండ్రుల కవల భ్రాతలకు మీకు
వందనమ్ము లటన్న నవ్వాని మెచ్చి
కాశిభూపతి న ర్థమార్గమునఁ జొనిపి
వనమునకు బోయె మరల సుబాహుఁ డెలమి. ౨౮౭

మ. ఘనుఁ డా కాశివిభుం డలర్కవిభు సత్కారమ్ము లేపార వీ
డ్కొని పోయెం దనకాశికాపదము ముక్తు ల్భక్తి సేవింప నౌ
ఘనసంస్థానము కాదె? విశ్వవిభుఁ డా కల్యాణ మీకుండునే?
చనె మందోచ్ఛలదుత్తమాంగుఁ డతఁడు న్స్వస్థానికిన్ హృష్టుఁ డై.

గీ. విశ్వనాయకుఁ గొలువఁడో? విబుధగంగ
మునుఁగఁడో? మున్ను వాఁ డది మోటుమాట
యెఱిఁగి కొనియాడె నిప్పు డయ్యెరువుర నతఁ
డట్టె చేపట్టె ముక్తికాంతాగ్రకరము. ౨౮౯

చ. అనవుడుఁ దండ్రి యి ట్లడిగె నాత్మజుఁ గాశివిభుండు వోవ న
ట్లనువరి యన్న కాననచయాంతరితుం డయి చన్న న య్యల
ర్కుని తరువాతివర్తన మురుక్రమ! చెప్పుము రాజ్య మేగతిం
జనియె నతండు వోయె నెటు సంగ మడంగ నన న్సుతుం డనున్.

ఉ. ఇంటికిఁ బోయి పుత్త్రునకు నిచ్చు స్వరాజ్యము నిచ్చి మింటికిన్
మంటికి నుత్సవంబుగ సుమాళముఁ గూర్చి వినీతి సెప్పి తాఁ
గంటికిఁ గంటకం బగుచుఁ గన్పడు సర్వమునం బ్రసంగముం
గెంటి యలర్కుఁ డొందె నవిగీతవిధి న్విపినంబు సిద్ధికిన్. ౨౯౧

మ. బహుకాలం బటుచో నలర్కపతి నిర్ద్వంద్వాత్ముఁడు న్నిష్పరి
గ్రహుఁడు న్నిర్వృతిలక్షణాఽపతులయోగప్రాప్తసంసిద్ధిధూ
ర్వహుఁడుం డా నయి దేవదానవనరప్రాయప్రపంచంబుఁ జూ
చె హతాశాగుణపాశబద్ధముగ సంసృత్యబ్ధిమగ్నమ్ముగన్. ౨౯౨

ఉ. దారకుమారసోదరహితప్రతిపక్షిపరాపరత్వము
ఖ్యారతిహేతుకష్ట మసుఖార్తము సుప్తము భిన్నదర్శనం
బౌర జగ మ్మబోధతిమిరావిలపంకిలగర్తగం బను
ద్ధార మటంచు నెంచె నెడఁదం దను నెంచె నుదీర్ణుఁ దీర్ణుఁగన్. ౨౯౩

## అలర్క గీతము

క. తన మునుపటి చరితమ్మును
ఘన మవ్వ నీనాఁటిస్థితిని గనికొని పాడెం
దనపాటఁ బాట గా న
మ్మనుజేంద్రుఁ డలర్కుఁ డాత్మమాన్యత వెలయన్. ౨౯౪

సీ. నాకన్న సుఖితు లున్నారా? బళే యని
మునుపు రాజ్యము సేయు పని యెటూ? చనె
యోజించి కనుగొంటి యోగమ్ముకన్నను
బరమసుఖమ్ము లేఁబర మటంచుఁ
బృథివి నే యే యవ్రీహిహిరణ్యాంగ
నాపశుముఖసుఖోన్నతులు కలవా?
యాశ లడంచు మహాసుఖమ్మున కెన్ని
నవి పదారవ్వకల కైన రావ
యాత్మరూపమ్మె సుఖ మది యఖిలము లవ్వ
నీహ లుపరతి నొందు న య్యింపునందు
దాని విడనాడి మృగతృష్ణఁ దవిలి నెమకు
జనము పరికింప దుఃఖభాజనమ కాదె? ౨౯౫

సీ. మహితమ్ము చైతన్యమాత్రమ్ము దేశకా
లాద్యనవచ్ఛిన్న మాత్మ సత్తు
స్వప్రకాశము పరసౌఖ్యరూపము సనా
తనము పూర్ణమ్ము వాఙ్మనసదూర
మమృతాఖ్యమును స్వగతాదిభేదత్రయ
శూన్య మశూన్యమ్ము శుద్ధము పర
మైన బ్రహ్మ మ్మన్న నేన యనెడు నుడి
మతి నాకు తెలివి నిశ్చితమ తోఁచె
తల్లి తండ్రి యన్న దత్తదేవుఁడు వీరి
కరుణ నన్ను నిట్లు గా నొనర్చె
నేఁ గృతార్థుఁడను గృతార్థుండను గృతార్థుఁ
డను విసంశయ మ్మడంగెఁ దమము. ౨౯౬

సీ. అని యలర్కుండు వ్యాఖ్యాన మ్మొనర్చె నో
జనక! వచించితిఁ జక్కఁగ నది
దత్తదేవుండు సాదరభావ మొప్ప యో
గాదేశ మొనరించె నతనికి మును
నదియు వింటివ యట్టు లభ్యాసమునఁ గూర్పు
ముత్తమయోగమ్ము ముక్తికొఱకు
నది సెంది శోధింప వెక్కటి తద్బ్రహ్మ
భావమ్ము సువిదితార్థ్వమునఁ బొందు
మేల క్రతువుల జపముల గోల నాకుఁ
దాత! కృతకృత్యుఁడను మదంతఃకరణము
బ్రహ్మభావస్థితికి సమర్థ మగుచున్న
దింకఁ దమ సెలవైన నే నేగువాఁడ. ౨౯౭

క. అపరిగ్రహుఁ డద్వంద్వుం
డపమోహుం డన మెలఁగుచు యత్నించెద ము

క్తిపరిగ్రహార్థ మక్లే
యుపాయమున నిర్వృతి నెనయుదు సంతతమున్. ౨౯౯

క. నీ వడిగిన కథ యెల్లను నావిదితము చొప్పునఁ జెప్పినాఁడ జనకుఁడా!
నీ వట్లు నడువు హిత మవు నే వెడలెద సెలవులా! యనిందితచరితా!

చ. అని గురుఁ జుట్టివచ్చి విదితాఖిలధర్ముఁ డతం డనుజ్ఞ యా
జననుతుఁ డా సుతుండు సనె సర్వపరిగ్రహము త్యజించి త
జ్జనకుఁడుగూడ న ట్లొగి నసంశయుఁడు న్సుసమాహితుండు నై
వనమున కేగి యర్హ మవు వర్తన మొప్పఁ జరించె నిష్ఠతోన్. ౩౦౦

ఆ. అంతఁ గొంతతడికి నంత్యాశ్రమముఁ గొని
యాత్మజయము నొంది యధిగుణంబు
బంధ మందు వదలి పరమసిద్ధిం బొందె
నని వచించి యిట్టు లను గురుండు. ౩౦౧

క. వత్స! పితాపుత్రుల సుచి
కీర్తిత మిది దత్తదేవకృతబోధముతోఁ
దత్సచరిత మేధావికిఁ
దత్సుతుఁ డగు సుమతిచే నుదాహృత మయ్యెన్. ౩౦౨

శా. సర్వామంగలనాశనం బిది ముముక్షుశీలినిధ్యేయ మై
యుర్వీపర్వము యోగిరాజచరితం బొప్పన్ శ్రుతై తత్క్రముల్
నిర్వేశంబును బొంది సంసృతిస్మృతి స్వీడంగ నై యుండు రా
మర్వారంబు విమోహ మొత్తిగెల సొదుం దాము వై దీపకా! ౩౦౩

క. నీ వడిగినయది యెల్లన్
నే వివరించితిని మఱియు నీ కేది విన నా
భావించి యడుగు మన న
ప్పావనుఁ డతిభక్తి నెరగి పలికె గురునితోన్. ౩౦౪

క. అను సూతు నాదరించుచు
మును లాదటఁ దద్గుహాత్తముని శిష్యోత్తం

సుని సంవాదక్రమగతి
ననువాదింపు మని వేఁడి యభిముఖు లగుడున్. ౩౦౭

మ. భవ! శ్రీరామకథామృతాదిరచనోపాత్తానుబంధప్రియో
త్సవ తాడేపలివేంకటప్పకవివిద్వద్భ్రాతృవాహార్పణా
దివిశేషానిశసేవ్యమానచరణా! దేవాదిదేవా! సము
ద్భవరాహిత్యకరప్రకారనిజదివ్యస్నానమసామక్రమా! ౩౦౮

క. చందోలుపురనివాసా!
యిందుకలాకలితముకుటా! హృదయనివేశా!
కందర్పదర్పసంహర!
సుందరవామాంగ! విశదశోభినిజాంగా! ౩౦౯

మాలిని. సవితృగత! హిరణ్యశ్మశ్రుకేశానుబంధా!
పవిసహితబిడౌజోబాహుసంస్తంభకారీ!
నవనవమహిమాంచన్నామరూపప్రణాళీ!
స్తవననిహితచిత్తాసంభృతానందవిత్తా! ౩౧౦

సీ. ఆంధ్రోర్వి రామకథాఽమృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెం దనయు విత్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ మఖములఁ
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదిగో
నాలవు ప్రసూనమంజరి దాలుపు మెద. ౩౧౧

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## పంచమ గుచ్ఛము

క. శ్రీమద్విద్వన్నిషేవిత! ధీమన్మజ్జనకపాదదివ్యకవిత్వ
ప్రేమోల్లసదంతఃకరణా! మంజులతానుషక్తనగరాభరణా! ౧

గీ. అవధరింపుము మునులకు ననియె సూతుఁ
డట్లు గురుముఖనిస్సృత మమృతఝరముఁ
గర్ణములతోడఁ గ్రోలి యాకంఠకుహర
మడిగె మఱి దీపకుఁడు గురు నతివినీతి. ౨

దీపకుని ప్రశ్నమునకు గురుఁడు తీవ్రముగా నుత్తర మిడుట

సీ. ఈసందియము దీర్పుమీ సర్వవిజ్ఞాన
సాగర! భగవంతుఁడా! గురువర!
యత్రికి ననసూయయందు నావిర్భూతుఁ
డసలు త్రిలోకకృత్యావహితుఁడు
మునివేషధరుఁడు యోగనిరూఢుఁ డై యుండి
యేల యనాచారమే నటించె?
శ్రేష్ఠుఁ డెయ్యది యాచరించు ననుసరించు
నద్దానిఁ దదితర మైన జనము
నదియుఁ గాక విప్రుఁ డానందకందమ్ము
ధార్మికుండు మోక్షధర్మ మొరఁల
కధిగతంబు సేయ నవతరించి ప్రతీప
కారి యగుట నమ్మఁగాఁ దగునొకో? 3

ఆప్తకాముఁడు పరమానందరూపుఁ డీ
శ్వరుఁడు దోష మంటఁ జాల దతని
నందు వేమొ? దేవతాధీశుఁ డట్లుండ
కేల విప్రభావ మెనసెనయ్య? ౪

మును పథిదేవుఁ డిప్పుడును బుట్టె మునీంద్రుల యింట బ్రాహ్మణుం
డనయము మద్యపానరతుఁడా? మదఘూర్ణితలోచనాంతుఁడా?
ప్రణదితమౌక్తికావలితవర్ష్మకుఁడా? కమనీయకామినీ
ప్రణయవశంవదాత్మహితవర్తనుఁడా? యిది బుద్ధమార్గమే? ౫

కరిణీవశంగతోన్మద
కరినిభమున వర్తనంబు గలవాని నిఁకే
కరణి నపరాగనిర్జిత
కరణు లనుసరించి యెఱుఁగఁ గలరు శమంబున్? ౬

వినయమ్మున విప్రశ్న
మ్మనక సమాధానపఱుపు మయ్యా! యని మ్రొ
క్కిన శిష్యునిఁ గనుఁగొని యనెఁ
దన మది నొచ్చియును వేదధర్ముఁడు కరుణన్. ౭

ద్యుచరమనుష్యఖేచరచతుష్పదజాతిగతిప్రకారభే
దచయ మటు ల్సదాచరణతత్పరు లౌ నరు లాచరించు బా
హ్యాచరితమానిదర్శితకులాశ్రమధర్మములందు లేవె? భే
దచితపథంబు లెన్నియొ? పృథక్పృథగాస్థితము లగున న్వినన్. ౮

అందును గొంద ఱిష్టపరమార్థసునిష్ఠ నివృత్తకాము లై
డెందము శుద్ధిఁ గోరుచుఁ గడింత్రు యథాంగబలంబు కర్మముల్
కొందఱు కామకాము లయి కోరి యజింతురు వేల్పులన్ యశం
బందును రాజ్యమందు ధనమందు సుతాదులయందు నర్థితోన్. ౯

వేదవాదప్రభేదనిర్వాదమోహి
తాత్మ లై యాచరింతు రా యా విధముల

నేవి యగునందు మవ్వాన నేవి కాని
వందు మం దేరు విజ్ఞులు నజ్ఞు లెవరు? ౧౦

గీ. వేదము ననువర్తించుట వీర లెల్ల
నిష్టులే నాకు నందువే నీశ్వరుండు
నింద్యము ననింద్యమును జేయు నిర్విలిప్తుఁ
డచ్ఛబోధైకవిగ్రహుం డై యనె శ్రుతి. ౧౧

ఉ. ఆయభవుండు లీల వివిధాంగముల న్ధరియించి యిచ్ఛతోఁ
జేయఁడు సేయుఁ గర్మముల సృష్టిముఖమ్ములఁ గాలయుక్తి నా
చాయకుఁ గర్మసంగ్రహము సజ్జనరక్షణదుష్టశిక్షణ
ప్రాయము నిర్ణయింతురు పురాణములం దెది దోస మాదెసన్? ౧౨

క. మాయికుఁ డగు నీశుఁడు తన
చేయు పనులు సిద్ధి నెనయఁ జేయు న్మాయా
స్థాయనోన్మహనవైఖరు
లా యా యెడఁ దోఁచెనో మది కది దోసముగన్? ౧౩

గీ. రాము తాటకాహననాదు లా మెయి యదు
నాథు బాలలీలలు జగన్నాథు రాక్ష
స వధవిధులును నీవు దోసమ్ము లనెదొ?
చాలుఁ జాలుఁ బురాణప్రసంగ మింక. ౧౪

చ. ఋతము ప్రవృత్తి యం చన నివృత్తి యనన్ ద్వివిధంబు కర్మ మా
నతు లిడు దాన దానికి ఘనంబు వివేకము నేసి వేద మే
యనె నొకసారి కర్త కు భయంబు విరుద్ధ మసాధ్య మంచు నెం
చినఁ బరమందు లే దనియుఁ జెప్ప దె దత్తుని కన్నె ము న్ననా! ౧౫

చ. యతమతు లెడ్డ నెవ్వనిపదాబ్జపరాగలవాప్తిఁ దృప్తులై
యతిశయయోగశక్తి విధుతాఖిలమాయికకర్మబంధులై
కృతకరణీయులై యిలఁ జరింతురొ స్వైరముగా? నిజేచ్ఛ నా
దృతకరణుం దథావిధు విధించునె శాస్త్రము? బంధ మున్నదే? ౧౬

గీ. సర్వజగదాత్మ యైన సాక్షాద్ధరి పరుఁ
డాంతరంగికుఁ డధ్యక్షుఁ డతఁ డొకండె
భూమి నోముఁగ విగ్రహముల గ్రహించు
నని వినవె? వాఁడె వీఁ డన నడ్డు గలదె? ౧౭

సీ. విజ్ఞానసన్నిధి విష్ణుఁడే సుమి వీఁడు
మునివిగ్రహము లీల నెనసినాఁడు
సజ్జనాభయదుఁ డై సంచరించుచు నుండె
భూతానుకంప యద్భుతము గాఁగ
నెదియేనిఁ గొనుట వహ్నికి నెట్లు దోసఁగు కా
దట్లె తేజస్సుల కన్యములకుఁ
గాన నీశ్వరులెడఁ గానంబడెడు సాహ
సములు ధర్మవ్యతిక్రమము లోలి
నిట్టి వెన్నఁడుఁ జేయరా దెడఁదనే న
నీశ్వరుఁ డెఱింగి యెఱుఁగక యేనిఁ జేసె
నా? వినాశమ్ము నెనయు, నంధకవిరోధి
గాక మఱొకండు బ్రదుకునే? గరళము దిని. ౧౮

గీ. అట్టివారల నుడులు తథ్యములు కొన్ని
కొన్ని యాచారములు ననుకూలము లవు
నందు స్వతపోన్విత మ్మవు నట్టిదాని
ధృతియుతు లెఱింగి తగ నాచరింపవలయు. ౧౯

గీ. మంచి సేయుటతో వచ్చు మంచి లేదు
లే దనర్థంబు విపరీతలింగగతుల
నేను నాయది యనుమాట లేని వారి,
కున్నవారికి నన్నియు నుండవలయు. ౨౦

గీ. దేవదానవనరపశుతిర్యగాది
సకలభూతచయప్రశాసకుఁ డవు నెవఁ

డట్టివానికి నీశితవ్యాంశమం ద
నవసరము కుశలాకుశలాన్వయంబు. ౨౧

చ. అశినుఁడ! దీపకుండ! భువనాశ్రయుఁ డీశ్వరుఁ డీతఁ డిచ్ఛమై
వశివపురాదృతుం డయినవాఁ డని నమ్మినవాఁడ వౌర! యీ
పశుమతిశిక్షితం బయిన ప్రశ్నముఁ జేయకు మింక నెన్నఁడుఁ
గుశలము లోకసంగ్రహముఁ గోరి యతండును నాచరించెడుఁ. ౨౨

సీ. సంధ్య నుపాసించు స్నానదానాదిక
మాచరించు నొకప్పు డతిచరించు
భిక్షకు నొకనాఁడు వెడలు నిరాహారుఁ
డై యుండు నొక్కనాఁ డాత్మనిష్ఠ
యోగరతుం డయి యుండు దుర్గమవన
సీమల గుహల వసించు నొకపు
డశ్వత్థముల నీడ నాశ్రమవాసుల
దరిని నొక్కొకసారి దవిలి మెలఁగు
నరుగు గ్రామమునుండి గ్రామాంతరమున
కగపడును రాజనగరుల నప్పుడపుడు
ధ్యాని మాని దిగంబరుం డౌ నొకతటి
దివ్యభూషాంబరుం డొకతేప యగును. ౨౩

గీ. గుఱ్ఱముల నెక్కు నెక్కును గుంజరముల
రథము లెక్కును బ్రవహణరాజి నెక్కు
సాధుజనమును గొనియాడు జగముఁ గర్మ
నిర్మితముఁ దిట్టుచుండు నెన్ను మఱొకపరి. ౨౪

సీ. అమరాంగనాయుక్తుఁ డై వీతరాగుఁ డై
మద్యమాంసాశి యై మహితశుద్ధ
సత్త్వసమాచారసంస్థితుఁ డై లింగ
పూజాపరుం డయి పూరుషోత్త

మారాధనాసక్తుఁ డై శాక్తనిష్ఠాప్తుఁ
డై గణేశార్చకుఁ డై సహస్ర
కరసమర్చామతిపరుఁడై చరించు వాఁ
డొక్కొక్కసారి యొకొక్కవిధమునఁ
గాశిలో నొక్కెడ శివలింగప్రతిష్ఠ
సేసి శివుఁ బార్వతీయుతు నాసఁ గొలుచు
చగ్రమున స్థాణువన్నిశ్చలాకృతిఁ గొని
యోగమార్గప్రవర్తకుఁ డుండుఁ జువ్వె. ౨౫

క. దత్తాత్రేయేశునకు న
నుత్తరమున భక్తజనుల నోముచు సంసా
రోత్తాలగదాహృతి ని
ర్వృత్తాదిగదాధరాఖ్యఁ నే నివసింతుర్. ౨౬

క. ఆయెడ నున్నది దత్తా
త్రేయోత్తమతీర్థ మందుఁ దీర్థ మ్మాడం
గా యోగసిద్ధి పనుపడుఁ
బాయు నఘం బది త్రిభువనపావన మనఘా! ౨౭

గీ. జ్ఞానదము మహాపుణ్యప్రసాద మై స
మర్చ్య మున్నది మఱి త్రిపురాంతక మన
దానికిం బడమట శుభదమ్ము గలదు
సంగతమ్ము దత్తాత్రేయలింగమూర్తి. ౨౮

క. అని కాశీమాహాత్మ్యము
ననుగీతం బయ్యె దత్తనాయకు మహిమం
బును దత్కృతలింగస్థా
పనమును సాక్ష్య మది వాని పావనత కనర్. ౨౯

సీ. మునులు సూతుని మున్న కొనియాడి దీవించి
యడిగిరి సంసరణామయమ్ము

వాఁగొట్టు మందు దేవుని విశదయశమ్ము
బాపురే యిది విన్న దీపకుండు
మరల నేమని గురువరునిఁ బ్రశ్నించెను
వేదధర్ముఁడు తపస్విప్రవరుఁడు
శిష్యుండు స్వగురుసంసేవాపరాయణుం
డనురక్తుఁడును భక్తుఁ డైన వాని
కాప్తి నేమేమి యుపదేశ మాచరించెఁ
జెప్పు మది యెల్ల నెమ్మది విప్పుకొనఁగ
ద్విజుల నటు లుంచు దత్తేశు దివ్యలీల
లన్యుల విశుద్ధులను జేయున యవలీల. ౩౦

క. సూతుఁడు మరల నను న్విన
యాతిథరానమ్రుఁ డగుచు న య్యాచార్యుం
డాత! పురాణశ్రుతులం
దాతతములు దత్తలీల లను మింక ననేఁ. ౩౧

కార్తవీర్యమహారాజు దత్తదేవుఁ గొలువ వచ్చుట

గీ. వేదధర్ముండు వకణించె వినుము వత్స!
సారమును సారమును సర్వశాస్త్రసమితి
నుండియు సముద్ధరించి సమున్నతంబు
దత్తదేవుమహాత్త్వమ్ముఁ దగఁ బలికెద. ౩౨

సీ. ఒకసారి సహ్యాసానూపరివిరచితా
వాసు సుఖాసీనుఁ బరమయోగి
గురు జగదుపకృతికరణాదృతుని విశ్వ
వంద్యపదాంభోజు వరదు నీశు
జ్ఞానవిజ్ఞానర్ధిసన్నిధి నెన్ననౌ
పౌరుషతను వంది పరులువాని

దర్శింపఁ దలఁచి తత్పర్వతాధిత్యకఁ
జేరి సహస్రాక్షు చెన్ను గొన్న
యల సహస్రకరుం డర్జునాభిధుండు
కార్తవీర్యుండు విజితసుక్షత్రియుండు
యోగివిభుఁడు ధనుర్ద్వితీయుం డపదరఁ
డరయఁ జొచ్చెను దరులఁ దత్తరుతలముల. 33

సీ. నారికేళవనంబు దాఁటి గైకొని పోయి
యామ్రాతకామ్రమమ్ము లనుసరించి
పోకతోటలు దాఁటి పున్నాగమందార
చందనాద్యంచితస్థలులు సొచ్చి
మాధవీమల్లికామంజులతాకీర్ణ
సుమవనమ్ముల మేలు చూచుచుఁ జని
కదలికాషండము ల్గడచి చెఱకుచేల
కలుముల కెలయుచుఁ గెలఁకు లరయు
చరగి కుముదోత్పలాబ్జకల్హారకలిత
హంసకారండవబకచక్రాభిశోభి
శీతలామృతమృష్టవిశిష్టవిమల
సరసికాంచలముల నేగెఁ జక్రవర్తి. 3౪

గీ. జాతిసంభవవైరము ల్సంత్యజించి
మునుల పోలిక నగు మృగములఁ గనుఁగొని
భ్రమరగీతమ్ము కోయిలపాట నెమ్మి
యాట కేకలతో విని యాగ కేగి. 3౫

గీ. బ్రాహ్మణప్రవరుల వేదవాదనాద
మేదురము లైన యాశ్రమ వేదు లెనసి
హోమధూమసమాకీర్ణహుతభుగాప్త
సంగతుల ఘ్రాణ మంగంబు సంమదింప. 3౬

చ. నెమకుచుఁ బోయి పోవుచుఁ గనెం గృతవీర్యభవుండు తద్గుహా
స్యమున నవప్రవాలవిలసద్వ్రతతీతతచూతపోతర
ద్యుమహితవేదికాతలమునందు సుఖాస్థితు మీలితాక్షు దే
వమునిసమర్చనీయు గురువల్లభు యోగసమాధిసాధితున్. ౩౭

గీ. చూచినంతన హృష్టుఁడై సుచిరకాల
మంగములు పులకింప నాస్యము వికాస
మెనయఁ దత్పాదపర్యంతమునఁ బడె నృపుఁ
డుదితభక్తిప్రసక్తి నయోన్నతుండు. ౩౮

క. కడువడిఁ బుడమిపయిం బడి
తడవని గురువరునిచాయఁ దడఁబడి కనుచున్
బడి లేచి చూచి మరలం
బడి దండముఁబోలె మాటిమాటికి మ్రొక్కెన్. ౩౯

శా. ప్రేమోద్భిన్నహృదంబుజాతుఁ డయి యాపృథ్వీశుఁ డాధ్యాని
ష్ఠాముద్రాంకితు సద్గురుం దలఁచి చే శస్త్రంబు లట్లుంచి వి
ద్యామేయుండు సహస్రబాహువుల వాద్యంబుల్ తగం బూని తా
నామధ్యాహ్నము నానిశీథమును గాయన్నృత్యదారంభుఁడై. ౪౦

క. భగవంతుని సేవించెను
జగదీశున కపుడు మానసము బహిరర్థో
పగతము గామి నెఱింగిన
జగతీశుఁడు సంస్తవమున సంస్తుతి సేసెన్. ౪౧

కార్తవీర్యుఁడు దత్తదేవుని స్తుతించుట

ఉ. పూర్ణుఁడ! నిత్యసత్యసుఖబోధమయాత్ముఁడ వైన నీయెడన్
వర్ణితమాయతో నొదవి వాస్తవ మట్లు స్ఫురించుచున్న ద
భ్యర్ణగతప్రపంచ మిది స్వప్నసమంబు జడంబు దుఃఖదం
బర్ణవమందు ఫేనమన నై నినుఁ గప్పి నిజాశ్రయంబునన్. ౪౨

మ. అతిసంలోల మలాతచక్ర మన దృష్టాదృష్ట మై మానస
వ్యతిభాతంబు విలాస మీసకలము న్భావింప విజ్ఞాన మే
కత శోభిల్లు వికల్ప మెల్ల గుణసంకల్పక్రమాయాత సం
సృతిసర్గప్రసృతంబు మాయికము భాసించు న్స్వభావంబునన్. ౪౩

చ. మది నిది యెల్ల నెమ్మది విమర్శ మొనర్చి మునుల్ మనోగత
త్రిదశ భవత్స్వమాయనె ప్రతీత యటంచు వినిశ్చయించి సం
మదకరరాగపాశ మనుమానసదు క్తినిశాతబోధసం
పదసి నిరాకరించిరి సమస్తగురు న్నిను జెంది రాదృతిన్. ౪౪

ఉ. ఆ నిను సర్వలోకగురు నచ్యుతు నప్రభవుం ద్రయీధిను వి
జ్ఞానదు నీ భవాంబునిధి సంతరణం బొనగూర్చువాని నీ
శాను నిరీశు మోక్షమున స క్తి నిజాశ్రితదుఃఖహారి! యె
న్నే నివిధంబుల స్మరణ మీవ యటంచు నమస్కరించెదన్. ౪౫

ఆ. అట్టు లగుట ని న్ననన్యసిద్ధు విబుద్ధు నిత్యముక్తు శుద్ధు సత్యరూపు
నింద్రియాసు దేహవ్యాతరూపుడ నగు నే నన్నివిధముల శర ణంటి దేవ!

గీ. తంతుసమవేత మైన వస్త్రమ్ము పోలె
బ్రోత మోతమ్ము నై విశ్వ మున్న దేవని
యందు సరవరు నట్టి నారాయణు నిను
సచ్చిదానందమయు నిదే శరణ మంటి. ౪౬

ఉ. కాలభుజంగదష్టము నిశాముభవాంబుధిసంనిపాత ము
త్త్రాలము క్షుద్రసౌఖ్యబహుతర్ష మిదంజన ముద్ధరింపుమా
జాల మిం కేల? ము క్తిదవచస్సలిలంబుల నింపుమా దయా
శీల! మహానుభావ! కృపసేయుము మ్రొక్కెద మాటిమాటికిన్.

గీ. ఎవ్వడు నీ యీహితము లెన్న యోజుంగ గలడు?
స్వీయమాయ జగంబు సృజించి నియమ
నం బొనర్చెద వనుచు నెన్న విని కర్మ
బద్ధు లై విమోహితు లగు వార లిందు. ౪౭

గీ. ఘోరసంసారమార్గసంచారవశత
నడరు తాపత్రయాభిహతాత్ముఁడ నగు
నాకుఁ గనరాద శరణ మన్య మమృతాయి
తమ్ము యుష్మత్పదాతపత్రమ్ముకన్న. ౫౦

మ. పరిశుద్ధంబు పురాణము న్విపులము న్వైరాగ్యవిజ్ఞానసం
భరితజ్ఞానముఁ జెప్పు మృగ్య మవు త్వద్భక్తిప్రయోగంబుతోఁ
బరమేశుండ! యకుంఠధాముఁడ! భవద్భవ్యావతారంబు మో
క్షరమాభ్యర్థికి యోగగుప్తికిని సుజ్ఞానంబు సెప్పంగదే. ౫౧

గీ. సంసరించు చనర్థసంచయవహ మవు
నొడలినుండి వీమోక్షంబు నొంద నెఱుఁగ
కున్న జనములు సుఖ మంది యుత్తరింప
నెన్ని లీలావతారంబు లెత్త వభవ! ౫౨

మ. నినుఁ గూటస్థు మహాత్ము నాదిపురుషు న్విశ్వేశు నిట్టిట్టి వాఁ
డని రూపింపఁగ లేము జాడ్యమతులమ్ హా వెంటనంటంగ నై
నను వేల్పు ల్భవదీయసత్త్వముఁ బ్రజేంద్రవ్రాతముల్ రాజసం
బును భూతాదికము ల్తమంబుఁ గొని సంభూతంబు లౌ నీశ్వరా! ౫౩

గీ. విభవ మొసఁగెదు లెస్సగా స్వభజమాను
లకు సకాముల కెఱుఁగ రల్ల నిజపదము
వారు నీపాదుకల నమ్మి ప్రణతు లైన
భక్తున కనశ్వర మ్మవు పదమ యిడెదు. ౫౪

చ. తను విది యేల? నాకు? వివిధప్రసవిత్రి ధరిత్రి యేల? యే
ల నగరగేహానందనకలత్రగజాశ్వముఖానుభోగసా
ధనధనము ల్స్వరాజ్యము పదంబు నిఁకేల? భవత్పదంబుఁ జెం
దనిమెడ మోసపోయి మును దర్పముతోఁ నివి యెల్ల వేఁడితిన్. ౫౫

ఉ. ఒక్కఁడె సత్య ముజ్జ్వల మహో విలసిల్లెడు ద్వైత మెల్ల న
మ్మక్క యసత్య మెంచ మది నైన భ్రమం బని సిద్ధు లంద్రు మా

కెక్కడ యద్ది మాయికమయేని జగం బిది యెట్టు లింత పెం
పెక్కె విభాతమయ్యె జగదీశ! ప్రపన్నున కింత దెల్పవే. ౫౬

ఉ. ఎంతటి శత్రుసంతతుల నెంచిన నాకు భయంబు లేదు. కా
లాంతకుచేతి దండమునకా? శిఖకా? జలవాయుశక్తికా?
క్రాంతి నెసంగు మిత్రకృతికా? భయ మందుట లేదు నీదయన్
సంతతసంసృతిభ్రమణచక్రము నెంచి తలంకెందం ప్రభూ! ౫౭

గీ. కాన నా మహాళి నీపాదకమలమందు
భృంగ మగుచుండె నిజసుఖశ్రీ రమింప
నన్మదాత్మ సముత్కంఠ నర్దయమాన
మై విభవ మెల్ల వదలి నిన్నండఁగోనెను. ౫౮

ఉ. అందఱకన్న నెక్కుఁడన నై మన నౌ నని కన్ను విచ్చి నీ
యొందిలి మాన్పు సత్కరుణ నొంది గ్రహించితి వై భవంబు మి
న్నందు గుణత్రయావిలమహాతపతాపవితప్తుఁ డై తి ని
ష్టిందుసహోదరా! యుడుపు మెమ్మెయినే నిజసూక్తరశ్మిలన్. ౫౯

ఉ. ఈ విషయాంధుసంపతన మీశా! భవచ్చరణారవిందసే
వావిముఖాత్ము లౌ నరులపాలిది నా కుచితంబె యింక? వి
శ్వావిత విశ్వధారకు ననంతు నవిశ్వుని విశ్వరూపు సం
భావితుఁ జేసినే ననఘ! పట్టితి నీ పదముం బరం బిటుల్. ౬౦

గీ. యోగరంధితకర్మలు యోగశోధి
త మగు హృదయమ్ము నందు యుక్తతము లెపుడు
యోగి యోగేశుఁ గనుఁగొనుచుందు రెలమి,
నట్టి నీకు నతుం డై తి నయ్యవారు! ౬౧

క. అసదింద్రియతర్పణమున
విసివితిఁ గదు బ్రహ్మమూర్తి! వృజినపయోధిం
బస తప్పి పడితి దానన్
బ్రసరింపు సముద్ధరింప బాహాబాడుపమున్. ౬౨

మ. అనలంభావమహానలమ్మునఁ బరీతాత్ముండ నైనాఁడ యూ
వనపుం గాల మసంఖ్య మేగె విషయాభ్యాసప్రయాసంబులన్
మనువే చెల్లెడు వేళ వచ్చిన సతృష్ణత్వంబునం బొంద దీ
మన మీనాఁటికిఁ జాలుఁ జాలు వినతు ల్మన్నింపు న న్నాతురున్. ౬౩

క. దితిసుతులు యాతుధానులు
పతత్త్రిలు మృగమ్ములు నరవర్గమ్ములు సం
సృతిసాగర మసుతరము
న్నుతారముగ నీదినారు సుజనసజనతన్. ౬౪

గీ. ఎంత కష్టము? లోకమం దే నొకఁడన
క్షత్రియాధముఁడను దుర్భగతకు నై తి
యోగిరాజపదాంభోజ మొంది కొలిచి
కూడ బంధంబు వాయని కొఱఁతఁ బడితి. ౬౫

గీ. అనఘ! మిథ్యావిలసితమ్ములందుఁ దవిలి
మహితసామ్రాజ్యసంపత్ప్రమత్తుఁడ నయి
రేపు రాఁబోవు నంతకుకోపు నెన్నఁ
జాలకుంటిన యిన్నినా ళ్లేల వగపు? ౬౬

గీ. త్వత్ప్రసాదా త్తరాజ్యసంపదనుభు క్తిఁ
దృప్తి నెనసితి నేఁటికి దివులు వోఁడమె
నీదు వచనామృతమ్మున నియతిఁ గొనక
శాంతి నెనయ నిఁ కెట్లని శమధురీణ! ౬౭

సీ. పారమేష్ఠ్యపదమ్మొ? పౌరందరశ్రీలొ?
పాతాలరాజ్యసంపత్క్రమములొ?
యోగసిద్ధులొ? దేవభోగసంప్రాప్తులొ?
యిడెద నన్నను మది కింప వింక
నటు లౌట మాయామయమ్ము హార్దము వాస
నారూఢ మగు వివిధామయమ్ము

మూలమ్ము నిప్పు డున్మూలింపు మీశా! స
దు క్తితీక్ష్ణాసి దయోదయమున
శుద్ధ విజ్ఞానఘను స్వేచ్ఛ సువిహితాఖి
లార్థ లీలాగృహీతరుక్మామలాంగు
నిను సదానందమూర్తి వందనము లొనరఁ
గొలిచెద నమోఘవాంఛితఫలుఁ బురాణు. ౭౮

క. నీ యీ యవతార మస
న్మాయామూఢ మ్మఘమున మహితభవత్ప
త్త్రోయజవిముఖ మ్మగు జన
మేయనువున నుద్ధరింపనేకద విభుఁడా! ౭౯

క. నీయంఘ్రిపద్మమధుమధు
పాయితమను లైన వారి భవదీయుల నీ
మాయాభవామయం బెటు
లాయాసముఁ బెట్టఁ జాలు నఖిలేశానా! ౮౦

చ. తపము సుతప్తమయ్యె మును దైవతశేఖర! తుల్యశీలతో
నపరిమితమ్ము గాఁగ భవదాప్తి కుతూహలి యైన యత్రిచే
నిపు డిదె యిచ్చుకొంటి నను నే నని యంత వరప్రదుండ వా
కృపకయి దత్తనామము ధరింపవె? మమ్ము సముద్ధరింపఁగన్. ౮౧

సీ. నామరూపములు వర్ణము దేహకర్మమ్ము
లెక్కడివి? నీకు నీశ్వరేశ!
సంసారసాగరస్థము జనము సముద్ధ
రింపఁగా లీల శరీరి వైతి
త్వత్పాదజలజబంభరమతి నగు నన్నుఁ
గన్నుదామర లెత్తి కనుఁగొను మిఁకఁ
బరమకారుణికేశ! ప్రమదమ్ము నొందింపు
నీదుపాదముకన్న లేదు శరణ

మాత్మభక్తి మగ్ను నద్దరిఁ జేర్పుము
ద్రొక్కు లిడుదు నీకుఁ బురుషవరుఁడ!
పుండరీకనయన! దండనమస్కృతు
లాచరింతు నన్ను నాదరింపు. ౨౨

సీ. నమనము ల్విశ్వవంద్యపదాంబుజాతుండ!
వాసుదేవుండ! నావందనములు
సంకర్షణుండ! సంస్తవములు ప్రద్యుమ్న!
నతు లనిరుద్ధ! ప్రణామశతము
లబ్ధిశాయీ! జోత లధ్యక్షు! వినతు లం
జలులు వాఙ్మనసవిచారదూర!
యాధులు వ్యాధులు నను నహా ల్గలఁచెడు
గరుడవాహన! దివ్యకరుణఁ జూడు
మనుచు మాహిమ్నతీశుఁ డి ట్లభినుతించి
విభుదయాదృష్టి తనమీఁద వెలయకునికి
గ్లానబుద్ధియు ఖిన్నహృత్కమలుఁ డగుచు
నూరకుండె నొకింతసే పుడిగి మడఁగి. ౨౩

క. అని గురుఁ డన దీపకుఁ డపు
డనంతపతి యేమి సేసె నవబుద్ధుం డై
యనుకంపం దిలకించెనె
యనుగతుఁ? ముద మొదవ నమ్మహాత్ముం డనుడున్. ౨౪

గీ. భాగ్యవంతుఁడ! వత్స! సర్వమ్ము వినుము
దేని విన భవవేదన దివ్వదు నరు
నట్లు భక్తి విభుం గొనియాడి యాడి
యుర్విభుఁ డవాగ్వదనుఁ డై యుండ నుండ. ౨౫

## దత్త దేవుని దినచర్య

ఉ. వచ్చిరి సిద్ధపుంగవులు పల్వురు వేఁగఁగ జాము గల్గు రే
చొచ్చిరి వ్యోమయానమున సూరెల నిల్పి తదగ్రభూమి న
భ్యచ్చితభక్తి దోర్యుగము నొక్కటి సేసి నమో జయప్రభో!
సచ్చిదనంతరూప! యని సాగిలి మ్రొక్కిరి దిగ్గిగాగతుల్. ౨౬

క. సన్నుతు లొనరించుచు హ్యా
హ్యన్నయనులు వారు పార్థివాన్వితుఁ గని య
న్నన్న సమయమ్ము కా దని
మిన్నక వచ్చినపథమున మిన్నంది చనన్. ౨౭

క. కొందఱు సహ్యాద్రిగుహా
మందిరు లం దందు నుండు మానులు యోగుల్
కొందఱు గొందఱు దివ్యులు
వందలు వే లనఁగరాక వరివస్యకు నై. ౨౮

క. వచ్చెదు వారలు ముదమున
హెచ్చెదు వారలు ప్రణతుల నెఱిఁగించెదు వా
రచ్చపు బత్తి నెసఁగు వా
రచ్చటునన్ నిండిరి నిమిషార్థములోనన్. ౨౯

క. గోవింద! విధృత! మాధవ! భావాతీతా! జయ జయ పరమపురుష! దే
వా! విశ్వదృశ్వనయనా! భావితమహితాత్రిగోత్ర! పాలింపు మమున్.

క. అని కొనియాడుచు మ్రొక్కుచు
మనుజేంద్రుని మనసుతోడి మన్ననఁ గొనుచుం
బనివిని రందఱు నొయ్యన
ఘన మగు నానంద మంగళమ్ములఁ దోఁపన్. ౩౦

గీ. అంతలో విప్రవరులు నా ల్గాశ్రమముల
వారు సహ్యాద్రినిలయులు ప్రకటధర్మ

పరులు భక్తిసగద్గదభాషు లగుచు
వచ్చి దర్శించి వోయి రావలివిధులకు. ౮౨

గీ. అప్పుడు సమాధి వదలి వీరాసనమ్ము
విడిచి పరతెంచుచుండఁ బ్రాగ్వీథియందు
సంజకెంజాయ యించుక జాదుకొనియె
విభునిసమయంబు వేఁచె రవియు నొకింత. ౮౩

సీ. శాంతతపుని పేరి సంయమి యందించు
నంబుమృదాది బాహ్యవిధిఁ దీర్చి
సత్యవాఙ్మని యిచ్చు జలదంతకాష్ఠము
గ్గొని మఱి దంతధావన మొనర్చి
గుణనిధి కొనివచ్చు గోమయభస్మమ్ము
త్కృశములతోడ స్నాతుఁ డయి వార్చి
వేదవిదుఁ డొసంగు వివిధవల్కలములఁ
గటి మండలాంసకూకటులఁ దార్చి
బ్రహ్మయజ్ఞమ్ముతోడ దేవమునిపితృను
తర్పణము లాచరించి యుద్యద్రవిమహ
మెంచి నిలిచి యుపస్థాన మొనఁగఁజేసి
యాహ్నికము నెరవేర్చి భైక్షార్థ మరిగె. ౮౪

మ. చని కోలాపురియందు లచ్చి యిడు భైక్షుం బట్లు భక్షించి చ
య్యన వేంచేసి నిజాసనాంతమున సౌఖ్యాసీనుఁడై యోగివం
ద్యునిచుట్టు న్నువి ముక్తకిల్బిషులు మానుఁ బ్రొమ్మికి కొల్వుండఁ దా
ను నతు ల్సేసి నృపాలుఁ డంతికమున న్గూర్చుండె భీఁ జూచుచున్. ౮౫

ఉ. అప్పుడు చెప్పె శాంతతపుఁ డాదర మొప్పఁగ మ్రొక్కి దేవ! నీ
కెప్పుడు భక్తుఁ డీ నృపతి యేలొకో? యిప్పుడు ఖిన్నుఁ డయ్యె నీ
యొప్పెడు ధర్మపాలు మది నొప్పరికింపక వాంఛితమ్ములం
దెప్పునఁ గూర్చి పంపుము విధి స్నురుమూర్తి! యటంచు మంచిగన్.

చ. అది విని దత్తదేవుఁడు దయామతి నాతనిఁ జూచి పుత్త్రికా!
మదిఁ జొరనీకు ఖేదము శ్రమంపడితే? యిటు రా క్షణమ్ము నా
యెదుట నుపావిశింపుము మహీన! శమం బెసయంగలాఁడ వ
న్నఁ దటిసి మ్రొక్కి సంతసమునం దయివారు నృపాలుతో నను. ౮౭

సీ. అవనీశ! యేమేమొ? యడుగఁ దలఁచె దేల
మత్పరాయణు నిన్ను మది నెఱుఁగనె?
యత్కామనుఁడవొ? యదర్థివో? నీ వెది
యడుగ నుంటివో? దాని ననెద వింకె?
యనుటయు కాకుండ నవి యెల్ల నిడుదు నీ
కీయరానిది యించుకేని గలదె?
జ్ఞాన మేనియుఁ బరమానందలక్షణ
శ్రేయమేని దురాపమా? యరయఁగ
నాదు భక్తుఁడ వగు నీకు లేదు కొఱఁత
యైన నెదియేని ననెదవా? యను మిన! యవి
శంక నను లోకనాయకుచరణసరసి
జములఁ గైకొని భక్తి రాజవరుఁ డడిగె. ౮౮

దత్తదేవకార్తవీర్యసంవాదము

క. సదసద్వ్యక్తావ్యక్తం
బిది సర్వము బ్రహ్మ మేకమే వాఙ్మనసా
పదము పరము నిత్యం బ
య్యది నీవ యటండ్రు మౌను లవ్యయభావా! ౮౯

సీ. వేదాంతవాదులు వేదవాక్యములతో
స్మృతిపురాణాదుల మేళవించి
రజ్జుభుజగ శుక్తిరౌప్యాది విభ్రాంతి
విధమున భాసించు వితథముగను

విశ్వ మనిత్యమ్ము నశ్వర మిది మాయి
కము సత్యమున నని రమలబోధు
లందురు మఱి కొంద ఱగపడు నెట్లు మి
థ్యాభూతమేని? సంతతము గాఁగ
నరయ బోధమ్ము గూడ లక్ష్యము గాద
యాది లేమిఁ బ్రవాహ మియ్యది యన వలె
ననుచు శ్రుతివాక్యముల దీనియందుఁ గూడ
పొరిది యోజించుచున్నారు సూరివరులె. ౯౦

గీ. ధర్మతత్త్వవిచక్షణు ల్ధర్మమె పర
మనిరి వారుఁ బ్రపంచసత్యత్వవాదు
లదియె వేదార్థనిర్ణయ మ్మని సమన్వ
యించుచున్నారు పండితులే తలంప. ౯౧

చ. పురుషు నిమిత్తమాత్రముగఁ బొంది ప్రధానము సేయు నిజ్జగం
బరుదుగ నంద్రు సాంఖ్యులు మహాధిషణు ల్ద్వివిధాత్మసత్యతా
స్ఫురణమె తన్మతోదితము పూరుషుఁ డన్యుఁడు గూడ నుండు నం
దురు హఠయోగు లమ్మతముఁ దుల్యమ తక్కిన వెంట దానితోఁ. ౯౨

ఉ. వేదపథానువర్తులు ప్రవీణులు తార్కికు లెన్ని యన్న ని
ర్వాదమె నిత్య మీ జగము ప్రత్యయ మంచు వచించి రిట్లు బ
హ్వాదృత మి మ్మతమ్ము క్షణికాదులు కొందఱు కా దటన్న న
వ్వేదవిరోధు లిందు నెది విశ్వసనీయము మాకు ముక్తికిఁ? ౯౩

చ. జను లెది యాచరించి యవిచాలితు లై యనుతాప మందకే
మనెదరో? నిశ్చయించి యొకమాట శ్రుతిస్మృతిసమ్మతమ్ము నీ
వనుము మహాత్మ! యేది గొన నై భవదీయవిధేయుఁ డాదిమ
ధ్యనిధనహీన మైన పద మవ్యయ మందు ననంశయమ్ముగఁ? ౯౪

సీ. అధ్వపారం బంద నైరి భవత్పదా
శ్రితు లీశ! యిది యేటి చింత నాకు?

నేదియే నొకయుక్తి నెంచి భవాంబుధి
పారంబు నెనయింపు భక్తు నన్నుఁ
బరమేశ్వరా! వినవలె నింక నొక్కటి
నీ నోటిమాటతో నిఖిలవంద్య!
సర్వసమాచారసన్నిధి నాచార
సంప్రవర్తకు నిను జను లనియెద
రితరు లాచారహీను బహిర్ముఖునిఁగ
నందు రిం దెదో? నీతత్త్వ మరయలేరు
పండితంమన్యు లగు మూర్ఖు లుండనిమ్ము
నేనుఁ జూచితి నటు నిటు నీప్రసక్తి. ౯౫

క. ఆచారముచే లభ్య మ
నాచారముతో నశించు నదియును నేదీ?
యాచార్య! నీకు నీశున
కాచితకామున కసంగుఁ డగు వాని కిలన్. ౯౬

గీ. బ్రహ్మముఖ్యులు నింద్రచంద్రరవివాయు
పావకాదులు భృగ్వాదివశివరులును
సప్రజాపతు లీ నిను సర్వసాక్షి
నాత్మ ధ్యానింతురే పరమాత్ముఁడ వని. ౯౭

గీ. అట్టి నీ వరవిందాక్ష! హరివ కావె?
భావ మెట్టిదియో దృఢవ్రతుఁడ వగుచు
ధ్యానశీలుఁడ వై యుందు దలఁప నీకు
ధ్యేయ మెది? లక్ష్య మెది? నాకు నేర్పరింపు. ౯౮

చ. అపహతకంటకం బగు మహత్తరరాజ్యము నీప్రసత్తితో
నుపగతమయ్యె సర్వ యవు నుర్వి స్వశాసన మాఁదలం గొనెన్
గృపఁ గొసరంగ నై రమరులే యరు లంచును లేరు కాల్చెదం
గుపితుఁ గృతాంతునే నగుణగోచర! కాదు మనంబు శాంతికిన్. ౯౯

చ. అమరసమాశ్రయుండ వగునట్టి నినుం గురుఁ గొల్చి మోక్షమా
ర్గముఁ గొనకుండ నెట్లు కృతిఁ గాఁగల? నార్య! మఱొండువాసనల్
స్వమనమునం బొసంగవు భవమ్మున శిష్టము లిష్టపూర్తిఁ జే
యుము తగు దీవ దానికి దయోజ్జ్వల! మ్రొక్కెద మాటిమాటికిన్

క. అను నృపు విజ్ఞాపనమును
విని పరమాత్ముండు లోకవిభుఁ డిట్లనియెన్
మునిముఖ్యులు వినుచుండఁగ
ననుమానము మాని విభుఁడు నానుచుండన్. ౧౦౧

శా. రాజా! నీ దగు విన్నపంబు మతముం బ్రశ్నంబు నామర్షణం
బోజం జేసిన సంస్తవంబుఁ గొనియె యున్నాఁడ దివ్యేక్షణ
శ్రీఁ జెప్పంగలవాఁడ ఖేదమును వర్జింపంగ నై విన్మ ని
ర్వ్యాజోక్తం బిది యెల్ల మోక్ష మిడుదున్ ద్వన్నిష్ఠుతం బొందితిన్.

శా. నాభక్తుండవు నీకు లోకమున నెన్న స్దుర్లభం బున్న దే?
శోభావంతుఁడ! వర్ణితం బయిన నీస్తోత్రంబు నే మెచ్చితిన్
నాభావంబున గుప్త మైన దిది ము న్భాసింపఁగాఁ జేసితిన్
నాభక్తుండవు నీముఖంబున ననంతప్రీతి లోకార్థ మై. ౧౦౩

క. ప్రాతఃపారాయణ మిది నాతులు పూరుషు లొనర్చి నాప్రీతికి నై
యేతత్తల్లోకమ్ములఖ్యాతికి నై మోక్షకలన కగుదురు తుదికిన్. ౧౦౪

గీ. శాస్త్రవిప్రతిపత్తి విషయమున మతి
మంతుఁడా! నీవు పలికిన మాట నభ్య
మమతికృత మని యెఱుఁగుదు నదియ ముందు
తేటపఱిచెద నుడుల సందియము దీఱ, ౧౦౫

క. సందేశించెద మోక్షవి
ధిం దరువాత నిపు డిది మదిం జొనుపు మినా!
సందిగ్ధచిత్తునకు నె
న్నం దగు నుపదేశ మెక్కునా యెంతేనిన్? ౧౦౬

శాస్త్రము లెల్ల మోక్షసాధనము లనుట

సీ. ఈవిషయంబుననే నీకు గాథ స
　　　　ప్తోదాహరణయుత నుచ్చరింతు
శుక్రసురాచార్యసంవాద మది విను
　　　　దా నెదో మది నుచథ్యానుజుండు
గైకొని కల్పించెఁ గామకలాయుక్త
　　　　దండనీత్యాదిశాస్త్రములఁ గామ
శాస్త్రమ్ము సౌగతశాస్త్రమ్ము శిల్పశా
　　　　స్త్రముఁ జదివించె సచ్ఛాత్రులఁ గొని
　　సురవిభుఁడు సూచి గురునిల్లు సొచ్చి మ్రొక్కి-
　　మాటిమాటికిఁ బ్రణయసమ్మాననకయి
　　చేసి విన్నప మాతని సెలవుఁ గాంచి
　　భక్తి నతుఁ డయి మరల నిప్పాటఁ బలికె. ౧౦౭

గీ. ఆత్మతత్త్వవిచక్షణుఁడా! సదయుఁడ!
　లౌకికులువోలె నెట్టు లీలాగుఁ గొంటి
　విట్టి శాస్త్రము లతత్త్వబహిర్ముఖములు
　విషయమోహాదములు గూర్చు వెరవు మేలె? ౧౦౮

గీ. ప్రాణులకు రక్తి విషయాత్మభావ మెపుడు
　పుట్టువునఁ బ్రాప్త మైనదివో విబుధుఁడు
　శాస్త్ర మిట్టిది వొనరించి నలుపు నెవని
　కెట్టి బోధమ్మ నింతకు నింత యేల? ౧౦౯

ఆ. అట్టి శాస్త్రకర్త యంధునిఁ గూపంబు
　నందు వైచినతని యట్టు లేమి
　ఫలము సంతరించు వచియింపు మే వినఁ
　దగుదునేనిఁ దగవు దాన నున్న. ౧౧౦

క. అని యడిగిన వాచస్పతి
వినవేడుక వొడమినయెడ విను మమరపతీ!
యని యనఁ దొడఁగెను శాస్త్రము
లనుతత్త్వము తెన్ను నెన్ను నన్నియు నోలిన్. ౧౧౧

క. ఈదృశమ యిది యన న
ప్తోదాహరణముల ననెద నూహించి పథం
బో? దారి కాదొ? నీ వను
మోదట మాటలఁ బనేమి? యజ్ఞాంశార్థీ! ౧౧౨

సీ. కాంపిల్యపురమునఁ గలఁ డొక పనివాఁడు
శాంతుండు దాంతుండు స్వవిధు తెఱుఁగు
పేరు విధిజ్ఞుండు భిత్తినిర్మితులతోఁ
దుల లేని ధనధాన్యముల గడించె
నిండ్లు గట్టించువా రెల్ల నవ్వాని న
కోరి తెచ్చెదరు పెక్కుతిథు లయిన
వాని ననుసరించి వర్తింతు రనిధిజ్ఞు
లతఁడు సెప్పినఁ జేయు నతిదరిద్రు
లల్పవేతనములవార లన్యు లధిక
ధని వినయశీలుఁ డతఁడు శ్రాద్ధముల దేవ
పూజలను దానముల నిత్యపుణ్యుఁ డగుచు
సర్వజనహృదయంగమచరితుఁ డయ్యె. ౧౧౩

మ. ధనవన్మాన్యుఁడు మంత్రిమాన్యుఁడు వొరిం దద్రాజమాన్యుండు నై
యనుదేశాంతరరాజపూజితుఁడు విద్యాశాలి ధర్మాత్ముఁ డై
చని నాకమ్మున భోగము ల్సుచిర మాస్వాదించి యా యూరియం
ద నృపాలుం డయి ధర్మతత్పరత రాజ్యం బేలె నాతం డటన్. ౧౧౪

గీ. జన్నములు సేసె దానము ల్సలిపె హరి భ
జించె దేవాలయారామశిశిరజలత

టాకవాపీముఖమ్ముల ననువుపఱిచె
స్వర్గమున కేగ మఱి వచ్చె సద్ద్విజుఁ డయి. ౧౧౫

క. వేదమ్ములు శాస్త్రమ్ములు
వేదాంతము లెఱిఁగి ధ్యానవిధికై యోగం
బూఁది మఱి సన్యసించి స
మాదరమున నున్న తత్త్వ మరసి సరసుఁ డై. ౧౧౬

గీ. ఆతఁ డాత్మపరోక్షత్వ మనుభవించి
యంతతోడ జీవన్ముక్తుఁ డై చరించి
యావల విదేహకైవల్య మవధరించె
శిల్పశాస్త్రకృతాభ్యాససిద్ధి కలిమి. ౧౧౭

క. ఈ కథ వినఁ బురుహూతుఁడ!
నీ కెది మదిఁ దోఁచె? శాస్త్రనిష్ఠాప్తి మనీ
షాకరమో! కాదో? సువి
వేకింపుము మఱొకమాట వినుము వినిచెదన్. ౧౧౮

## విశాలాక్షు చరితము

సీ. కామశాస్త్రపరుండు కలఁడు మాహిష్మతి
నతఁడు విశాలాక్షుఁ డనఁ బ్రథితుఁడు
స్త్రీలాక్షణికుఁడు పత్ని నరుచి గర్హించి
కన్యార్థి యై యెల్లకడలఁ దిరిగ
గీతవాదిత్రనృత్యాతతకవితావి
శాలకలావిదుం డా లలితుఁడు
నొకపురి నొకరాజునొద్దకుఁ జని యనె
నేను స్త్రీలక్షణజ్ఞాని ననుచు
నతనిఁ గొంపోయి నృపతి సర్వాంగసుంద
రిని దనూజాత లావణ్యఖని సులక్ష

ణాఢ్యుఁ గాన్పించె నవరోధమందుఁ దత్ప
రీక్ష కని కని వాఁడు మూర్ఛిల్లె నపుడ. ౧౧౯

ఉ. రాగము నొందె వానిఁ గని రాజతనూజయుఁ దద్విభావనం
దోగి విధానవేత్త మహిధూర్వహుఁ డిచ్చెను గన్నె నిచ్చె భూ
భాగము నిచ్చె మందిరము బహ్వమలార్థము లిచ్చె నిచ్చె ను
ద్యోగము ని ట్లభీష్టశుభ మొంది రమించె నతం డతంద్రుఁ డై. ౧౨౦

గీ. కామశాస్త్రానుసారి సుఖం బతఁ డెది
యనుభవించెనొ? యది వజ్రికైన లేదు
చక్రవర్తిసుఖమ్ము వాచ్యమ్ము కాదు
బ్రహ్మయింటనె సున్న తత్పరమసుఖము. ౧౨౧

గీ. ఆత్మరూపు సుఖమ్ము యన్యమ్ము లేదు
సుఖముకన్న నుపేయమ్ము శ్రుతిమత మిది
యేకమాత్రోపజీవు లీ యెల్లజీవు
లాత్మసుఖరూపమం దని యనదె శ్రుతియు? ౧౨౨

ఆ. అదియుఁ గాక వినవె? యానందమీమాంస
చక్రవర్తి మొదలు సరసిజభవు
నంతదాఁకఁ గలుగు నానందములు పెక్కు
లవి యకామునకు సహజము లనదె? ౧౨౩

క. ఈ యాత్మకు సుఖ మాకృతి
కాయ మఖిలతృడుపరతి యఖండము నిత్యం
బౌ యానందమె పుణ్యుల
కాయత మయి తోఁచు వృత్తి నధిరూపంబై. ౧౨౪

ఉ. ఈవిషయం బెఱుంగక బహిష్ఠము సౌఖ్య మటందు రజ్ఞు లీ
భావనఁ బండితోత్తములు ప్రాణికి వేనికి నేని సంతసం
బే వెరవైనది నైన నెనయించుట యీశ్వరపూజనం బటం
చావిధి కాదు రెండు విషయం బెడయ న్సుఖ మేక మే కదే. ౧౨౫

శా. స్త్రీరత్నంబు లభింప నిమ్మెయిని శాస్త్రీయప్రచారుండు వి
స్తారార్థంబుగ ధర్మకామములఁ దత్త్వేశలం జెందె నె
ప్డారంభింపఁడు పాప మల్పమును బుణ్యం బింత పోనీఁడు దుః
ఖారబ్ధం బనుభూతము న్స్మృతము గా దవ్వాని జన్మమ్మునన్. ౧౨౭

క. ఈకరణి న్గాంధర్వవి
వేకజ్ఞుఁ డతండు చిత్రవేదినితోఁ దా
నాఁకఁగొనె న్విషయముల య
థాకాలం బనుభవము యథారుచిగ నిలన్. ౧౨౮

గీ. నాదవేత్త ద్విజుండు గాంధర్వకామ
శాస్త్రసంలబ్ధపుణ్యావశమున నొకపు
డతివతోఁ గూడ గంధర్వపతిగఁ బొడమె
నగ్గలం బగు సుఖ మందు ననుభవించె. ౧౨౯

ఉ. ఆస నొకప్డు డాతఁడు ప్రియాంగనతోఁ జని చేరి కాంచి కై
లాసమునందు శంకరు విలాసవతీయుతు పంస్తవించి యు
ల్లాసమున న్సుఖస్వరహితాలపనం బవు పాట పాడ మె
ప్పై ప్రసకలేశుఁ డూఁచె శిర మాదట బల్కెను సుప్రసన్నుఁడై.

ఉ. చక్కని శిక్ష నీది సురసత్తమ! యెప్డు వినంగలేద నే
నెక్కడ నిట్టి పాట యిటు నింతకుమున్ను బళే సెబాసు నీ
వొక్కఁడవే కృతార్థుఁడ వహో కడు ధన్యుఁడ వీ మదాజ్ఞతో
నెక్కుము నాకమందు నుతి కెక్కి చరింపుము నీకు భద్రమౌ. ౧౩౦

క. అను వరదాత సదాశివు ననవరతము కొలిచి మఱి తదాజ్ఞ విమానం
బనుసూర్యవిభం బెనసి చనెను బత్నీసహితుఁడై వినిచె దేవవిభున్.

క. అది విని నందనముఖసంమదకరదేశముల దేవమానితుఁడై య
మ్మదవతితోఁ గ్రీడింపఁగ సదయుం డై యాన సేసె శక్రుం డంతన్.

సీ. మఱియొకప్డు బ్రహ్మ సమాజమ్ము గల్పించె
వేల్పుల మునుల రావించి వేడ్క

నాహూహూతుఁ డై యతఁ డాలితో నటవోయెఁ
బురుహూహూతుఁ డాదరమునఁ గొనిచన
నాటలఁ బాటల నజు నలరింప గం
ధర్వ లచ్చరలు వాద్యములు మొరయ
మెలఁగుచో సురరాజు కలికిచూపునఁ బ్రచో
దన మొనరించె న య్యనఘు నోలి
వాఁడు కరసంజ్ఞ నందఱ వరుస నాగి
తాను తన సతి గానతత్పరతఁ బూని
దర్శనమ్ము చింతాకంత తప్పకుండ
వివిధరాగాలి రంజించె విధి మనమ్ము. ౧౩౩

చ. మనమున సంతసించిన సుమాళమునన్ జగదేకధాత వా
ని నతిసమాదరంబునఁ గనెన్ నిను నొక్కని నాదవేదసం
పనితరసప్రసంగపరవంతునిఁ గాఁ గనుగొంటి నం చనెన్
నను విడనాడకుండు మిట నందన! చూచితె? నా ముదశ్రువుల్. ౧౩౪

క. శ్రుతిగోచర మవు బ్రహ్మము
ప్రతిభాసింప నుపదేశవంతు నొనర్తున్
మతిమంతుఁడ! యని పిలిచి ని
యతునకు నద్వైతభావ మాదేశించెన్. ౧౩౫

మ. కృతకృత్యుం డయినాఁడు వాఁ డిటుల వాగీశప్రసాదమ్మునన్
శతమన్యుండ! గ్రహించినాఁడవు గదా శాస్త్రం బెదే నిమ్మెయిన్
ధృతియుక్తుండు తరింపఁ గారణము గా నీ నెమ్మదిం బట్టెనే?
వ్యతిరిక్తం బన హేతు వున్న ననుమా? యాలింపుమా యిక్కథన్.

## దత్తదేవుఁడు వేదశర్మ ననుగ్రహించుట

సీ. వేదశర్మ యనంగ విశ్రుతుం డొకవిప్రుఁ
డుండె విశాలాపురోపకంఠ

మందు వానికి నొక్కఁ డాత్మజుం డాతని
చేసిన కర్మంబు చెయిది నేడు
బ్రహ్మగ్రహంబులు పట్టి బాధించెడు
దుష్టభావమ్ములు దుర్ధరమ్ము
లన్యోన్యవివిధవద్వైషులు నవ్వించు
నేడ్పించు నాడించు నెందుఁ ద్రిప్పఁ
దత్సమావిష్టుఁ డా ద్విజతనయుఁ డెటుఁగఁ
డెందు భక్ష్యం బభక్ష్యంబు నెదియొ చేయుఁ
దత్సముద్ధరణార్థయత్నములు పెక్కు
లాచరించియు ఫల మొనయండ తండ్రి. ౧౩౭

గీ. శీల మేమయ్యెనయ్య సుశీల! కొడుక!
యేమి సేసిన లాభింప దేమి? యనుచు
ఖన్నుఁ డై వేదశర్మ వీక్షించుచుండు
నంత నొకనాఁటి వైశ్వదేవాంతమందు. ౧౩౮

గీ. అతిథి విచ్చేసె దుర్వాసు నన్న యనఁగఁ
బూసినాఁ డెల్లయంగము ల్బూదెపూఁత
ముసరుచున్నవి యీఁగలు మ్రోఁత లడర
నట్టి దుర్గంధు మలిను భిక్షార్థిఁ జూచి. ౧౩౯

గీ. దేవతాబుద్ధి న య్యతిథిప్రియుండు
స్వీయధర్మం బనుసరించి వివిధపూజ
లాచరించె సమర్పించె నన్నభిక్ష
లాత్మ నెంచె దత్తాత్రేయుఁడా? యటంచు. ౧౪౦

ఉ. ధన్యుఁడఁ గేవలాతిథివిధానమ యేనియు, దత్తదేవుఁడా?
ధన్యతరుండ, నిప్పరి నతం డెపుడుం దగ భిక్షసేయు నా
మాన్యత యింతలా? గురుని మాలిమి కైన నటంచు విప్రమూ
ర్ధన్యుఁడు వెంటనంటె నతితత్పరుఁ డై యతఁ డెందువోయినన్.

ఉ. కట్టెలు పిట్ట లిట్టికలు కత్తులు జా లెవి చేతి కందినన్
గొట్టెను వట్టి మీఁది కెగఁగొట్టెను దిట్టె ని ఱెంత సేసినన్
గట్టిగఁ బట్టు పట్టి తినుఁ గా దని పోని ద్విజేంద్రుఁ జూచి యా
దిట్ట స్మృతి క్షరంబుమృతదేహముమాంసముఁ గోసి యిచ్చినన్.

చ. అదియు మహాప్రసాద మని యందెను గన్నుల నద్దె మ్రొక్కె నె
మ్మది నిదె త్రోవ యంచు గరిమమ్మున వెన్నడి తెన్నుఁబట్టె నా
పద సుఖ మంచు నెంచి తనుఁ బాయని పాఱుని నీసడించి కొం
డదరి దరి న్నివిష్టుఁ డయి డంబు విడంబన ద్రోవ నిట్లనున్. ౧౪౩

ఉ. ఏటికి వచ్చినాఁడ విటు లెయ్యది కార్యము పిచ్చివానితో
మోటగు వానితోడ మొగ మోట మెఱుంగనివానితో నన్
మాటికి మాటికి న్నతు లొనర్చుచు బిడ్డనిగోడు సెప్పె న
ప్పాటనె యేడ్చు విప్రుఁ గని పాలకుఁడుం గృప ద్రోవ నాప్తుఁడై.

ఉ. ఏడు సబీజమంత్రముల నిచ్చెదఁ గైకొనుమయ్య! సూనుపై
నేడు గ్రహంబు లున్నవి యహింస్యము లయ్యెవి బమ్మరక్కసుల్
నేఁ డొకఁ డొండు రేపు నిటు నెమ్మది నొక్కొక మంత్రయుక్తి న
య్యేడుఁ గ్రమంబుతో విడిచి యేగెడు నట్లొనరింపు మంచితా!

మ. ఎదియున్ లేని విమూఢుఁ దెచ్చి లిపి కా యీ ముఖ్యవర్ణంబులన్
మొదల న్నేర్పి పదంబు వాక్య మనుచుం బోధించి మీమాంసఁ గ
ర్మదశ న్సాంఖ్యమున న్మరల్చి దృఢతం బ్రాపించి యోగంబు సం
పద నద్వైతవిబుద్ధభావమున సర్వజ్ఞుం గురు ల్సేయరే? ౧౪౬

సీ. ఆభ్యంతరములు బాహ్యము లవిద్యావృత్తు
లిరుదెఱంగుల నుండు నెన్నియేని
శాస్త్రప్రవృత్తుల నమయింపవలె వాని
నవియు నడంగు వేదాంతబోధ
మున ననుభూతి సమూల మజ్ఞానంబు
విధ్వస్త మా నట్టివిథము చూవె

బ్రహ్మాగ్రహములు సంబరము మైనున్నవి
యేకసాధ్యములు గా వెన్నఁడేని
నా వచించినరీతి మంత్రముల వరుస
తోఁ బ్రయోగింపు మవి వీడి తొలఁగు నన్న
దత్తదేవు నుతించి ప్రదక్షిణించి
మాటిమాటికి మ్రొక్కి బ్రాహ్మణుఁ డరుగుచు. ౧౪౭

క. వాఁ డట్లు కోసి యిచ్చిన
గాడిదశవమందు మాంసఖండము దారిం
జూడంగ రక్తపుష్పము
పోఁడిమిఁ గన్పట్టె న్రబమున మునుఁగంగన్. ౧౪౮

ఉ. దేవుఁడు సెప్పినట్లు వసతిం జొరఁబోటి సుతుంగుఱించి భూ
దేవుఁడు మంత్రసంతతి విధిం గ్రమయుక్తి జపింపఁ జొచ్చినం
దీవరమైన తజ్జపము తేజున కోడి సశోకనిర్గతం
బై వెసఁ బోయె నూరు విడనై మును దుర్ధరభూత మూర్తితోన్.

చ. దినమున కొక్కభూత మిటు తేకువ వీడి చనంగ సప్తమం
బున దివసంబున న్సుతుఁడు ముందు నిజప్రకృతిం గొనంగ నా
యన ప్రకృతిం దొలంగి వితతాఽమృతభావవిభావనాదృతిం
బనుపడఁ జొచ్చె దత్తవిభుభాషితతత్త్వము రిత్తవోవునే! ౧౫౦

క. ఇదియు విచారింపుము నె
మ్మది ననుము యథాక్రమముగ మహితాగమసం
పద లెవ్వియేని మోక్ష
ప్రదము లవుం గా వటంచు భవదుక్తులతోన్. ౧౫౧

విష్ణుదత్తుని చరిత్రము

సీ. ఇతిహాసము తురీయ మిఁక విను పురుహూత!
శ్రవ్యమ్ము జగతిఁ బురాశ్రుతమ్ము

పహ్యాభూమిధరభూస్థలమున నొప్పారు
మాతాపురాఖ్య విఖ్యాత నగరి
విష్ణుదత్తుం డన విశ్రుతుం డం దుండు
విప్రుండు వేదవేదప్రసితుఁడు
పత్ని సుశీల నాఁ బతిదేవతామణి
విదితతద్భాగ్యసంపదయు తలఁప
వారి గృహసీమ నున్న యశ్వత్థమందు
బ్రహ్మరాక్షసుఁ డొకఁ డతిభయదుఁ డుండె
దత్పరత వాని యొసంగు భూతబలి సతత
మనుభవించుచు ద్రోహచింతనము వదలి. ౧౫౨

క. అన్యుల నెటూ పీడించెడు
నన్యములఁ దదీయవసతియందుఁ జొరఁగ నీఁ
డన్యాయ మ్మెఱుఁగని ద్విజ
మాన్యున కుపకృత మొనర్చుమతి నెపు డుండున్. ౧౫౩

క. ఒకనాఁటిభూతబలిఁ దాఁ
బ్రకటంబుగఁ గొనఁ దలంచి ప్రత్యక్షంబై
కకవికవడు నా భూసురు
నకు నిట్లనె మంజులముగ నతినుతు లమరన్. ౧౫౪

గీ. బ్రాహ్మణోత్తమ! నినుఁ జెందఁ బడసి నాదు
జన్మము కృతార్థ మయ్యె నాసంగతి విను
నీవు వెట్టెడు బల్యన్నమే విశుద్ధ
మాహరించుచు నీ భావింపుచు నుందు. ౧౫౫

సీ. హీన మీ జన్మంబు నెనసి యొందఱ నెంద
ఱను బాధఁ బెట్టలే దనుదినంబు?
నేను ముంచిన కొంప లీనాఁటి కేవెంట
నేని యొండే నొడ్డు నెనయలేదు

తిట్టెడువారలు దిగఁబాఱఁబోయువా
రా తిండి పట్టెనా? యకట యొడలి
కగు నీదుకడుపు చల్లగ వర్ధిలు మపాప!
నీ పట్టెఁ డీపాట్లతాప మార్చె
నదియు మొదలుగ నోరుజోలి వదలి యిందు
నిందుశీతల! కాలంబు నెల్లఁ గడపు
చుంటి మతిఁ దోఁచె నింతటి యుపకృతునకు
నుపకరింపఁగవలదె యం చిపుడు వింటె? ౧౫౭

గీ. ప్రత్యహము నీవు పెట్టెడు బలికబళము
నేను దినుచుంటి డాపఁగా నేల దానఁ
దుష్టుఁడైనాఁడ నీమది కిష్ట మెదియొ?
దానిఁ జేయ సమర్థుండఁ దగ నడుగుము. ౧౫౮

మ. అను భూతమ్మునుఁ జూచి పత్నియును దా నాశ్చర్యమగ్నాత్ములై
మన ముల్లోలము లై దలిర్ప నతని న్మానించి చింతించి దే
వుని దత్తాభిధు నత్రిపుత్రుఁ గనులం బూజింపఁగా నెంతు మా
పని మాకు న్నెరవేర్ప తాదృశులు సర్వజ్ఞు ల్గదా యం చనన్. ౧౫౯

ఉ. శక్తుఁడవే? మహామహుని శాస్త్రను యోగికులైకసద్గురున్
సక్తుఁడుగానివాని ననిశంబిట చిత్రచరిత్రవేషుఁడై
వ్యక్తుఁడు గాకయుం దిరుగువానిఁ ద్రిధాకృతి నీ వెఱుంగఁగా
సూక్తము మిథ్యసేతు నెటు? చూపెద ముమ్మలు భాగ్య మెట్టిదో?

ఉ. చూపెదఁ జూపుచుండఁగనె చుట్టును జుట్టుము పాదపద్మముల్
నూపుల కంట బాపువుల ముట్టఁగఁ బట్టుము తిట్టఁ గొట్ట నే
పాపము లాచరించినను బాయకు మాయన మెచ్చునంతకున్
నాపని నుందు నే నని కనం గనరాక యడంగె భూతమున్. ౧౬౦

క. వారలు తమకార్యంబుల
ధోరణి నుండియును నెట్లు దోఁచునొ దైవం

బా రక్కసుఁ డెపు డెట్లు కృ
తారంభుం డౌనో? యనుచు నాశలు సూడన్. ౧౬౧

శా. రా విప్రోత్తమ! యంచు సంభ్రమముతో రా వెంటఁ గొం చాతనిన్
రావిం గాఁపుర మున్న భూతము పురప్రాంతస్థమద్యాపణిన్
రా విం దంచు ననంబరుండు నతఁ డున్మత్తుండు నై పిల్చినా
రావిం జూపి యితండె దేవుఁ డని దూరంబందె తా నిల్చినన్. ౧౬౨

సీ. ఇంత దురాచారుఁడే? దత్తగురుమూర్తి
యేమి సేయుదు వీని నె ట్లినయుదు
నాకరాలాస్యుండు నంగ మాసవ దిగ్ధ
మీఁగలు ముసరెడు నెగసి యెగసి
బ్రహ్మరాక్షసుఁ డీ ట్లబద్ధంబు లాడునా?
యవునో? కాదో? యెవ్వ రనెడువారు
శ్రీ రామ రామ! కాశికిఁ బోవఁ బోవునే?
వీని సేవింపఁ బ్రాప్తించు నఘము
లనుచుఁ జింతించుచుండ దేవాదిదేవుఁ
డింత నంతఁ జరించు చదృశ్యుఁ డయ్యెఁ
దిరిగి వచ్చి ద్విజోత్తముఁ దిట్టి బెట్టు
బమ్మరాకాసి విస్మయ మిమ్ముకొనఁగ. ౧౬౩

ఉ. మున్నె వచింపనే? యకట పో యెటువాఁడవు? మందభాగ్యుఁడా!
సన్నుతుఁ జెప్పి చూపి కనుసన్నలఁ జేయుచు నున్నఁ జూడవే?
యిన్నెటి తిచ్చవోయె దిది యేల? భవాదృశుఁడా విభుండు? పో
తిన్నఁగ నింటి కీసరికిఁ దేకువగల్గు మిఁకొక్కసారి కేన్. ౧౬౪

ఆ. అనుచు బదరి మలఁచి యంతర్ధి నెనసె నా
తం డితండు నింటిదారిఁ బట్టె
దత్తదేవుఁ గొలిచి దయితుండు వచ్చునం
చెదురుసూచు దయిత యేకటపడ. ౧౬౫

ఉ. బాడబరాక్షసుండు పసిపట్టి మెలంగెడువాఁ డొకప్డు రా
వాఁడె మహామహుండు ద్విజవర్య! పదంబుల వ్రాలు మింత నీ
వోడకు మేను బూట వినవో యతినాథుచరిత్ర మాలితో
నేఁ డది విస్మరింపకు మనిందిత! యం చలవార్చి పిల్చినన్. ౧౬౬

ఉ. పోయెను బిల్వువెంటనె నమో యనుచు న్మసనమ్ముపొంత వేఁ
బోయెడు దేవుఁ జూపఁ గని భూసురుఁ డంతికమందుఁ జేరుచో
నీ యనివాని కుక్కలు పయింబడ కీకస మొక్కఁ డెత్తి వాఁ
డూ యని మొత్తఁజొచ్చె ద్విజుఁ డోయని మొత్తుకొనం గరాళుఁ డై.

మ. చలచిత్తుండు కపాలి రక్తనయనాంచన్మూర్తి శుద్ధాస్థికుం
డల కేయూరకిరీటహారవలయవ్యానద్ధుఁ డై వేల్పుఁ గు
క్కలు వెన్నంటి మెలుంగుతోఁ దఱుమ నక్కర్మాస్థితుం డార్తుఁ డై
కలకంబొందెను దారి డొంక యనకే కంపం బనల్పంబుగన్. ౧౬౮

మ. అతిభీతిం బడి లేచుచుం బొరలు చవ్యావృత్తుఁ డై జీవితే
ప్సితుఁ డై వచ్చు మహాద్విజుం దొరసి యిస్సీ పౌరుషం జేటి కీ
గతి దైవంబె పరం బటం చతని కెక్కం జెప్పి తా నవ్వ్యాచుం
గతుఁ డై రక్కసుఁ గాంచి సిగ్గిలుచు సత్కర్ముండు గీ మందినన్.

గీ. అతనియిల్లాలు నుస్సురు మంచు నూర్చి
గాసివడి యట్లు వచ్చిన కాంతునకును
దగిన యుపచారముల మనస్థైర్య మొనరఁ
జేసి యిట్లనె మెల్లని బాసతోడ. ౧౭౦

మ. అగుఁబో యత్రికులావతంసుని దయావ్యాసంగసంపత్తికిం
దగమో? యంతటి నోము నోమమొ? సరే దాక్షిణ్య మా దేవుసా
మ్ము గదా సంతతజాయమానకరుణాపూర్ణుండు నై జానుభా
వగతిం జూపఁగరాదొ? యె ట్లయిన నెవ్వా రిందు వే లూపఁగన్?

సీ. వైశ్వదేవాంతనిష్పాదితబల్యన్న
మా భూతమతిఁ దృక్క్షిప్తి నలమనేల?

తృప్తి నెందిన భూత మూర్తిఁ బ్రత్యక్షమై
ప్రత్యుపకృతి కని పరగనేల?
యుపకార మన్నంత నూర్జితుఁ నద్దేవు
నగపడఁజేయుమం చడుగనేల?
యడిగినఁ గా దని యరుగక యాతండు
ముమ్మాఱు చూపఁగాఁ బూననేల?
పూనెఁబో రెండుమారులు పోయె రిత్త
యింక నిమ్మఱి యేమౌనో? యెఱుఁగరాదు
దైవమా! యడియాసలఁ దవులు గొలిపి
తేడ దేవాధిదైవతం? బేమి నేడ? ౧౭౨

గీ. ప్రాణనాథుండ! బడలితివా? మదుక్తి
నంత పనిఁ బూని తెలిసినయది వచింప
కుంట తగునా? యటంచు వాకొంటిఁ గాని
యింత లింతలు మీా కగు టే నెఱుంగ. ౧౭౩

మ. అనసూయాసుతుఁ డిట్టివాఁ డనుచు నే నాలించియే యున్నదా
న నెఱుంగం జను మంచు బొంకఁ దగునే? నాథుండ! యేనాఁ డఘం
బని లేదే? నినుఁ గర్మఠు న్వరదుఁ డిట్లాయాసముం బెట్టునా?
యని ము న్నిపని కొగ్గితిం దుది నసాధ్యం బం చెదం దోఁచెడిన్.

ఉ. కావునఁ బడ్డకష్ట మిది కాఁగల దిం దొకసారి కేని సం
భావితసత్ఫలం బిపుడొ? భవ్య భజింపుద మర్చయంద క
ర్మావహితస్వభావ! పరమాస్తిక! భూతము సూపు దారి నా
మావిభుపజ్జఁ బోవల దమాయుఁడ వీ వతిమాయుఁ డాతఁడున్. ౧౭౪

గీ. అను సతిం జూచి దాని వాక్యముల నార్తి
నరసి యద్దేవు కొలువున నధికఫలిత
మాత్మ నిశ్చిత మొనరించి యనియె సోమ
యాజి యవ్యాజహృదయ మం దవఘళింప. ౧౭౫

చ. ఒకటికి రెండుమార్లిటు లహో వృథ యయ్యెను నాదు ప్రాన్కి యీ
యొకపరిగూడఁ బోయెదఁ గృశోదరి! చావున కింత జంక నే
టికి? నది యొండొ? రెండొ? ప్రకటించెద నాదగు పట్టుగూడ నిం
కొకమరి జూపు మన్న నతఁ డూఁకొనఁ డేఁ జనఁబోను వానితోన్.

శా. ఔరా యింతటి దుర్భగుండు కలఁడే యస్మాదృశుం డెందునే
స్థీరత్వం బెటువోయె దుర్మతికి నేదీ? చూత మీసారి నీ
చారంభుం డయినన్ వడిం దఱుమ డాయం దిట్టినం గొట్టినన్
నోరం గోరఁ గసుక్కునం గొఱికిన న్బోనిత్తునే? దేవునిన్. ౧౭౮

క. పాదములు పట్టుకొనెదను
నీదాసుఁడ ననెదఁ జంపు నీవున్నె మెటుం
బో దనెద ననెద ననినది
యే దైవము వదలి వత్తునే యింటిదెసన్? ౧౭౯

చ. అనుచు నె లేచె నప్పటికి నప్పుడె దిక్కులు సూచె నింతలోఁ
బనిగొని వచ్చి పిల్చె వెస బ్రాహ్మణభూతము వాత్తివాక్తతిన్
విని వినకుండ నూఁచెఁ దల వేఁ జనె విప్రకులోత్తముండు పూ
నిన కడుగట్టి ప్రాన్కి యవనిం దివి నన్యయముఁ జూడనిచ్చునే? ౧౮౦

ఉ. గ్రామము నెల్ల దాఁటి చనఁగా వెలివాండ్రుర పల్లెవద్ద వి
శ్రామము లేని ప్రాన్కి మృతరాసభమాంసము లెల్లఁ గోసి కై
కో మని విశ్వ ముఖ్యములకుం దగఁ బంచెడు పిచ్చివాని వీఁ
డే మునిముఖ్యుఁ డంచుఁ జనియెం ద్విజభూతము మార్పడంగ నై.

చ. అటు నిటుఁ జూచి ధైర్యము నయంబును బంచిన సోమయాజియుం
దటుకునఁ బట్టెఁ బాదయుగిఁ దా నెదురేగి యెదేనిఁ బల్కు రా
దటె మొగమందు నింక సుమహాత్ముఁడొ తన్నె ననేకవారముల్
పటుభయదప్రహారముల బాధితుఁ జేసె నదల్చెఁ బెల్చనన్. ౧౮౧

ఉ. ఎంతలు సేసిన న్విడువనే విడువం డటు లంఘ్రియుగ్మముం
బంతముఁ బూని వచ్చె నటె బ్రాహ్మణుఁ డీశుఁడు మాత్ర మట్టిచో

నంతకుఁ దీసిపోవునె? రయంబున వానిపవిత్రగాత్ర మొ
క్కింతయుఁ ద్రిక్కకుండ నలికె న్నవగార్ద్రభర క్తమాంసముల్. ౧౮౩

ఉ. ఐనను పీడకున్న ద్విజు నారసి యోరి! దురాత్మ! నీకు నా
తో నెది కార్య? మేటికిర దుఃఖదుఁ డై యిటు పట్టినాఁడ? వే
దే నొకభూతజాతివొ? మదించితివే? నినుఁ జంపి తిందు మూ
ఢా! నను వీడు మం చన విడం డతఁ డీప్సితసిద్ధిబుద్ధితోన్. ౧౮౪

చ. అపుడు ప్రసన్నుఁ డీశుఁడు దయాపరుఁ డై వసుధామరోత్తమా!
కృపణుడఁ గుత్సితుండ విపరీతుఁడ నీ నను నిట్లు గొల్చె దే
మిపనికి? సాహసంబు విడుమీ యిది మూఁడవుసారి యక్కటా
శపథము లాడి వచ్చితె? యసాధ్యుఁడ! యేమి గడించి తం చనన్.

గీ. కొట్లు తిట్లును లేవు వాకొనుచునుండె
మెత్తమెత్తని మెల్పున మేను నిమిరె
నంత వేఁడికి జల్లన మింతలో? యని
హర్షనిర్భరహృదయుఁడై యవనిసురుఁడు. ౧౮౬

క. తల యెత్తి చూచె మ్రొక్కెను
తలతల మను మేనువాని దాంతు న్శాంతున్
సలలితు శుచి నాసీనుం
దిలకించెఁ బునఃపునర్నతిప్రవణుం డై. ౧౮౭

శా. ఆనందాశ్రువిలక్షణేక్షణుఁడు నై యారా మహీమండలిన్
నేనే ధన్యుఁడ నొక్కరుండ ననుచు న్మేనుం జెమర్ప న్గళా
స్థాని న్గద్గదవర్ణవర్ణితసరస్వత్యాప్తి భక్తిప్రవ
ర్త్యానంత్యంబు గడింప నిక్క మవు దేవాకార మీక్షించుచున్.

ఆ. పక్కణంబు లేదు పలలంబు లేదు కు
క్కలు సృగాలకరటములును లేవు
చేతికత్తి లేదు చిన్ముద్ర ముద్రితుం
డున్నవాఁ డొకండె యున్నవాఁడు. ౧౮౯

క. జని ధన్య ధన్య జననియు
జనకుఁడు కవి ధన్యుఁ డిట్టి సత్ప్రతిపత్తిన్
మునివంద్యపదాంబుజు దే
వునిఁ గనులం గంటి మంటిఁ బున్నెముఁ గొంటిన్. ౧౯౦

క. అని వినయబద్ధుఁ డా వి
ప్రుని మెచ్చి కృపాంబురాశి భూసురవర! నీ
పని యెది మత్కరణీయం
బనయం బది సుకృతమ యని యాత్మఁ దలఁపుమా. ౧౯౧

ఆ. వరము గోరు మనెడు వరదుని నేవరం
బడుగవలెనొ తెలియ దామె ద్విజున
కాలు చెప్పలేద యారక్కసుఁడు ననం
డేమి సేయుఁ బాప మా మహాత్ముఁడు? ౧౯౨

ఆ. ఊఁచె శిరము నప్పు డుపపన్నబుద్ధితో
ననియె దేవవిభున కానతుఁ డయి
శ్రాద్ధ మే నొనర్తు సర్వేశ! నిను నిమం
త్రింతు నందు నామతింపు మనుచు. ౧౯౩

ఉ. స్నానము సేసి వచ్చెద ననా! శుచి నౌచు భవత్పరిశ్రమం
బూనము సేసి వోదునె? యహో చను మింటికి నీవు ముందు సం
ధాన మొనర్పు మన్నియుఁ దథా యని దేవుఁడు వోవ నవ్వెమో
మై నిజపత్ని డగ్గఱి మహాత్ముఁ డనెం ద్వరితప్రసక్తితోన్. ౧౯౪

ఆ. నీవు చెప్పవైతి నేను మున్నెంచలే
దేమి సేతు వరము నిచ్చెద ననెఁ
బాకశుద్ధిఁ గూర్పవలయు నిమంత్రించి
వచ్చినాఁడ వరదు వనిత! యనుడు. ౧౯౫

ఉ. ఈ విభుఁ జూచినప్పుడె సమీహితము ల్ఫలియించు నెంచి యా
దేవుఁడు బ్రాహ్మణార్థము విధిం గయిసేయుట కాత్మఁ బొంగి యా

భావిని హర్షభావితవిభావన సిద్ధము సేసె సర్వ మీ
లో వెస వచ్చె నత్రిజుఁ డలోపముగా ద్విజుఁ డిచ్చెఁ బాద్యముల్.

గీ. ప్రభుఁ డుపాసీనుఁ డై వార్చి పావనుండ!
యన్యు నెవని నిమంత్రించి తాత్మసముని
వాఁడు రాఁ డే మనిన భీతి బ్రాహ్మణుండు
పిసికికొనఁ జొచ్చె చేతులు విస్మరించి. ౧౯౭

గీ. దత్తదేవుఁ డస్మత్పితృస్థానమందుఁ
గవ్యముం గొను నేఁడు సంకల్పయుక్తి
నేఁ గృతార్థుఁడఁ బెతరులతోఁ గ్రమింతు
నూర్ధ్వ మని పొంగెఁ గాని యీ యూహ యేది? ౧౯౮

ఉ. దేవవిభుండ! నీసమునిఁ దెచ్చెద మెచ్చటనుండి యంచు నా
భావిని యింటనుండి గృహబాహిరభూమికిఁ వచ్చి చూచె సం
భావన వ్యోమమధ్యగతు భాస్కరుఁ జేతులు రెండు మోడ్చెఁ రా
నావల కెంచి యుంచెనో? తదారచితంబొ? నుతించె నంచితుల్? ౧౯౯

సీ. జగదేకబంధుండ! సవితృండ! సర్వాత్మ!
సర్వాధిసాక్షి! ని న్నన్నుతింతు
జడము సుషుప్తవిశ్వము నీకృతమ్మునఁ
గాదె సచేతనకలన వెలయు
నది గాక మాయతో నఖిలవికార జా
తముఁ గూర్చి యంతరాత్మవుగఁ జేరి
సర్వపరుండవు సర్వదృక్కువు నవు
నీ కిందు విజ్ఞాపనీయ మేది?
వచ్చికూర్చున్నవాఁ డత్రివంశవర్ధ
నుఁడు నిమంత్రితుఁ డై త్వదన్యుండు లేఁడు
తత్సముఁడు వినుచుంటె? ప్రార్థనము దేవ!
ముప్పు రాకుండ మెలఁగుము మ్రొక్కెద నన. ౨౦౦

సీ. పతిదేవతామణి ప్రార్థనమ్మును గొన
కున్న ముప్పగు నని యులికిపడెనొ?
దత్తదేవునిసాటిఁ దగు నేర్చి కూర్చుండ
నని మురిపెమ్మున నర్థిఁగొనెనొ?
యెంత లుద్యోగంబు లేక గాశ్యపుఁడ బ్రాహ్మ
ణార్థ మె ట్లెడసేతు నని తలఁచెనొ?
యిపుడు రా నన మోడి కీ సోమయాజి రే
పసలు పిలువఁ డంచు వెసఁ దిరిగెనొ?
మూర్తిమంతుఁ డై యల వేదమూర్తి తపనుఁ
డట్టి సాకారసామ్యత్వ మధిగమించి
మించు మెలపున నచటి కేతెంచి స్వయము
గా సతిం గని నేఁ జేయఁగల దెది యనె. ౨౦౧

గీ. శ్రాద్ధమున నిన్ను రెండవ బ్రాహ్మణునిగ
నే నిమంత్రించితి నటంచు నెలఁత వలుక
నట్లె యవుఁగాత మనుచుఁ బాద్యమును గొనుచు
స్వాసనమ్మున సుస్థిరుం డయ్యె రవియు. ౨౦౨

క. ఇరువుర మిప్పటి కై తిమి
సరి మూడవువాఁడు లేఁడొ? శ్రాద్ధ మెటులు దే
వరహిత మైనం జెల్లుం
బరహితముగ ననుచు యోగివరుఁ డన సతియున్. ౨౦౩

క. స్వవిహారమ్మునఁ జొచ్చెను
బవిమలమతి వీతిహోత్రుఁ బ్రార్థించెను భ
క్తివశమ్మున నాతుర యై
భవనేశ్వర! వేగ రె మ్మపరదేహముతోన్. ౨౦౪

క. భగవంతుఁ డత్రిపుత్త్రుఁడు
స్వగృహమ్మున శ్రాద్ధమం దశనముం గొన నై

భగుఁడుం దోడుగ నిను మూ
డగువాని సమానుఁడ వని యాత్మ నయించెన్. ౨౦౫

సీ. వైశ్వానరుండ! హవ్యము కవ్యముం గొను
వాఁడ! దివ్యవరుండ! వందనమ్ము
లఖిల దేవతలకు నాస్యభూతుండ! న
న్గావు కేతుండ! యనుగ్రహింపు
గృహపతీ! నీ కివె కేల్మోడ్పు లఖిలక
ర్మాధ్యక్ష! నా మొఱ లాలకింపు
మిలువేల్ప వింక నె ట్లెడసేయనవు నీకు
నెట్టిసంకటమొ? నీ వెఱుఁగకుంటె?
యనుచుఁ బ్రార్థించుచుండ న య్యగ్నిదేవుఁ
డొక్కకుండంబునుండి యంశోత్థితుఁ డయి
కుండమున నన్యాంశంబు మండుచుండ
వచ్చి స్వాసన మొనసెను బాద్యముఁ గొని. ౨౦౬

క. అది గనుఁగొని భగవంతుఁడె
మది విస్మయ మొదవ దీని మాహాత్మ్యం బి
ట్టిది లే పొమ్మని పరితో
షదశాంబుధిమగ్న తాప్రసక్తుం డయ్యెన్. ౨౦౭

ఉ. భానుఁడు చిత్రభానుఁ డధిభానుఁడు భోక్తలు దైవపిత్ర్యసం
స్థానములందుఁ గర్త యజమానుఁ డనూనము పాకశుద్ధి సం
ధాన మటంచుఁ బల్కి చరితంబె వచించెడు నిట్టి శ్రాద్ధ మెం
దేని గన న్వినం గలదె? యిద్దియె చాలదె? యెంత కేనియున్. ౨౦౮

గీ. విధిగ భోజన మొనగించి వేల్పులు ముప్పు
రెంచి "తృప్తాస్మ" యం చాచమించి రెపు
డపుడె యక్షయ మనిపించి యది సమాప్తి
నొందఁగాఁజేసి దంపతు లుభయు లాప్తి. ౨౦౯

క. సాష్టాంగ మెఱఁగి విధి నుప
విష్టునిఁ గొనియాడి రెనసి విష్ణు న్విభు నా
విష్టబ్రహ్మాత్మకులు వా
రష్టోత్తరశతపద స్తవాధీతికృతిన్. ౨౧౦

సీ. ఆనందదాత, దత్తాత్రేయు, హరిఁ, గృష్ణు,
నున్మాదవేషవిద్యోతమాను,
మునిబాలు, విష్ణు, దేవుని, దిగంబరుఁ, బిశా
చరుచి, విజ్ఞానసాగరునిఁ, గవిని,
యోగిని, భోగిని, భోగమోక్షప్రదు,
జయు, ననసూయాత్మజాను, నగ్ను,
విశ్వదేవస్వరూపి, నురుక్రము, న్విశా
లాక్షునిఁ, గార్తవీర్యవరదు, గురు,
వరదునిఁ, బరమానందసంపచ్ఛరీరు,
వివిధరూపధరున్, హృద్యు, వేదవేద్యు,
దైవతేశేశు, భక్తచింతామణి, మదిఁ
బ్రస్తుతింతుము ప్రణతిపూర్వముగ నెపుడు. ౨౧౧

సీ. ఆనతార్తిహరు, గూఢాచారు, గుత్స్యవే
ష్టితుని, మితాచారు, మితవిహారు,
విశ్వవంద్యపదాబ్జు, వివిధయోగిహృదబ్జ
వాసు, భక్ష్యాభక్ష్యవర్జితు, శివుఁ,
బ్రాణనిలయునిఁ, బ్రమాణు, సర్వాధారుఁ,
గపిలునిఁ, గృష్ణపింగలు, సుశీలు,
సిద్ధసాధకవర్గసేవ్యు, వియత్స్నము,
విప్రపర్యుని, వేదవిదు, శుభదుని,
రాజరాజ్యదు, శాంతవిగ్రహు, శరణ్యు,
సుందరగ్రీవు, రామావశున్, రమాప్తుఁ,

బరమశ_క్తిపదాశ్లిష్టు, భ_క్తవత్స
లుని, మహాదేవుఁ గొలిచెద మనిశ మెనసి. ౨౧౨

క. వీరు, వరేణ్యుఁ, బరు, వృషా
చారు, వృషప్రియు, వృషభు, నజని, నపలేపుఁ,
ధీరుఁ, రామారాము, న
ఘోరు, ననఘుఁ, గొల్తు మె ప్డగుణు, మేధ్యతనుఁ. ౨౧౩

సీ. ఏకు, ననేకు, మహేశాను, నంతర
హితు, ననురారాతి, నీడ్యు, శాంతు,
ననికేతను, సనాతనాత్ము, నధ్యత్ము, గ
హను, గుహ్యు, గంభీరమను, గుణజ్ఞు,
శ్రీశుని, శ్రీదుని, శ్రీనివాసునిఁ, బరా
యణుని, శ్రీవత్సలాంఛను, విజయదు,
గహ్వరప్రియు, జపద్గణవంద్యు, జపిత, జా
నాను, జగజ్జీవనము, జగతికి
సేతువును, జాతవేదు, నిస్సీమఫలదు,
యజ్ఞు, నీజ్యుని, యజ్ఞేశు, యజ్ఞభుజుని,
యాజకు, యజస్సు, యజ్వ, నన్వహము ధ్యాన
యోగమున నాశ్రయింతు మీ యోగ మెడల. ౨౧౪

ఉ. ఇంతటివానిఁ జెందితి మిఁకెన్నటికిం జెడఁబోము మేము జ
న్మాంతరసంచితప్రతతు లన్నియు నిన్నియతి న్ఫలించె నం
చాంతరభ_క్తియోగ మనయం బిరురూపు వహించినట్లు లా
శాంతుఁడు గాంతయుం బ్రభుని కాళ్లబడిం బడి యూరకుండిరి. 

మ. గురుదత్తుం డతితుష్టుఁ డై పలికె నీకు న్సుప్రసన్నుండ నై
వర మీనుంటెని సువ్రతుండ! ద్విజసంభావ్యా! స్వభ_క్తుండ వై
తి రయంబార వరింపు వాంఛిత మొగి ద్దివ్యంబు నీ యష్టకో
_త్తరసంజ్ఞాశతక_స్తవం బిపుడు ప్రత్నం బొందె నావిష్కృతిఁ. ౨౧౬

గీ. అనఘ! యీస్తోత్ర మెవఁడు సమాహితుఁ డయి
నిత్యము పఠించి నన్ను నందింపఁజేయు
వానికిని యోగరతునకు వలెఁ బ్రసాద
మహిమ నభిముఖుఁ డై యుందు మానసీయ! —౨౧౭

శా. ఔరా! యెంతటిభాగ్యమో కదె సుశీలాభిఖ్య యీ నీసతీ
హీరం బీ పతిదేవతామణి గుణాహీనత్వ మట్లుండ ని
త్యారంభప్రచితప్రభావమును బ్రత్యక్షంబ నేఁ గాంచితిన్
సారం బౌ మునిదృష్టి గెల్చె నిది మున్ స్వర్ముఖ్యలోకావళిన్.

సీ. నీవు విద్యావళీనిధివి నీ కల్యాణి
గుణసంపదల మించు కొండలోయ
యేరీతి గుణలక్ష్మి నిల్లాలిఁ బడసితి?
విల్లాలితయుఁ బతి నెనసె నిన్ను
సమశీలు రగు మీరు సన్యాసి నగు నాదు
మదికి నత్యంతసంహ్లాద మిడితి
రీ నా యనుగ్రహాహితహితసంపత్తి
స్వానందభాజను లై యలరుచు
బ్రదికినన్నాళ్లు యోగతత్పరత వెలయ
యోగపారపరాత్మాభియోగసుఖము
చిర మనుభవించు చగుదు రాచివరతటికి
నా యఖండచిదానందభూయ మెనయ. —౨౧౮

చ. చరమము జన్మ మియ్యది ద్విజాతివరా! మదనుగ్రహంబు నీ
తరమునఁ జెందు టారయ స్వతంత్ర మ టుంచుము మంత్రతంత్రముల్
బరమహితంబుఁ జేకొనుము భద్రరమాస్పద మాదు దేవతా
సురనరముఖ్యు లెల్ల నినుఁ జూచ్చి సిరు ల్గొన నాదు రిమ్మెయిన్.

గీ. ఆయు వారోగ్య మైశ్వర్య మసము సిరి ధ
నమ్ము ధాన్యమ్ము రాజ్యమ్ము నందనుండు

మొదలుగాఁ గల కామితముల నొసంగు
మేతదీయజపమ్మున భూతములకు. ౨౨౧

ఉ. నీ పితృవర్గ మెల్ల నవనీసురవర్య! విముక్తకర్మపా
శోపనిబంధ మై వడసె నుజ్జ్వలమైన విధాతృలోకముఁ
బ్రాపితబోధ మై పిదపఁబద్మజుతోడ విముక్తి నందు నీ
యీ పరమప్రకారవిహితేప్సితపైతృకకారణంబునన్. ౨౨౨

మ. ఉపకారం బొనరించె రాక్షసుఁడు నీ కుచ్ఛిష్టపాత్రోపసి
క్థపదార్థంబు భుజించి ధన్యుఁ డయి నాకం బందుఁ గా కింక నా
యుపదేశంబు గ్రహింపు మంచుఁ జెవిలో నో మ్మాదిగాఁ జెప్పె మం
త్రపరోపన్నిషదర్థ మప్డె యతఁ డత్యంతప్రసిద్ధుండు గాన్. ౨౨౩

క. ఆయిద్దఱ శిరముల కర మా
యోగివరేణ్యుఁ డుంచి యాశాసించెన్
భూయశ్శుభసంపదఁ జప
లాయితుఁ డాలి కాక్షణమ చెందె లలి నంతర్థిన్. ౨౨౪

క. భగవంతుఁడె పరమగురుం
డుగఁ దన పత్నియును దాఁ గడుం బ్రతిపత్తిన్
విగతశ్రముఁ డై తన్మం
త్రగణంబు ధరించు వాని రవియుఁ గని యనెన్. ౨౨౫

సీ. పోయి వచ్చెదము నీ పుణ్యాం బగణ్యాంబ
యూరక పోదుమా? యూర్జితుండ!
వ్యోమయానముఁ గొమ్ము కామగం బిచ్చితిఁ
దలఁచిన ప్డాసఁగెద దర్శనంబు
దివ్యమ్ము సిద్ధగతిం గూడఁ దాల్చెద
నని సహాపత్నికుఁ డా ద్విజవరుఁ
డానతుఁ డై కొల్వ నభినందన మొనర్చి
యెగసె నాకసమున కెలమి సవిత

యంత స్తుతుఁ డయి గార్హపత్యాగ్ని దేవుఁ
డర్థవరములు గూర్చి న య్యాలుమగల
కెప్పుడెప్పుడు దర్శింప నైదఁ దలంత్రు
కానవచ్చెదఁ జేసెదఁ గలిగిన పని. ౧౨౮

ఆ. విప్రవర్య! నన్ను విధిసమారాధితుఁ
జేసినాఁడ వనుచుఁ జెప్పుచున్న
దిట్టి కర్మసిద్ధి యిఁక నెందుఁ గాదువ లే
దగుము సుఖివి సుఖుదుఁ డగు మొరులకు. ౧౨౯

క. అత్యంతదురాధర్షుఁడ
వత్యయరహితుఁడ వలంఘితాశాస్తివిఁ గ
మ్మత్యంతము తేజస్వివి
సత్యపరుఁడ వనుచు నగ్ని స్వస్తితి నెనసెన్. ౧౩౦

క. ఉచ్ఛిష్టముఁ దిని రక్కసుఁ
డచ్ఛవిమానము వహింప నా దంపతులన్
బ్రోచ్చిరుఁ డై వీడ్కొని చనె
విచ్ఛిత్తి యొసంగ దివ్యవీధిం బ్రీతిన్. ౧౩౧

మ. అని వర్ణించు గురూత్తముం గొలిచి దత్తాత్రేయరూపంబు పెం
పున వర్తించు నలోకలోకవిభు సంపూజ్యప్రభావంబు ము
న్నును వింటిన్ బహువిశ్రుతంబు విన నెంతు న్విష్ణుదత్తుండు సి
ద్ధి నటు ల్సెంది యెటు ల్చరించె? నని యర్థిం గోరు సుత్రామునిన్.

విష్ణుదత్తుఁ డొక సాధ్వీపతి నరోగుఁ జేయుట

చ. కనుఁగొని జీవుఁ డిట్లనె నఖండవరమ్ముల నట్లు చెంది స
త్వనిధి దయాపరుండు కవి దాంతుఁడు శాంతుఁడు శీలవత్ప్రియుం
డనుపమశీలుఁ డై యొకళులందును ద్రోహపు బుద్ధి లేక మై
త్రి నెనసి గర్వ ముద్ధతి నివృత్తి ప్రమాదము మాని వర్తిలెన్. ౧౩౨

గీ. నాతిహృష్టుం డదుఃఖుఁ డై యాత్మగతము
సుప్రభావమ్ముఁ బ్రకటించు చూపు లేక
యా సదాచారుఁ డెప్పటియట్ల యుండెఁ
గాని దాఁచిన దాఁగునే భావశక్తి? ౨౩౨

శా. భస్మచ్ఛన్నమణిప్రకారుఁ డవు నా భవ్యాత్ము దివ్యప్రభా
వస్మేరప్రచితప్రకాశయశముల్ బ్రహ్మాండభాండంబునం
దాస్మాకీనసమజ్ఞల న్మిగిలి దైత్యద్వేషికీర్తు ల్వలెన్
సుస్మార్తావహము ల్ఫలప్రదము లై శోభిల్లె నిండారఁగన్. ౨౩౩

గీ. ఎందులకు వాని మహిమంబు నింతగా వ
చింపఁ బూనితినో? యట్టి చెలువు వింటె
ఉండె గోదావరీతీర మొంది తీర్థ
మది కుశావర్త మను పేర నతివిదితము. ౨౩౪

గీ. వేదశాస్త్రార్థపారగు ల్విప్రు లెంద
ఱెందఱో యుందు రందు నమందబుద్ధు
లొక్క విప్రకుమారుఁ డా యూరనె కలఁ
డఖిలరోగకృతాతిపీడాతురుండు. ౨౩౫

సీ. ఉండె నెన్మిదియేండ్లనుండియు క్షయరోగ
మొకయేటినుండి జలోదరమ్ము
జీర్ణజ్వరవిశేషచీర్ణము లివి యెల్ల
వాతగుల్మము స్వభావజము గలదు
షాణ్మాసిక మ్మతిసారమ్ము నాలుగు
నెలలు భగంధర మ్మలముకొనియు
సన్నిపాతించె దోషత్రయం బిప్పుడు
మరణోన్ముఖుం డయ్యె మందు లేద
ఇరువదేండ్ల బొటాబొటి యీడువాఁడు
వాని భార్య పదాఱేండ్ల వయసులోని

దన విన రాద దానిదుఃఖాతురత్వ
మధికదీన తత్సేవాపరాయణ యది. ౨౩౬

మ. బహుయత్నంబు లొనర్చె భర్త బ్రదుకం బత్నీవతంసంబు స
స్పృహ ధర్మంబులు సేసెఁ బెక్కులు ధనం బెల్ల న్వ్యయం బందె న
న్వహముం బుట్టకు నెట్టి చెట్టునకునే నార్తిం బ్రణామంబుఁ గూ
ర్చు హరీ! వైద్యము దాని మానినది యేరుం జెప్ప లే రెయ్యెడన్.

గీ. ఇంతలో నెవ్వరో? తెల్ప నింతిమిన్న
విష్ణుదత్తు మహాత్మ్యంబువిధ మెఱింగి
తండ్రితోడుగ నచటికిఁ దరలిపోయె
వాని పదముల సాష్టాంగపడె హరముగ. ౨౩౮

గీ. ఆదరమ్మున నల్ల దయాపరుండు
బుజ్జవముతోడ నడుగంగఁ బూవుఁబోఁడి
భర్తృదేహజదుఃఖసర్వస్వ మనియెఁ
దా నొనర్చినకృతులు వితా యగుటయు. ౨౩౯

మ. అపుడే శిష్యున కాజ్ఞయిచ్చె సదనంబం దగ్నిశుశ్రూషకున్
గృప నచ్చోటికిఁ బాదచారి యయి పోయెన్ జూచె రోగార్తు నె
య్యపుఁ జుట్టాల ద్విజావతంసముల నాహ్వానించి యవ్వారితో
నిపుణుం డై వినయంబు దోఁప ననియెన్ నీతిం దదర్థంబుగన్. ౨౪౦

గీ. గ్రస్తుఁడై నాఁ డనేకరోగములచేతఁ
జావఁ బోవుచు నున్నాఁడు సత్వరంబ
కర్జ మాలోచిత మొనర్చి కావుఁ డితని
నాకు నిడఁ దగు నాన నింతకు నొసంగి. ౨౪౧

గీ. అనిన వా రని రెల్లకార్యములు మేము
చేసిచేసి విసివియు యా చేతులెల్లఁ
గడుగుకొన్నార మీ వేది కార్య మనెదొ?
చేత నయినంత సేతుము చింత దొఱఁగి. ౨౪౨

చ. అనుడు, దదుక్తుల న్విని మహాత్ముఁడు నెమ్మది నెంచె నిట్లు ద
త్తనియమి సత్కృపాగరిమఁ దంత్రపుశక్తి నరోగుఁ జేయవ
చ్చు నితని నప్రయత్నమునఁ జూడ నపక్రమకార్య మొప్పునా?
పనివడి లోకతుల్యపరిపాటి సమస్త మొనర్తు నం చొగిన్. ౨౮౩

ఉ. ఆదట వారితో ననియె నక్కట కర్మముచేత వచ్చు రో
గాదులు శాస్త్రము ల్దెలుపవా? మును దాని నిరూపణంబుతోఁ
గాదె పొసంగు వైద్యకృతి కాన ద్విజోత్తము లీ రెఱుంగరే?
కా దనకుండఁ డెం డిపుడ కర్మవిపాకముఁ గాంచుఁ డాదృతిన్. ౨౮౪

చ. అని కని రోగమూలము నహాక్షయ మన్నది బ్రహ్మహత్య సం
జనిత మవున్ దదర్థముగ జాయ పౌనర్భవలె వ్రతంబు హో
యనములు మూడు నాల్గులు తదర్థము చాలును దీవ్రయుక్తిఁ జే
సిన నని దీక్షయిచ్చిరి విశేషవిధి న్సతి కప్పు డందఱున్. ౨౮౫

ఆ. వ్రతము మొదలువెట్ట వడి తగ్గి సగమయ్యె
క్షయము పాదమయ్యె సగముపడఁగ
నదియుఁ బూర్తి యగుడు వ్యాధి నిర్మూల మై
పోయె నెల్లవారుఁ బున్నె మెన్న. ౨౮౬

మ. హరివిద్రోహముచేత వచ్చినది పో మ్మంచు న్వచించెన్ జలో
దరము న్ద్రోవ వ్రతమ్ముఁ బూన్చె విహితాబ్దంబు ల్తదారూఢిఁ ద
ద్విరతిం గూరిచి వాతగుల్మమునకు న్విధ్యుక్తిఁ గీలించి సం
జ్వరముఖ్యంబుల మూలపాతకము లార్పం జేసెఁ దత్తత్కృతిన్.

గీ. అంత నవ్వాని హృదయంబు నంటి విష్ణు
దత్తుఁడు జపించె దత్తప్రదత్తమంత్ర
తంత్ర మాతతశివము నెదం దలంచి
శీల మెసఁగంగ నప్పు డాశీర్వదించె. ౨౮౭

క. ఆయువు పూర్ణం బైశ్వ
ర్యాయతి సంతానలబ్ధి యశము సిరి ధనం

బాయత ధాన్యము ధర్మ
ప్రాయము హరిభక్తి స్వర్భువనగతియుఁ దుదిన్. ౨౮౯

క. దంపతుల కొసఁగి వారల
సంపత్తికిఁ బొంగి తండ్రిచాయ సువాస
స్సంపన్నాలంకృతు లిడి
పెంపలరఁ దదిష్టము నెరవేర్చి పయనమై. ౨౯౦

ఉ. చచ్చెదువాని నాదయితు సత్తమ! మిత్తిమొగమ్మునుండి యి
ట్లిచ్చితివే? వెలార్చి నిను నెమ్మెయిఁ గొల్తు? ఋణంబు దీర్తు నె?
ట్లచ్చెరువైన నీకృతికి నాజని దాసిని గాదు కాదసం
బిచ్చిన బిడ్డ నమ్మలకు మెప్పటి కంచు సుమేధ మ్రొక్కెనన్. ౨౯౧

గీ. దాని దీవించి మించు సంతసముతోడ
దంపతులు తల్లిదండ్రు లుత్తములు ద్విజులు
పౌరు లన్యులు నంప నప్పరమయోగి
యింటి కేగి యథాపూర్వ మెలమి నుండె. ౨౯౨

ఉ. అట్టివ చేసెఁ జాలకృతు లాతని కెం దభిమానదంభము
లుట్టివ దత్తదేవుకృపఁ బుణ్యుఁడ! రోగవినాశనంబు చూ
పట్టె యథోక్తమంత్రనయపద్ధతి నిట్టులె శాస్త్రజాతముల్
పట్టిన యీ యవిద్యఁ బెడఁబాపఁ జుమీ కడుఁ బట్టువట్టెదున్. ౨౯౩

ఉ. ఆగమజాతి భోగపర మంచు విమోహకరం బటంచు న
ర్థాగమహేతు వంచును శ్రమావహ మంచుఁ దలంపరాదు త
ద్యోగము ధర్మకామవితతిం బ్రజ నైహికమందు స్వర్గతిన్
యోగమునందు సాంఖ్యమున నూనదు నిష్ఠ నొకించుకేనియున్.

గీ. శత్రుమరణవశత్వాభిచారకృతులు
శాస్త్రధోరణి యెపుడు విశ్రాంతి నెనయ
దఖిలజీవుల విషయాభిముఖుల మేలి
మాటల మరల్చి మోక్షకామ మిడఁ గాని, ౨౯౪

ఉ. ప్రాతిగ నీతిబాధల భరంపడువానికిఁ దత్త్వ మంటునే?
యేతఱిఁ దీని నెమ్మియి నయింపఁగ నాఁ గ్రమ యుక్తి నమ్మియిఁ
బాతకము ల్సడల్చి తముఁ బాయనివారికి నాగమావళుల్
చేతముశుద్ధిఁ గూర్చి ప్రతిషేధ మొడంపడఁ జెప్పుఁ దత్త్వముఁ. ౨౫౬

గీ. తత్త్వమస్యాదివాక్యబోధప్రదీప
భానమున కర్హ మైన శుభ్రత వహింప
హృదయమును జేయవలె నన్న నెవరితరము
గురుల తరము శాస్త్రమ్ముల తరము గాక. ౨౫౭

గీ. ఎంతలో నగు సద్గురు నెనసి భక్తిఁ
దన్మహావాక్యబోధసందర్భయుక్తి
సాధకుఁడు సహజానందసంపదఁ గృతి?
శాస్త్రముల కింతకే పరిశ్రమము గాని. ౨౫౮

గీ. ఇప్పు డీ కథ వినలేదె? యెల్లరోగ
ములు ప్రశాంతము లొనరించి బోధసేసె
విష్ణుదత్తుఁడు మను వని విషయవశున
కాగమమ్ములు తత్త్వమ్ము నట్లె చెప్పు. ౨౫౯

సీ. ఉపమ సెప్పెద విను మొక బాపనిల్లాలు
జ్వరము వచ్చిన తన శాబకునకుఁ
జేదుమందు నొసంగెఁ జేతికిఁ ద్రావు మం
చతఁడు మూఁజూడఁ జేయత్నములను
లడ్డుక మిచ్చెద బిడ్డ! త్రావర యని
యది చూపి కరమున నట్టె పెట్టె
నౌషధ మా కుఱ్ఱఁ డాసక్తి ద్రింగుచో
భక్ష్య మూడ్చె నది యపథ్య శంక
లడ్డువంటిది శాస్త్రఫలంబు చువ్వె
పరమఫలిత మారోగ్యసంపత్సమంబు

జ్వరము సంసారబాధ శాస్త్రతతి తల్లి
మఱి మహావాక్యమననంబె మందు శక్ర! ౨౬౦

విష్ణుదత్తుఁడు పిశాచమును వంచించి విప్రుఁ గాపాడుట

గీ. పెక్కుమాట లిఁకేల? యింకొక్క ముక్క
చెప్పెదను చిత్తగింపు మంచితనయుండ!
ఒక్కద్విజముఖ్యునకుఁ గల దువిదమిన్న
భార్య రతిసుమనోహర పరమసాధ్వి. ౨౬౧

ఉ. వానికి దూరమేగు పని వచ్చె నొకం డిలురక్షఁ గూర్చి య
జ్ఞానకు స్వాచింపదగు నట్టి సమస్తము శిక్షసేసి యే
మైన నను దప్పదంచుఁ జనె నక్కట రాఁ డొకమాసమేని నీ
లో ననువేద నాఁకఁగొనె లోలపిశాచుఁ డలోలుపం దమిన్. ౨౬౨

సీ. ఆచార ముడిగి కామాతురుఁ డై బ్రహ్మ
చారియే చచ్చి పిశాచ మయ్యె
లక్ష్యపెట్టం డేరి లాతిదయ్యాలనే
పెక్కువిధాలఁ దాఁ బీడపెట్టు
మంత్రవాదుల కేని మర్యాద దక్కదు
వానిదారికి నడ్డపడఁ దలఁచిన
నందకత్తె యొదేని నగపడెనా? దాని
బలమున ఛలమునఁ బట్టి వేఁచు
వివిధ శేషి రఘుంటిగ నామ విశ్రుతుండు
దేశమున కెల్ల తీఱని తెవులుగొంటు
వాని కంటఁబడె న్మనుపే నతాంగి
యెట్లు సమకూరునా? యని యెంచు నెపుడు. ౨౬౩

ఉ. ఆదినమందె యా కుధి తదంతరముం గని వాని వేషభా
షాదిక మిచ్చమైఁ గొని గృహం బెనసెం దగ సాయమైన న

త్యాదరవృత్తి భర్తయని యన్నె మెఱుంగని వన్నెలాడి తా
నాది ముదా ప్తిఁ బాదజల మాచమనీయ మొసంగు సంగతిన్. ౨౬౪

గీ. చాలదినముల పయన మం చా లలిఁ జని
యిప్పటికి నిప్పుడే వచ్చు శేమివిధ మ
టంచుఁ బ్రశ్నించె మంచిగా నించుబోఁడి
య య్యనిందితతో దుష్టుఁ డనఁ బొసంగ. ౨౬౫

ఉ. ఎవ్వరికోస మొచ్చుటికి నేగెద నంచు వచించినాఁడనో?
యవ్వసుధామరప్రవరుఁ డధ్వమునం గన నై వచించినాఁ
డివ్విధ మిప్డు కాదు నెల యేగిన రమ్మనె నేమి సేతు? నీ
మవ్వము దివ్వ దవ్వయిన మాపటికే యిలు సేరఁబొఱితిన్. ౨౬౬

ఆ. అనిన నట్టు పుట్టు వానుమా లెఱుఁగని
సాధ్వి యూరకుండె సత్యమ యని
వాఁడు నుప్పుఁ డట్లు వర్తించి యపరరా
త్రమున వశ మొనర్చి తపులుకొనియె. ౨౬౭

క. ఎక్కడి మగఁ డెక్కడి జగ
మెక్కడి రతిసుఖ మటంచు నెలనాగ మదిం
బొక్కుచు నీఁక నేమియు నన
నెక్కము గాకున్న విధికిఁ జిక్కి కలంగెన్. ౨౬౮

చ. నయవతి బాల శీలిని మనస్విని నందియమందు డెందమం
ద యువఁడు వీఁడు నా పతికి హా మును పింతటిదార్ఢ్య మీా బలం
బయుతవికారము ల్కలవె? యా నని కా దని యెట్లు లందు? న
న్నియును విలక్షణంబులె మనీషి యతం డితఁ డేటిదయ్యమో? ౨౬౯

ఆ. ఇంతలోనె మాస మెడసి చనె న్వచ్చె
వాఁడు గూడ నింతి పరమ విస్మ
యమున మునిఁగి యనియె హానాథ! యిది యేమి
యనుచు నడుగ వృత్తమును వచించె. ౨౭౦

సీ. ఎక్కడివాఁడ వీ వెవ్వాఁడవుర యన్న
నెక్కడివాఁడ వీ వెవ్వాఁడ వని
నక్కజిత్తులు నేర్చినాఁడవు లే యన
నక్కజిత్తులె నేర్చినాఁడవ యని
రక్కసిగుండ్రఁడ యీ తక్కులాఁడని యన్న
రక్కసిగుండ్రఁడ యీ తక్కరి యని
పెక్కుమాట లిఁకేల? వెడలు వీధికటన్న
పెక్కుమాట లిఁకేల? వెడలుమ యని
యన్నమాటలె యనుచుఁ దా రన్నకొలఁకు
గట్టిగా వాదులాడి లగ్గలకు నెక్కి
మిగిలి సికపట్ల కగ్గమై మేరమీఱి
నూరివారలు ప్రోవైరి వీరు వారు. ౨౨౧

చ. ధనము గృహంబుఁ బెండ్లమునుఁ దాఁగొని యుండె సుఖంబ వీఁ డటం
చును నిజబంధుమిత్రబుధశూరసమాజముఁ బ్రోవుసేసి చె
ప్పు నొకఁడు వారితోడ నదె పో మఱి చెప్పు ద్వితీయుఁ డిందఱుం
గని విని యాను గాదని యొకండు ననం దెసఁ గాన కున్నెడన్. ౨౨౨

ఉ. వేసము బాస తీరు నెఱివిభ్రమ మభ్రమ మొక్కతీరుగా
భాసిలు వారిఁ జూడఁ దమభావము సందియ మందుచుండ న
భ్యాసముఁ జేర్చి తేర్చి సభవా రొక యప్రియముం బ్రియంబు వి
శ్వాసమున న్వచింపమికి వారలు రేఁగి జిగీషులై వెసన్. ౨౨౩

ఉ. గ్రామమునుండి గ్రామముఁ బురంబుననుండి పురంబుఁ జేరుచున్
వాముఁ డవాముఁడు న్వివదమానులునై వెసఁ జేరి రప్పు డు
ద్దాముఁడు విష్ణుదత్తుఁ గనఁ దన్నగరంబున వారితోడ నా
భామిని దాని పక్ష మవు బాంధవవర్గము నిశ్చయార్థమై. ౨౨౪

గీ. అమ్మెయిం బోయి విష్ణుదత్తాఖ్యు పాద
కమలముల వ్రాలి వృత్తవృత్తము వచించి

యెదుట నిలఁబడి రిరువురు నేమి యనునొ?
యని సమాగతు లచ్చెరు వంది వినఁగ. ౨౭౫

గీ. వచ్చువారలఁ గాంచి సర్వజ్ఞుఁ డతఁడు
భూత మొక్కటి మానుషపురుషు డొక్కఁ
డేమి సేయఁగ నుచిత మకా నిప్పు డని మ
ది న్విచారించి యనియె నీతి వెలయింప. ౨౭౬

చ. వయసును రూపము న్స్వరము వర్ణ మవస్థయు శీలము న్గతం
బయము నయంబు స్వాకృతి సమాఖ్యము గోత్రము నేకరూపముల్
జయ మజయమ్ము నెమ్మెయి నసంశయవృత్తిఁ గొనంగ మా కగుః
దయను క్షమింపుఁ డిందఱు విధాన మొనర్చెద నొం డెఱుంగఁగః ౨౭౭

క. అని పలికి వారిఫాలం
బునను విలక్షణముఁ ద ప్తముద్ర సమంత్రం
బనువు కొలిపెను విపర్యయ
మన రా కుండంగ యోగి ప్రారంభమునః. ౨౭౮

చ. ఒకనిని దూరమం దునిచి యొక్కని దగ్గఱఁ బిల్చి యడ్గె నే
మి కలదు నీగృహంబున భ్రమింపక చెప్పు ధనంబు భాండ మం
శుకము నకుప్యకుప్యములు సుందరియందలి చాటు మాట ల
క్షకములు తప్పఁ జెప్పిన నిజం బనిన న్ఫల మట్టిఁ డంద నొ. ౨౭౯

మ. అని తత్ప్రోక్తము నెల్ల నొక్కెడ వ్రాయ న్బంచి వాని న్వెలా
ర్చి నయం బార ద్వితీయునిం బిలిచి యారీతిం దదుక్తంబు నె
మ్మిన వ్రాయించి తలోదరిం బిలిచి నీ మేనం గృహంబందుఁ గ
ల్గిన సర్వస్వముఁ దెల్పు మం చదియు నోలిం జెప్ప వ్రాయించె మునః.

మ. ఇఁక మధ్యస్థులు దాను నిత్థ మిద మం చేమో విమర్శించి యా
రక మట్లుంచి ప్రహాసభాసురము గా రావించి య య్యుద్ధఱం
బ్రకటం బీ పుర మైదుక్రోసులు సుమీ ప్రస్తారముం జుట్టి వా
రక రం డెవ్వఁడు ముందు వచ్చు విజయారంభుం డతం డయ్యెడుః.

గీ. ఊరకే పోయి వచ్చుటా? యూరిచుట్టు
నున్న వేల్పుల లక్షణా లున్నయట్టు
లుభయులును బేర్కొనవలె నుచితయుక్తి
సరసి రం డని వారల ననిచిపుచ్చె. ౨౮౨

గీ. చూచి ముందర వచ్చి పిశాచవిభుఁడు
జయముకై స్పష్టమైనట్టి సర్వ మనియెఁ
జచ్చిచెడి రెండు జాముల సమయమునకు
వచ్చి విప్రుండుఁ జెప్పె న వ్వాస్తవంబు. ౨౮౩

చ. మరల వచించె యోగి జనమాన్యులు మానులు సిద్ధులెంద ఱీ
గిరివరమందు నుండిరో? యెుగిం బ్రణమిల్లుచు గోత్రనామత
చ్చరితము లెల్లఁ జెప్పవలె శైలముచుట్టును జుట్టివచ్చి యం
దరముగ వచ్చువానిదె జయం బని పంపినఁ బోయి రిద్దఱున్. ౨౮౪

ఉ. హా మ్మని వచ్చి చెప్పెను ముహూర్తములోనె పిశాచవల్లభుం
డ మ్మల నున్న సర్వవిషయమ్ము సుఖమ్ముగఁ బూస గ్రుచ్చిన
ట్ల మ్మహిదేవుఁడుం దిరిగి యామము వేగఁగ నుండ రాత్రి దుః
ఖమ్మునఁ జేరి యమ్మహితుఁ గాంచి వచించె నిజప్రకారమున్. ౨౮౫

గీ. అగపడనె లేదు నాకు మహానుభావు
లెట్లు గోత్రమ్ము నామమ్ము నెఱుఁగఁగలదు
చంపు బ్రదికింపు మున్నవా స్తవము ననెదఁ
దిరిగి వచ్చితి గిరిచుట్టు ద్విజవర! యని. ౨౮౬

క. అది యిది మది నిడి యనెఁ గవి
విదితుఁ డొక పరీక్ష యింక వెలితిపడె వినుం
డది యైన సుదతి నొప్పిం
చెద నని తెప్పించె నొక్క చిన్న కరకమున్. ౨౮౭

క. ఇరువురిలో నెవరైన
న్సరే చోరుఁడు దీన ముఖమునన్ వెడలుఁడు సుం

దరిఁ జెందనున్నఁ గొమ్మునఁ
బరీక్ష యింక లే దిది కడపటిద యనునెడన్. ౨౮౮

ఉ. నేఁడిగ రేఁగు నూ ర్పధరబింబము నార్పఁగ నాకు నాదు పూఁ
బోఁడికి నెంతదవ్వు చెడిపోవుచు నున్నది కార్య మంచుఁ గా
రాడుచు నొక్కఁడుండఁ గొని యాడెద నిమ్మెయి న మ్మనస్విని
మూఁడు పరీక్షలం గెలిచి పోదునె? యం చొకఁ డుత్కచిత్తుఁ డై.

ఆ. విభునిముదలఁ గాంచి వేఁ జొచ్చె లోహంపు
గిండి మొగమునందు నుండి వెడల
కుండఁ గొమ్మునందు నొనర మంత్రముల బం
ధించె దత్త దత్తధీచతురుఁడు. ౨౯౦

క. చెడిపోయె ననుచు సంభ్రమ
పడి మొగమున నెడల నెంచు వానికి నదియే
నొడఁగూడకుండ నాలోఁ
గడువడిఁ దన్ముఖముఁ గూడ ఘనుఁ డాకట్టెన్. ౨౯౧

మ. సుజనోపద్రవదుఃఖకారకము నాశుప్రజ్ఞుఁ డా భూతమున్
ప్రజ లెల్లం గొనియాడ నే ర్పెసఁగ నిర్బంధించి యా గిండితో
విజనం బా నిలఁ గీలితం బొనరిచెన్ విప్రుండు దత్తాన్వయున్
నిజపాదాబ్జములందు వ్రాలి కొలువన్ నీతిజ్ఞుఁ డిమ్మై నను౯. ౨౯౨

ఉ. చూచినయప్పుడే ఖలునిచో ష్పఖిలంబు నెఱింగియుండియున్
నీచుఁడు రిత్తమాటలకు నిల్చునె? యం చపవాద మింతతోఁ
బాచెద నంచు నీతిమెయి బద్ధ మొనర్చితి సర్వనీయులా
రా! చిత మైన సంశయ మరంబె విరామముఁ జెందెనేకదా. ౨౯౩

చ. తడబడె లక్షణంబులను దారి ద్వితీయపరీక్ష భేద మే
ర్పడె నరుఁ డంచు భూత మని పాసెను సంశయమే తృతీయమం
దెడ రడఁగం జతుర్థము పరీప్సిత మైనది శాస్త్రజాల మ
జ్ఞుఁడు దన యజ్ఞతం దొఱఁగు చొప్పునఁ జెప్పి విబోధ మీయదే?

గీ. ప్రకృతిలో నున్నవానికిఁ బ్రకృతిదృష్టి
కాక యప్రాకృతము చూపు గలుగు నెట్లు?
శాస్త్రములు లోకవిజ్ఞానసరణి నూది
విశ్రమించు నలోకసంవిత్సమాప్తి. ౨౧౫

క. ఆ యోగివరాచరితమె వ్యాయోగం బనెద నొకటి వాసవ! విను మా
జాయాసతు లొక్కెడ విద్యాయుతులే కని రొకసుతు నత్యున్మత్తుఁ.

విష్ణుదత్తుఁడు విప్రకుమారు బోధించుట

సీ. వాగుచు నిలిచియే పాన మన్నము భక్ష్య
మశనించు నొరులకు వశముకాఁడు
జల్పన్ములుండఁ దిష్ఠన్మాత్రుఁ డను పదా
లతనిమూలమ్మున నభిధకయ్యె
ననవచ్చు నిది యిది యనరా దను విమర్శ
ముడిగి తన్ముఖమున వెడలు నుడులు
వడుగు చేసిరె కాని వహ్నికార్యము సంధ్య
సావిత్రి జప మను సరణి లేదు
తల్లి తండ్రియు నేకపుత్త్రికుని వాని
సంస్కరించు తలంపున శ్రమపడ నయి
రడవి గొడవ పిశాచ మెయ్యదియొ వొడమె
దారి కెటు వచ్చు నంచు నందఱు వాసింప. ౨౧౭

సీ. మందుల నిప్పించి మంత్రజపమ్ములఁ
జేయించిరి ధనవ్యపాయ మనక
యేపుట్టలోపల నేమి పా మున్నదో?
యని సర్వతీర్థమ్ములందుఁ దోఁచి
రర్పించి రఖిలదివ్యవ్రాత మతిభక్తి
విసువక యుపవాసవిధులఁ దీర్చి

రెన్ని వ్రతమ్ములో? యెన్ని దానమ్ములో?
యెన్ని ధర్మమ్ములో? యెన్న రాదు
యిన్ని సేసిన లాభ మింతేని గాన
రాదు ప్రకృతికిఁ గాదు కింక రాఁ డను నెడ
నెవ్వరో చెప్పి రిపు డేగు మేగు మనిరి
విష్ణుదత్తునిమహిమంబు విశ్రుతి నని. ౨౯౮

గీ. వెంటనే దంపతులు సుతు వెంటఁ బెట్టు
కొని చనిరి తన్నగరమునకు నతిభక్తి
విష్ణుదత్తుని దర్శించి వినతు లైరి
పుత్త్రిచరితంబు వినిపించి రాత్రపడుచు. ౨౯౯

ఉ. ఒక్కఁడె మాకు బిడ్డఁడు నహో యితఁ డిట్టిఁడ యైన జీవనం
బెక్కడి దక్కటా కలిగనేనియు సొంపును జంపు గల్గునే?
మ్రొక్కులు పుత్త్రిభిక్ష యిడి పున్నెముఁ గట్టుకొనంగఁబోలు నా
న క్కరుణాకరుండు తదుదంత మెఱింగి తెఱంగు సొప్పడన్. ౩౦౦

క. నాకడ నుండును మీ కొడు
కాఁకటఁ గడు డస్సినార లరుగుం డింటన్
బాకము సిద్ధం బైనది
కైకొనుఁ డాతిథ్య మెసఁగఁగా విశ్రాంతుల్. ౩౦౧

గీ. అనిన నో మని వారు గృహాంతరమున
భోజనపుఁ బని నుండ న మ్మునివరుండు
నల్ల శిశుతల్లజుం గని యాదరమున
మేలి సంలాపమునకు నిమ్మెయి దొడంగె. ౩౦౨

గీ. బ్రహ్మమూర్తీ! యెవండవు? వచ్చితేల?
యేమి పని నీకు నాతోడ? నేమి సేయు
చుంటి వేగుము తలిదండ్రు లున్న వసతి
కనుభవింపు యథాసుఖ మఖిల మన్న! ౩౦౩

క. ఏ నేమి సేయవలయునో?
యీ నీ బహిరంగచేష్ట నిఁక విడిచి లస
న్మానసమునఁ గొనినది యను
మానముఁ బోవనడచి యనుమా యనుచుండన్. 304

గీ. ఏమి సేయుదు నెక్కడి కేగువాఁడ?
దేనిఁ గావలె నని కొందు దేని విడుతుఁ?
గార్యగంతవ్యపరవస్తుకలన లేక
పూర్ణుఁ డై యుంటేఁ బ్రాలయాంబువుల పగిది. 305

శా. జ్ఞానానందమయుండ నాకుఁ గలవే జ్ఞాతవ్యభోక్తవ్యముల్?
పానం బన్నము నేన త్రావఁ గుడువన్ బ్రహ్మాత్మ! యోగ్యత్వ మే
దీ! నిష్ఠించి వచింప నించుకయు లేదే పల్కు? నే నంటె సి
గ్గౌ నంచాడెడు యోగి యోగి కని బాహ్యాసంగ మొప్పారఁగన్. 306

మ. అనఁ జొచ్చెం బ్రతివాక్య మ ట్లయినఁ గద్దా? దోస మాచారమం
దనఘాత్మా! సుఖముండు మింటికడనే యజ్ఞప్రబోధార్థ మా
పనినై నం బొనరింపు వర్తిలుము జీవన్ముక్తభావంబుతో
ఘనబంధం బిది కాదో? యం చనెడు శంక న్మాను మే నాడెదన్.

సీ. దేహాఽభిమానంబె తెచ్చిపెట్టును బంధ
మును ముక్తి తత్త్యాగము నిజ మరయ
నాది నే ననుటె బంధము రూపము స్వరూప
మేను నాయది కాద యెదియు ననుట
మానావమానసంభవగుణదోషమ్ము
లభిమానవంతునియంద తోఁచు
హర్షవిషాదముఖ్యవికారవిషయవా
సన లభిమానసంజాయమాన
ములు శరీరాత్మబుద్ధికి మునివరుండ!
లేదు సంగ మద్ధాబుద్ధి కీ దెసఁ గను

జాని వర్జించి కర్మవర్త్మమున మెలఁగు
మూఢునకె లేని సంసృతి బుధున కేది? ౩౦౮

గీ. మనుజులకు బంధమోక్షకారణము మనము
సవిషయము బంధకరము మోక్ష మొనఁగూర్చు
నిర్విషయ మైన లేదు సందేహ మిందు
నవధరింపు బుద్ధ్యాదుల కవలివాఁడ! ౩౦౯

గీ. ఇంటిపని వ్యగ్ర యయ్యుఁ బరేచ్ఛ నారి
పరపురుషసంగసుఖరసాస్వాద మొనయు
నట్లు జ్ఞాని బహిర్వ్యవహారి యయ్యుఁ
బరపురుషసంగసుఖరసాస్వాద మొనయు. ౩౧౦

గీ. మోక్ష మాకాశమునఁ గాని భూతలమునఁ
గాని పాతాలమునఁ గాని కలుగఁబోవ
దది యహంకారరూపమోహావసాద
మగుట నిజరూపసంస్థానమ యగుఁగాదె? ౩౧౧

గీ. అ య్యహంకృతిసంత్యాగ మన్న నించు
కేని శ్రమ మొనయంగ నొ కృతియ కాదు
కౌసుమావదలనమునకన్న లోచ
నాంచలనిమీలనముకన్న నది సుకరము. ౩౧౨

ఉ. చంచలశక్తికం బయిన స్వాంతమె లోకసమాకృతి న్విడం
బించు గ్రహించు న వ్విషయమేలనముం గొనియాడు నర్థి యా
చించు భ్రమించు మోహమునఁ జెందు స్వయంకృతము న్స్మరించు గీ
సంచున నద్వితీయమున సంచలనం బెనయుఁ ద్వితీయ మై. ౩౧౩

క. ఇది యంతయు నీ వెఱుఁగని
యది కాదు మహామునుండ! యా యీ చేష్టల్
వదలుము పిత్రుసంప్రీతిఁ
మది దలఁచి వసింపు మింట మర్యాదమెయిన్. ౩౧౪

ఉ. నాకుఁ బ్రియుండ వౌట మునినాథ! వచించెద శాస్త్రి గాద యీ
లోకస్మృతి న్మలంగు మెదలోఁ గొని కొండొకకాల మంతపై
నీ కగుదారిఁ బోరె దని నీతులు సెప్పి భుజింపఁ జేసినన్
ఖీకిఁ దొలంగెఁ దన్మహిళ పెట్టిన యన్నము గొన్న యన్నెటన్. ౩౧౫

గీ. ఇంతలో లోన విశ్రమం బెనసి వచ్చి
తల్లిదండ్రులకును బ్రణామిల్లె నాప్తి
వారు నతివిస్మయం బంది బ్రాహ్మణవరుఁ
గొలిచి కొనియాడ నైరి సంకోచ మెడల. ౩౧౬

సీ. మందులశక్తియో? మంత్రమహత్త్వమ్మొ?
క్షణములోనె ఫలించె స్వామి వైద్య
మెదియుఁ జేసినయట్టులే లేదు తాదృశం
బేతాదృశం బెట్టు లింత కయ్యె?
మీబోంట్ల మాటలే మేలిమంత్రములు గా
కవి వేఱ లే వది యట్టు లుంచు
మనఘ! దయానిధీ! యన్నివిధమ్ముల
జీవన మ్మిచ్చి పుచ్చితివి మమ్ము
నెమ్మెయిం దీర్తుమో? యింక నీఋణమ్ము
కాక యధమర్ణతం ద్రోవఁ గలదె త్రోవ
యనుచుఁ దత్సత్కృతు లయి నెయ్యమునఁ గొలిచి
కొడుకుఁ గొంపోయి రింటి కెక్కుడు ముదమున. ౩౧౭

ఉ. ఆనెటి యోగి వారి మరణాంతము నుండి యథాసుఖంబుగాఁ
గా నగు కర్మము ల్వరుసగా నెరవేర్చి చరించె నీక్షమన్
జానుగ నాత్మబంధుఁ డపసంస్మృతిబంధుఁడు నౌచు మున్నె వి
జ్ఞానసుధాబ్ధి బోధమున సంగభయం బెడయం గృతార్థుఁ డై. ౩౧౮

సీ. కావున మోహమాత్రావృత మీ లోక
మాత్మ చిద్ఘను నిత్యు ననిశ మెనసి

తన్నుఁ గర్త వికర్త దాత భోక్త నటంచుఁ
దలఁచి విమూఢ మై తపులు బలిమి
ప్రత్యయసాక్షితఁ బ్రత్యక్ష మనుభవిం
చియు నే నెవఁడ నెట్లు చెందు నెందు
నాకు నాత్మజ్ఞానదయ మని పరువెత్తు
బాహ్యసాధనములఁ బడయు వితగ
జనని కుచకోటరాసువ్వుఁ దనయు మఱచి
యేడ్చు చుం దందు నెమకంగ నేగునట్లు
గొల్ల కక్షస్థ మవు గొఱ్ఱెపిల్ల బింబ
మంధువునఁ జూచి భ్రాంతి మల్లాడు నట్లు. 3౧౯

గీ. ఇవ్విధమ చెప్ప శాస్త్రమ్ము లెవ్వియేని
మోహమాత్ర మనువదించి ముందు తన్ని
రాసపర్యవసన్నము లై సొరిది జ
నంబున కెద సుఖంబుగా నగవిరోధి! 3౨౦

గీ. మున్ను లేనిది యణుమాత్రము నొనరింప
వలయునది లేద యాగమాధ్వమున నెందు
శాస్త్రముల నున్నచదువు తాఁ జలుపునదియు
మోహసంపాదితదై వ్రతమున కలనలె. 3౨౧

క. ఇది యెల్ల విమర్శింపుము
మది నా శాస్త్రీయరచన మంచియొ చెడుగో?
త్రిదివేశ! నిర్ణయింపుము
పదులును వందలును వేలు పలుకు లిఁకేలా? 3౨౨

చ. అని గురుఁ డన్న విన్న యమరాధిపిభుం డభిమానముం ద్యజిం
చి నమనతత్పరుం డయి వచించె నతిక్రమముల్ క్షమింపు మా
ర్య! నిఖిలశాస్త్రధోరణు లనాది నవిద్య నెడల్ప నాత్మ వి
జ్ఞానమువున సంప్రకాశితు నొనర్ప నటం చిపు డే నెఱింగితిన్. 3౨౩

చ. బహువిధ మాగమార్థ మను పర్యవసాన మెఱుంగ లేని మో
హహతుల మాట కేమి? మహితాత్మ! సమన్వయ మాయె నాయెడన్
విహితభవద్విబోధ మని పెక్కనతు ల్నుతు లాచరించి పో
యె హరిహాయుఁడు గీష్పతి నిజేష్టపరుం డయి యుండెఁ బార్థివా!

క. ఇతిహాస మ్మిద్ది సమా
హితమతి నెవ్వఁడు ధరించు నెక్కాలము మో
హతమం బావిద్యక మా
కృతి కార్మణబంధము క్తికిం బాఁచి తగున్. 3_౨౫

క. అవహితమనుండ వై విం
టివె? సప్తోదాహరణి గడించితె తత్త్వం?
బవనీశ! మదికి నించెనె?
భవదభిమత మింకఁ బలుకువాఁడఁ గొనఁగదే. 3_౨౬

క. అను గురున కెలమి మ్రొక్కెను
జననాథుఁడు పలికెను మఱి జగదీశానా!
ఘనభవదనుబోధంబున
వినష్టసంశయుఁడ నైతి విద్యార్థ్యమునన్. 3_౨౭

ఉ. నీదయ వేదశాస్త్రముల నిర్ణయ నిర్ణయ మొంచిన వ్విసం
వాదము లేద యిప్పు డుపపాదిత మయ్యెడు నర్థ మేక మె
చ్చోఁ దిలకించినన్ మునుపు క్షుద్రము లన్న మతమ్ము లిప్పు డు
త్పాదిత తన్మహార్థత ముదం బొనరించెను జిత్తవృత్తికిన్. 3_౨౮

క. మన మిది యాత్మవిబోధ
మ్మునఁ జులుకన చొచ్చులాగు పుణ్యభవద్వా
క్ప్రణిరూపితనిర్ణయమున
కు నపేక్షపడెదు తెఱంగుఁ గొనకొనె ననఘా! 3_౨౯

మ. అఖిలాతీతుఁడు బ్రహ్మనిష్ఠుఁడును నై యాదేహ మాసక్తి లే
క ఖిలాప్యవ్యవహారమార్గమున ముక్తం బైన చిత్తంబుతో

సుఖముండం దగురీతిఁ జెప్పి గురుఁ డీ శుశ్రూషు నోమంగ నా
ముఖ మొప్పం జూచి యంచు రా జనె నవ న్మానించి యాచార్యునిన్

క. దీపకుఁడు యానవిద్యా
రూపకులద్యోతయదీపరూపితుఁ డనియెన్
నా పున్నెమ్మున వింటి ద
యాపర! పరమేతిహాస మది మదిఁ గొనియెన్. ౩౩౧

క. హృదయానందవిధాయక
మదియుం దత్త్రేశవర్ణితైతిహ్యము సం
మద మొదవించెం బ్రాకృతు
లెద నిది శీలించి తత్త్వ మెఱుఁగుదు రార్యా! ౩౩౨

ఆ. ఇంద్రుసందియంబు నినుసంశయంబును
దీఱె నాదు శంక తీఱకున్నె?
యిది యిటుంచి నృపున కీశుఁడు బోధించి
నట్టి చొప్పు చెప్పు మని యనుటయు. ౩౩౩

మ. సమయన్యాయవిచార్యమాణసుమనస్సంవిత్తసత్త్వాక! ని
ర్మమతావ్యక్తవిదుఃఖతాభిమతభూమప్రస్తుతానంద! చి
త్త్వమహత్త్వాభినయప్రకారవిలసత్తాత్పర్య! చందోల్పురీ
సుమనోభాస్వదలింగలింగితలసచ్ఛ్రద్ధాంగ! లింగోద్భవా! ౩౩౪

క. లింగగతవృత్తిభంగీ
భంగీకరణప్రకారబాభాతపజా!
లింగతదాసీంతనతా
సంగీతస్థూలరూప! చంద్రపురీంద్రా! ౩౩౫

మా. ప్రతిశరదుపయాతప్రస్ఫురన్మాధవీస్వీ
కృతమధుమధుమాసోత్కీర్ణతత్పూర్ణిమాంతా
హితహితపరిచర్యాస్వీతకల్యాణవేలా
గతకవివరవర్ణ్యాఖండఖండాత్మలీలా! ౩౩౬

సీ. ఆంధ్రేల రామకథాఽమృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
నను( గనె( దనయు వి త్తనయు( జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్య( దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ ముఖములు(
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదిగొ
ప్రసవగుచ్ఛంబు గై కొను పంచమంబు. 332

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## షష్ఠ గుచ్ఛము

క. శ్రీనగరాయితచంద్రపురీనేత్రోత్సవవిధానవృత్త్యవధానా!
భానాఽభానపరత్వాధానా! లింగోద్భవాభిధానాఽధీనా! ౧

ఆ. అవధరింపు మీశ! ఆమీఁది గురుశిష్య సంలపనవిశేషచాకచక్య
మ గ్గురుండు భక్తుఁ డాత్మప్రియుం డైన దీపకునకు నెచ్చి తెలిపె నిట్లు.

మ. స్మయమానాస్యలసత్సరోజుఁ డనుకమ్పామందిరుం డిందిరా
ప్రియతావిత్తుఁడు దత్తదేవుఁ డనియెం బ్రీతి న్విలోకించి శి
ష్య! యతాత్మా! యిట దత్తచిత్తుఁడవు కమ్మా స్వానుభూతాత్మతా
వ్యయసంపత్తి నెలర్చి కాఁగలవు జీవన్ముక్తతావస్థకున్. 3

చ. మును పతిదుర్లభం బడుగఁబో యవమానద మర్థధర్మకా
మనిచయభోగభంగురము మానిత మీశ్వరభావ మద్దె యీ
యనె? యలనాఁడు నేఁటికిఁ గదా భవదాత్మ ముముక్షు కయ్యెడున్
విను మిదె కూర్చువాఁడ నిఁక వేఁడనిదాని నొసంగ నెట్లగున్? ४

సీ. ఆకలి వాయంగ నన్న మెమ్మె దేయమ్ము
నీర్వట్టునకు నగు నీరు వోయ
రోగికి నౌషధం బీఁగావలయు నిద్ర
నాతురునకు నీయ నగు సుశయ్య
కామాతురునకుఁ దత్కామపూర్తియె విధి
బద్ధునకు విముక్తి భావనీయ
మే యిచ్చగలవానికిఁ బాడి యదియ య
న్యేచ్ఛున కన్యమ్ము నీఁగి వ్యర్థ

మనుచు నడిగిన దిచ్చితి నప్పటి కటు
లట్టి యైశ్వర్య మెల్ల నేఁ డస్థిరముగ
నాత్మ నెంచితె? మెచ్చితి నౌర సత్య
మక్రియము నిత్య మగు మార్గ మరసితోనెదె? ౫

దత్త దేవుఁడు కార్త వీర్యునకుఁ దత్త్వము నుపదేశించుట

క. నీరూపు నీకుఁ జెప్పెద
నోరీ! ముక్తుండ వయ్యె దొకమాత్ర నిర
ర్థారూఢమ్ముల యీ రెం
డౌరా బద్ధుండు ముక్తుఁ డను శబ్దంబుల్. ౬

గీ. బంధ మున్నదొ? ముక్తి యెప్పటికి నెట్లు
కలుగుఁ గలిగెడు నది నిల్వఁ గలదె యెందు?
నది వచించెద నెమ్మది నాలకింపు
వస్తుమాత్రమదాకారవై భవమ్ము. ౭

గీ. అస్తి భాతి ప్రియ ప్రత్యయాభిమతము
నామ రూప సమయ దేశ నయ రహితము
నిన్న నేఁడును రేపు సంపన్న మొకటి
నిర్విశేష మసామాన్య నిరతిశయము. ౮

క. నీరంధ్ర మనిర్వాచ్య మ
కారణ మవిచింత్య మప్రకార మలక్ష్యం
బై రహితనికేతన మై
యారాద్దూరములు లేక యది వెలుఁగొందుః. ౯

గీ. నామరూపాదికవికల్పనలకు మూల
మదె యధిష్ఠాన మీ భ్రాంతి యొదవ ననియు
నట్టి శాస్త్రంబుచేతనే యట్టివాని
కే స్వరూపోపలబ్ధికి నెంచఁబడియె. ౧౦

గీ. మోహమాత్రమ్మె భ్రమము రూపు గొన లేద
డాని కదియు ననాది య జ్ఞానికి బుధు
లాది బాలబుద్ధివిశుద్ధి కాదుదు రది
వా స్తవము కాదు శాస్త్రసంపాదితంబు. ౧౧

గీ. జీవుఁ డీశుఁడు సంశుద్ధచిత్తు జీవ
దేవభిదయు నవిద్య తద్ద్వితయయోగ
మా చివి యనాదు లం చని రజ్ఞభావ
కల్పితయె యీశజీవజగత్ప్రక్లృప్తి. ౧౨

ఉ. ఇందు నవిద్య లేనియది, యెమ్మెయిఁ దత్కృతభేద ముండు? న
స్పందునకుం బరాత్మున కెసంగును యోగము వేనితోఁ జిదా
నందనిజస్వరూపకలనం గనరానిద ద్వైత, మజ్ఞదృ
ష్టిం దిలకింప నైన నగు శ్రీగురుబోధ మెలర్చునంతకున్. ౧౩

శా. ఆ నామమ్ములు రూపము ల్వెలుఁగగా నాలింప నా సత్యమున్
జ్ఞాన మ్మేక మనంత మక్షరము చిన్మాత్రం బఖండంబు బ్ర
హ్మానందంబు తమఃపరంబు ఖము నిత్యం బద్వయం బవ్యయం
బీ నామమ్ములు వస్తుతత్త్వమున కౌ వృద్ధక్రమాకల్పనన్. ౧౪

సీ. ఆత్మ యీశుఁడు పరమాత్మ విష్ణుఁడు వేద్యుఁ
డన సదాశివుఁడు బ్రహ్మ శివుఁ డగ్ని
యింద్రుండు పరముండు నీశానుఁడు స్వరాట్టు
ప్రాణ మక్షరము విరాట్టు విభుఁడు
సవిత హృషీకేశుఁ డవిత నారాయణుం
డాగమకర్త దేవాది ప్రభుఁడు
పశుపతి కవి భగవంతుండు మనువు మ
హాద్భూత మన మహాద్యక్షు మనఁగ
శంభు సోమాగ్ని శర్వ ప్రజాపతి పతి
దక్ష హరి ధాతృ సవిధాతృ ధర్మగమ్య

కాల మృత్యు యమా మయ క్రతు యజు స్త్రి
పా ద్గురు నిధాన జీవనాస్పదము లనఁగ. ౧౫

క. అవ్యయబీజం బనఁగా
నవ్యక్తప్రభవ మనఁగ నది యిది యన నే
లా? వ్యక్తమునఁ బదాకృతు
లవ్యక్తపరు న్విశిష్టు నాభాషింతుర్. ౧౬

క. కనఁబడునది వినఁబడునది
జనించునది చింత్యమైన సర్వము లోకం
బున నెదియు వస్తు మాత్రం
బని లే దన్య మని తెలియనగు మహితమతీ! ౧౭

మ. నను నీ విప్పుడు పృచ్ఛసేసితివె ధ్యానం బీవు నెద్దానిఁ గూ
ర్చి నిమేషం బెడలేక చేసె, దని సచ్చిత్తత్స్వరూపం బిదే
యని యంతఃకరణప్రవృత్తి లెడయ స్స్వానందసంపత్తి నుం
టి నజస్రం బపరం బిఁకేమి కల దంటిం గంటి నం చాడఁగన్. ౧౮

క. ఇది యిటు లుంచు మునులచే
మొదట మొదట బాలబోధమున కాగమ సం
గదనముల భ్రమము పే ర్లని
యుదితము లగు వానిఁ గూడ నుపదేశింతున్. ౧౯

సీ. ప్రకృతి ప్రధానమ్ము బ్రహ్మయోని త్రివృ త్త
నాదిభ్రమమ్ము విద్య పరదేవి
మాయ యవ్యయవిభ్రమము శక్తి కారణ
మధ్యాస మజ్ఞాన మని తమ మని
ప్రస్వాప మనియుఁ గారణభూత నందు ర
విద్యఁ గార్యావిద్యవిధము వినుము
స్వస్వరూపాప్రకాశము వపురభిమాన
మభినివేశము భోగ మందుఁ గ్రోధ

మర్థహాని మృతప్రాయుఁ జగుట యిట్టు
లైదు దీనికిఁ బర్వమ్ము లది నివృత్తి
నెనయఁగ నుపాయములు జ్ఞాన మనఁగ విద్య
యనఁగ జన్యము లివి మోహ మంతవట్టు. ౨౦

గీ. ఆవరణ మన విక్షేప మనఁగ రెండు
శక్తు లుదయించె మొదలి యజ్ఞానమంద
పర మపర మను భేదకల్పన మొనర్చె
ముందు పరిపూర్ణ మానంద మంచు నేది. ౨౧

గీ. ఈశు నావరణ మెఱుంగనీయకుండు
లేని భోక్తృత్వభోగ్యావలిభ్రమంబు
నాత్మ నధ్యస్త మొనరించి యవశుఁ జేయ
సంసరించును విక్షేపశక్తి జడుఁడు. ౨౨

క. తా నెవ్వఁడొ యెఱుఁగడు ము
న్నే నిట్టిఁడ ననుచు లేని యితరగుణంబుల్
మానించి తిరుగు భ్రాంతిక
దీనుం డయి తెలివి వితగఁ దెలిసితి ననుచున్. ౨౩

గీ. మాయ యాయత్త మైనవాఁ డాయె నీశుఁ
డతఁడు స్వస్థసచిదానందుఁ డవ్యయుండు
మాయ కాయత్తు డైనవాఁ డాయె జీవుఁ
డతఁడు స్వావిర్భవద్దుఃఖతతికలితుఁడు. ౨౪

గీ. హ్లాదినీసంవిదాశ్లిష్టుఁ డనఘుఁ డతఁడు
సచ్చిదానందరూపుఁ డీశ్వరుఁ డనఁబడు
నఖిలసంక్లేశనికరసమాశ్రయుండు
స్ఫురదవిద్యావృతుండు జీవుం డనఁబడు. ౨౫

ఉ. భావము కేవలం బది స్వభావమునం బ్రతిభాత మై జగ
జ్జీవపరేశభావమునఁ జిత్రిత మైనది దానిఁ బ్రోవ వే

డావలి భూతసర్గవిలయంబులఁ గల్పనఁ జేసి చెప్పె నా
త్రోవయె సత్య మందురు పరు ల్పరిమూఢు లనాత్మవేదితన్. ౨౬

ఉ. ఎక్కడి మాయభ్రాంతి యిది యెట్టు లడంగు నటన్న విన్ము తా
నెక్కటి యాత్మ లే దిట ననేకము లోకము దోఁచు మోహితుం
డొక్కనికే, తదన్యునకు నున్నది యుండు నొకండ, నిద్రితుం
డక్కల గాంచు నొక్కరుఁ డహో యపనిద్రున కద్ది చెందునే? ౨౭

ఉ. ఏవిధి నమ్మనోరథ మనేకమనోరథపంక్తి నోలి నా
నావిషయానుషక్తము గనంబడఁజేయుఁ దలంచి చూడ స
ద్భావము కద్దె? యం దొకవిధంబున కే నటులే యసత్తె స
ద్భావసమాశ్రయంబున నుదంచిత సత్తనఁ దోఁచు భూవరా! ౨౮

సీ. ఐనఁ దత్త్వ మెఱుంగ నౌ నెటు లందువా?
యవధానమున విను మది వచింతు
నేపదార్థమునందు నెవనికి నజ్ఞాన
మున నన్యథాజ్ఞానము మొలతెంచుఁ
దన్నిరాసము లేక తత్త్వ మ్మెఱుంగఁ డా
తం డెందు నెమ్మెయిఁ దడవెనేని
స్థాణుచోరభ్రాంతి స్రక్సర్పవిభ్రాంతి
శుక్తిరౌప్యమనీష చూడలేదె?
స్థాణువా? చోరుఁడా? యను సందియంబు
చక్కగాఁ జూచు చూపున సడలిపోదె?
భ్రమ మెడలెనేని మిగిలిన వస్తు వదియె
వాస్తవం బని యనరె? యెవ్వార లైన. ౨౯

గీ. వస్తుసిద్ధికి సాధనవాంఛ వలదు
భ్రమనిరాసమ్మునకె యత్నపరత వలయు
యాగయోగాదికము వేద మనువదించు
నెల్లని మ్మాత్రకే యని యెంచు మెడఁద. ౩౦

గీ. మునుపు నేఁడును రేపును బుట్టు మాట
కర్థమే లేదు భాసించె ననెదె? యనుము
వినుమృషాభాన మిది యని మనసు నేసె
ననియు మాయామయ మ్మని యరయుమయ్య. 31

క. ఇది నా భ్రమ మని యెఱుఁగుట
కేది యధ్వము? సంశయమ్మొ యేదీ? తల యె
త్తిదు సత్యం బీ జగ మని
విదితులై కొంద అనుచుండ వినమే యనిన౯. 32

సీ. ఏతదర్థమెకదా చేతోవిశుద్ధికి
నిత్యకర్మ మొనర్ప నెగడవలయు
నందు విసర్జింప నగు నిషిద్ధము కామ్య
మాభిచారికముఖానర్థకరము
మనము భక్తిం దత్ర్పవణముగఁ జేసి స
మర్పింపవలె నీశునందుఁ గృతము
నెంత ప్రీతి భజించు నీశ్వరు నత మంత
శుద్ధచిత్తుం డవ్వుఁ జువ్వో జనుఁడు
బ్రహ్మలోకము మొదలు సర్వప్రపంచ
మిది యనిత్యము నశ్వర మింత భ్రమమె
మృష యని విరక్తుఁ డెన్నఁ డౌ మృష్టమలుఁడు
వాఁ డపుడె బోధసంపత్తి వడయుఁ బ్రభుఁడు. 33

గీ. ఎవనికిని దేవునెడ భక్తి యొసఁగు బరమ
మీశ్వరుం డెంతొ గురుఁ డంత యెవని, కమ్మ
హాత్ము నాత్మఁ బ్రకాశించు నర్థము లివి,
యన్యునకు శబ్ద మర్థమ్మె యవగత మవు. 34

గీ. దృశ్యమున మేలు లే దన్న ధీ గడించి
స్వాంతమును జేరనీక దృశ్యము వెలార్చి

నిల్చెనా? పరనిర్వాణనిర్వృతి యపు
డుజ్జ్వలం బయి యుండు నద్వ్యాజఁ గాంచు. 3౫

క. ఆచార్యు ననుగ్రహమున
రోచించు విచార మల్లత్రోవనె తత్త్వ
ప్రాచుర్యమ్ముగ స్ఫురించుం
బ్రాచీనత స్వప్రకాశమాన స్థితితోన్. 3౬

ఉ. నీవు సమస్తకర్మములు నేర్చి వొనర్చితి యాగయోగర
తావిధుల న్మదర్పితవిశాలఫలమ్ముగ నీ విచార మా
త్రోవ జనించె రాగము విధూతము గా మన మాయె నిర్మలం
బావల మత్ప్రబోధము కృతార్థము కాఁగల దింక భ్రాంతి వోన్. 3౭

గీ. భ్రమము నిరసించు నుపమ చెప్పఁబడు నింక
శాస్త్రవిదు లుపక్రమ ముపసంహారణము
కారణం బందు రద్దాని కలనమునకు
నాలకింపు ముపక్రమ మంధు ముందు. 3౮

ఉ. ఆపరతత్త్వవస్తువు చిదాత్మక మేక మనాద్యవిద్యచే
నాపరమాత్మనందుఁ గలయట్లు విభాగము తోఁచుచున్న దీ
చూపె భ్రమంబు మోహ మని సూరివరేణ్యులు వాదులాడు మా
యాపరనామకప్రకృతియందె ప్రపంచము సంభవించెడున్. 3౯

క. ఒకఁడు సదానందచిదా
త్మకుఁ డవు పరమాత్ముఁ డావృతస్వానందుం
డొక నొకఁడు పురుషుఁ డను మా
యికపు విభాగంబు దోఁచి యింతయుఁ జూపెన్. ౪౦

సీ. బ్రహ్మమువలన నవ్యక్త మావిర్భావ
మందె దానన మహ త్తంకురించె
నందు నహంకార మన మాను గట్టెను
దన్మాత్రశాఖ లద్దానఁ దోఁచె

పంచీకృతము భూతపంచక మింద్రియ
దశకమ్ము తద్దైవతములు మనసు
సత్వరజ స్తమస్సంసర్గకలనఁగా
బహుసర్గ మిందు సంపన్న మయ్యె
రాజమార్తాండ! మానసభ్రమమయ మవు
నవలి సృష్టివిధి నియమ మని కలుగమి
నొక్కచో నాకసము మొద లొక్కచోట
తేజ మాది యటం చని రీ జగతికి. ౪౧

క. నరదేవాసురపశుముఖ
శరీరములు భౌతికములు సంభవమందెఁ
సరి సూక్ష్మమ్ముల సూక్ష్మము
లురువు లనురువులును ద త్తదుచితస్ఫూర్తిఁ. ౪౨

క. భూతము లెల్ల స్వాకారణ
భూతములం డింద సర్వము నహంకృతి ని
ర్ణీత మగు నది మహాత్మున
నా తత్త్వము ప్రకృతి నదియు నాత్మ విహృత మౌ. ౪౩

గీ. అజ్ఞునకును స శేష మౌ నా లయమ్ము
స్వాత్మవిజ్ఞాని కదియె నిరాత్మక మవుఁ
గాని యుభయుల కవశిష్ట మౌ నవహృతి
సచ్చిదానందఘన మాత్మ సాంద్ర మొకటె. ౪౪

ఉ. కావున రాజసత్తమ! జగ మ్మిది లేదు వివేకశీలికిఁ
గేవల మాత్మ పూర్ణ మిది గా నదె తోఁచె విమోహవేళ స
ద్భావ మభావరూపము ప్రపంచమ కాఁ గనుపట్టుచున్న ద
జ్ఞావిలచిత్తవృత్తికి యథార్థము సెప్పితి నే మనంగ నౌ. ౪౫

చ. అనుడుఁ గృతార్థుఁ డైతి నని యర్జునభూపతి మ్రొక్కి దేవదే
వుని వినుతించి సంశయము వోయె వినిశ్చయ ముప్పతిల్లె యో

గనితర! దీనవత్సల! యఖండసుఖాత్మక మాత్మనాత్మ నె
య్యనువున రూఢిఁ జెందనగు? నానతి యీవె తదర్థ మంచనన్. ౮౬

దత్తదేవుఁడు శ్రుతము రూఢం బగు విధ ముపదేశించుట

మ. భగవంతుం డను చిత్తశుద్ధి కలిగె న్వైరాగ్య మయ్యెన్ దృఢం
బు గురుప్రేమము దైవభక్తి శ్రవణంబుం గూర్చె సత్పూర్వార్జితం
బుగఁ దత్త్వజ్ఞవినిశ్చితం బగు మహాబోధం బెసంగె న్మహో
క్తిగృహీతార్థత సర్వథా విలయమొందెన్ హ్యాత్మ న్నవిశ్వాసయుక్.

ఉ. ఎన్నివిధంబులం దలఁప నేకమె తత్త్వము బ్రహ్మ మద్వయం
బన్న యిదంవిధంబు సమనంతరభూమిక నెక్కఁగ న్మిఁకన్
బ్రోన్నతచిత్త! బోధ మపరోక్షము నీకు ననుక్షణంబె సం
పన్నము గాఁ దలంచెద భవంబుభయం బెడయ న్నయంబునన్. ౮౮

గీ. అందు ముందు మననము సేయంగవలయు
నవలఁ గర్తవ్య మగు నిదిధ్యాసనంబు
దత్తచిత్తుఁడ వగు మిప్డ దాని తెఱఁగుఁ
జెప్పబోవుచునుంటి వాంఛితము నెఱయ. ౮౯

గీ. తత్త్వనిశ్చయకరము మద్వాఙ్మయమ్ము
వింటివే? దాని విజ్ఞులు వినికి యండ్రు
సర్వసాధనసంపత్తిజాతనిశ్చ
యాత్ముఁ డధికారిపూరుషుం డమ్మెయికిని. ౯౦

క. అవధారణలక్షణ మగు
శ్రవణం బొనరింపఁగ గురుసదన మెనయ నౌ
నవహితుఁ డుపశమసంశ్రయుఁ
డవు బ్రహ్మమె గురుఁ డనంగ నౌ నవ్విధికిన్. ౯౧

గీ. తత్త్వమస్యాదివాక్యసందర్భ మర్థ
మతిదయాలుగురూపదేశాపితమ్ము

సమ్యగాలోచితము లింగషట్కమున నొ
నర్చునది శ్రవణ మ్మనఁ బేర్చు వింటె? ౫౨

గీ. తత్పదమ్మునఁ బరమతత్త్వమ్ముఁ జూపి
త్వంపదమునఁ బురుషు ననువాద మెత్తి
అసిపదమ్మున బోధించు నైక్య మల్ల
వాక్యము ధ్రువమ్ముగా నిది పట్టుకొనుము. ౫౩

గీ. త్వంపదము సన్నిహితమును బలుకుఁజువ్వొ
తత్పదమ్ము పరోక్షతత్త్వమ్ము నొడువు
త్వమభిధేయ ముద్దేశించి తత్పదార్థ
సంవిధానంబు శ్రుతి సేసె సమ్మతమ్ము. ౫౪

ఉ. ఆరయ సంభవించునె తదర్థత? త్వంపదవాచ్యుఁ డైన సం
సారికి నందువేని విను సాటువు సెప్పెద మున్ను గన్న శ్రీ
హీరుని నేఁడు చూచి యతఁడే యితఁ డంచను ప్రత్యభిజ్ఞ నీ
వే రహి భేదము ల్విడిచి యేకముఁ బిండముఁ గొందు వారహిన్.

క. జహదజహల్లక్షణచే
జిహాసితాంశముల వదలి చిద్భాగములన్
సుహితమతి నెంచఁగా శ్రుతి
విహితార్థసమన్వయ మవు వెరవెరి కనఘా! ౫౬

సీ. అగుణగోచరము సదానందచిద్రూప
మై యుండి మాయ సౌఖ్యమ్ము దుఃఖ
మనుభవించుచుఁ గర్త నని భోక్త నని సంవ్య
వహరించు సంసారి త్వంపదార్థ
మందుఁ జైతన్య మొం డంశంబు సంసార
మన్యాంశ మని యున్న యంశ మరసి
సర్వజ్ఞుఁడు పరమేశ్వరుఁడు తదర్థ మం
చెఱిఁగి చిద్రూపత్వ మేక మంశ

మనియు సర్వజ్ఞతాదిక మన్య మంశ
మనియు నిశ్చిత మొనరించి యల ద్వితీయ
భాగముల వీడి యాదిమభాగము లవి
రెండు లక్షించు నొం డొటఁ బండితుండు. ౫౭

అన్న! వాక్యార్థ మిది సునిష్పన్న మైన
దీవె పరమము బ్రహ్మమ వింత నిజము
బ్రహ్మ మది చిన్మయము నీవ పట్టిచూడ
నెవ్విథంబున భేద మింతేని లేదు. ౫౮

త్వంపదమ్మ విశేష్యమ్మ తత్పదమ్మ
తద్విశేషణభావమ్మ నుద్వహించు
వీని దుఃఖిత నిరసించి వెలయు తత్స్వ
రూపత విధింపఁబడుచున్న దీ పథమున. ౫౯

వైపరీత్యమ్మన నెఱుంగవలె విశేష్య
మయ్యెఁ దత్పదలక్ష్యమహార్థమందుఁ
ద్వంపదమ్మ విశేషణత్వమునఁ జెంది
తత్పరోక్షత్వ మెడలించు దాని కయ్యె. ౬౦

పరమమలమ్మ తత్త్వ మనుభావ్య మనామయ మాత్మ యేక మం
చరసి గురూక్తి శ్రుత్యుదిత మైక్యము నిమ్మయి నన్వయించి రె
ల్లరు విబుధాగ్ర్యు లి య్యుభయలక్షణపేర్మిఁ ద్రికాండవేదముల్
స్మరణములుం బురాణములు శాస్త్రము లన్న యథార్థమా యిదే.

జ్ఞేయము సూక్ష్మబుద్ధుల కశేషవిశేషసమర్థితార్థ మ
జ్ఞేయము మందబుద్ధులకు సిద్ధము పండితమాను లజ్ఞులీ
తోయ మెఱుంగకే తమకుఁ దోఁచినరీతిఁ బ్రవృత్తిమార్గమం
దే యఖిలత్రయీమతము నెట్టులొ? కల్పనసేతు రే మనన్? ౬౧

శ్రవణలింగంబు లొగి నందు సంశ్రవింపు
మమరెడు నుపక్రమోపసంహారము లొకఁ

డబ్బెసన మపూర్వత ఫల మర్థవాద
మట్టు లుపపత్తి యన నలరారు నారు. ౬౩

గీ. ముందు శాస్త్రార్థ మారంభము నొనరించి
యంతమున దానినే నిర్ణయముఁ బొనర్తు
రమ్మెయి నుపక్రమోపసంహారము లవి
రెండు నొండవు లింగ మూరీకృతమ్ము. ౬౪

ఉ. చెప్పినయర్థయే మరలఁ జెప్పెడుచొప్పుల నాగమంబులం
దప్పటి కప్పు డబ్బెసన మందురు రెం డవు లింగ మద్ది యే
యొప్పులు శాస్త్రపద్ధతికి నొం డొకదారి నెఱుంగరావొ యా
చొప్పు లపూర్వతార్థములు సుమ్ము తృతీయము లింగ మర్జునా! 

శా. జ్ఞానాఖ్యమ్ము ప్రయోజనం బఖిలశాస్త్రప్రోక్త మేకం బప
జ్ఞానధ్వాంతవినాశనంబు ఫలలింగం బొఁ జతుర్థంబు నూ
క్తానూనార్థము దార్ఢ్య మొందగఁ బ్రశంసార్థంబు వర్ణించు ను
ద్గానార్థము నిందుఁ బంచమము లింగం బర్థవాదం బనన్. ౬౬

క. ఆగమసంగదితార్థము
నొఁ గా దని చేయు నాగమానుగతోహం
బొఁ గడమవడిన లింగము
నాగము లుపపత్తి యందు రద్దాని నృపా! ౬౭

చ. మననము సేయఁగావలె సుమా గురుసంశ్రుతవిశ్రుతార్థచిం
తన మది స్వానుభూతి వివిధప్రథితార్థనయుక్తిసూక్తులన్
వినుము తదంగము ల్స్వమతివిత్తము లైనను సంప్రదాయశు
ద్ధి నెదఁ దలంచి చెప్పెద విధేయము యోగము సాంగ మాదృతిన్.

గీ. యమము నియమమ్ము ధర్మశాస్త్రములయందు
మునుపె విహితమ్ము లగుట.నాసనము నెంచి
యంగములు యోగమున కారె యనిరి యోగు
లిందుఁ గొందఱు వానితో నెనిమి దనిరి. ౬౯

గీ. ఏయెడ సమాధి యనుభవనీయ మగుట
ఫలము, యంగము లేదు త త్ప్రాప్తి కనిరి
ఆదియుగ మిది వీడఁ బంచాంగ మయ్యె
యోగ మాసనము గణింప రొరులు నిదియ. 20

క. చతురులు వారల యోగము
చతురంగమె యనునియమము సంప్రత్యాహా
రిత ధారణ ధ్యాన మనఁగ
మతిమంతుల కిన్నిదార్లు మాన్యము లయ్యెన్. 21

క. ద్వివిధము సమాధి యంచు
న్సవికల్పము నిర్వికల్పనముఁ జేసి యొకం
డవయవ మవయవి యొకఁ డని
రవధానులు గొంద ఱందు నయ్యెసంఖ్యన్. 22

గీ. యమము లివి పది బ్రహ్మచర్యాపరిగ్ర
హము లహింస య స్తేయ సత్యములు మాన
మభయ మా స్తిక్యబుద్ధి మందాక్షసంగ
వర్జనము లు త్తమనరసంపత్క్రమములు. 23

గీ. శౌచ మాచమనంబును స్నానవిధియు
బ్రహ్మయజ్ఞము జపము తపము మదర్చ
నమ్ము సంతోష మఖిలతీర్థమ్ము లాట
మఖము లొనరించుటయు నియమము లివి పది. 24

గీ. ఊరుజాన్వంతరమ్ముల నుభయపాద
తలములుం గూర్చి కూర్చుండు కలన స్వస్తి
కాసన మ్మది యాదిగా నైకము లవి
యందుఁ దన కించు నాసన మ్మమర నుండి. 25

మ. సమ మై నిర్జన మై నసౌఖ్యమయి నిశ్శబ్దంబు నై యొప్పు దే
శమునందు న్నిరుపద్రవం బగునెడన్ జైలాజినాద్యాచితో

త్తమసంస్థానమునందు నాసనసుబంధం బూది యోగాప్తికిన్
సమకాయాస్యశిరోగలుండు యతి నిశ్చాంచల్యసుస్థేముఁ డై. ౨౭

క. అభ్యాసము సేయందగు
నభ్యంచితవృత్తి నల్లఁ బ్రాణాయామం
బాభ్యంతరమలశోధన
మభ్యర్హిత మది జితముగ నాత్మ జిత మగున్. ౨౮

చ. అతిబలమత్తమై నయుగమై పరువెత్తెడు గిత్త దోయి శృం
గతలనిబద్ధపాశమునఁ గైకొని లాఁగ నొకండు లోఁగ ను
ద్ధతిఁ బెడఁబాసి రెండవది దక్కు విధంబునఁ బ్రాణచిత్తముల్
గతిఁగొను నం దొకొండు యతి కైవస మైన నిఁకొండు నయ్యెడున్.

క. ఆయాసము లేకుండ ను
పాయమ్మునఁ గర్మ మన్మదర్పణబుద్ధిం
జేయఁగ నైన యతాత్ములు
వాయుజయము నెనయఁ గల రపాయం బెడయన్. ౨౯

ఉ. అమ్మొయి నుత్తరమ్ము లగు నట్టివి ధారణ మున్ను గాఁగ నం
గమ్ములు సంతరింతురు సుఖమ్ముగఁ గొందఱు ప్రాణయుక్తితో
నెమ్మది గెల్వ నెంతురు మనీషులె వారలు దాని కేమి? ప్రా
ణమ్ము యమించు పద్ధతి గనం ద్రివిధ మ్మవు విన్ము చెప్పెదన్. ౩౦

గీ. వామనాసాపుటమ్మున వాతపోత
మారఁ బూరించి కుంభించి యవల మరల
దక్షనాసాపుటమున వదలఁగవలయు
వెలికి మెల్లన మాత్రల వెలితిఁ బడక. ౩౧

క. పదియాఱిటఁ బూరక మరు
వదినాల్గిఁట గుంభకంబు పయి రేచము ము
ప్పదిరెండు మాత్రలనుఁ జే
యుదు రది విపరీత మొకళు లొనరుతు రనఘా! ౩౨

గీ. కొంద ఱొనరింతు రిది బహిఃకుంభకముగఁ
బిండశుద్ధి యగును దీనఁ బిత్తవాత
ముఖ్యదోషమ్ము లెడలు సమ్మోద మొదవు
నమలములు సర్వనాడికాద్వారము లగు. ౮౩

క. సహబీజమొ నిర్బీజమొ
బహిరంతఃకుంభకమ్ము ప్రాణాయామం
బహరహరభ్యాసక్రమ
మహితంబుగఁ గూర్చి యోగి యపరోగుఁ డగున్. ౮౪

క. ప్రాణము జిత మగుడున్ వి
జ్ఞాని ప్రయత్నమున మానసముతో విషయ
జ్ఞానములవలన నింద్రియ
భానమ్ము గుదించు నదియె ప్రత్యాహృతి నాన్. ౮౫

ఆ. మనసు నాత్మ నిలుపు పనియె ధారణ యన
నదియు సగుణ యనఁగ నగుణ యనఁగ
నుభయవిధ యటంచు యోగమార్గప్రవ
ర్తకులు నిర్ణయింతు రకలుషుండ! ౮౬

గీ. ఆత్మయందు విక్షిప్త మైనట్టి మనసు
నసకృదభ్యాసమున నరుఁ డాఁచిపట్టి
మాటిమాటికి ధ్యేయమ్ము నూటిఁ గొలుపు
ధారణనె ధ్యాన మందురు దార్ఢ్యయుక్తి. ౮౭

క. ప్రాణాయామము మొదలగు
నా నాలుగు యోగయుక్తి యంగమ్ములు న
ద్దానికి నది ద్వాదశగుణ
మానవివర్ధితము లంద్రు మతిమంతు లొరుల్. ౮౮

చ. అది పదిరెండు రెట్లయి సమాధి యవు న్సవికల్ప మిన్నిటన్
మది మనసక్షమం బగుడు మాన్యుఁడు శాస్త్రవిచక్షణుండు సే

యఁ దగును బేర్మి నమ్మనన మద్ది పరాత్మని వైదికోక్తియు
క్తిదృశ నిరంతరంబుగ గతింగొను ధ్యానమె యంద్రు తద్విదుల్. ౮౯

సీ. అల సవికల్పసమాధినే కవులు ని
దిధ్యాసనం బని తెలుపుచుంద్రు
సర్వవిధముల విజాతీయ మవు ప్రత్య
యము నిరసించుచు నాత్మనొగి స
జాతీయతత్ప్రత్యయాతిప్రవాహీక
రణ మంద్రు బుధులు లక్షణము వినుము
తద్గురునిర్ణీతతత్త్వమస్యాదివా
క్యార్థము లింగషట్కాశ్రుతంబు
సమ్యగవధారితమ్ము లాక్షణికశక్తి
సమవబుద్ధము ధారణాశతవిచింతి
తము మననముఖవశము చిత్తమున యమికి
నియతసమవస్థిత మ్మవుటయె సమాధి. ౯౦

సీ. అక్షాదికవివిక్త మవు మత్స్వరూపంబె
పరము బ్రహ్మము పరాత్పరమ మైన
బ్రహ్మమ్మె యౌ నేను శ్రౌతమార్గప్రాప్య
మద్వయ మానంద మంతరహిత
మాపూర్ణ మమల మనాయస్త మవు నిత్య
సచ్చి దనామయ స్వప్రకాశ
మే నైతి నను మనోవృత్తి దృఢం బవు
నందుఁ జైతన్యంబు వ్యాపకంబు
తగ స్థితంబె కదా సదాతన మదె యహ
మనెడు వృత్తి ప్రవాహదార్ఢ్యమున సూర్య
కాంతయోగంబుచేఁ దూలకలిక నగ్ని
యట్లు చిత్ప్రతిబింబ మా యతి కగపడు. ౯౧

మ. ప్రతిబింబాత్మచిదిద్ధవృత్తి యకలబ్రహ్మంబు స్వాధారతా
ప్రతిపత్తి న్విషయీకరించి తొలఁచుం బ్రాగింద్రియగ్రామని
ష్ఠతమం బద్ది వినష్టమైన సమయుం దాఁ దన్మయం బౌటఁ ద
త్కృతకార్యాత్మజగత్కలాపములతోఁ గీలింపు భూపాలకా! ౯౨

ఆ. వృత్తి యను నుపాధి విలయంబు నొందిన
స్వప్రకాశవస్తుసంప్రకాశ
నము నొనర్ప నవసరము లేమిఁ జిత్ప్రతి
బింబ మగును జిత్త పృథివినాథ! ౯౩

గీ. బ్రహ్మవిషయం బెఱుంగని వానియందె
చిత్తవృత్తి ప్రయోజనసిద్ధి కాంక్ష
మనసుతోఁ జూడఁదగినది యనియె శ్రుతియె
మానసీయ స్వయమ్ముగా మానసీయ! ౯౪

చ. మనసు తలంప లే దచట మాట లడంగు స్వయంప్రభంబు వా
ఙ్మనసపరంబు జ్యోతి పరమం బది యంచు వచించె వేద మే
యనువున వేద్య మా మదికి నందువొ? తచ్ఛ్రుతి బ్రహ్మమందు నొ
ప్పనిది ఫలప్రవర్తనమె స్వాంతము వృత్తి ప్రవృత్తి నొప్పెఁ బో. ౯౫

గీ. బ్రహ్మమందు నజ్ఞాననిరాసమునకు
వృత్తిసంవ్యాప్తి వలయున భిత్తియందు
వోలె స్వప్రకాశంబునఁ బోలదు ఫల
సంప్రకాశనశక్తి యసంశయంబు. ౯౬

గీ. ఎంత కి మ్మాద్రి సిద్ధి యా నంతవఱకు
వృత్తి యడఁగదు కావున వృత్తియందు
జ్ఞాతృవిజ్ఞేయసంవిభాగాతిభాన
మా నెఱి స్వభావమునఁ దోఁచు టనుభవంబు. ౯౭

క. సవికల్పసమాధి యిదియె
యవికల్పసమాధివృత్తి యడఁగిన నగు నం

దవిభాగము తత్త్వం బను
భవరూపం బెనయ నోట భాస్వద్బుద్ధీ! ౯౮

చ. యతికి మనమ్ము నిమ్మెయి నయమ్మునఁ గూర్చుచునుండ నంతరా
యతతులు గల్గు సిద్ధు లణిమాదులు మున్నుగఁ దత్ప్రసక్తి ని
ర్గత మగు యోగ మాముకొను నామెయి సంసృతి నశ్వరమ్ము కా
దిత వని సమ్మతింపఁడు మహేచ్ఛుఁ డెఱింగి తదీయసంగతిన్. ౯౯

గీ. చిత్తము శమింపఁజేయు విక్షిప్తమైన
లయము నెనసిన బోధించు నయ మెఱింగి
కనుఁగొనుఁ గషాయపక్వతఁ గదలనీఁడు
సమసమాపిత మది యైన సాధకుండు. ౧౦౦

క. సుపరీత బుద్ధిఁ గొని యం దపసంగత నే రసంబు నాస్వాదింపం
దుపమాన మట్టి నియతికి నపేతవాతస్థదీప మందురు విదితుల్. ౧౦౧

శా. వృత్తివ్యాప్తివిహీనసుస్థిరుఁడు బ్రహ్మీభూతుఁ డౌ యోగికిన్
చిత్తగ్రంథి విభిన్న మౌ సకలసందేహంబులున్ ఛిన్నతా
విత్తంబు ల్కృతకర్మము ల్విహతముల్ విద్య ల్కృతార్థత్వసం
పత్తు ల్గాఁగల వొక్కమాత్ర నృపతీ! పాటింపు మి ట్లింతయున్. ౧౦౨

క. ఈ వెరవున యోగావ
స్థావిధ మాత్మానుభవము దాఁక నొడివితిన్
భావింపు మెడఁద రూఢం
బౌ వాస్తవ మరయువాఁడ వది యట్లుండెన్. ౧౦౩

క. అకులున కాకులబుద్ధికి
వికలున కిది చెప్పఁబోకు వినయాదిగుణ
ప్రకటునకు శిష్యునకుఁ జె
ప్పక యుండకు మెప్పుడేని భవ్యమనీషా! ౧౦౪

క. ఈ గతి యోగాదేశము
యోగీశకృతంబు నెనసి యుర్వీశుఁడు భ

క్త్యాగతసాధ్వసుఁ డై భూ
భాగంబున దండవత్ప్రపతితతనుం డై. ౧౦౫

ఆ. సుచిరమునకు లేచి శుంభన్మనఃపద్ముఁ
డశ్రుపూర్ణనయనుఁ డై ముదమున
ననిమెు మేనఁ గంప మంజలి యౌదల
గద్గదత గలమునఁ గానిపింప. ౧౦౬

కార్తవీర్యుని కృతార్థతఁ దెలుపు ప్రసంగము

ఉ. మోహమహాంధకారము సమూల మడంగ భవద్వచోమృత
వ్యాహత మై యుషర్బుధసమర్చకు శీతభయాదికం బనం
గా హృదయాంబుజంబును వికాసము నొందఁగఁజేయుచుం దమో
వ్యూహముఁ జించుచుం బొడిచెఁ బూర్వమె జ్ఞానసహస్రభానుఁడున్.

ఉ. ఇంతయు నీదుపాదకమలేహితసేవఫలంబె వేర లే
దంతటి సిద్ధు లిచ్చి సకలార్తు లెడల్చి విశుద్ధిఁ గూర్చు పా
దాంతమహాశ్రయంబు విడనాడి యెవం డొరు నాశ్రయించెడున్
హంత కృతజ్ఞుఁ డైనఁ బురుషార్థ పరుం డఖిలేశ! సిద్ధికిన్. ౧౦౮

ఉ. పీడ లెడల్చి మోదమును బిందు భవత్పద మాశ్రయింతురే?
వాడలనుండి వచ్చి విభవార్థము దేవ! మహానుభావ! కా
రాడుచు హంసలుం బరమహంసలు నిమ్మెయి నిన్నుఁ గొల్వ నౌ
వాఁడె సమాశ్రయార్హుఁ డగు వాఁ డని వెంబడుఁ బూరుషార్థముల్.

ఉ. నేనుఁ దథావిధం బయిన నీచరణాబ్జమున న్నమస్సు లెం
తే నతిభక్తిఁ గూర్తు నదియే కద సర్వలయాస్పదంబు తా
పానుశయాపహంబు సకలాశ్రితజన్మజరామయఘ్న మీ
శానవిరించిత త్తనయశక్రముఖామరవంద్య మం చొగిన్. ౧౧౦

క. శీతలము శాంతికర మతి
పూతము స్వాత్మావభాసము సుమంగల మా

భాతశుభార్థము సేవ్య మ
తీతా! నీపదము మాకు నిత మనిశ మగుర్. ౧౧౧

ఉ. పువ్వులమాలయం దహివిబోధము వోలె వృథావిభాత మై
యెవ్వనియందు నీసదసదీహితవిశ్వము సత్య మెంచ లే
దవ్విభు నిన్ను సంభవమహాంబుధి దిక్కఱి చిక్కువారి మే
ల వ్వలికట్టఁ జేర్చు పరహంసగతి న్నతుఁ డై యజించెదన్. ౧౧౨

ఉ. ఆ నిను నిత్యముక్తుఁ బరిశుద్ధు విబుద్ధు మహేశు సర్వర
క్షానుగృహీతవిగ్రహు ననన్యసమానుఁ బ్రసిద్ధు నింద్రియ
ప్రాణశరీరతద్విషయవాసనలం బెడఁబాఁచి చెందుచు
న్నా నిదె సచ్చరణ్యు శరణంబు సమస్తవిధంబులం బ్రభూ! ౧౧౩

శా. ఆ యీ దేవుఁడ వీవు తోఁచి మును మూలాధారమందుం బరా
ఖ్యాయోగంబునఁ బ్రాణఘోషణముతో నా నాభి పశ్యంతికా
స్థాయత్వాస్మృత రూపుఁ గాంచి హృదయస్థానాప్తితో మధ్యమా
ఖ్యేయం బై ముఖసీమ వైఖరి యనం గీలింతు నిష్టార్థముల్. ౧౧౪

గీ. మండల న్వేఁడి గా నిండి మధ్యమాన
మగుచు రవ్వఁగఁ దోఁచి యయ్యనిలబంధు
డింధనము లొంది దీప్తుఁ డై యెనసి హవ్య
మిడుఁ బ్రసిద్ధుల నట్లు నీ వీశ్వరేశ! ౧౧౫

గీ. ఆది నవ్యక్త మేక మై యవలఁ గాల
గతిఁ ద్రివృద్రూప మై శక్తికలితయుక్తిఁ
బుడమి నెనసిన విత్తనంబులవడువున
నైకవిధమున వెలయు మహాత్ముఁ గొలుతు. ౧౧౬

ఉ. ఎం దిది ప్రోత మోత మయి యెల్ల వెలుంగు? గుణప్రధానమం
దొందు పటంబుఁబోలె నెదియుం దనయం దనువాదమాత్ర మా
చందము కాని పేఁటొకఁడు చక్కఁగఁ జూచిన లేదొ? సచ్చిదా
నందఘనున్ నిరాకృతిమనఃప్రియు నిన్నెనయంగ నయ్యెదన్. ౧౧౭

శా. ఆసంసారనగం బనాది మది మాయాభాత మయ్యోక ద్విభీ
జాసంగంబు త్రినాల మూల శతకవ్యాప్తంబు స్కంధంబులై
దాసం బంచరసంబులం గురియుఁ జిత్ప్రాంతప్రసూతంబు సం
వాసం బద్ది సుపర్ణు లిద్దఱకుఁ గొమ్మ ల్మాడు నే డొప్పెదుక్. ౧౧౮

ఉ. రెండువిధాలఁ బండు నల వృక్షము నందలి పండులందు నొ
క్కండు భుజించు గ్రామముల గ్రద్ద లరణ్యనివాసిహంస లొ
క్కొండు దిను న్నమూలము మహోచ్ఛ్రిత మా నిది విద్దగొడ్డలిం
జెండి మునీశతండ మొనసెం బరమాత్ముని ని న్నధీశ్వరుక్. ౧౧౯

గీ. అట్టి ని న్నిట్టి నే నుభయ ప్రకార
కారణుఁ బురాణుఁ బురుషు సుఖప్రదాన
శీలుఁ జిత్ప్రకాశాత్మకుఁ జేరి మ్రొక్కి
వృజినజలనిధిఁ గడతేఱు వెర వెనసితి. ౧౨౦

క. గురు గురుతరు గురుగమ్యుం
గురూత్తముని దేవు గమ్యు గుణపారు గుణా
కరు దేవవంద్యసుచరణ
సరోజు వందనశతముల సంభావింతుక్. ౧౨౧

చ. అని వినుతించి మ్రొక్కి వికచాస్యవిలోచనహృత్సరోజుఁ డా
ననుగతు నెంచి ప్రీతి వికచాస్యవిలోచనహృత్సరోజుఁ డై
యనిమిషబృందకేతు వనె నయ్య! యెఱుంగఁగనయ్యెఁ దత్త్వ మ
ర్జున! యవశిష్ట మే ననెదఁ జూడుము సల్పఁగఁ జాల మే లికక్.

చ. గుహ యిదె గాంచనయ్యెడు నిగూఢ నిరామయ హృద్య యం దనో
కహమున మూలమందు సమకాయశిరుండవు స్వాసనుండవుక్
సుహితుఁడ వై విచింతనము సుస్థిరతం దగఁ జేయు మింక మ
ద్విహితము తత్త్వ మె ట్లనుభవించితివో? యటమీఁదఁ జెప్పుమా.

గురునాజ్ఞతో నర్జునుఁడు స్వరూపానుభవ మందుట

క. అవబోధంబో? సమాధియొ?
యవ్వఁ జిర మనుభవముఁ జెంది యగుదువు కృతి వం

చు వచించి దక్షిణము కర
మవనీశునిమూర్ధమందు నభవుఁడు గూర్చెన్. ౧౨౪

ఉ. అచ్చటఁ జొచ్చి రాజు విధి నాచమనం బొనరించి యింద్రియ
ప్రోచ్చయసంప్రసత్తి గురువు ల్వివరించినయట్ల సేయఁగాఁ
జొచ్చెను వచ్చె నప్పుడె విశుద్ధదృఢాసనికి న్సమాధి త
త్సచ్చరిత్రప్రసాదమున స్థాణువినిశ్చలుఁ డయ్యె నొయ్యనన్. ౧౨౫

ఉ. అల్లలి వర్ష మాసయుగ మై చన మానవభావ మొంద నై
మెల్లన లేచి వచ్చి ప్రణమిల్లె గురుప్రభుపాదయుగ్మమం
దుల్లసితార్ద్రదృష్టిఁ గనియుం గొనియు న్భగవంతుఁ డాన యీ
నల్ల రహఃపురస్థలమునందు వసించెను బ్రీతి నాతఁడున్. ౧౨౬

మ. స్మితపూర్వంబుగ నంబుజేక్షణుఁ డనెన్ శ్రీమంతుఁడా! కాల మే
గతి నిండాఁక నయించితో? తలఁచెదే? కాయంబు సుస్థంబె? నీ
మతి నైశ్చల్య మనుత్తమం బొలసెనే? మానించితే తత్త్వ? మ
య్యతియాతం బనుభూతముం దెలుపుమా యామూల మవ్యగ్రతన్.

క. అను దత్తగురున కిట్లను
మనుజేంద్రుఁడు దేవ! నిన్నె మానించు నెడన్
మనముం గరణమ్ములు క్షణ
మునఁ జిత్తనువందు విలయమును బొందె ననా! ౧౨౭

మ. పరమానందపదంబున న్మనిఁగితి న్భాసింపదయ్యెన్ వ్యాదం
తరమందుం ద్రిపుటీవిధం బెదియుఁ ద్వత్సంరూపితం బాత్మ సౌ
ఖ్యరసం బర్థి క్షణార్ధ మేనమభవం బందంగనోఁబో బలో
త్తర మారబ్ధము లాగె దేహదశకుం దచ్ఛక్తి నే మందు నో. ౧౨౮

గీ. త్వత్పదాంభోజ మొకఁడె బోధకర మంతె
లేదు రెండవు కారణం బేది యేని
నోదయామయ! యేల బహూక్తు లింక
దేవుఁడ! భవాబ్ధినుండి నిస్తీర్ణుఁ డైతి. ౧౩౦

సీ. ప్రాపితం బయ్యెఁ బరానందసందోహ
మాకులత్వము లేక యమరినాఁడ
కర్తమ్ము కృత మయ్యె జ్ఞాతవ్య మాజ్ఞాత
మయ్యెఁ బ్రాప్తవ్యంబు ప్రాప్త మయ్యె
శేషమ్ము లే దింకఁ జిత్తమ్ము చిత్తత్త్వ
మనుభూతము సుఖమ్ము గొనఁ బరువిడు
చున్నది రాజ్యమ్ము నొందిన విడిచిన
యోగపారగ! దుఃఖ మొనరఁబోవ
దమల మవు చిద్రసమున గ్రాహ్యమ్ము లేదు
లేద యగ్రాహ్యమేనిఁ గాలికము దైశ్య
మే పదార్థమ్ము నెంచిన నేక మైన
యల చిదాత్మయ కాక లే దన్య మొండు. ౧౩౧

గీ. పూర్ణ మానంద మిదియు నాపూర్ణ మయ్యె
నల చిదానందకలన మహాత్ముఁ డీశుఁ
డొకఁడ కా కన్యము పదార్థ ముండ దన్న
సిద్ధసిద్ధాంత మిపుడు సుసిద్ధ మయ్యె. ౧౩౨

క. ఇందాఁకఁ జిదానందా
మందుఁడ నవు నా కివి సుఖమయము లె యన న
య్యెం దెసలు దేవు నానం
బొందెద నా గుహనె మరలఁ బురుషోత్తంసా! ౧౩౩

గీ. త్వత్పదాబ్జావలోకనాదరమునందు
స్వస్వరూపావలోకనసౌఖ్యమందు
నెంచ లేదు విభేద మింతేనిఁ గాన
నేది సెల విచ్చెదో? యదియే యొనర్తు. ౧౩౪

క. అను శిష్యున కగ్గురుఁడు
న్ననుస్నాన మొనర్చి నిత్యమును దీర్చి కృతా

శనుఁడ వయి నేఁడు వోయినఁ
బునస్సమాధి నెనయంగఁ బోనెద వనుడున్. ౧౩౫

క. అటు సేసి మ్రొక్కి గురునకుఁ
దటుకున గుహ సొచ్చె రాజు తద్గురువాంఛన్
దిట వెనసి యారు మాసము
లటు చన మఱి చొచ్చె వాని యనుశాసితితోన్. ౧౩౬

ఉ. వత్సర మేఁగఁగా వెలికి వచ్చి గురుం గని మ్రొక్కి యాతఁడున్
"వత్స! వసాఽగ్రతో మమ యనం బద మొత్తుచు నొద్దనున్న ని
ర్మత్సరు నాదరించి వినుమా యనుమానము వాయలేదె? సం
దిత్సితమందుఁ జెప్పఁగలదే? కృతకృత్యుఁడ వైతి వా మ్మెఁకన్. ౧౩౭

దత్త దేవుని యనుశాసనము

ఉ. ఆ రహి నీదు ప్రశ్నముల కన్నిఁటికిం బదు లంటి వింటె? యా
చారముఁ గూర్చి నీకుఁ గల సందియముం బెడఁబాతు దానితో
ధారుణినాథ! నా కయినఁ దత్త్వ మెఱింగిన నీకు నైన లే
దారయఁ గృత్య మైన నది త్యాజ్యము కాదు సనాతనం బనా! ౧౩౮

చ. ననుఁ గని యిందుఁ గొంద ఱయిన న్విడనాడరె? వర్ణధర్మవ
ర్తనము లటంచు లోకము కృతంబున కే నొనరించుచుంటి ని
త్యనియతధర్మకర్మముల నన్యులతోఁ బడలేక బాధ లో
వ్వనివను లప్పుడప్పుడు నెపం బడి చేయుచునుందు నందనా! ౧౩౯

ఉ. నే నొనరించుచుంటి నని నీవు నొనర్పకు మా వ్యతిక్రమం
బే నెఱి సద్గృహస్థవిధియే భవదాచరణీయ మొప్పు భూ
మీనుఁడ! లోకసంగ్రహము నెంచుము చోదన నట్టు లుంచు మె
వ్వానికిఁ దప్ప దుత్తముని వర్తన మెంచి చరించు టుర్వరన్. ౧౪౦

ఉ. ఆతఁ డెదేఁ బ్రమాణ మన నందఱు నద్దె ప్రమాణ మందు రా
భీతికి మూర్ధ మొగ్గి సరవి న్విధిఁ దప్ప డొకప్పుడేన్ భయా

తీతుఁడు దోషబుద్ధిన విధి న్విడనాడఁడు సద్గుణం బటం
చేతటి శాస్త్రయంత్రితమునేఁ గొనియాడఁడు బాలుపోలికన్. ౧౪౧

గీ. ఆత్మరతి యెవ్వఁ డెవ్వాఁడు స్వాత్మతృప్తుఁ
డాత్మయందె సంతుష్టుఁ డౌ నట్టి యోగి
కాచరింపంగఁ దగిన కార్యంబు లేదు
కృత మకృత మాతనికి నర్థ మిడ దెడపదు. ౧౪౨

ఉ. ఎందును నర్థసంపనిత మేకము గల్గద యట్టి వాని కా
నందమునందు నాప్లుతు లనం దగు పూరుషు లిందు నిద్దతే
యందుము యోగయుక్తుఁడు భయాతిగతుం డొకఁ డొండు బుద్ధికిం
జెందనిచోటు నొందిన ప్రసిద్ధుఁడు తక్కినవారు లెక్కయే. ౧౪౩

చ. గృహమున కేగు రాజ్య మొనరింపుము భూప్రజ లిచ్చ మెచ్చ న
న్వహము యజింపు దేవతల యాగములం బితృవర్గము న్స్వధన్
మహిదివిజాతులం దరతమత్వ మెఱింగి సువర్ణకన్యకా
మహిగృహగోప్రదానముల మాననలం బరితృప్తు లౌ నటుల్. ౧౪౪

గీ. అప్పుడప్పుడు దర్శన మర్థిఁ గూర్పు
మమ్ము మఱవకు మవ్యగ్రమతివి కమ్ము
తత్త్వవిద్వర! యేకాగ్రతఁ గొను మెపు
డనుభవించిన స్వానంద మనుపదంబ. ౧౪౫

క. అనుశిష్టుఁడ వైతివి నా
మ్మనినట్టులె యాచరింపు మన్న! యనినన్
మునిమండలికిఁ బ్రదక్షిణ
మును మును వొనరించి హర్షమున విహ్వలుఁడై. ౧౪౬

క. ఆనందాశ్రుకలాకులుఁ
డై నిజగురుదేవునాన నాత్మనగరికిం
బో నయి యథోపదేశం
బానరపతి సంచరించె ననుయాతృమణీ! ౧౪౭

క. ఇది కార్తవీర్యునకు ద
త్తదయానిధిదత్తమైన తత్త్వవిబోధం
బెద నిల్పుకొనుము దీనిం
బదిలముగా నని గురుఁ డని వర్ణించుటయున్. ౧౪౯

క. ఏకకుబేరసఖత్వప్రాకట్యకైలాసశైలపరివర్జనధీ
నైకకుబేరాయితవైశ్యాకరచందోలుపురవరావాస! శివా!

చ. అగుణ! గుణప్రకాశక! గుణాగుణలోకవివర్తమాన! భా
వగతనిజప్రభావపరభావసమీకరణప్రకారతా
నుగత! నిరస్తశాత్రవమనోవినిరీక్షితభావరూప! రూ
పగతముఖక్రియాగుణవిభాతవిభప్రకృతిప్రసాధకా! ౧౫౦

మాలిని. అధిగతసుఖరూపా! హారిహారప్రకాశా!
విధివిధుముఖవిత్తస్వీయతత్త్వావకాశా!
విధివిధిపరచేతోవీధిలబ్ధప్రవేశా!
బుధజనపరివశ్యాపుణ్యవైరిప్రణాశా! ౧౫౧

సీ. ఆంధ్రీల రామకథామృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెఁ దనయు విత్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ ముఖములఁ
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదిగో
షష్ఠసూనస్తబక మిందు సన్నిధిఁ గొను. ౧౫౨

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్తభాగవతము

## సప్తమ గుచ్ఛము

క. శ్రీలింగోద్భవనామా!
బాలకలానిధివతంస! పార్వత్యంకా
లాలితభక్తజనా! విష
యాలోలశరీరిదూర! హర! హృతమారా! ౧

ఆ. అవధరింపు మవల నడిగిన యనుగున
కనియెఁ గురువరుం డనంతరంబు
కార్తవీర్యచరితకము మునులకు సూతుఁ
డానతిచ్చె నట్టు లనెద నేను. ౨

చ. కతిపయమాసము ల్చనుడుఁ గ్రమ్మఱ వచ్చె నరేంద్రుఁ డత్రిసం
తతి యతి నుత్కటం గనుఁగొనన్ గురుపాదుకఁ దాల్చె మూర్ధమం
దతఁడు గవుంగిలించి ధృతి నానతి యీ నెదుట న్ధరాస్థలిం
గతభయుఁ డుండి దేవుఁ డడుగ న్స్వశుభం బనియెం బ్రసక్తితోన్. 3

ఉ. సూరెల నున్న మానుల విశుద్ధతలం గొనియాడి వారి వి
స్తారతపఃప్రచారకలితప్రతిపత్తులఁ బృచ్ఛసేసి యా
కారముఁ జూచి ప్రత్న మవకాశముఁ గాంచుట నెంచి యాత్మని
స్తారకుఁ డైన దేవుసవిధంబున నంజలిఁ బన్ని యిట్లనున్. ౪

ఉ. కాంచితి నీప్రసత్తుల జగద్గురుఁడా! పరమంబు శ్రేయ మ
భ్యంచితుఁ డైతి ధన్యుఁ డన నైతి ననుగ్రహసంగ్రహంబుతో
వంచితు లై భవార్ణవజవంబున దుఃఖితు లైనవారి భా
వించి వచించుచుంటి మునివిగ్రహ! దేవ! దయాపరా! నతుల్. ౫

కార్తవీర్యుని యాత్మ ప్రశ్నము

సీ. ఎవఁడు స్వరూపంబు నెఱిఁగి భావించినాఁ
డరసె విశ్వం జేసె నఖిల మతఁడు
త్వత్ప్రసాదమున నద్వయ మాత్మపద మేను
భావించి కను ననుభవము దారి
నాకన్న దృశ్య మన్యము లేద కాన్పించు
నదియొ? నిరర్థకం బతికరణుఁడ
సచ్చిదానందనిజస్వరూపుఁడ సక
లాశ్రయుండ నకర్త నభిదుఁడఁ గద
యనఘుఁడ! సదాచరణము దురాచరణము
నిట్టి మాబోంట్లకే ఫల మీయు దీశ్వ
రేశునకుఁ బుణ్య మే శ్రేయ మిచ్చు?
నాపదల కనాచార మేది సంధాయకమవు?

క. నిపుణముగ నిరూపించినఁ
గృపాపరుఁడ! మోహాకరము యీ నీ యాచా
రపు సరణి జనములకు నే
వపుగతి శుద్ధగతి యవ్యవస్థితములు గాఁ.

క. ఆ యీ విషయము వినఁ గుతు
కాయత్తం బైనది మది యఖిలేశ్వర! యీ
తోయమున నీవు మాఘ
స్నాయి వగుట కర్థ మేది? సంభావింపన్.

చ. నినుఁ గనియే? స్వయమ్ముగనో? నీట మునింగెద రెల్లవారు శ్రీ
లని నరు లంచు వృద్ధు లని యర్భకు లంచు విభేద మేది? మే
దిని సుఖకాములే చలికిఁ దేఁకువ లేక వడంకువారె యొ
య్యన నరుణోదయంబుఁ గనినంతన మాఘమునం దమోఘతన్.

గీ. ఏమి ఫలము నుద్దేశించి యింత కష్ట
మెనసెదరు జను లకట మోక్షేచ్ఛనొక్కొ?

నీప్రసాదంబుఁ గోరిరియో? నిర్మలతకుఁ
గర్మమునఁ గర్మనిర్హారగతిఁ దలఁచిరియొ? ౧౦

ఉ. నిత్య మనిత్య మంచును ననిత్యము నిత్య మటంచు నెంచి త
త్ప్రత్యయమోహపాశచయబద్ధము లోకము నాక మెంచకే
సత్యముగాఁ ద్రివర్గము పసం దిలకించి తథావిధార్థధ
ర్మాత్యనురక్తి సక్త మగు నట్టిది నీ పట ము న్వచింపవే? ౧౧

ఉ. ఇప్పుడు చెప్పు మిందు ఫల మేది గ్రహించి మహానుభావులుం
దెప్పున మాఘమాసమునఁ దీర్థముల న్మునుఁగంగ నోదురో?
ముప్పిడల ప్రసక్తి మునిముఖ్యులు వీరలె నీ ముఖాబ్జమం
దొప్పిన చూడ్కి నెట్టి వినుచుండిరి దేవ! యనుగ్రహింపవే! ౧౨

## ద త్త దే వు ని స దు త్త ర ము లు

గీ. అనుడుఁ బ్రీతి దత్తాత్రేయుఁ డనుగున కనె
రాజశార్దూల! వినుము సంప్రశ్నమునకు
శోభనం బుత్తరం బిట్టిచొప్పు నడుగు
మహితుఁ డగు నారదునకు బ్రహ్మ యని నట్లు. ౧౩

సీ. ఆత్మస్వరూపంబు నాదమఱచి యిందు
నానాసుఖమ్ము లంతరమున నెపు
డభిలషించెడువారి కభిలషింపనివారి
కాంతరశోధనం బాచరించు
చాత్మప్రకాశనం బల్లనల్లనఁ జేయు
మాఘసంస్నానసంభవము ఫలము
దేశమ్ముఁ బట్టియుఁ దీర్థమ్ముఁ బట్టియుఁ
శ్రద్ధను దత్క్రియాక్రమముఁ బట్టి
సిద్ధులెడఁ దదపూర్వవిశేష మొసఁగుఁ
గర్మధారుణి భారతాఖ్య మగు వర్ష

మిందుఁ బొడమి రవి మకరమందు నుండఁ
బ్రొద్దుప్రొద్దున మునుఁగని పురుషుఁ డెద్దు. ౧౪

సీ. మాఘమజ్జనమునమాద్రిఁ బ్రీతుఁడు గాఁడు
హరి తపోదాన వ్రతాదులందు
సూర్యుం డొదవకున్న సురవర్త్మ మట్లు మా
ఘస్నానరహితసత్కర్మ మురదు
క్రతుజక్రియలు పోలఁగా రావు మాఘను
స్నానమ్ము నన్యతేజము లినువలె
వాసుదేవప్రీతి పాపాపనుత్తి స్వ
ర్గప్రాప్తి యగును మాఘమున స్నాత
కనుచుఁ బెద్దలముఖమున నాలకించి
మాఘమున నేట మునుఁగని మానవుండు
భరతమహిఁ గలి నేమి లాభము గడించె
నశుచి యధ్రువ మైన కాయమ్ముఁ బెంచి? ౧౫

ఉ. ఎమ్ములఁ బన్ని స్నాయువుల నెల్లెడ లల్లి బిగించి రక్తమాం
సమ్ములఁ బూత పూసి యొకచర్మముఁ గప్పి విధాత సేసె దే
హమ్మని యిందుఁ జొచ్చి నరుఁ డన్యులఁ గొట్టి తినంగ నెంచు రో
గమ్ములపుట్ట యొప్పు దపగంధము మూత్రపురీషపూర్ణముల్. ౧౬

ఉ. స్థూలశరీర మిద్ది యిఁక సూక్ష్మ మొకం డిట నుండె దోషపా
పాలయ మావృతాశము మహాశను లార్వురు శత్రు లుందు రం
దా లలి బద్ధుఁ డాత్ముఁ డుభయాంగముల న్సమతం జెడెం బడెన్
ధీలసితుం డతం డెడసెనే నిది కుక్కల కొఁ దినం దుదిన్. ౧౭

గీ. ఇట్టి దేహమ్ము నమ్మి యిం దెవరు మాఘ
మాసమున స్నానవిధిఁ బ్రొలుమాలువారొ?
తోయములయందుఁ దోఁచు బుద్బుదములట్లు
వారు మరణమ్ముకొఱకె సంభవ మొనయుట. ౧౮

సీ. విప్రుఁ డవైష్ణవుం డప్రయోగి శ్రాద్ధ
మట్టు లబ్రహ్మణ్యు డైన క్షత్ర
మాచారవిహతాన్వయము దంభిధర్మ మ్ము
ధృథము జ్ఞానము కోపదిగ్ధతపము
సప్రమాదు శ్రుతమ్ము సాక్షికభోజన
మ్మపగురుభక్తి యై నట్టి నారి
నారి సంగతి బ్రహ్మచారి యదీప్తాగ్ని
హవనార్థ ముపజీవ్య యైన కన్య
స్వార్థపాకక్రియయు శూద్రు నడిగి చేయు
నధ్వరక్రియ కృపణుని యర్థగరిమ
నవిత మకరంబునం దుండ స్నానమాడ
నట్టి మానవు జన్మం బపార్థము లివి. ౧౯

ఉ. ఆన విరోధముం గొనఁగ నౌ పతి సత్యము లేని వాణి య
భ్యాసము లేని విద్య మన మట్టిటు లాగు జపమ్ము తీర్థసం
వాసము జీవనార్థ మపపాత్రము దానము తిండి కైన స
న్యాసము మాఘమాసమున స్నానము లేని భవంబు వ్యర్థముల్. ౨౦

గీ. పంచపాపప్రపంచంబు సంచితంబు
నెట్టు లెడలించు స్వర్వీధి నేగు నెట్లు
మకరమాసంబునం దహిమకరుఁ డుదితుఁ
డగుతఱికిఁ దాన మాడని యన్నరుండు. ౨౧

గీ. బడుగు నడుగునఁ బడెడు నెవ్వాని నిప్పు
డుద్ధరింతుము? బ్రహ్మఘ్నుఁడో? సురాపుఁ
డో? కనకహారియో? యన్యుఁడో? మునుఁగఁగ
ర మ్మనుచు మ్రోయు జలము మాఘమ్ము వేఁగ. ౨౨

గీ. ఎవ్వఁ డేయేట మునుఁగునో? యే మన నగు
నాశకాలమె వచ్చె నీనాఁటికి మన

కనుచుఁ గంపించు దుఃఖించుఁ గనుచునుండ
మండిపడు మాఘమున పాపతండము లిన! ౨౩

గీ. మాఘమున స్నాన మొనరించి మానవులు వి
పాపు లై మేఘముక్తులై వాత్మకు లనఁ
బావకుల వోలె దీపింత్రు పాయు నపుడ
వాఙ్మనఃకాయకర్మసంపాదితములు. ౨౪

గీ. ఆర్ద్ర మని శుష్క మని యల్ప మని యధిక మ
టంచుఁ బ్రామాదిక మటంచు నెంచవలవ
దహిమకరమకరావాస మరసి సరసి
మగ్నుఁ డౌవాఁడు దేలు సంబరమున దివి. ౨౫

ఉ. పాపము లేనివారు త్రిదివంబు గడింతురు శుద్ధు లౌదు రా
పాపులు వద్దు సందియము భాస్కరుఁ డమ్మకరంబుఁ జెందునాఁ
డాపగఁ దోఁగి యప్పనికి నందఱు యుక్తులె విష్ణుభక్తియం
దేపగిదిం గులాశ్రమము లెన్నఁగరావో? తథావిధంబుగన్. ౨౬

గీ. అఖిలపాపాపహము మాఘ మఖిలద మదె
పరమ మగు మంత్ర మిద్దియే పరమ తపము
పూర్వ జన్మశతాభ్యాసమునన కలుగు
నాత్మవిద్య మాఘస్నానమందు మనసు. ౨౭

గీ. పావనమ్ములలోనఁ బావనము మివుల
మాఖ మా నెల స్నానంబు మాను నెవఁడు
చంద్రసూర్యగ్రహోపమాశ్చర్యకరము
లందు భోగంబు లతఁ డెట్లు లందఁగలఁడు? ౨౮

క. భృగువంశజ మును బ్రాహ్మణి
యగు ఋచికాభిఖ్య యొకతె యతిబాల్యమునన్
విగతధవ యై సుదారుణ
మగు దుఃఖముతోఁ దపంబు నారంభించెన్. ౨౯

సీ. అకరంటకక్షేత్రమందు నర్మదదరి
వింధ్యపాతమ్మున విప్రవనిత
నారాయణపరాయణయు సదాచారయు
సంగవివర్జిత సత్యవచన
అల్పభాషిణి విజితారి జితేంద్రియ
దానశీల సుశీల తనుతనుతర
దేవపితృద్విజాతిథులకు మునుమున్న
వహ్నికిఁ బెట్టి హవన మొనర్చి
షష్ఠకాలమునందు భోజనము సేయు
నాపణంబులఁ గణముల నరసి తెచ్చి
కృచ్ఛ్రపారాకకృచ్ఛ్రాతికృచ్ఛ్రములను
వ్రతములను బున్నములఁ గూర్చుఁ బాడి వేఁడి. ౩౦

గీ. తిని తినక యున్న లేకున్న గునుపు లేక
ద్వంద్వములయందు సమతానువర్తిని యయి
షష్టిమాఘంబు లాప్తి సుస్నాత యయ్యె
నర్మదాకపిలాసంగతోర్ములందు. ౩౧

చ. కృతముల దుష్కృతంబు లొదిగించి శరీరము నుజ్జగించి సం
తతముగ విష్ణులోకమున నాలుగు వేలు యుగమ్ము లుండి యా
యతివ మహాద్భుతమ్ముగ సురార్థము సాధిత మాచరించి యు
చ్ఛ్రితయశ యయ్యె మాఘమునఁ జేసిన పున్నము చెన్ను మీఱఁగన్.

క. సుందోపసుందు లసురులు సోదరవందర జగంబుఁ జేయు టరసి యా
సుందరిఁ దివిచి విరించనుఁ డందుల కనిచెం దిలోత్తమాఖ్య యిడి వడిన్

ఉ. కేలిగఁ బోయి తన్వి యిరుగేల విపంచి నయించుచుండెఁ గం
కేలితరుప్రకాండమునఁ గింకరు లప్పుడ పాటి చెప్పినా
రేలిక లిద్దఱొద్ద భువనైకవిమోహిని యాట బాట పు
ష్పాలిధనుర్గుణం బడుమ నాదొర లాదృతిఁ జేరి రాదెసన్. ౩౪

ఉ. ఆటలపాటలం గొనుచు నాంధ్ర సహస్రములం ద్యజించి య
ప్పాట నుపస్థితం గని సెబా సని శీధువిమత్తు లిద్ద ఱి
ప్పోటికి నేన నేన యుపభోగసమర్థుఁడ నంచు గిట్టి మో
మోటము మాని మత్తగజము ల్వలె నన్నయుఁ దమ్ముఁ డమ్మెయిన్.

ఆ. నూరుపుట్ల బరువు క్రూరగదాదండ
ములను గాలదండముల సమముల
వేరువేరఁ బట్టి వెసఁ గొట్టికొనఁ జొచ్చి
రొకరి నొకరు కాలయోగమునను. 3౬

ఉ. ఎక్కడనుండి వచ్చిపడె నిద్దఱపాలిఁటఁ గాలరాత్రియో?
యక్కట యం చమాత్యు లొరు లా యన నూ యన రాక మొత్తుకోఁ
జక్కగ మేను లిర్వురును జాచి నిగుడ్చిన తద్గదాహతుల్
మొక్కల మైన నోరువక పోయెను బొందులు వీడి ప్రాణముల్. 3౭

ఉ. ఉత్తమదేవకార్యముఁ దిలోత్తమ మెత్తనఁ దీర్చిపోయె ది
గ్భిత్తితతు ల్చళుక్కు మన విష్ణుపదంబున బ్రహ్మపాలి కా
మత్తచకోరనేత్ర గరిమంబు నుతించి విరించి పంచె యా
వత్తపనేందుతారము నవారితసూర్యరథస్థితిం గొనన్. 3౮

గీ. ఈ లలి న్వింటివా? ద్విజబాలవిధవ
నర్మదామకరార్కసుస్నానమహిమ
నచ్చరలయందుఁ జే రొంది యబ్జహితుని
లోకమున సౌఖ్య మందెడు లోకపాల! 3౯

ఉ. కావున మాఘమాసమునఁ గావలె నంచును దాన మాడఁ గై
కోవలె యత్నము న్నరులు కొండలఁబోలు నఘంబు లంబులం
బోవును బూరుషార్థములఁ బొందఁగ రాని వటంచు నుండఁ బో
వేవియు సర్వదక్షిణమహేజ్యలు దానికి నెత్తు రా వినా! ౪౦

గీ. స్నాన మఘహారి మాఘమాసమున మఱియు
నొప్పు నది రవిమకరమం దుండ వెండి

యదియుఁ దీర్థవిశేషంబునం దొసంగు
ఫలమున కియత్తలే దట్టి కలన వినుము. ౪౧

చ. కృతయుగమందు నైషధపురీవరమం దొకవైశ్యుఁ డుండువాఁ
డతనికి హేమకుండలసమాఖ్య యొసంగు నతండు సత్క్రియా
న్వితుఁడు కులీనుఁ డగ్నికిని విప్రులకుం బరిచర్య సేయు సం
తతముఁ గృషిం బొనర్చు నిరతంబుగ బేరములాడు నన్నిటన్. ౪౨

ఉ. అమ్మును గోవులం బసుల నమ్మును ద్రసవర్గ మమ్ము ఖా
ణమ్మును నమ్ము నమ్ము లవణమ్ములు ధాన్యము లమ్ము నమ్ము ర
త్నమ్ములు జాతరూపముఖధాతువిశేషము లమ్ము నమ్ము వ
స్త్రమ్ములు గట్టై లమ్ము సతత మ్మతఁ డమ్మని దెం దలభ్యమే. ౪౩

ఆ. అట్టు లమ్మి యమ్మి యెనిమిది కోటులు
హాటకములు లాభ మాహరించెఁ
గొనుచు నమ్ముకొనుచుఁ గుడుచుచు నుండంగ
నాశ్రవణము వలిత మయ్యె మేను. ౪౪

ఉ. ఆచెను జిత్తమం దెనసె నాజని తా నొనరించినట్టిఁ డా
లోచన మప్డు విచ్చెను నలో యని యేడువ నేమి కద్దు నే
నోచిన దేమి? యింతకుఁ జను న్మయి వీడి యొకండు వానితో
నాచితము ల్మహార్థములయం దొకఁడేనియుఁ బోవనేచునే? ౪౫

గీ. అని విచారించె వెంటనే యర్థమందు
షష్ఠభాగంబు భాగించె సంతరించెఁ
దనకుఁ దోఁచినయవి పెద్ద లనినయవియు
జనుల కుపయుక్తము లగు నిశ్చయపుఁ బనులు. ౪౬

సీ. విష్ణుదేవున కొక విపుల మాయతన మ
ద్దెసనె యట్టిదె శివదేవునకును
దదుభయాగ్రిమభూమిఁ దామరసాంచిత
సద్రససరసాబ్ధిసమతటాక

మా వెంటఁ బూజ కౌ బూవులతోఁట య
ద్దానిచుట్టు ననేకధర్మవనము
లా పరిసరమున నఖిలవసతు లొప్పు
వేదవేదీయుతవిప్రవసతు
లర్థి సమకూర్చెఁ బురమున కన్నిదెసల
నేర్చి నిర్మించె నెన్నొ పానీయశాల
లోదయ మ్మాస్తమయ మనరాద వాని
యన్నసత్త్రమ్ములందు లే దన్నమాట. ౪౯

ఉ. ఎక్కడ నెక్కడం జెఱువు లెక్కడ నెక్కడ బావు లే రెవా
రెక్కడ కౌ నటందు రవి యన్నియు నాతఁడమే యమర్చె నా
చక్కఁ బురాణము ల్వినెఁ బ్రశస్తములం చట నెన్ను దానము
ల్పెక్కు లొనర్చె రా వవియు లెక్కకుఁ గొల్చె సదా హరి స్మరుల్.

క. ఆమెడ సర్వావిధమ్మున నాయతికాఁ డొనరిచికొనె యావజ్జీవ
ప్రాయశ్చిత్త మ్మందు మహాయతు లమ్మెయికి సమాశీస్సు లిడన్.

ఉ. కొండొకకాల మేగఁ గొడుకు ల్దన కప్డుదయింప నైరి శ్రీ
కుండలుఁడు న్వికుండలుఁడు కోమటిమానిక మింటి భార మా
కొండికలందుఁ దార్చి వనిఁ గోర్కెఁ దపఁ బొనరించి మించి తా
నండజవాహుపత్తనమునం దమరె న్నపునర్నివర్తి యై. ౫౦

ఉ. వాని కొమారులా? యిఁక సవవ్యవహారము నిచ్చ మెచ్చి యే
మానమువారిఁ గై కొనక మాత వచించిన మాటఁ బట్టకే
పానముఖంబు లేదు దముఁ బట్టి వెలార్పఁగ యావనార్థరూ
పానుగతంబు గర్వము రయం బనయం బనయంబు వెంచఁగన్. ౫౧

సీ. దేవళమ్ములఁ గని ధిక్కని రర్థిఁ గ
ట్టించిరి వేశ్యల కించు నిండ్లు
తండ్రివెంబడి వచ్చుతరమువారి నెడల్చి
తమకుఁ దగినవారిఁ దార్చుకొనిరి

విప్రుల కిచ్చుట వెఱ్ఱితనం బని
భుక్తంబు పీతంబుఁ బోరి నొనర్చి
రగ్గిలో బూడె సేయుఁ దగ దర్థ మటంచు
నని నటవిటకుగాయకుల కిడిః
చారుచందనవసనవేశ్మప్రచార
చంచదంచితవాహనాంచత్ప్రచార
ములు వొసంగఁగ మేలి సొమ్ములునుఁ దారు
మెఱయుచు రమించి రవ్వీది మెఱుపు లట్లు. ౫౨

ఉ. సంచులు గోసి కొన్నిదివసంబులు వాడిరి చే విదిర్చి యా
సంచులు గించులుం దులిపి చాలియుఁ జాలక కొన్నినాళ్లు లా
సంచుల నమ్మి పూటకును జాలక కొన్ని దినంబు లీన్చుచుం
గాంచిరి కన్ను విచ్చి ధనగర్వ మడంగఁ గడ ల్విడర్చకుల్. ౫౩

ఉ. సంచిత మర్థి ధర్మమున షష్ఠము పాలు వ్యయించెఁ దండ్రి వె
చ్చించి రధర్మమందు నవశేషము లుంచిన పంచభాగముల్
గొంచక పుత్త్రికు ల్స్వజనులు న్హితులు న్భటు లాత్మబాంధవుల్
గంచుకులుం ద్యజించి రిఁకఁ గానఁగరాఁ డొకఁడే నొకప్పుడేన్. ౫౪

గీ. అయ్యవారి నట్టిల్లయ్యె నట్టియిల్లు
కట్టఁ దినఁ ద్రావ లేమి నిక్కట్లు వడుచు
నూరివారల కనుమూసి యూడ్చికొనెడు
నట్టి వ్యాపారమునఁ జొచ్చి రల్లనల్ల. ౫౫

క. అట్టుడికినట్టు లుడికెం గట్టిఁడు లీ వైశ్యసుతులె కానిపనికి నీ
పట్టున మొదలిడి రిట్టని హట్టంబునఁ గెలఁకులందు నవనీశుకడన్. ౫౬

ఉ. అట్టిప్రవృత్తి నెంచి యనయంబునకుం బురివార లెట్టి యి
క్కట్టులు గూర్తురో? నృపుఁడు కట్టునొ? కొట్టునొ? యంచు భీతు లై
శెట్టులు సెట్ట యం చనక చేరి రరణ్యమునందుఁ ద్రోవ లా
కట్టి తెగించి దోఁచుకొనఁగా సమకట్టిరి వింటివార లై. ౫౭

ఉ. భిల్లులతోడఁ గూడి యడవిం బడి వేటల బాటలన్ బత
చ్ఛల్లకరోహితార్భకశశప్రముఖంబులఁ గొట్టి మాంసముల్
గల్లును దించుఁ ద్రావుచు నఘంబు లఘంబులఁ బెంచఁ గ్రించు లై
చెల్లి రొకండు రాత్రిఁ బులిచే నొకఁ డొక్కఁ డహిప్రసంగతిన్. ౫౮

గీ. అన్నదమ్ములఁ బాపుల యమభటు లపు
డంటఁగట్టి కై కొని చని యగ్రమందుఁ
బెట్టఁ గని చిత్రగుప్తుని విన్నపమును
గొని శిరం బూఁచి యాన యిచ్చెను బితృపతి. ౫౯

ఉ. అగ్రజుఁ గట్టి ఘోరనిరయంబుల పాల్పడఁజేయుఁ డిష్ట ని
ర్వ్యగ్రహనాకలోకసుఖభంగుల నాతని తమ్ముఁ గూర్చుఁ డ
వ్యగ్రత నంచుఁ గొంద ఱటు లన్ననుఁ గొంచుఁ జనంగ నొక్కరుం
డగ్రగతిం ద్వితీయుఁ గొని నాకము దారిఁ గ్రమించుచుండఁగన్. ౬౦

క. భయ మడఁగి యడఁగకే వి
స్మయము న్సంశయము సంతసము సమకూర్పన్
నయ మెఱిఁగి వికుండలుఁ డడి
గె యమానుచరునకు నెరఁగి కీర్తించు చొగిన్. ౬౧

ఉ. ఎక్కటిసంశయం బపనయింపు యమప్రియదూతభూత! మే
మొక్క కులంబునం బొడమి యొక్కఁడె కర్మ మొనర్చి దుర్మతిం
జిక్కి భవద్గృహీతగతిఁ జేరితి మిం దతఁ డన్న చిన్న నే
నక్కట నాకు నాక మెటు? లాతని యాతన యెట్టు? లం చనన్. ౬౨

చ. జనకుఁడు తల్లి పుత్త్రకుఁడు జాయ సహోదరి సోదరుండు నాఁ
జను నివి జాతిహేతువులు సంజ్ఞలు జన్మమొ? కర్మభోగముం
గొన నొక పాదపమ్మున శకుంతసమాగమ మట్టిఁ డొక్క గీ
మున నిటు లింద ఱొందుట విభోగమొ? తత్తదుపార్జితాప్తితోన్. ౬౩

గీ. చేయుదురు మంచిచెడుగులు చెందుదురు ఫ
లంబు లగుకాలమున నరు ల్మాటిమాటి

కర్యవర్యుఁడ! చేసినయతనిఁ గాక
యన్యుఁ దత్కర్మఫల మొందు నందఁబోదు. ౬౮

గీ. పడియె నతిపాతకుండు నీ భ్రాత దారు
ణం బనం దగు నిరయబంధంబునందు
నీ వొనర్చిన ధర్మసంసేవ నొందఁ
బోవుచుంటివి శాశ్వతపుణ్యపదము. ౬౯

చ. అనునెడ నే నొనర్చిన మహాఘనకార్య మఘంబు తత్కృతం
బును మహితాత్మ! నా కిపుడు బుద్ధి స్ఫురింపమిఁ గాదె నిన్ను న
ర్థి నడిగెదన్ గృతంబు లగు రీతులు భేదము లే దొకొండ్లయం
దును గలదేనిఁ జెప్పఁదగునో? వివరింపు మటన్న వాఁ డనున్. ౭౦

క. నీ వెఱుఁగక నే నెఱిఁగిన పావనధర్మంబు వినుము వైశ్యోత్తమ! సం
భావితుఁడు వేదవాదియు నౌ విప్రుని చెలిమిఁ జేయ నైతి వొకతఱిన్.

గీ. మిత్రనందినితటి హరిమిత్రపుత్త్రుఁ
డౌ సుమిత్రునిమైత్రిఁ దదాశ్రమమున
నుండి పాపప్రణాశతీర్థోత్తమమున
స్నాతుఁ డైతివి మాఘమాసములు రెండు. ౭౨

క. ఒకనెల స్నానంబున నీ
సకలదురితముల హరించె శమనస్వస యిం
కొక మాఘమాసమజ్జన
సుకృతమునకుఁ ద్రిదివ మిచ్చె సుస్థిరయుక్తిన్. ౭౩

చ. సతతము దేవలోకసుఖసంగివి నీ వగు మిట్టి పుణ్యసం
గతి భవదగ్రజుండు నరకంబుల బాధ సహించుఁగాక శా
శ్వతముగ ఛిద్యమానుఁ డసిపత్రుల ముద్గరభిద్యమానుఁ డ
శ్మతలవిచూర్ణ్యమానుఁ డయి మండెడు నిప్పుల భర్జ్యమానుఁ డై.

చ. అనఁ బులకాంకితాఖిలనిజావయవుం డతిదీనవక్త్రుఁ డై
వినయము దోఁప దూత కను విశ్రుతసోదరదుఃఖదుఃఖితన్

ఘనమతి! మైత్రీసాప్తపదిఁ గా వినమే? యది సుస్థిరంబ య
య్యెను మన కింతదూరము సహించిన తత్పదయుగ్మసంపదన్. ౭౧

ఉ. కావున మైత్రి నెంచి నరకంబున కేగుదు రెట్టిచేతలన్
బోవుదు రెట్టికర్మములఁ బుణ్యపురందరమందిరాప్సర
స్త్రీవనసౌఖ్యము ల్గానఁగఁ జెప్పు మొకింతయుఁ ద్రిక్కకుండ నా
భావన కీ వెలుంగని శుభం బశుభంబును గల్గ దంచితా! ౭౨

క. కారుణ్యామృతవర్షం బీరీతిం గురియుమయ్య హృష్టు నొనర్పన్
భారపడు మనుచు వేఁడెడు ధోరణి వాని కనె దేవదూతుండు దయన్.

మ. అనుయోగించితి వెంత మంచిగ బలే యస్తాఘుఁ డై నాఁడ వే
మనఁ జిత్తంబు విశుద్ధ మైనపుడ శ్రేయం బందు ధీవృత్తి సా
గును బుజాతికి సేవతోఁ బ్రదుకు నాకు న్నీదు ప్రశ్నంబులం
దనన్నైనన్ విననైన లే దవసరం బైన న్వచింతున్ స్పృహన్. ౭౪

క. మనమున మాటఁ దదితరకరణములఁ గృతి నఖిలదశల రహి నెప్పుడు న
న్యుని హింసింపనివానికిఁ బని లేదు యమాలయంబు బాటఁ దలంపన్.

గీ. ప్రాణిహింసకు లవుదురా? ప్రాఁజదువులు
చదివినను మఖములఁ గొన్నఁ జాగములె నొ
నర్చినఁ దపించినను నెట్లు నాకలోక
గతి యెనయరాద నరుల కాయతియుతుండ! ౭౬

గీ. పరమధర్మమ్ము పరమతపమ్ము పరమ
దానము నహింసయే యని మౌను లనిరి
మశక మత్కుణ యూక దంశ ముఖ జంతు
తతులఁ దనయట్లె కనువాని దయ కెది తుల? ౭౭

క. ఆయతతప్తాంగారం
బాయసకీలంబు పథము నల వైతరణిం
డాయరు చూడరు దుర్గతి
నేయెడ యమకృత మహింస నెసఁగు నరవరుల్. ౭౮

సీ. తమబొజ్జ నిండ భూతముల జలస్థల
చరముల హింసించు నరపశువులు
కాలసూత్రమ్ము దుర్గమ మొంది యందు నొం
దిలి కై స్వమాంసంబ తిను చఱచుచుఁ
బూయశోణితవసాప్రాయపంకిలగతి
గమిచి యయోముఖక్రిములు తొలువ
నన్యోన్యఘాతు లై యంధకారమున నా
కల్ప ముందురు కష్టకష్టకలన
నరకనిర్గతు లయ్యు స్థావరతఁ జిరము
డిందు తిర్యగ్మనుష్యతఁ గందుగుందు
ననుభవించి యనంతర మాదుదు నరు
లంగహీనదరిద్రపంగ్వంధవిధులు. ౭౯

ఉ. కావున రెండులోకములు కావలెనో హితముల్? వచఃక్రియా
భావములం బరాప్రియవిభావన సేయఁగరాదు భూతహిం
సావిరతు ల్భయంపడర యందును నిందు సముద్రమందు స్రో
తోవహ లట్లు ధర్మఘణితు ల్సకలమ్ము లహింసఁ జొచ్చెదుర్. ౮౦

గీ. సర్వతీర్థంబులందు సుస్నాతుఁ డయ్యె
సకలయజ్ఞంబులందు దీక్షలు వహించె
నఖిలభూతావలికిని వైశ్యప్రభూత!
యభయదానం బొసంగిన యట్టివాఁడు. ౮౧

క. తనధర్మ మెదిరిధర్మ
మ్మనువర్ణాశ్రమము శాస్త్రమం దుదితము నె
మ్మనమున నెఱింగి గతిగొను
జనుఁడు యమాలయముచాయ జనఁ డెన్నండుర్. ౮౨

గీ. బ్రహ్మచారి గృహస్థుండు వనగతుండు
యతియు నిష్ఠ స్వధర్మంబు లాచరించి

నాకమున సుఖముంద్రు సనాతనమ్ము
నెనయుదురు బ్రహ్మపదము జితేంద్రియు లయి. ౮౩

క. ఇష్టాపూర్తరతులు పంచేష్టసమాచరణపరులు హృదయధృతదయుల్
దిష్టకృతవహ్నిపూజావిష్టమతులు సెందుదురు దివిం గనరు యముఁ.

క. శాత్రవులు సుట్టుముట్టిన నత్రాసు లదీనవాదు లై యాహవ మం
దాత్రముఁ జెందినవారు సవిత్రంతరమార్గ మెనసి వెడలెద రనఘా! ౮౫

క. పనివడి శరణార్థులకై యనాథనారీద్విజార్థ మై యసువుల నే
జనులు త్యజింతురు వారలు పునరావృత్తి పని లేని పుణ్యపదగతుల్.

ఆ. బాలవృద్ధరోగిపంగ్వనాథదరిద్ర
జనుల సతము ప్రోపు స్వర్గహేతు
వాపుఁ గర్దమస్థ నవనీసురుని రోగిఁ
గాచి యశ్వమేధిగతి కగుదురు. ౮౭

క. గోపృష్ఠంబున నెక్కక గోపోషణ మాచరించి గోశుశ్రూషా
'యాపితదిను లగు వారికిఁ గాపుర మవు గోజగతి యుగంబు లెడలిన౯.

ఉ. ఆలకు నీరు త్రావ నగునట్టులు గర్తము ద్రవ్వ నెవ్వఁ డా
క్షాలితపాపుఁడై శమనుఁ గన్గొనకే యతఁ డేగు ద్యోగతి౯
గ్రాలుమతి౯ జలస్థలచరంబులు స్వేచ్ఛఁ జరింప నైన కూ
పాలి సువాపి దీర్ఘిక తటాకముఁ గూర్చిన పున్నె మెంతలో! ౮౯

క. ప్రాణులు పానీయంబుం బానం బొనరించుకొలఁది బరివృద్ధిఁ గనం
గా నగు ధర్మము దివి భోగానంత్యము తత్ప్రణేత కటు సమకూర్చు౯.

ఉ. జీవన మెందుఁ బ్రాణులకు జీవన మం దసువు ల్ధ్రుతంబు లౌఁ
గావునఁ ద్రోవలో బ్రప సుఖం బిడు నం దిఁక నైదు చూతముల్
రావి వటంబు నింబ మవలం బది చింతలు మూడు మూడు ధా
త్రీవరబిల్వదంతశఠవృక్షములు న్ధర నాట నాక మౌ. ౯౧

ఆ. కోష్ఠరుహము లైదు నిష్ఠఁ బెంచుటకన్న
నైదు భూరుహముల ప్రోదిసేత

వరము పత్త్రపుష్పఫలములచే నవి
దేవపితృనరులను దృప్తిపఱుచు. ౯౨

గీ. క్రోశపలో రోపితమ్ము తరుప్రవరము
కూర్చునంతలు గూర్తురా? కొడుకులట్లు
గాని సుమహాతాగ్ని గాని యా ఘనుఁ డెపుడును
దాతయే హోతయే సత్త్రియే తలంప. ౯౩

క. ఛాయాపుష్పఫలాఢ్యం
బాయతవృక్షమ్ము నిరంతరాశ్రితపక్ష్యు
చ్ఛ్రాయము నఱికెడు మూఢులు
భూయోనిరయాంబుధిఁ బడిపోయెద రార్యా! ౯౪

గీ. యమునిఁ జూడరు తులసీవనములు పెంచి
సర్వపాపహరం బది సర్వకామ
ద మ్మది గలట్టి యిల్లు తీర్థమ్ము చుమ్ము
కాదు యమకింకరుల కందుఁ గాలు వెట్ట. ౯౫

ఆ. తులసిఁ బెంచు నరులు దివి నుందు రన్నివే
లేండ్లు బీజదలము లెన్ని దాని
కరిగెదరు పితరులు హరియింటికి కాశ్రపూత
మాచరించి గరుడు నధిగమించి. ౯౬

క. నర్మదఁ జూచుట జాహ్నవి
నిర్మలి మునుఁగుటయు దులసి నంటుట సమముల్
శర్మ మగు నఘము లడఁగుం
ధర్మంబున నాటఁ బెంచఁ దడుపఁ గనఁ గొనన్. ౯౭

ఉ. బారసి బొరసిం దులసిపత్రము విప్రునిహస్తమందుఁ గా
నీ రమనేలువాని శిల నెత్తినఁగాని యొవండు వెట్టు ను
త్తారుఁ డతండు రావులు శతమ్ములు వేలు రసాలసాలముల్
దారిఁ దలిర్పఁజేయు ఫలిత మ్మది యొక్కఁడు మొక్క నాటినన్. ౯౮

గీ. తులసి గోవిందుపూజకై దొడ్డిఁ బెంచు
నతఁడు గడు మించు దివి యుగాయుతశతమ్ము
హరిహరార్చలు తులసిమంజరులఁ జేయు
వాఁడు ముక్తుఁడై చొరఁడు గర్భగృహ మింక. ౯౯

క. ఒక్కొక తులసీదలదల
మిక్కగ నివసింతు రెక్కడెక్కడి వేల్పుల్
పెక్కులు తీర్థమ్ములు గం
గక్క మొదలు నదులు దానిగౌరవ మసదే? ౧౦౦

సీ. నర్మదాలింగంబుననో? రత్నలింగంబు
నందో? స్ఫాటికపార్థివాదులందో?
తీర్థవనాద్రిప్రతిష్ఠితమ్ములఁ గాని
యెందే స్వయంభూతమందుఁ గాని
యొకపరి రెండుసార్లిఁకనొక్కతేప ష
ట్కాలమే ననుదినం బోలి భక్తి
నుగ్రు నమశ్శివాయో మని పూజించు
చమ్మనుజపము నిత్య మ్మొనర్చు
వారు యమలోకకథ వినఁబోరు శివుని
తోడఁ గూడి సుఖింత్రు చతుర్దశేంద్ర
కాలపర్యంత మభవులోకమున భవ్య
భవనమర్చానుభావసంపద ఘను లయి. ౧౦౧

గీ. శాఠ్యదంభలోభములఁ బ్రసంగమునను
శర్వుఁ బూజించినాఁడు భాస్కరినిఁ జూడఁ
డఘము లెడఁజేయ నైశ్వర్య మందఁజేయఁ
బున్నె మన్నె మున్న దే? శివపూజకన్న. ౧౦౨

గీ. శివునిఁ బూజించువాఁడు మాధవునిఁ గాని
తత్సమర్చకుఁ డ య్యుమామాధవునిఁ గాని

యెఱిఁగి యెఱుఁగక ద్వేషించిరేని వారు
నిరయమున నుందలేరు సంతరణ మెపుడు. ౧౦౩

గీ. భక్తి శివు నిత్యమును గొల్చువాఁడె యైన
ద్రవ్య మన్నము ఫలము నీరము శివస్వ
మంటరాదు గుత్తకుగొనె నద్ది చండుఁ,
డంటెనా? మోహమునఁ దప్పదఘ మసుఖము. ౧౦౪

ఆ. ఈఁగకాలియంత యేని శివద్రవ్య
మనుభవింపఁగూడ దఘభయుండు
దాఁటరాదు త్రొక్కఁదగదు నిర్మాల్యమ్ము
సలిలమందుఁ జేర్పఁజనును గాని. ౧౦౫

క. తృణపర్ణాదుల భవుని భ
వన మొనరించు జన మందు భద్రంబులు రు
ద్రునితోఁ గైలాసంబున
నన ని ట్లనఁగలమె సౌధహర్మ్యాదికృతిన్? ౧౦౬

ఆ. బ్రహ్మహరిహరులకుఁ బ్రాసాదమొ మఠమ్ము
కట్టువారు సుచిరకాల మట్టి
లోకముల వసింతు రాకలి డప్పియు
లేని సౌఖ్యకలన లీల మెఱయ. ౧౦౭

ఆ. బ్రహ్మశాల విపుల బ్రాహ్మణశాల వి
శ్రామధర్మగోవిశాలశాల
లుటజములు యతులకు నురు నిండ్లు పేదల
కారచించువారి కమరవసతి. ౧౦౮

ఆ. చెందు ద్విగుణఫలము జీర్ణముల సముద్ధ
రించి వానిఁ జెఱిచి కాంచు నరక
మర్థలోభ మలమ యతిదేవవిప్రమ
ఠాధిపత్య మెనసెనా? యఘ మగు. ౧౦౯

ఉ. పత్రమొ పుష్పమో ఫలమొ వారియొ యన్నమొ భూరియో తృణ
మ్మో త్రివిహీనుఁ డెవ్వఁడు విమోహమున న్మఠమందుఁ జెందు వాఁ
డాత్రము నొందు సూర్యతనయాలయమందలి యాతనార్థులన్
శత్రుసకైన నీఁదగ దనా! సురవిప్రమఠాధిపత్యమున్. ౧౧౦

గీ. ఎవని సహపుత్త్రపశుబాంధవేష్టు నిందు
నందుఁ జెఱుపఁ దలం పగు నట్టి వాని
కాధిపత్యంబు గట్టఁగా నగు మఠమున
దేవభూసురగోవితతి స్భరింప. ౧౧౧

క. అన్న మభోజ్యము మఠములఁ
దిన్నం జాంద్రాయణవ్రతిత్వ మొనయ నో
నన్నన్న! యంటి మఠవిభు
నన్నిరమున్ సచేలుఁడై క్రుంకవలెన్. ౧౧౨

గీ. బ్రహ్మవిష్ణుమహేశదేవవిహితార్చ
కలరుదోటల నాటి దివ్యత కగుదురు
తేవతాతిథివిప్రపూజావిధు లెపు
డాచరించి ప్రాజాపత్య మధివసింత్రు. ౧౧౩

క. పతితుఁడో? శ్రోత్రియుఁడో? పం
డితుఁడో? మూర్ఖుండొ? యెద్దడి న్మధ్యాహ్న
గతుఁ డతిథిమాత్రుఁడే యతఁ
డతులితుఁ డజునంత లనుట యది యొక యనులే? ౧౧౪

ఉ. డప్పిక నాకటన్ నడిచి డస్సి గృహాగతుఁడైన వానికిం
దెప్పున నన్నపానములఁ దృప్తి ఘొనర్చెడువారు స్వర్గమం
దొప్పుల కుప్పలై సుచిర ముందురు రేపును మాపు నర్థులే
యప్పగృహంబున న్విముఖులై చన రాతఁడు సూడఁడ య్యమున్.

చ. అతిథిసమర్చనార్పితమహామహిమంబున రాజులు న్మునుల్
సత మజలోకముం బడసి సత్యము సౌఖ్యము లొందుచున్నవా

రతిథిని బోలుబాంధవుఁడు నట్టిహితుండు తథావిధార్థ మం
చిత మవు ధర్మ మట్టిది వచింపఁగఁ దోఁపదు ముజ్జగమ్ములన్. ౧౧౬

గీ. లేదు లే దన్న నుడి విని లేచిపోవు
నతిథి కొనిపోవు గృహిసంచితతతసుకృత
మర్థి లేకయు జన్మమధ్యమున నొకపు
జేసి నభ్యాగతు భజించి యెనయఁడు యము. ౧౧౭

ఉ. అంచితసద్విమానముల నన్నదుఁ డయ్యమృతంబుఁ గొంచు భో
గించి దివంబు వీడి జనికిం జనువేళఁ గురూత్తరంబులన్
మంచికి నై జనించు గరిమంబున భారతవర్షమందు న
భ్యంచిత మా కులంబున మహాయువు నౌ నవు వంశకర్తయున్. ౧౧౮

గీ. అన్నమంద భూతమ్ముల యసువు లున్న
వది యొసంగెడివాఁడు ప్రాణార్థమండె
స్వర్గనిర్గమత్కాసరిద్ధ్వజనృపతికిఁ
బలికెఁ గరుణ నియ్యదియె వైవస్వతుండు. ౧౧౯

క. అన్న మిడు మన్న మిడు
మన్నమె నరనాథ! మరల నమరాలయసౌ
ఖ్యోన్నతిఁ బడసెదు చిత్త
మ్మున్నం గర్మమహీ నున్న యొకతఁడ మనుచున్. ౧౨౦

గీ. నియతి గ్రీష్మర్తువందుఁ బానీయ మిచ్చి
శిశిరహేమంతముల మేలి చిచ్చు నిచ్చి
యన్నివేళల నర్థికి నన్న మర్థి
నిచ్చి యమయాతనం గన కేగు దివికి. ౧౨౧

క. జ్ఞాతాజ్ఞాతాల్పమహా
పాతకముల కాచరింపవలెఁ బ్రాయశ్చి
త్తాతిశయ మబ్దమబ్దం
బాతరగతివాఁడు వోఁడు యమునెడ కనఘా! ౧౨౨

దాతల సుఖాస్పదులఁ జేయు దైవగతుల
నమ్మెయిఁ బదారు దానంబు లఘహరములు. ౧౨౯

గీ. పుణ్యతిథుల వ్యతీపాతమునను సంక్ర
మణములందును మజ్జనమాత్రమేని
దానమేని హోమమ్మేని దన కురునది
చేసినాతఁడు దుర్గతిఁ జెందఁబోఁడు. ౧౩౦

ఉ. దాన మొనర్చువారలకు దారుణరౌరవబాధ రాదు రా
దీ నరలోకమందు ధనహీనుగృహంబునఁ బుట్టు వట్టులే
మానియు సత్యవాది ప్రియమంజులవాది యఘోషుఁడుర్విఁ క్షమా
నూనుఁ డసూయ లేనియతఁ డూర్జితు లిందఱు నుత్తమస్థితిన్. ౧౩౧

సీ. పరగుణం బిసుమంత బహుళీకరించువాఁ
డన్యాఘముల నెంచనట్టియతడు
భూతదయాళుఁ డేప్రొద్దు దాక్షిణ్యంబు
సెడని సంపద గాఁగఁ జెందువాఁడు
పరధనం బల్పమే స్పృహాలమే నెడఁదనే
నపహరింపఁ దలంప నట్టి శుద్ధుఁ
డాహారనియమి మై యవనిఁ దీర్థము లెన్ని
యున్నెఁట మునుఁగు జితేంద్రియుండు
నరకయాతనఁ జూడని నరులు వీరు
నా మత మ్మిది పరదూషణ మ్మొనర్చు
వెకలిపాపుల కెల్లఁ బాపిష్ఠుఁ డతని
యముఁడు వండించు నిరయమ్ములందుఁ జిరము. ౧౩౨

గీ. సందియము లేదు చిత్తంబునం దలఁపుము
పరుషముగ మాటలాడు న న్నరుఁడు నరక
మునకె జన్మించినాఁడు దుర్జనన మొనయు
మరల నిలమీఁద నాలాగుశరమువాఁడు. ౧౩౩

క. తపము లొనర్చినఁ దీర్థము
లెపు డాడిన నిష్కృతి గలదె? కృతఘ్నునకుఁ
గృప లేక యమునిచేఁ జిర
ముపపీడితుఁ డగునుగాక యుగయుగములకుఁ. ౧౩౪

గీ. చేయరాదు తీర్థమ్ములఁ జెట్టపనులు
తదుపజీవన మెవనికిఁ దగని దరయఁ
ద్యాజ్యము ప్రతిగ్రహమ్ము తత్థ్సలములందు
ధర్మవిక్రయ మెందును దగదు చేయ. ౧౩౫

గీ. పాపము ప్రతిగ్రహమ్ము సర్వమ్ము దుర్జ
రమ్ము తీర్థమ్ములందు నారకి యగు నతఁ
డతిచిర మ్మట్టివాఁడు గంగాంబుమజ్జ
న మొకపరి చేసి పూతుఁ డై నాక మెనయు. ౧౩౬

క. వ్రతదానతపోయజ్ఞము
లితరములు పవిత్రము లెవియేనియు గంగా
మృతబింద్వభిషేకముతో
నితతులములు కా వటంచు నినజుం డనియెఁ. ౧౩౭

సీ. అన్యతీర్థసమాన యని గంగ నను నరా
ధముఁ డెనయును రౌరవము నరకము
నూరామడలనుండి నోరారఁ బలికిన
గంగ వర్ణము లఘుఘస్మరములు
నరకదాయక మవు దురిత మ్మపుడ కాల్చు
గంగ కొం డధికంబు గాదు జగతి
ధర్మఫలం బిడ ద్రవరూప మెనసిన
ప్రకృతిపర మ్మవు వస్తు వద్ది
స్వరసవై కుంఠచరణాంబుజచ్యుత మది
సంధృతమ్ము మహేశశీర్షమ్మునందు

నమృతరూపంబులోఁ బాఱు నవని దివిని
బడుగుల సముద్ధరింపఁ జొప్పడుకుతుకిత. ౧౩౮

క. కాన నయత్నుఁడు కావలె
మానవుఁ డెపు డమరతటిని మహితాంబుఝరిన్
స్నాన మొనరింప నంతటి
మానములవు పున్నెము లనుమాన్యము లెందున్. ౧౩౯

క. క్షేముఁ డయ్యుఁ బ్రతిగ్రహ మే
సుమనుఁడు కైకొనఁడో వాఁడు సుచిరమ్ముగ న
భ్రమునం దారారూప
మ్మమర న్వెలుఁగొందుఁ జుమ్మీ యర్యకలజనీ! ౧౪౦

ఆ. ఆలఁ బ్రోదిసేసి యవి పంకమగ్నలో
నెడ సముద్ధరించి హితము నెంచి
వానికొఱకు పోరు వచ్చి చచ్చినవారు
గగనమందుఁ దారక లగు వారు. ౧౪౧

గీ. ఎంత దుష్కృతికర్ము లే నెనయఁబోరు
యమునిలోకంబుఁ బాయ కహరహము నోగిఁ
ప్రాణసంయమ మొనరించువారు దాని
నిహతకల్మషు లగుచుఁ జెందెదరు దివము. ౧౪౨

చ. యమనియమమ్ములు వ్రతము లన్యతపమ్ములు నెందుఁ బ్రాణసం
యమమును బోలునే యహరహంబుఁ బదాఱు పదాఱు సేయ నా
యమి కవి భ్రూణహత్య దొసఁ గైన వెలార్చి విశుద్ధిఁ గూర్చు ని
ర్మముఁ డవు నట్టివానికిఁ గరస్థము లౌఁ బురుషార్థసార్థముల్. ౧౪౩

చ. నెల కొకసారి దర్భకొన నీరకణం బొకఁ డాహరించుచుం
జెలఁగుచు సాగ్రవత్సరము సేయు తపంబు సమంబు సువ్వె ని
శ్చల మొకప్రాణసంయమము సర్వవిధాల్పమహాఘసంఘముల్
ఫలవిధురంబు లౌ నరుఁడు ప్రాణనిరోధము నభ్యసింపఁగన్. ౧౪౪

గీ. తల్లివలెఁ బరదారలఁ దలఁచువార
లెనయ ర య్యమయాతన నిందు నందు
వేల్పులే వారు వారిచే విశ్వ మెల్ల
విధృత మైనది తద్ధర్మవిభము మేలు. ౧౮౫

గీ. పరధనంబులయందు లోభ మెదనైన
లేనియాతఁడు క్రోధనిదాను లైన
పెద్దలం దది లేనివాఁ డుద్ధవిడిన
గెలిచినారు దేవభువనము లుచితముగ. ౧౮౬

చ. జనకునిఁ దల్లి దేవసదృశంబుగ వార్ధకమందుఁ గొల్చువా
రనయము వారికన్న గురు నత్యధికంబుగఁ బ్రోదిసేయువా
రు నతిథు లౌదు రవ్విధికి రూఢిగ శీలముఁ గాచుకొన్న య
వ్వనితలు ధన్య లెందు నది వాసిన నారి యమావనిం బడుఙ. ౧౮౭

చ. చెడిపడుఁ బాకయజ్ఞము నిషిద్ధసమాచరణంబు సల్పి శూ
ద్రుఁడు యమయాతనాబ్ధి మహితు ల్స్మృతి శాస్త్రములుం బురాణమె
ప్పుడును బఠించి ధర్మహితబోధము సేసి నిరస్తపాపు లై
చెడనిపదంబుఁ జెందుదు ర శేషజగద్ధుర తద్ధృతం బనా! ౧౮౮

గీ. బ్రహ్మలోకంబుఁ జేరువారలు సడల్చి
తమము వేదాన్తసన్నిషణ్ణమతు లెందు
జ్ఞానయజ్ఞముల న్వేదశాస్త్రవిహిత
బోధ మొనరించువారి వేల్పులు గొలుతురు. ౧౮౯

చ. వినుము రహస్య మొండొకఁడు విష్ణుని. జిత్తమునం దలంచువాఁ
డనయము విష్ణునామనిచయం బనువాఁడు ప్రసక్తినేని వి
ష్ణునిఁ గొనియాడువాఁడు ననుఁ జేరరు పొ మ్మని చెప్పె మా విభుం
డనితరసామ్య మట్టినరు నంటినఁ గాంచినఁ బున్నె మెన్నఁగఙ. ౧౯౦

ఆ. వర్ణబాహ్యుఁ డైన వైష్ణవుఁ డుత్తముఁ
డతనివలన వెలయు నఖిలభువన

ముద్ధరించుఁ గొలము నొగి వానిఁ జూడ మే
మతఁడు మమ్ముఁ గానఁ డనఘ! నిజము. ౧౫౧

చ. నరులకు లే దుపాయ మిఁక నారకసాగర ముత్తరింప నె
ప్పరుసున విష్ణుభక్తి నెడఁబాసినఁ దద్విఘు నింటఁ దిన్నఁ ద
త్పరు లయి యట్టివారిఁ గొలువం దలకొన్న నిరాకులాత్ము లై
యరుగుదు రిందిరారమణునంతికమం దభయప్రతిష్ఠ కై. ౧౫౨

ఉ. దీక్ష వహించి సాంగము సదేవతసర్షిసముద్ర మార్యసం
శిక్షిత ముత్తమోత్తమము శేషశయానుని మంత్రవర్య మ
ష్టాక్షర మేని ద్వాదశమహాక్షర మేని జపించువారు ప
ద్మాక్షులె వారిఁ గాంచ నగు నయ్యెడఁ బాపము లెల్ల రూపఱుఁ౯.

ఉ. జే యని శంఖచక్రములఁ జేతులఁ దాల్చి విష్ణురూపు లై
పాయక విష్ణులోకమున వైష్ణవు లవ్వనమాల లూని బ్ర
హ్మాయువు నొంది యుందురు మహాఘము లైదు నశించు వారి సం
స్త్యాయము తీర్థభూతము, తదాప్తులు గారె? తదాప్తిమంగళుల్. ౧౫౪

క. శిలయందో? హృదయమందో?
జలమందో? ప్రతిమయందో? స్థండిలమందో?
జలజాప్తునందో? హరి ని
మ్ములఁ బూజించిన నరాళి పొందు విముక్తి౯. ౧౫౫

శా. శాలగ్రామశిలానుచక్ర మది వజ్రప్రాయకీటాకృతం
బాలక్ష్యం బట వాసుదేవుఁడు ముముక్షాపేక్షికిం బూజ్యుఁ డా
వాలం బా హరి కద్ది పుణ్యదము పాపక్షీణ్యముం జేయు ము
క్త్యాలంబం బిదె రాజసూయఫలసాహస్రంబు సంసేవికి౯. ౧౫౬

మ. అను వేదాంతము లచ్యుతం బనుచు బ్రహ్మం బంచు నిర్వాణ మం
చును నెద్దాని నదే ప్రసన్నమతిఁ దోఁచుం బ్రత్యహం బే నరుల్
ఘనపూజానియమంబు పూనెదరు శాలగ్రామచక్రంబునం
దనలం బట్టులు కాష్ఠమందు మథనవ్యాపారు లౌ వారికి౯. ౧౫౭

గీ. ఎంత పాపసమాచారు లేని కర్మ
గతులయందు నెందు ననధికారు లేని
శమనుఁ గనరు శాలగ్రామచక్రమందు
హరిని బూజించువారు వైశ్యప్రవరుఁడ! ౧౫౮

క. శాలగ్రామశిలాచ
క్రాలయమునఁ బోలె లక్ష్మియందును వైకుం
ఠాలయమందును హరి
యేకాలమ్ము రమింపఁ డట్టి గతి నే మందున్. ౧౫౯

చ. దినదినమ్ము నెవ్వఁడు మతిం దులసీదలముఖ్యమాధవా
ర్చనకరణమ్ముల న్విభుని శైలసుచక్రగతు న్భజించు వాఁ
డనుగతసాగరాంబర మహావని నిచ్చిన పాత్రమందుఁ జే
సెన పావనమ్ము నిత్యమును జేకొని శేపును మాపు వహ్నిలోన్.

సాలగ్రామశిలా మహాత్త్వము

ఉ. ద్వాదశకోటిలింగముల స్వర్ణసరోజసహస్రపంక్తిచే
ద్వాదశకల్పకాల మధిభక్తి సమర్చితము ల్వొనర్ప నా
నేది ఫలంబు గల్గు నది యేకదినంబునఁ జక్రపూజతో
ద్వాదశభేదము ల్గలవు తచ్ఛిలలందును వైశ్యసత్తమా! ౧౬౧

క. శాలగ్రామశిలాసను
శ్రీలలితుం బూజసేయు శీలమువాఁ డా
లీల లలి నొపఁగు నం దిఁ
దేలున్ స్థిరఁ బొడమె నేని హీనుం డేనిన్. ౧౬౨

గీ. ఊర్ధ్వలోకమునుండి ప్రచ్యుతిఁ గనండ
నరుఁడు భక్తి శాలగ్రామ హరి యజించి
భూతసంప్లవ మాదాఁకఁ బన్నె మన్నె
మున్న దిట్టిది యని యెందు నెన్న రాద. ౧౬౩

ఉ. దానము లేక తీర్థములఁ దానము లేక మఖమ్ము లేక ధీ
ధ్యానము లేక ముక్తిఁ గన నౌ నతిపాతకి యైనఁ జెందఁబోఁ
డే నరకంబు గర్భమున నెందుఁ జొరండు కృమిత్వముఖ్యదు
ర్యోనిభవంబు లెక్కడివి? వహో హరిఁ జక్రమునందుఁ గొల్చినన్.

క. దీక్షావిధానమంత్రా
పేక్షితబలి నాహరించు నెవ్వఁ డెపుడు వాఁ
డక్షీణవిష్ణుపదమున్
దక్షుండై చెందు నందుఁ దథ్యం బనఘా! ౧౬౫

శా. సాలగ్రామశిలాజలంబుల సదా సంవాసముం జేయు ము
క్త్యాలంబంబులు గంగ గోద మొదలౌ నర్థింప నౌ తీర్థముల్
వేలు న్వందలు గానఁ దత్సలిలము ల్శీర్షంబున న్దాల్చినం
జాలు న్భక్తి నతండు స్నాతుఁడౌ సమంచత్తీర్థసార్థంబులన్. ౧౬౬

మ. కలి నే మానవుఁ డర్థధర్మపరుఁ డై కల్పించు సద్భక్తి ను
జ్జ్వలపుష్పంబుల ధూపదీపముల దివ్యశ్రీనివేద్యంబులన్
లలితార్చావిధి గీతవాద్యముల శాలగ్రామసంవాసి కా
విలుఁడే నాతఁడు చక్రిఁ జేరి సుఖ యయా విశ్రాంత మా నంతరున్.

గీ. కోటిలింగంబులను గని కొలిచి నరుఁడు
నెందు ఫల మందు నొకసాగి సేవ సేసి
గ్రామశిలఁ జక్రమందు మారమణు భక్తి
ముక్తిఁ జూఱగొను న్యాత్రములఁ బనేమి? ౧౬౭

శా. శాలగ్రామశిలాస్వరూపి హరి యేస్థానంబునం దుండు న
చ్చో లేఖు ల్పదునాల్గు లోకములు యక్షు ల్సిద్ధులు న్నిల్తు రా
నేలన్ శ్రాద్ధము సల్పువాని పితరు ల్నిత్యంబు సంతుష్టులై
యాలోకంబున నూరు కల్పములు సౌఖ్యం బందువా రిచ్చతోన్.

గీ. పంచగవ్యసహస్రసంప్రాశనములఁ
దీర్ఘశతకోటిసేవావితీర్ణి కృతుల

నున్న దే? యట్టికృతికిఁ బ్రయోజనంబు
సత మెవండు శాలగ్రామజలముఁ గ్రోలు. ౧౭౦

సీ. చక్రశాలగ్రామసలిలంబు గ్రోలినఁ
దలఁ దాల్చినను వాని తను నఖిలము
చక్రాంకిత మ్మగు సందియ మిందు లే
దకృతపుణ్యుల కది యగపడనిది
యముఁడు బోధించు నిత్యము నిజదూతల
కరిది వైష్ణవు లిండ్లఁ జొర వల దని
యసముద్రగలు నదు లాదించు నొకసారి
మునిఁగిన మాణ్నాళ్లు మునిఁగిన ఫల
మబ్ధిగామిను లొసఁగు మాసార్ధఫలము
మాసఫల మిచ్చు జలధి షణ్మాసఫలము
హాయనఫలంబు గోద జాహ్నవి యిరుదురు
ద్వాదశాబ్దఫలంబు చక్రోదక మిడు. ౧౭౧

సీ. పూర్వపుణ్యవిశేషమునఁ బ్రాపఁ గలుగు శా
లగ్రామచక్రశిలాజలమ్ము
అది యున్న యన్నెల వామడ లొమ్మడు ది
వ్యము తీర్థ మధిగుణ మ్మందుఁ గృతము
ఒకచుక్క తదభిషిక్తోదక మానెనా?
తల్లిచన్నుల పాలు ద్రావఁడు నరుఁ
డతిభక్తి ద్విజునకు నది దాన మిచ్చిన
భూమిచక్రం బిచ్చు పున్నె మెనయు
నట్టి వస్తువునకు మూల్య మనినవాఁడు
గొనినవాఁడు పరీక్షకుం డనుమతుండు
యావదాభూతసంప్లవ మరుగువారు
నిరయగతుల సృతు ల్గొని నిర్గతు లయి. ౧౭౨

ఆ. కానఁ జక్రశిలలఁ గ్రయవిక్రయ మొనర్చు
వంకఁ బోవరాదు భవ్యులైన
చక్రిసంస్మరణము సర్వపాపహరమ్ము
పాపభీరు వొనరుపవలె నెపుడు. ౧౨౩

సీ. అడవిలో నియతేంద్రియతఁ దపించినవాని
కగు ఫల మగు హరి నభినుతింప
సర్వపాపాపహు సంస్మరించి రమేశు
నరకం బెనయఁ డెట్టి దురితనరుఁడు
పుణ్యాయతనతీర్థముల నెల్ల సేవించు
రమఁ జెందు విష్ణుకీర్తనమువలన
యాదృచ్ఛికస్మృతి నైన శార్ఙ్గధరుండు
కననీఁడు జముని లోకమున తెరువు
నెంత విష్ణుభక్తుఁ డేనిఁ బొనర్చెనా?
శివునినింద వాఁడు సేరఁబోఁడు
విష్ణులోకమందు వెరవేది యమునిచేఁ
బడును బడును నరకబాధ లెల్ల. ౧౨౪

క. మానవుఁడు ప్రసంగంబున
నేని నుపవసించి యొక్క యేకాదశియం
దీ నా యాతనఁ గనఁ డని
కీనాశుఁడు మాకుఁ జెప్పెఁ గేవలము దయన్. ౧౨౫

మ. హయమేధంబులు రాజసూయములు రా వాసూటి కేకాదశిం
ద్రియసంపాదితపాపరాశి హృత మా నిర్మాల మేకాదశిన్
నియతుండై యుపవాసము న్సలుప వన్నె న్వాసిఁ దే మన్న న
వ్యయసౌఖ్యం బిడ బద్ధకంకణము సుమ్మా యా దినం బేయెడన్.

గీ. గంగకన్నను గయకన్నఁ గాశికన్నఁ
బుష్కరముకన్న హరిదినంబు కడుఁబెద్ద

హరిపదం బంద నగు ననాయాసకలన
నలదినంబున నుపవాస మాచరించి. ౧౭౭

గీ. తల్లితరమునఁ బదుగురు తండ్రితరము
నందుఁ బదుగురు తనవార లటు పదుగురు
ద్వంద్వనిర్ముక్తు లై హరివాసరోప
వాసరమ విష్ణురూపు లై బరగుదు రట. ౧౭౮

గీ. అనశనత మేలు యమతిథి నంతకన్న
రాత్రిజాగరణము మేలు రాదు చెప్ప
బారసిం బారణము సేత బహుగుణమ్ము
కేశవప్రీతి నెనయు నా కృతుల కెందు. ౧౭౯

క. తీర్థస్నానము సేయక
యర్థికిఁ బాత్రునకు నిడక యపరంజి తపం
బర్థి నొనర్పక చనియెడు
వ్యర్థుల దుఃఖముల ననఁగ నౌనా? నారా. ౧౮౦

క. పలుమాట లేల? ధర్మం
బుల సుగతి కధర్మకరణముల దుర్గతికిం
దలఁకక తలఁకుచుఁ జొచ్చెద
రిలఁ గలవా రెల్ల సూక్ష్మ మిది వైశ్యవరా! ౧౮౧

ఉ. కావున ధర్మసంగ్రహము కర్జము పిన్నటనాఁటఁగోలె మ
ర్త్యావలి కందు ధర్మ మన నాత్మ నుడిం బని మేన ద్రోహ మే
జీవికిఁ జేయకుంట హరిసేవ నిజాశ్రమవర్ణధర్మసం
భావన దాన మింద్రియసమాజనిరోధము సువ్వొ ముఖ్యముల్. ౧౮౨

సీ. ఎంతదరిద్రుఁడే నిడవలె జల మన్న
మన్నెమ్ము దిన మవంధ్యమ్ము గాఁగఁ
బెట్టనివానికిఁ బుట్టు దీలోకంబు
నందుఁ గాని పరంబునందుఁ గాని

దాత లా యా యమయాతనఁ గాంచఁబో
రథిసురలోకసౌఖ్యములఁ జెంది
యాయుర్ధనాఢ్యులై యధిభోగభాగులై
యవని జనింతు రా యా తెఱఁగులఁ
దపము దానమ్ము నాత్మకృతమ్ము నెపుడుఁ
జెప్పుకొనరాదు శ్రేయోర్థి చెడు వచించి
యడిగితివి నొడివితిని నీ యడిగినంత
నింక నేది వినవలచెద వెఱుఁగఁజెప్పు. ౧౬౩

గీ. అక్షయ మ్మైన పూర్వపుణ్యమ్ము కలద
యన్య మది యట్టు లుండ నీ కనఘ! వింటె?
మాఘమునఁ దాన మాడిన మహితకృతికి
ఫలముగాఁ బ్రాప్త మయ్యె నీ స్వర్గ మిపుడు. ౧౬౪

చ. అనుడు వికుండలుం డను మహాత్ముఁ డిట్లనె యమదూత కర్షుకుఁడా!
మనసు ప్రసన్న మైనది సుమా భవదీయవచఃప్రసక్తి పా
వన మగు గంగ నా సుజనవర్గము పోల్తి సుఖంబు శైత్య మిం
దునకు నిసర్గజం బటు మృదుప్రియభాషలు సత్స్వభావముల్. ౧౬౫

ఉ. కావున దేవదూత! నిజకారుణికత్వము మీఱ నన్ను కే
ళ్రోవఁ దొలంగునో? నరకదుర్గతి యిప్పుడ విప్పి చెప్పు మా
భావుక మెద్ది మున్నటి భవమ్మున నే నొనరించినాఁడనో?
నా పినిచె న్యమానుగుఁ డనా! విను మంచుఁ దలంచి తత్కృతిన్.

క. ప్రాకటమవు మధువనమున
శాకలి యనఁ గలఁడు మౌని సప్తఋషముఁడు తాఁ
గై కొనె రేవతి యను సతి
నాకె గనె న్సుతుల గ్రహము లనఁ దొమ్మండ్రన్. ౧౬౭

గీ. ధ్రువుఁడు క్షమి మధువులు తారుఁ డవలివాఁడు
పంచముండు జ్యోతిష్మంతుఁ డం చనఁబడ

నగ్నిహోత్రప్రియాత్ము లీ యనఘమతులు
మించిరి గృహాశ్రమమున రమించు కృతుల. ౧౮౮

గీ. అపవిమోహాఖ్యుడు జితమాయుఁ డట్లు ధ్యాన
కాష్ఠుఁడు గుణాతిగుఁ డన శాకలితసయులు
మివ్రులు నలువురు వైరాగ్య మవధరించి
యాశ్రయించిరి తచ్చతుర్థాశ్రమమ్ము. ౧౮౯

చ. ఎదొ తిని యేదొ కట్టుకొని యేస్పృహ లేక యరణ్యవాసులై
మదిని గుదించి సంగమును మాని పరిగ్రహశూన్యులై మహిం
బదిలముగాఁ జరించెదరు మానము మాని జగంబు సర్వ మి
య్యది యదె పో నిజంబునకు నంచు నసంశయవిత్తసత్తులై. ౧౯౦

గీ. జుట్టు జందెమ్ము వర్జించి చట్టు మట్టి
కాంచన మటన్న భేద మొక్కండు లేక
బ్రహ్మభూతులై తిరిగెడు పరమహంసు
లొక్క రే విశ్రమంబు నీ యిక్కఁ గొనిరి. ౧౯౧

గీ. బ్రహ్మనిధ్యాన మొనర న ప్పరమ హాను
లింటి కేతేర నాతిథ్య మీ వొనర్చి
నట్టి పున్నెమ్ము నెన్న నా కగునె శక్య
మెన్నివే లేండ్ల కేని మహోన్నతుండ! ౧౯౨

గీ. ప్రాణు లెల్లభూతంబులఁ బ్రాణులందు
మతియుతులు వారిలోపల మానవులును
వారిలో బ్రాహ్మణులును విద్వాంసు లందుఁ
గృతవినిశ్చయు లందును గృతులు వరులు. ౧౯౩

ఉ. అంతకు బ్రహ్మవేత్తలు మహత్తరు లమ్మెయి వారి మీఁఱు న
త్యంతము భూత మీ త్రిసమయమ్ముల నుండదు నెందునేని వి
శ్రాంతి వహించినా రటె ప్రసన్నత నీ గృహమందు నంతవా
రంతము నొందె నీదు దొసఁ గంతయు మేల్మి గడించి తెంతయున్.

ఉ. అష్టమపూర్వజన్మమున నార్జిత మైన సుపుణ్య మిట్టిఁ డా
యిష్టున కిమ్మ దాని నన నిచ్చితి నంచు వికుండలుం డనెన్
హృష్టమనస్కుఁ డౌచు నిరయేలఁ దొఱంగి యతండు వచ్చె త్రై
విష్టపసీమకుం జనిరి వేల్పులు ప్రాజను లాదరించుచున్. ౧౯౫

ఉ. వేలుపుబంటు చెప్పిన సవిస్తరధర్మసుబోధ మాగమా
లీలలితంబు మాన్యము నుడి న్విని వైశ్యుఁడు నైజధర్మపుం
బా లిడి యున్న మన్ని త్రిదివంబున కాతనితోడఁ బోయి పూ
ర్ణ్వాలు నొసంగి ప్రాజ నలువం జనె దూత యథాగతంబుగన్.౧౯౬

గీ. ఎవ్వఁ డీ యితిహాసంబు నెల్లఁ జదువు
వినును వ్రాయును జెప్పును వేని కేని
నట్టి సుకృతి విపాపుఁ డై యాలు నే లొ
సంగిన ఫలంబుఁ జెందు నసంశయ మన. ౧౯౭

క. గురుపాదుక శిరమునఁ గొని
నరపతి విభు నడిగె మరల నా కద్భుత మీ
చరిత మొనరించుచున్నది
సురవంద్యా! మాఘ మంత సుకృతకరంబే? ౧౯౮

చ. ఒకనెలఁ దాన మాడ నఘ మున్నది యెల్ల నశించె నంటి విం
కొకనెలఁ దానమాడ దివ మొందె నటంటివి, వైశ్య పాపమా?
ప్రకటిత మద్రిసార మచిరంబుగ దాని నకంచినట్టి మా
ఘకలితపుణ్యము న్విన సుఖప్రద! వేడుక మొల్ల మయ్యెడున్.౧౯౯

క. అని యడిగెడు శిష్యున కి
ట్లనఁ గొనె వాచాస్రవంతి నల మునిఘనుఁ డో
జననాథ! తద్వివరము
న్వినఁ గౌతూహలము గలిగెనే న్వివరింతున్. ౨౦౦

మ. జలమే మేధ్యము నిర్మలమ్ము సుఖసంస్థాకారణం బర్థ్యమున్
మలసంహారక మెల్లజీవులకుఁ బ్రాణప్రాణనప్రీకరం

బల నారాయణదేవుఁడే యది యటంచా వేదము ల్సెప్పఁ ద
త్ఫలితంబే యడగింపదే? యఘముల న్సంస్నాత కృశాంతముల్. ౨౦౧

గీ. ఇంతియే కాక మకరమం దినుఁ డుదయము
నందు సమయంబునందు మాహాత్మ్య మతుల
మట్టివేల గోష్పదజలమందునేని
బావులందునేని స్నానమ్ము స్వర్గదమ్ము. ౨౦౨

మ. ఇఁక దీర్థమ్ముల మేల్మి చెప్పవలెనా? యీ మాటతో పాటు శ
క్తికి యుక్తంబుగ నిచ్చుటొప్పు నది భక్తిప్రాపితం బైన ను
క్తికి నందంజన దట్టి పుణ్యముల మే ల్దేవత్వముం గూర్చు ము
క్తికిఁ దార్చ స్మృతియేమి కావలె ధరిత్రి న్సాధనం బెంచినన్? ౨౦౩

గీ. మూఁడు దినము లశక్తుఁడే నాడవలయు
నించుకేని దరిద్రుఁడే నీయవలయు
నూరకే పోవనీయరా దొకదినమ్ము
మకరమందు నాదిత్యుండు మలయువేళ. ౨౦౪

గీ. ఐదు మూఁ డేడు తొమ్మిది యహములేని
మాఘమునఁ దానమాడెడు మానవులకుఁ
దత్ఫలము వృద్ధినొందుఁ జంద్రమునిమాద్రి
నప్పనికిఁ బూర్భహిర్జల మైన మేలు. ౨౦౫

సీ. సన్నిధానము నిన్ను ధరణీశ సత్తమ!
వ్రతనియమం బొనర్పంగవలయుఁ
దద్విశేషఫలాప్తిఁ దవిలిన మనముతో
గోవిందు మున్మూరు గొలువవలయు
నగ్నిఁ దిలవిమిశ్ర మాజ్యంబు హోతవ్య
మిలయందె శయనింపవలె నిశల
కంబలసద్వస్త్రకార్పాసభృతతైల
కౌశేయకాదు లీఁగా శుభ మగు

నక్షయఫలంబు సమకూరు నబ్ధిసలిల
మెసఁగ నపరంజి గురిగింజ యె త్తొసఁగిన
నీయవలె శీతవారణ మింధనమ్ము
నీవలె ద్విజుండు శక్తి గ్రహింపరాదు. ౨౦౭

మ. పరవహ్నిం బరభోజనంబుఁ బరదేవస్వార్థపూజావిధిం
బరివర్జింప నపూర్ణ స్వశక్తి ధనముం బాత్రంబులం దీఁగియు
న్వర మేకాదశినాఁ డొనర్పవలెఁ దన్మాసవ్రతోద్యాపనం
బు రమేశప్రియతార్థ మంతమున సంభోజ్యాల్ ద్విజుల్ భూవరా!

గీ. వింటె? యుద్యాపనం బన విష్ణుదేవు
ప్రతిమఁ బుత్తడిఁ గాని రౌప్యమునఁ గాని
కూర్చి పూజించి ద్విజవరుఁ గోరి తెచ్చి
యిచ్చి ద్విజమిథునమ్ముల నెలమిఁ గొలిచి. ౨౦౮

గీ. భుక్తభోజనులను జేసి భూసురాత్మ!
మాధవుండ! గోవిందుండ! మాఘమందు
నా యొనర్చిన స్నానంబునను యథావి
ధి ఫలదుఁడ వగు మనుచుఁ బ్రార్థింపవలయు. ౨౦౯

ఆ. వాసుదేవ! కృష్ణ! వైకుంఠవాసుండ!
మాధవుండ! హరి! రమాధవుండ!
యనుచు మౌన మెసఁగ నాచరింపఁగవలె
స్నాన మినుఁడు వొడుచు సమయమునకు. ౨౧౦

ఆ. స్వగృహమందె తప్తవారికృతస్నాన
మినుఁడు మకరరాశి నెసఁగువేళ
నేక మే షడబ్ది నెడలేక పొసరించు
స్నానముల ఫల మ్మొసంగుఁ జుమ్ము. ౨౧౧

సీ. పూర్వహిర్వాప్యాదిపుష్కరమ్ములనైన
ద్వాదశాబ్దఫలంబుఁ దడయ కిచ్చు

నది తటాకంబునం దామ్రేడితం బవు
దౌన నది నైనఁ జతుర్గుణంబు
పదిరెట్లు ఫలము దైవతఖాతమున మహా
నదియందు శతవిధం బది తలంప
మహితాపగాసంగమముల నాలుగునూర్లు
కగు నది గంగ సహస్రగుణిత
మర్థి మనుజుఁడు సురగంగ నాప్లుతుఁ డయి
మకరరవివేళ వేల్పులమనికి నుండి
నాల్గువేల యుగాల యంతమున నైనఁ
జెడఁడు పడఁడు కలంగడు పుడమిఱేఁడ ! ౨౧౨

క. గంగాయమునాస్రోత
స్సంగమమున శతసహస్రసంగుణితం బం
చంగీకరించి రమ్మును
లంగము దోఁచుట సమకరుఁడై రవి యుండన్. ౨౧౩

సీ. దినదినం బొకవేయి దీనారటంకాలు
పాత్రభూతున కిచ్చి పంపె నతఁడు
పదివేల్కపిల లనడ్వాహము లొక వేయి
ద్విజసత్తములకు నర్పించె నతఁడు
సాగ్రసంవత్సరశతము నిరాహారుఁ
డై యభ్యసించె యోగార్థ మతఁడు
కనకభారసహస్రకము కురుక్షేత్రమం
దినునుపరాగవేళ నిడె నతఁడు
రవిసుతయు విష్ణుపాదసంభవయు భవుల
భవము లెడలింప లో సరస్వతిని గూడఁ
గలిసికొని పాఱుచోట నగ్గలిక మునుఁగు
నెవ్వఁడు వేఁకువ మకరత్రయియాతనుఁ గని. ౨౧౪

చ. జనముల మేలు కోరిన ప్రజాపతి పాతకభూరిభారనా
శనదహనప్రదేశముగ సర్గ మొనర్చెఁ బ్రయాగభూమి భూ
జనపరిపాల ! పాపపశుజాలము కుత్తుక లెల్ల నిర్దయా
ప్రణయతఁ గోయుచోటిది సురల్మను లెత్తిన నిశ్చయమ్మునన్.

గీ. పీతగర్భ సితాసితస్ఫీతసలిల
వాహిని సృజించె నిజలోకపథము గాఁగ
ధాత యచ్చోట మాఘ మే పాతకియును
మునిఁగి స్త్రీగర్భవాపుల మునుఁగఁబోఁడు. ౨౧౬

చ. అవిదిత తత్సురాసురదురాసద వైష్ణవమాయ నిస్తలం
బవు నదియుం బ్రయాగమున నమ్మెయి మాఘమున న్మునింగినన్
వివిధము లిందు నం దనుభవించును భోగము లంతమందుఁ గే
శవు నెడ లీనుఁ డౌ సుకృతశాలి తథావిధుఁ డుర్వరేశ్వరా !

చ. సమకరుఁ డౌ నహస్కరు ప్రసంగమున న్మనుజుం డెవం డిలన్
రమణ సితాసితవ్యతికరంబునఁ దీర్థ ముపస్పృశించు నా
సుమహితుఁ డొందుచోటిదియ చు మ్మన లే రల చిత్రగుప్తుఁడున్
యముఁడును రాజసూయకసహస్రముతో ఫల మంత లబ్బునా ?

చ. పుడమి వెలుంగు తీర్థములు పుణ్యము లేడు పురు ల్పరాలి సం
గడమున నల్లనై యమున గంగయు సంగతలైనచోట వేణి భా
నుఁడు మకరంబుఁ జొచ్చుటఁ గనుంగొని వచ్చి మునింగి తెల్లనై
వెడలెడు స్నాతు లౌ కృతుల విశ్రుతపాపచయంబు కాలదే? ౨౧౯

గీ. పాము కుబుసంబుఁ బుచ్చినభంగి నఘము
బాము విడనాడి దివ మందుఁ బంచజనుఁడు
మూడునాళ్ళు ప్రయాగలో మునిఁగెనేని
మకరమున రవి యుదయింప మాఘమందు. ౨౨౦

మ. సిరి దార్చు న్సురగంగ దోఁగినఁ గురుక్షేత్రంబులోఁ బాటిచే
ఘర నైనం బదిరెట్లు వింధ్యయుత యా స్థానంబునం గాశి ను

త్తరతోవాహిని నూరు రెట్లుగఁ గళింద ప్రోద్భవాసంగతా
దరమే పశ్చిమవాహినిం బొగడ సందర్శించినం జాలదే? ౨౧

గీ. కల్పకృతపాపము దహించు క్షణములోనె
మాఘమున నది దుర్లభ మానవులకు
నమృత మని చెప్పఁబడును ప్రయాగమె ధర
నట్టిదానికి నాసింతు రమరవరులు. ౨౨

గీ. ముగురు మూర్తులు శక్తులు ముగురు సిద్ధు
లష్టసిద్ధులు పితృగణ మచ్చరలును
వారు వీ రననేల? సర్వసురవరాను
లాత్మపత్నులతో వత్తు ర త్తటి కటు. ౨౩

క. ప్రచ్ఛన్నరూపు లై కలి
నచ్ఛన్నాకారు లై కృతాదుల వేణీ
స్వచ్ఛోదము సేవింతెద
రచ్ఛలమున నెఱుక గల మహామహు లెల్లన్. ౨౪

గీ. పాపకారి రాక్షసునకుఁ బార్థివేంద్ర!
మాఘమందు సితాసితాంభస్స్రవంతి
మూడు నాళ్ళు దోఁగిన ఫలము వెస నిచ్చి
మున్ను కాంచనమాలిని ముక్తుఁ జేసె. ౨౫

క. అని వినిచిన నది యెట్లని
జననాథుఁడు పృచ్ఛసేయ సంయమినాథుం
డనఁ జొచ్చె వినినవారల
కనలేని ఫలం బొసంగు నితిహాసంబున్. ౨౬

కాంచనమాలిని చరిత్రము

గీ. అనఘ! కాంచనమాలిని యనఁగఁ గలదు
రూపసంపన్న యగు నప్సరోవరిష్ఠ

యదియు మాఘమ్మువేళఁ బ్రయాగమందుఁ
బ్రతిదినము దోఁగి యేఁగు శివావసతికి. ౨౨౮

ఉ. అమ్మయి నేఁగుచున్న మహితాంగనఁ గాంచి వచించె శైలరా
జమ్ము నికుంజమందుఁ జిరసంస్థుఁడు వృద్ధుఁ డొకండు ఘోరరూ
ప మ్మువు రక్కసుం డమరభావినివా? కమలాయతాక్షి! ని
క్కమ్ము గదింపు మెవ్వతెవొ? కాంచనమాలిని! మేలు నీ కవున్.

ఉ. ఎక్కడనుండి యెక్కడకు నేఁగెద? వంశుకకేశపాశముల్
చక్కనిచుక్క! సార్ద్రితఁ బొసంగఁ బనేమి? ఖగత్వ మేగతిం
దక్కె? నతీవరూపకలితంబు మనోహర మిట్టి మేను నీ
కక్కరొ! యెట్టి గట్టి సుకృతాతిశయమ్మున నయ్యెనో నన్. ౨౨౯

గీ. ఇట్టు లడుగుట లేటికో? యింతిమిన్న!
చూడు నీ కట్టుపుట్టమ్ము చుక్క వడియె
నాతల క్షణమ్ములోనె శాంత మన నయ్యె
ముసు పతిక్రూర మన నైన మనము వనిత! ౨౩౦

క. ఇంతటి మహిమం బెక్కడి
దింతీ! యీసలిలమునకు నిది చెప్పుము నీ
వెంతటి శీలవతివొ? రతి
కాంతా! కాంతమ్ము లంగకము లనుచుండెన్. ౨౩౧

క. అనువాని కనియె నది కాం
చనమాలిని యని పిలువవె? చను నదె నా పే
రనవద్య! కామరూపిణి
నను నచ్చరఁ గా నెఱుఁగుము నగజఁ గొలిచెదన్. ౨౩౨

చ. అరిగితి నేఁ బ్రయాగజల మాడఁగ మాఘ మటంచు దాన నా
పరికర మార్ద్రి మాచుఁ గనుపట్టెడు రాక్షసవర్య! వోవలెన్
హారగిరి కిప్పు డేను గిరిజాధిపుసేవకు వేణినీర మ
ద్దిర పయిఁ బడ్డ ఘోరతరధీపరివర్తన మయ్యె నియ్యెడన్, ౨౩౩

సీ. ఘనుఁడు సుమేధుండు గంధర్వుఁ డవ్వాని
నందన నైతి నీనాఁటి గతికి
మును కలింగేశ్వరు భోగిని నై యుండు
రూపలావణ్యనిరూఢగర్వ
నా యూర ననుఁ బోలు నట్టి సుందరులు లే
రే శిరోమణి యన నెలమిఁ గాంతు
ననుభవింపని భోగ మని యున్నదా? నాకు
నల్ల జన్మమ్మునయం దసురుఁడ!
రత్నభూషణచిత్రవస్త్రములు చంద
నాగరుసుగంధకర్పూరహారిచారు
హారసంహారములు ప్రార్థితార్జితములు
కలవు నాయింటియందె సకలము లనఘ! ౨౩౪

ఉ. యౌవనసంపదం బురము నంతయు మోహవశం బొనర్చితిన్
భావముచేతఁ జిక్కిన యువప్రవరు ల్వేలు నాదు పాదసం
సేవకు లైరి వారిఁ గలఁచె న్నిరతంబు మదీయ మాయ కా
మావిలు లొండొరుం దొడరి హా మృతు లైర యసూయ పెంపునన్.

మ. రమణీయ మ్మగు నప్పురి న్సమయ మారాణం జన న్వార్ధకం
బు మునించె న్ననుఁ జూడ రెవ్వ రపుడే పుట్టె న్మదిం గట్టి శో
కము దానంబు జపంబు హోమము మొద ల్గా నేమియుం జేయనై
తి మతేమున్నది రే పౌనర్భ జమువాతిం బడ్డ నా కం చొగిన్. ౨౩౬

ఉ. ఈశునిఁ గొల్వలేదు కమలేశు మదిం గొనియాడలేదు దు
ర్గా! శరణం బన న్గద ధరాసురుల న్మది మెచ్చఁజేయ లే
దీశత నొక్కప్రాణిహిత మే నొనరింప నిఁ కిన్ని యేటి కే
లేశము పున్నెము న్గలుపలేదు గడించితి నేన మెంతయేన్. ౨౩౭

చ. అని విలపించుచుం జని మహామహు వేదవిదు న్సుశీలనా
ముని నిజరాట్పురోహితునిఁ బుణ్యుఁ గనంగని మూర్ధ మంత్రిసో

కున మనమొప్ప నుప్పతిలుఘోరమనోవ్యథ మొత్తుకొంటిఁ బా
వన ! యఘపంకమగ్నుఁ గచపాశముఁ బట్టి సముద్ధరింపుమా. ౨౩౮

గీ. కోరి కారుణ్యవర్షంబుఁ గురియుము ఘన !
స్వజనులెడ నన్యజనులెడ సాధులు సము
లెఱుఁగమా ? క్షీరపాథోధి తెలుఁగు సుహిత !
యంచ కిచ్చిన పాలు బకాలి కీదె ? ౨౩౯

గీ. అనునెడ ననుగ్రహమ్మున ననియె విప్రుఁ
డఖిలధర్మమయమ్మౌ వాక్యమ్ము ప్రీతిఁ
దలఁచినపు డాదరమునఁ బ్రత్యక్షమిచ్చి
యిచ్చుఁ దీర్చు సురలు విప్రు లే నిజమ్ము. ౨౪౦

మ. అన విన రాని త్వత్కృతదురాచరణం బఖిలం బెఱుంగనే?
పనవిన నేమి లాభము? విపత్ప్రతికారముఁ గోరెదేని? వే
పనివిను మా ప్రయాగమునఁ బావనమజ్జన మాచరింపు మే
నని విను మూర్ధమెత్త దట నంహము సింహముఁ గన్న దంతి నాన్. 

శా. ఆలోచించినఁ ద్రోఁపదాయె మది నీయన్యాయవృత్తంబు ని
ర్మూలంబుం బొనరింపఁ జాలు మహిమాపూర్ణంబు తీర్థం బొకం
డేలా జాలము? నీకు నాక మిడ నేనే యంచు ర మ్మంచు దు
శ్శీలా! యామునగాంగసంగమము ని జ్జై యెత్తి తాఁ బిల్చెదున్.

క. అక్కడఁ ద ప్పొనరింపక
తక్కినఁ ద త్తీర్థ మన్యతస్సంచితముం
దక్కఁగొను మానవులకుం
దక్కిన నిక్షేప మదియె దశమము దశమీ! ౨౪౩

సీ. కామమ్మొ? క్రోధమో? గౌతమతత్పత్ను
లెడ నెడ దివ్య మహేంద్రుఁ డెలమిఁ
బడరానిపా ట్లల్లఁ బడి యొడిఁ గట్టిన
వృజినమ్ము వేల్పులఁ బెతరులఁ గొని

గురునాన నటచని యరుదార మజ్జనం
బాచరించినమాత్ర నారవిడిచి
దేదీప్యమానుఁ డై దివి కేగి యేలుచు
నున్నాఁడు మునుపటికన్న మేల్మి

నని వచించుఁ బురాణమ్ము లరుగు మందు
మకరమాసమ్మునం జేయు మజ్జనమున
నఘములను మార్చుకొనుము పుణ్యముల గములఁ
గా బిరానఁ బురాణి! స్వర్గమ్ముఁ గొనఁగ. ౨౬౪

చ. అని యితిహాసయుక్తముగ నన్న ద్విజోత్తము పాదయుగ్మమం
దున తలపెట్టి మ్రొక్కి దయ దోఁపఁగ వీడ్కొని బంధుగేహభా
జనధనదాసవర్గముల సర్వసుఖంబుల సంత్యజించి యి
త్తను వతినశ్వరం బధికదారుణ మా నరకాబ్ధి యం చెదన్. ౨౬౫

మ. తలపోయం దల కంటగింపఁగ వెసం దాతప్యమానాత్మ నై
తలకుం బాపు సితాసితవ్యతికరోద్యద్వారిపూరంబుఁ జే
రి లలి న్మజ్జన మాచరించితి నటే శ్రీమాఘమానంబునన్
ఫలముం జెందితిని న్నిశాచరుఁడ! తన్మాహాత్మ్య మూహింపుమా.

ఉ. చేసినపాపరాసులు నశించె నశేషము లొండు రెండు నా
ళ్లాసలిలంబుల న్మునుఁగ నాపయి నిర్వదియేడు వారము
ల్సేసిన తన్నిషేవణముచే నమరత్వము నొంది యద్రిజా
తాసఖు నై సుఖింతు రజతక్షితిభృత్తటి నెల్లకాలమున్. ౨౬౬

మ. హిమసారాత్మ్యలు విప్రులే యనఁగ నా నే పుట్టలో నెట్టి స
ర్వము కద్దో? తదనుగ్రహంబె కద తీర్థం బాచుఁ జూపెట్టెఁ దీ
ర్థముఁ దీర్థోత్తమ మంచుఁ బాచె ననివార్యం బైన సంసారసం
గమబంధం బది నేఁ గృతార్థ నయితిం గల్యాణసంపత్తికిన్. ౨౬౭

ఆ. ఎఱిఁగి తన్మహత్త్వ మేటేట నాడెద
నప్రయాగతీర్థమందు నర్థిఁ

జోవనీను మాఘమును జిత్త నా కథ
యిట్టిఁ డెట్టివాఁడ వీ వను మన. ౨౮౯

చ. అతఁ డను నిష్టమిచ్చుఁ గొను నాప్తి రహస్యముఁ జెప్పు నట్టు న
ట్టి తగవు నీయెడం గనఁబడెఁ గలదో? యిఁక నిష్కృతి నీని కంగనా!
కృతమవు దుష్కృతంబు వివరించెద దాన సుఖించెదఁ శుభా
కృతి! చెవి యొట్టు మించుక యహీన! విహీను సముద్ధరింపవే. ౨౯౦

సీ. కాశిలో సుశ్రోణి! కలకాల ముండుదు
బహ్వృచుం డను వేదపారగుఁడను
గొప్ప నిర్మల మగు కొలమునఁ బొడమితి
ద్విజవరిష్ఠుఁడ నని తెలుప సిగ్గు
పట్టెతి పాపభూపతుల దానంబుల
వైశ్యుల శూద్రుల వదలలేదు
చండాలదత్తదుష్టప్రతిగ్రహముల
గైకొంటి నగు నిది కాదు నాక
మోమునందును భస్మత్రిపుండ్ర మొప్పఁ
జందనలలాటిక యొలర్ప సాలు వొందు
వల్లెవాటుగ వైచి యావాడ నున్న
నన్నుఁ గా దని యెవ్వఁ డే నరున కిచ్చు? ౨౯౧

ఉ. పాతక మేను చేయనిది భావిని! లేదు రవంత యేని న
ర్థాతురుఁ డేమి సేయఁ డచలాయిత మైనది తీర్థశక్తి నా
చేత సుకార్యమం చొకటి సేయఁగఁబడ్డది కాదు జాయియా?
యా తను వల్లె యుండ సమయం బయిన న్నమసెం దలోదరీ!

మ. అవిముక్తంబున మేను వాసిన జనుం డత్యంతపాపాత్ముఁ డై
న వివస్వత్తనయుం గనంజనఁడు గాన న్నేను నద్దేవు దం
డవిధిం గాని సరీసృపంబ నయి మూఁటన్ గ్రద్ధ నై రెంట నీ
చవరాహంబు నలూక మై పులియు నై జన్మించితిన్ నాల్గిటన్.

గీ. భైరవాజ్ఞ నయోనిజవపువు లిట్లు
తొమ్మిది వహించితిని గల్పితమ్ము లోలిఁ
గృత మనుభవింప దశమమ్ము కీరవాణి!
యిదియు రాక్షసదేహ మిం దేర్పడెఁగదె. ౨౫౪

క. అనవద్య! యిందు నేడులు
సనె డెబ్బదియైదు వేలు సంకటు మెడయం
గను దారి దొరక దింతకు
నినుఁ జూపెనొ? కాశి గాసి నేమించుటకున్. ౨౫౫

ఉ. ఈయెడ మూడుయోజనము లేయెడ జూచిన జంతుసంతతిన్
మాయఁగఁజేసితి న్వినవె? మానస మిప్డు దహింపఁజొచ్చె నా
నేయకృతంబు శల్య మది నీవలనం బెడబాయవచ్చు నె
ప్డో? యనుఁ దీర్థ మప్పుడె మహోదయ మార్యసమాగమం బిడున్. ౨౫౬

చ. విరలుఁడు సజ్జనుండు భువి విప్పి స్వదుఃఖముఁ జెప్పుకొంద మ
న్న రమణి! భాగ్యవైభవమునం గన నైతివి విన్నవించితిన్
జరితము సాధుసంపదలు సర్వసమాప్యము లోఁ బయోబ్ధి య
వ్వరికినిఁ బాలువెట్టుఁ దనపాల విభేదము సేయ నెంచునే? ౨౫౭

గీ. అనెడు రాక్షసు నుడు లిట్టు లాలకించి
కరుణ నార్ద్రీకృతాంతరకరణ యగుచుఁ
దన సుకృతమునఁ బా లీయఁ దలచి పిలిచి
కలికి కాంచనమాలిని పలికె నిట్లు. ౨౫౮

ఉ. ఏడుపు మానుమయ్య! కలవే యిల నాపద లేరికేని నీ
కీడు దలంగ నిచ్చెద సుఖించెదు గాక నాకమందు నే
డేడును శ్రీప్రయాగమున నే నొనరించితిఁ బెక్కు మాఘముల్
వేడుక స్నానదానములు విధ్యనుసారము శ్రద్ధ మున్నుగాన్. ౨౫౯

శా. నాకు న్నమ్మిక కద్దు ధర్మమునెడ న్సందేహమే లేదు దా
ర్ఢ్యాకల్పమ్ముగఁ బున్నెము న్సలుపు మం చన్నట్టి విద్వాంసులే

యాకొన్నఁ డెవఁ డన్న మాతనికె యర్థం బర్థిఁ బెట్టంగ నే
లా? కూపారమునందు సార్థమవు మేఘాటోప మం చాడరే? ౨౬౦

ఆ. అట్టులౌట నొక్క యర్కమకరయోగ
మందు నే సితాసితాంబుయోగ
మందు నాడిన ఫల మాత్మానుభవవిత్త
మిత్తు స్వర్గ మెనయు మిపుడ నీవు. ౨౬౧

క. అని వస్త్రము పిడిచిన జల
మును గరమునఁ దాల్చి మాఘమున నొక్క డే
నొనరిచిన స్నానఫల మీ
తని కిచ్చితి నని వదలెను దత్కరమందుౝ. ౨౬౨

ఉ. వింటివె? రాజశేఖరునివీఁట మృతిం గనినట్టి పున్నె మీ
వెంట ఫలించె నా నపుడె వీడెను రాక్షసదేహ మల్ల వా
ల్గంటి యిడ న్సితాసితజలంబును మాఘఫలంబు నొంటఁ గై
కొంటకుఁ బ్రాప్యమైన యనుకూలశుభాంగముచొప్పు చొప్పడౝ.

శా. దేవాకారవిరాజమానుఁ డయి సందీవ్యద్విమానంబునం
దావిష్టుం డయి స్వప్రభావళులతో నాశ ల్వెలుంగంగ సం
భావించెం దన కింత కూర్చిన సతిౝ బ్రార్థించె శిక్షింపు మం
చావర్థిష్ణునిఁ జూచి మెచ్చి యనె దివ్యస్త్రీలలామం బిటుల్. ౨౬౪

గీ. ధర్మము భజింపు మెప్డు భూతముల హింస
మాను సత్సంగ మొనరింపు మదను నడఁపు
మన్యగుణదోషకీర్తన మార విడుము
సత్యు నర్చింపు శివు నిజాక్షముల మలఁచి. ౨౬౫

గీ. జంతుజుష్టాంగరుధిరమాంసములయందు
దారపుత్రాదులెడ మమత్వంబు విడువు
మెఱుకఁ గను క్షణభంగుర మీ జగ మని
యోగసక్తుఁడ వగుము విరాగ మెనసి. ౨౬౬

చ. ప్రియమున నా వచించు పదవి న్మది ధర్మము లెల్ల నిల్పు శీ
లయుతుఁడ వై ధృతామరసలక్షణదేహుఁడ వై దివి న్నిరా
మయసుఖ మందు మన్న సురమానినితో నని రాక్షసుండు సం
చయ మవు హర్ష పూర మన స్వ స్త్రిపురస్సరవాక్ప్రసంగతిన్. ౨౬౭

ఉ. కాంచనమాలినీ! మదనఘస్మరశై లమునందు నేందుభం
బంచితసౌఖ్య మందు ముముయా ప్తికిఁ గమ్ము తపంబు ధర్మముం
బెంచుకొనంగ నై యెపుడు నిల్లె విపన్నుల యార్తు లెల్ల మా
యించుచుఁ గీర్తిఁగొమ్ము జననీ! యని మ్రొక్కెను వీడ్కొనెం జనన్.

ఉ. ఇంతటి ఘోరరాక్షసున కెట్లు విమోక్షముఁ గూర్చితమ్మ మా
చింతలు వాసె నమ్మ వనసీమ భయం బెడయించితమ్మ మా
యంతర ముల్లసిల్లఁగ విహారముఁ జెందెద మమ్మ యింక నం
చింతి నుతించి మీఁదఁ గురియించిరి పూవుల దేవకన్యకల్. ౨౬౯

శా. ఆగంధర్వవరిష్ఠకన్య తన పుణ్యం బిచ్చి తద్రాక్షసున్
వేగ న్దివ్యు నొనర్చి పుచ్చి దివికిన్ బ్రీత్యశ్రుపూర్ణాక్షి యై
తాఁ గైలాసధరంబుఁ జేరఁ జనియెన్ దద్గాథ విన్నట్టి వాఁ
డౌఁ గల్యాణనిధాన మెప్డు మతి ధర్మార్థాభిరూఢుం డవున్. ౨౭౦

మ. మహితక్లేశపరంపరాపతితు లై మల్లాడువా రెల్ల మో
హాహతింజేసి విముక్తిఁ జెందఁగ నుపాయం బైన మాఘంబు స
న్మహిమంబు న్వివరించితి న్వినఁగ నన్యం బెద్ది నీ కిష్ట మో
మహిపాలా! యడుగందగున్ బలికెదం బాత్రంబ వాత్మాప్తికిన్.

మ. అని దేవుం డనరా జనె న్గురుఁడ! నీ వాత్మం బ్రసన్నుండ వై
న నలభ్యం బెది? వ్యావహారికస్మృతిన్ నా కర్తవ్య మెనట్టి దా
నిని బోధించితి వందు శిష్ట మొకఁడు న్లే దింటికిం బోదునా?
యినపాదాంబుజసేవ సేసికొను చింతే యుందునా? తెల్పవే? ౨౭౧

చ. అన విని శ్రీగురుండు చనుమయ్య! గృహంబున కన్న ప్రేమబం
ధన మననో నుడి న్విని ప్రణామము దేవున కాచరించి య

మ్మునులప్రసాదభాజనతఁ బొంది గురు స్వ్విభు సంస్మరించుచుం
జనె నిజమందిరం బెనయఁ జయ్యన దీఁడు వినేయుఁ డిష్టుఁడై. ౨౭౩

చ. అని నిజశిష్యదీపకున కర్మిలితో నని వేదధర్ముఁ డి
ట్లనె మరలం బ్రియాతిథికి నా నృపమౌళికి దత్తదేవుఁ డి
చ్చెను మును యోగసార మటుచెప్పెను మాఘమహాత్మ్య మిట్లు లో
కనయము దారి వింటి గద కామ్య మిఁక కెయ్యది? పృచ్ఛసేయరా.

గీ. ఇదియె తన శిష్యుఁడు దిలీపుఁ డిచ్చ మెచ్చ
సప్రసంగకముగ వశిష్ఠముని పల్కె-
నిందు నాదృతుఁడవు కాన నిదియు వినుము
పార్వతికి శంభుఁ డనియె జపంబుకొఱకు. ౨౭౫

సీ. అనఘుఁడ! వరద! దత్తాత్రేయ! కార్తవీ
ర్యాదిరాజవరరాజ్యప్రదుండ?
సర్వదోన్మదుఁడ! విశ్వశ్లాఘ్యుఁడా! మునీ
శ్వర! యమితాచారవర్తనుండ!
సకలవిరోధితేజస్సంహరుఁడ! పరా
శక్తిపదాశ్లిష్టసపరివృఢుఁడ!
భోగమోక్షప్రద! యోగమహానంద!
కలితానసూయాధిగర్భరత్న!
అధ్యమృతసాగరుఁడ! యనునట్టి పదము
లారు నెనిమిది యెప్ప జప్యములు సువ్వో
యని ప్రియకుఁ బ్రేమగర్భిణి కానతిచ్చె
శంభుఁ డీవును జలుపు మీ జపము వత్స! ౨౭౬

గీ. అను గురుపదంబు లొత్తుచు నంతయు విని
దీపకుఁడు సంప్రముదితుఁ డై తెలుపు ...ంకఁ
జక్రపాణిగుణాగుణోపక్రమ మనె
నని సూతునిఁ బొగడి రా యనఘమతులు. ౨౭౭

ఉ. ఆహితచందవోలునగరాలయభక్తియుతోపచారని
ర్వ్యాహా! నిరీహా! తౌహినధరాధరజాపరిపూర్ణపార్శ్వభా
గా! హరిధాతృవాసవముఖస్తవనీయమహానుభావతో
ద్వాహా! బహిర్దశారనిరవగ్రహవిగ్రహవర్జితగ్రహా! ౨౭౮

క. లింగాకారవిరాజిత!
లింగరహిత! సేవకావలీసమవనలీ
లాంగీకృతాంగ! సుమన
స్సంగీతవశాంతరంగ! సమసమనుభవా! ౨౭౯

మాలిని. అయుతనియుతకోట్యోమంతమంత్రప్రజాప
ప్రయతనియతిపారప్రాపకాప్తిప్రభేదా!
దయితసుకృతపద్యా! దాంతవేదాంతవేద్యా!
వియదఖిలగతత్త్వా! విశ్వవిశ్వాత్తతత్త్వా! ౨౮౦

సీ. ఆంధ్రేల రామకథాఽమృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెఁ దనయు విత్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ మఖములఁ
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
సందుపురనాథ! లింగోద్భవేశ! యిదుగో
సప్తమము నాప్తిఁ దాల్పు పుష్పస్తబకము. ౨౮౧

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## అష్టమ గుచ్ఛము

క. శ్రీవిస్తారకపదయుగ
సేవాపరతంత్రవిహితసిద్ధిసమృద్ధీ!
పావనకథ! లింగోద్భవ
దేవా! ధృతగంగ! పార్వతీవామాంగా! ౧

ఆ. అవధరించుచుంటి వని చెప్పుచుంటిని
రాజమౌళి! విను పరాకు మాని
యింత విన్న మాను లెంతో సూతుని మెచ్చి
యవలి తత్ప్రసంగ మడుగుటయును. ౨

ఉ. సూతుఁడు ధూతపాతకుఁడు శోధితతత్త్వవిశేషుఁ డమ్ముని
వ్రాతముపూతభావము శివంకర మంచు నుతించి యి ట్లనున్
భూతవిభూతులార! సులభం బనరాని మహార్థ మెన్ని త
చ్ఛ్రోత పరీతుఁ డై గురువరుం గొనియాడెఁ బ్రసంగసంగతిన్. ౩

సీ. మత్కృపాభరపూరమగ్నత్రిభువన! నీ
యాన వేచెద నెదో? యడుగవేఁడి
యడుగరా బిడ్డ నీ కనియెద నతిగోప్య
మేని శంకింపఁ బనేమి మనకు
నిమ్మెయిఁ దత్త్వంబు లెఱిఁగిన ఱేఁడు రా
జ్యము సేసెనా? చనెనా? త్యజించి
యపకంటకముగ రాజ్యము నర్థి గమనించె
నపరాగుఁ డై తన్ను నరయుచుండె

నైన నా విభు చరిత మాద్యంతము విన
న్వార్త మా యా యి పద్ధతు లలవరింప
నిష్ట మయ్యె మైత్రేయున కిదియె మున్ను
గురుఁ డగు పరాశరుండు వాక్రుచ్చె నన్న!

క. అను ధోరణి ననుగతుఁడా
ననుగునవు గురుప్రవరుఁడు ననె నా మైత్రే
యునకుఁ బరాశరునకుఁ గలి
గిన సంవాదంబు మొదలికినిఁ జివురునకున్.

చ. సుతుల మహాత్ముఁ డత్రి కనసూయ గనెం గతకల్మషాద్భుత
వ్రతుల విరించి సోము హృతభావజు దుర్వసనుం జతుర్భుజున్
హితచరితుం బ్రధానపురుషేశ్వరుఁ గేశవు దత్తదేవు ను
ద్యతు లయినా రలర్కుయదుహైహయులుం దదనుగ్రహోన్నతిన్.

క. ఆ దత్తదేవుకృప దముఁ
బ్రోది యొనర్పంగ సిద్ధిఁ బొంది రనేకుల్
మేదిని సుఖములా? పరలో
కాదృతసౌఖ్యములా? చెందనైరిం దొకళులుల్.

గీ. అందు నొడివెద హైహయానుగ్రహంబు
పరమ మది విను మైత్రేయ! వశివరుండ!
కార్తవీర్యుండు కృతవీర్యు కడుపుపంట
యర్జునుండు సప్తద్వీప నతఁడె యేలె.

ఉ. ఆభగవంతు నత్రికులమం దుదయించిన దత్తదేవు దే
వాభు వరించి బాహవసహస్రము ధర్మపథంబుఁ దప్ప కే
భూభువనంబు గెల్చుటయుఁ బోలఁగ నేలుటయు న్విభూతియున్
శోభితపౌరుషంబు రిపుసూదననైపుణి తేఁడు గైకొనెన్.

ఉ. జన్మములందు దానముల శాస్త్రశ్రుతపమ్ములఁ బ్రశ్రయమ్మునం
దెన్నఁగఁ గార్తవీర్యగతి నెవ్వరుఁ గైకొనలేరు పార్థివుల్

పున్నెము లెక్కలేని దన పూర్ణధనత్వము లుర్వివారి కా
యున్నతురాజ్యమందె యని యున్నది నేటికి నాటి పాటయే. ౧౦

సీ. ఎనుబది యైదు వే లేడులు పాలించె
మాహిష్మతిని బలమహితుఁ డగుచు
నాంద్రతో సలిలంబు లాడుచు రావణుఁ
బశుసమానంబుగఁ బట్టి కట్టెఁ
దాత పులస్త్యుండు దన్నెంచి ప్రతిమాల
రెండువే లేండ్లు కర్పించె నతని
కెన్ని యెన్నియొ వాని యితిహాసములు వాని
నన్నింటి నెన్న శక్యమ్ము కాద
యేకవిక్రమమున నిట్లు యేలువాని
యాయు వెల్లను గడచను నట్టివేళ
కవతరించిన విష్ణుఁడే యతని మడచెఁ
బరశురాముఁ డనఁగ నొక్క పాఱుఁ డగుచు. ౧౧

చ. అను నాచార్యునితోడ నిట్టులను శిష్యశ్రీప్రదీప్తుం డొగిం
జన వొప్పఁగా దను వొప్పు సాత్వికములం దత్ప్రీతి వర్ణింప నా
ర్యనమస్యాస్పద ! యెట్లు నమ్మనగు నీ యాస్యంబునందుండి యీ
మినుకు ల్వెల్వడకున్న నా కొరులకో ? మిన్నందు సందేహముల్ ౧౨

దీపకుఁడు వేదధర్మ్మతోఁ గార్తవీర్యునంతముఁ బ్రసంగించుట

సీ. క్రొత్తగా నిది వింటి మిత్తటి స్వాయముగా
భగవంతుఁ డే మని భక్తుఁ జంపె ?
దైత్యారిలీలావతారము ల్గలవెన్నొ ?
యిట్టి విచిత్రంబు లెందు వినము
కసిపుట్టి దేవుండె ఖండింప జేఁ డంత
విదితాత్ముఁ డపరాధ మెది యొనర్చె ?

దత్తదేవప్రసాదమున సర్వజ్ఞుఁ డౌ
యోగికదా యల్ల యుర్వివిభుఁడు
బ్రాహ్మణుఁడు సప్రతాపుఁ డై పైఁ గవిసిన
దేవదేవుం డితం డంచుఁ దెలియఁ డెట్లు?
తత్త్వవిజ్ఞానికి నపరాధము వొడమునె ?
యైన నగ్గికిఁ జెద లంటునా? గురువర ! ౧౩

గీ. ఎఱుఁగవచ్చును రా జీశు నెఱుఁగకుండ
వచ్చు నెఱిఁగిన విభునకు వచ్చు నెట్లు ?
యోగమార్గస్థుఁ బార్థివు నొక్కతప్పు
నకు వధింప నాశయ మెదొ ? నాకుఁ జెప్పు. ౧౪

మ. అను నవ్వానికి నిచ్చ మెచ్చి గురుఁ డన్నా ! నీదు ప్రశ్నార్థముల్
మునుపేఁ గొంటిని మాయికమ్మవు జగమ్ము న్మిథ్యగా నెంచు జ్ఞా
ననిరూఢుండు స్వరూపసంస్థుఁ డతని న్ప్రారబ్ధ మేరీతిఁ జెం
దును? దేవుం డిటు చేయునా? వ్యవహృతిన్ రోషించి యం చంటివే?

గీ. వినుము నిష్క్రియ మాత్మ కెవ్వియును లేవు
దేహబంధంబుతో వచ్చుఁ దివిరి కర్మ
మతివిమూఢుని మాట కేగతియు నుఱదె ?
యుభయదర్శికి విద్దె లీ యోజఁ దెలుపు. ౧౬

శా. ప్రారబ్ధంబులకుం బ్రతిక్రియలు సంపన్నంబు లై యుండినన్
శ్రీరాముండు నలుండు ధర్మజుఁడు నుర్వి న్దుఃఖముల్ జెంద నౌ
చారిత్రం బుపలక్షణంబుగ మును ల్బంధింపనేలా ? పురా
ణారంభంబుల నెంచ బ్రహ్మముఖు లాయత్తు ల్గదా భావికిన్? ౧౭

గీ. దక్షుఁడు భృగుండు నింద్రచంద్రప్రముఖులు
తత్త్వవేత్తలు గా రొకో ? దారి తప్పి
యనము సెడ నంతలేసి కార్యము లొనర్త్రె ?
గొప్ప విధి కన్నుఁగవ గప్పి రొప్పకున్న. ౧౮

గీ. పడిరి వైకుంఠకింకరు ల్భవకుమార
శాపనిర్దగ్ధులై విధికోపమునను
నారదాదిమహర్షు లానయ మెనసియు
నియతిఁ దరియింపలేమి నిర్ణయము కాదె? ౧౯

గీ. తత్త్వవిజ్ఞానమునకు బాధకము గాదు
స్వఫలము నొసంగఁ దాఁతాఁడు సంచిత మది
ఉభయశారీరబంధమ్ము నూదియుండు
నిది యదియొ చూచుచుండుఁ గానిది యటంచు. ౨౦

గీ. ఆత్మ నెడవెట్ట మే నెట్టు లనుభవించుఁ
గర్మ మందువా? కలియుఁ దాఁత్కాలికముగ
నదియుఁ దీఱిన మునుపటియట్టు లుండుఁ
గామచింతాదు లిటు నటు గడలుకొనమి. ౨౧

క. శారీరకర్మమాత్రం
బారంభించియును వృజిన మందఁడు విజ్ఞుం
డారూఢి భిన్నభిన్నశ
రీరశరీరిస్ఫురాద్విరీతు లెఱుఁగుటన్. ౨౨

సీ. ఇది యిట్టు లుండంగ నీశ్వరుదోస మిం
చెంచితినే? యదియేని లేదు
కల్పితమగు నీ జగద్భ్రమమున సత్య
సృష్టిస్థితిలయమ్ములే కలుగమి
వ్యవహారస్మృతి నందువా? సర్వమునకును
గర్త పాలయిత సంహర్తయు హరి
కానఁ దాఁ గూర్చిన తనువుల మార్చుట
తన కవశ్యము గార్య మని పొసరిచేఁ
గనమొకో? వినాశ ముత్పన్నమునకు నెందు
దేహము వినష్ట మయ్యెఁబో దేహియైన

భక్తునకు నేమి లోపమ్ము వాటిలె నతఁ
డాతఁ డవిశిష్టులు విశిష్టు లై యెలయుట. ౨౩

గీ. అన్ని విధములఁ ద త్త్వజ్ఞు లై నవార
లిపు డొనర్చెడు చేతల నెడరుపడరు
పూర్వకర్మప్రదిష్టు లై పొరలుచున్న
యట్టులు జనమ్ములకుమాత్ర మగపడుదురు. ౨౪

క. కర్మానురూపముగ నా
యుర్సుఖముల జగతి కిచ్చుచున్నట్టులుగా
నిర్మాతగఁ జేష్టించెడు
నర్మిలి లే దెందునేని నభవున కభయా! ౨౫

క. ఇది సామాన్యసదుత్తర
మిదిగాక విశేష మీశుఁడే యా యీ భూ
మిదయితుని హతు నొనర్పం
బదిల మ్మవు కారణమ్ము వలికెద వింశే. ౨౬

గీ. తివిరి యడిగిన వరము లాత్రేయదత్తుఁ
డిచ్చునెడ నిచ్చెఁగాదె మహీరమణున
కాత్మసముచేత సంగ్రామమందు మిత్తి
నెనయుటయు నొందువిధి నది మొనయమియును. ౨౭

గీ. వర మడిగి తెచ్చుకొన్నయావధము మాత్ర
మేవిధికి రిత్తవోవు మహీశున కిఁక
నేమి యపరాధ మొనరించె నెట్లు సచ్చె
దాని వరుస వచింతు నుత్తముఁడ! వినుము. ౨౮

మ. కృతవీర్యాత్మజుఁ డొక్కసారి రథ మెక్కెం బోయెఁ గ్రీడింప భూ
మితలంబందు వనంబుఁ జొచ్చె నుదయన్మిత్రంబు కాలంబుగాఁ
జతురంగంబు బలంబుతో సుచిర మిచ్చన్ సంచరింపంగ నై
జితసంగుండు నివృత్తుఁ డౌచుఁ గనె నార్చీకాశ్రమోపాంతమున్. ౨౯

ఉ. అం దరదంబు డిగ్గి దరియం జని వానికి మ్రొక్కి గొల్చి యా
నందమున న్నుతించి కెలనం దదనుజ్ఞ నుపోపవిష్టుఁ డై
యుండుఁ దదీయ వాఁ గుశల మీశుఁడు ము న్నడుగ న్మునీశ్వరుం
డెందు ననామయం బడిగె నెంచె నొసంగెను బాద్య మర్ఘ్యముల్.

శా. ఆతిథ్యంబునకున్ నిమంత్రితునిఁ జేయన్ రాజు సైన్యస్వకా
న్వీతుండై మునిహోమధేనుకృతము ల్విస్తారదివ్యోపభో
గాతీతప్రియభాజనంబులగు భవ్యాహారము ల్కాంతసం
స్ఫీతాసంజితము ల్వొనర్చి కొనుచుం జింతించెఁ జిత్తంబునన్. 31

ఉ. నన్నుఁ బరాభవించె మునినాథుని యోగసమిద్ధవై భవం
బెన్నఁగ లేదు స్వర్గముననేని నిదంవిధ మశ్రుతంబు నా
యున్నతి సన్నతం బయిన దొక్కట నిట్టి తిరస్క్రియావ్యథా
పన్నత ము న్నెఱుంగుదునె ? పాఱునిసః పదఁ జూడ నేర్తునే ? 32

సీ. యాచించెదను గాక యఘ మన కీ వాని
నీకామధేనువు ని మ్మటంచు
నడిగిన నిచ్చునా ? యట్టిదాని నితండు
నిష్క్రయం బిడి నైన నేఁ గొనవలె
బహుమాల్యబహురత్నబహుధనజాతమ్ము
నాకన్న నెవ్వఁ డీ నాఁగాఁడు
వలదన్నఁ గొనిపోదు బలమున శాంతిప
రాయణుఁ డితఁ డేమి చేయఁగలడు?
పలు తెఱంగుల నిట్లు స్వస్వాంతముననె
తాను దలపోసి తలపోసి ధరణివిభుఁడు
వశిత యెడపడ భవితవ్యవశతఁ జెంది
చెందఁగారాని యొందిలి నొంది వందె. 33

ఉ. అంతటఁగొంతసేపున కిలాధిపుఁ డెంచిన యంత చేయ నై
చెంతకుఁ జేరి మ్రొక్కుచు వశిప్రవరా! యని సి గ్గొకింత యొ

క్కింత భయం బొకింత నయ మించుక దైన్య మడంచి కోర్కె యు
ద్భ్రాంతు నొనర్ప నెట్టన స్వభావము మాని కెలుంగఁజేసినన్. ౩౪

గీ. శివశివ యటంచు నిరుగేలఁ జెవులు మూసి
రాజసత్తమ! యేమంటి? బ్రాహ్మణస్వ
మకట మీవార లాసించిరయ్య! యెన్నఁ
డేని నీ వేని యంతంతలే? యనునెడ. ౩౫

ఉ. అడ్డము వచ్చి మాటలకు నానరపాలకుఁడు న్మహాత్మ! నీ
గిడ్డి వృథాగ్రహింతునొకొ? గృష్టులు నిష్టధనంబు లిచ్చి నీ
బిడ్డఁడు వాడుకోఁదగఁడె? వేఁడెద నిష్క్రయ మెన్ని దీని నా
కిడ్డఁ గృతార్థుఁ డయ్యెద మదీప్సిత మిమ్మెయిఁ దీర్పు నావుడున్. ౩౬

ఉ. ఆలను విక్రయింతురె? ధరామరు లెయ్యెడ నైన నందు నే
నేల తథావిధమ్ములకు నెంతుఁ జొరన్? దొర! యాశ లెల్ల ను
ద్వేలముగా జయించి తగవే? వెడయాసలఁ గ్రమ్మఱింప నీ
వే లలిఁ గొందు వెట్టిదుదు నే నని యా జమదగ్ని పల్కినన్. ౩౭

గీ. ధర్మ మని చెప్పుచున్నాఁడు తత్త్వవేత్త
యనియుఁ జిత్తమ్మునఁ దలంప కవనినాథుఁ
డెత్తుకొనిపోదు బలమున నేమి సేతు
వనినఁ గొనిపొమ్ము శక్యమే ననియె మునియు. ౩౮

క. అనియు ద్విజుం డతిశాంతి
ప్రణిహితచిత్తుఁ డయి యుంటఁ బార్థివవరుఁడుం
ఘను లెక్కఁ గొనని ధృష్టతఁ
గొనిచనియె న్నగరమునకు గోరత్నంబున్. ౩౯

చ. అడుగుటకే భయంబుపడె నాదిఁ గ్రమంబుగ మాట మాటకు
న్నొడిపెను గాదు కూడ దన నో, యని యింతలుసేసె రాజటే
యడియరియయ్యె నేమనఁగ నౌ నిఁక నౌ నది కాకపోవు నె
ట్లెడవిఁ జరించి రాముఁడు గృహాగతుఁ డయ్యె నజయ్యుఁ డింతలోన్.

ఉ. మేదిని వ్రాలి తెచ్చిన సమిత్కుశశాకఫలాదు లెల్లఁ ద
త్పాదుకలొద్ద నుంచి పితృపాదుల యాస్య మొకింత చూచి యా
సోదరులం గనుంగొనుఁడుఁ జొ ప్పొకయింతయుఁ దప్పకుండ వా
రా దొర వచ్చి మెచ్చి తిని యాఱడిఁ గొన్న విధం బిదం బనన్. ౪౧

మ. బలవంతుం డవు రామదేవుఁ డప్పుడే వావర్ధమానాంగుఁ డై
యలుకన్ భీమదురాసదుం డగుచు నిష్వాసంబు తూణంబు గొ
డ్డలియుం గై కొని నేకవీరుఁడు పొగ డ్తం గన్నవాఁ డేగ వే
గ లయం బియ్యది వచ్చిపడ్డ దని యోఘుం బై సుర ల్వాఱఁగన్.

మ. భగవంతుం డిదె పేరుగా దురితభూభారాయితక్షత్రియ
ప్రగణంబుం బొరిపుచ్చఁ బూని రుష సంరక్తాంతనేత్రప్రభా
నిగృహీతప్రలయానలాగ్రహుఁడుగా నిల్చించి తా నప్పుడే
నగరంబుం జొరఁబోవుచున్న నృపతిన్ గాంచె న్వచించె న్వెసన్. ౪౩

శా. ఏ రాముండ మొగంబు జూపు మిటు లుద్వృత్తుండ వై క్షత్రియో
త్తారశ్రీ వికసింపనై తె? వెడఁగా! ధాత్రీసురార్థంబు లే
వా రేనాఁడు హరించి రి ట్లయిన గోవర్గంబు నర్పించి "వం
దే రామాయ"యటందువా? యసుగణా ప్తిం బొరఁ గొల్పోదువా?

గీ. లోకవిశ్రుతక్షత్రకులుండ వీవు
బ్రాహ్మణుఁడ నేనుఁ జూడు దైవమ్ము బలము
నక్కటక్కట రిత్త నీయట్టివాఁడు
చావవలె నట్టె బ్రాహ్మణస్వము హరించి? ౪౫

గీ. నాది నా కిచ్చి పైనొక్క నతి యొనర్పు
మెప్పటికి నిట్లు చేయ నం చొప్పుకొనుము
పాఱఁజూడు మయ్యది కాని పని యనిమెదొ?
కులవినాశమునకు నొప్పుకొనుము దొంగ! ౪౬

మ. అనుమాట ల్పెవిఁ జొచ్చుచుండఁ దన యన్యాయంబు చిత్తంబునం
దనువర్తింప విషణ్ణుఁ డై తిరిగి తేఁ డా దైవముం జూచి ధ

ర్మనిరూఢుం డభిమాన మర్థమును సన్మానించి నాసీరయో
ధనికాయంబుం బురికొల్పె జన్యమునకుం దా నున్ముఖుం డై చనెన్.

శా. రాజాజ్ఞప్తులు యుద్ధమాను లవు వీరక్షత్రయోధాగ్రణుల్
తేజస్సంముఖతామసౌఘముల మార్దిన్ రూపు లేకుండ నై
యాజిన్ రామునిముందటన్ బయలు సేయన్ హైహయాధ్యక్షుఁడున్
యోజించె న్మది భూతభావిభవితవ్యోదంతసిద్ధాంతమున్. ౪౮

సీ. అవతీర్ణుఁ డవు సురాధ్యక్షుండె సు మ్మితం
డవనిభారము వాప నైన కృతికిఁ
ద్రిభువనేశ్వరుఁ డని తెల్పియే చాటెడు
నను నిమిత్తము సేసినాఁడు నేఁడు
తిట్టినట్టులె చెడె నట్టి నావిక్రమం
బింతవా రొకనిచే నిట్టు లైరి
కూలముద్ధరముల లీలతో వీని నా
త్రేయదత్తుఁడు నెదిరింపలేఁడు
సేంద్రులు సుర ల్నిశాచరు లితనిముందు
నర్కునెదుటి ఖద్యోతము లనఁగరాదె ?
మున్ను పూజ్యుఁడు హరి విప్రపుంగవుఁ డయి
వరదుఁ డడఁగింపవచ్చె నా వరము సెల్లు. ౪౯

ఉ. నన్ను నెదుర్పలేరు సురనాయకముఖ్యులు నిట్టి నాకు న
త్యున్నతుతోడ మార్కొనక యున్నది సన్నయమే ? తలంప నీ
యున్న సిరుల్ గృహంబులు ధనోత్కరము ల్సుతు లాంద్రు నిత్యమా?
కన్నది విన్న దింతయును గల్పిత మాట తలంక నేటికిన్? ౫౦

మ. వ్యవహారాద్భృతసత్య మెంచి సుయశం బార్జింప నాబోటికిన్
యవనీదేవునితో స్వవీర్యబలము ల్సార్థక్యముం జెంద ను
త్సవయుక్తిం బ్రవిదారణంబుఁ గొనుటే దైవప్రదత్తంబు మే
లవలం గావలె నేది యా నదియె నా కా చింత లేలా యికన్? ౫౧

క. అని నిశ్చయించి ప్రళయం
బున మండు సహస్రరశ్మిఁ బురుడించు కృతిం
బనిఁబూని సహస్రకరుం
డనూనశరవర్షణముల నా ప్వెజు ముంచెన్. ౫౨

క. దానికి రాముఁడు దలఁకక
దానోగ్రద్విరద మట్లుదగ్రుం డగుచున్
మానవనాయక! ద్విజుఁడ ను
మానాయకుశిష్యుఁడం జుమా భద్ర మనన్. ౫౩

మ. జ్వలనార్కప్రతికాశశస్త్రకలితాస్త్రవ్రాతధారాశతం
బుల వర్షించెఁ దపస్విరాముఁ డగు రామున్ నించె గర్జారవం
బుల రోదోంతరము న్విమోహము జనంబు ల్పొంది యుర్వింబడన్
బలికెన్ రాజు నిజాంతరస్థ రసభావంబు ల్విభాసింపఁగన్. ౫౪

గీ. చూపుఁదూపుల నిన్నె లక్ష్యునిగఁ జేసి
క్రుమ్మరించెద నిదుగో నీ కులము బలముఁ
జలము సూపుము నీ వగ్రజన్ము వైన
నుగ్రుశిష్యుఁడ వైన నే నులుకఁ జుమ్ము. ౫౫

మ. అను నావీరు పరాక్రమమ్ము నెద నౌరా యంచు భావించుచున్
ముని సాటోద్గరుడధ్వజుం డతఁడు సంమోదించె మెత్తందనం
బెనసెం దా హృదయంబున న్శరశతం బేపార నాటించె ను
న్మనుఁ డై తచ్ఛరపంక్తిఁ ద్రిప్పెఁ జదల న్గాఢబద్ధమాల న్వలెన్. ౫౬

గీ. ఏకవీరుఁడు రాముఁ డయ్యేలువాని
ధనువు లేనూరు విఱిచెఁ గప్పెను శరముల
నతఁడును గ్రహించె మరల విం డ్లన్నియు వెస
గట్టిగాఁ గొట్టె దేవు సింగ మన నఱచె. ౫౭

శా. ఆజిన్ మండెడు నా నృపాలు మునివేషాసంజితుం డచ్యుతుం
డోజం బెక్కిన దివ్యమార్గణగణవ్యూహంబులన్ గారడీ

గాఁ జల్లార్చె లయాగ్ని నంబుదములం గాలాగ్నిరుద్రుం డనన్
భ్రాజిష్ణుం డొనరించె సారథిరథాశ్వవ్యాహతిన్ దీవ్రుఁ డై. ౫౮

ఉ. అంత సుతీక్ష్ణ ధార మవు నట్టి పరశ్వథ మెత్తి రాముఁ డా
మంతుసమేతు చేతు లనుమానము మానియె మానికొమ్మ లా
దంతి యన న్వ్రాలార్చుచు నదల్చి విదల్చె నవక్రవిక్రమా
క్రాంతదిశాంతరాళవిహరత్స్వయశశ్శకలనాతిలోలుఁ డై. ౫౯

ఆ. కనకరత్నవలయకాంతము లూర్చ్వకాంతు
కరము లభ్రవీథికల నొరయుచుఁ
బుషమిఁ బడియెఁ గల్పభూరుహశాఖికా
భ్రాంతిఁ గలుగఁజేయు చింత నంత. ౬౦

శా. దత్తాత్రేయలసత్ప్రసాదమునఁ దద్ధాత్రీశుహస్తంబు లు
త్కృత్తంబు ల్మొలవందొడంగె మరలన్ హేతిస్ఫురచ్ఛక్తి సం
పత్తిం దాలిచి యవ్వి లూనము లొనర్పం దోఁచె నింకెన్నియే
నిత్తోయమ్మున మాటిమాటి కెగువన్ హింసించెఁ గ్రీడారతిన్. ౬౧

శా. ఆగ్నేయాస్త్రముచేత రాముఁ డరిబాహాస్తంభసంభూతి ని
ర్భగ్నంబుం బొనరించె మించె నసె నా రాజన్యసింహంబుతో
మగ్నం బై నవి నీ పరాక్రమము లస్మద్విక్రమాంభోధిలో
లగ్నంబై నది చింతసేయు మది కాలప్రాప్త మం చాతఁడున్. ౬౨

ఉ. రామునిఁ జూచి నైజదహారంబునఁ బంచిన జోతిఁ జూచి యా
స్థేముఁడు సద్గురుం డిడ మదిం దిర మౌ నల తత్త్వ మెంచి యు
ద్దాముఁడు స్వస్వరూపపరిదార్ఢ్యమున న్సుఖరూపుఁ డయ్యె తేఁ
డామయ మేది మైమఱచి యప్పుడు గొడ్డలి కంధరం బడెన్. ౬౩

మ. పరిపక్వం బవు తాటిపం డన నభోభాగంబునందుండి త
చ్ఛిర ముర్విం బడ మ్రోయుచుం బడియె వాసింగన్న తద్దేహ మా
మరసంసాధితసామవర్ష ములతో మానించి రింద్రాదు లి
ద్వర సంఛేదకు ఛిన్నమస్తకునిఁ దత్పూర్ణత్వ మూహించుచున్. ౬౪

గీ. బ్రదుకునాఁడె విదేహుఁ డా పార్థివుండు
వపు వటు నశింపఁ బరముకైవల్య మెనసె
నమ్మహాత్ముని దేహభూతమ్ము లైన
భూతములు భూతముల లయము నెనయంగ. ౬౫

ఉ. ఆవును దూడఁ గైకొని గృహాగతుఁ డై స్వకృతంబు కృత్య మా
చేవ నివేదితం బొనరిచెం దనతండ్రికి రామదేవుఁ డా
భూవిదితద్విజర్షియును బొందెను తాపము లంతవానికా?
యావలన న్విఘాత మని యట్టు లధర్మము రాద్వధం బనెన్. ౬౬

ఉ. రాజకుమారులుం బిదప రామునిచే హతులై రనేకు లా
పై జితకాశి సేసెను నృపాలకులాంతకరప్రతిజ్ఞ వి
భ్రాజితవృత్తి నేలిరి ధరాస్థలి శిష్టులు రాజపుత్రకుల్
వాజిముఖం బొనర్చెఁ దరువాత భృగూత్తముఁ డంచుఁ దెల్పు-చోన్.

గీ. మరలఁ బ్రశ్నించె శిష్యుండు గురువరుండ!
రాజపుత్త్రు లిఁకే యపరాధ మతని
కాచరించిరి ప్రతిన గోత్రాంతకరము
నేల సేసె నర్జునుపుట్టు వెట్టి దనుచు. ౬౮

గీ. వేదధర్ముఁడు వలికె నుర్వీదయితుఁడు
కలఁడు కృతవీర్యుఁ డన వీర్యకలన లతఁడు
నద్భుతమ్ము లొనర్ప నా యాఖ్య వచ్చె
ధర్మసత్యపరుఁడు శౌర్యధైర్యశాలి. ౬౯

చ. భువి దివి విశ్రుతుం డయిన భూపతి కెంత చిరంబు కాల మ
ట్లువసిత మయ్యె సంతతిముఖాబ్జముఁ గన్గొను భాగ్య మబ్బ ద
య్యె విసువు లేక వానిసతి యే రెది సెప్పినఁ జేసి చేసి వి
ప్రవిబుధసంప్రసాదము శుభం బిడ గర్భిణియయ్యెఁ జయ్యనన్. ౭౦

గీ. పది నెలలు మోసి భవ్య మౌ వాసరమున
మంచి లగ్నంబునందుఁ గుమారుఁ గనియె

నేమి లాభము ? సంతోస మెట్లు కలుగు ?
నలవు లేనివ రెండు కే ళ్ళర్భకునకు. 20

చ. వినుముఁడు విహ్వాలుండు నయి వీరుఁ డోనర్చెను జాతకర్మము
ఖ్యము లవు సంస్కృతు ల్విదప నాతఁడు స్వర్గతుఁ డైన ద్వాదశా
బ్దముల వయస్సువాఁ డరిగి దత్తగురూత్తము నాశ్రయించెఁ ద
త్క్రమ మది యెల్ల వింటివికదా ! మది కించెన ? యన్న శిష్యుఁడున్.

గీ. భూతభవ్యభవద్వేది ! పూర్ణకామ !
విస్తరమ్ముగఁ జెప్పు మివ్విభునిపుట్టు
వెవ్వఁ డీతఁడు పూర్వమం దిందుఁ బొడమ
నేమి కారణ మన గురుఁ డిట్టు లనియె. 23

కార్తవీర్యుని పూర్వజన్మ వృత్తాంతము

చ. కల దొక గాథ పెద్దల సకాశమున న్విన నైన దే మనన్
దలితరిపుప్రకర్షము సుదర్శనచక్ర మొకప్పు డుబ్బుమైఁ
దలఁచెను నేను గల్గుటఁ గదా హరి విక్రమ మప్రమేయ మై
వెలిగెడు న న్వినాగ నెటు వెన్నుఁడు దైత్యుల గెల్చునం చెదన్.

సీ. అఖిలజ్ఞుఁ డది మది కాగతం బగుడు వ
త్సా! సుదర్శన! యని యామతించి
తన దరి నున్న తాసనమున నునిచి స
మాదరమేదురవ్యాప్రృతి కయి
ఏమిరా! బిడ్డ! నా కిప్పుడు మది కెక్కె
నీవిచార మెఱుంగ నింతదాఁక
జిష్ణుం డజితుఁ డంచు జేజేలు పచరించు
కైవారములనె నిక్క మనుకొంటి
లోకముల నెల్ల నెల్లలి సాకువాఁడ
నెటు దైత్యజాతులను జయించువాఁడ

నీవు నాచేతలేనినాఁ డీ వితతము
విశ్వవిశ్వ మ్మనాశ్రయమవివశమ కదె? ౨౫

ఉ. జృంభితశత్రునాశనము సేసి సురేంద్రుల మానివర్గముల్
సంభృతసౌఖ్యుల న్సలిపి సర్వము గొల్వ రమా స్తి కొంచు వి
శ్వంభరుఁ డీతఁ డన్న సుయశంబున కై సుఖవృత్తి నుంట ని
ర్దంభభవత్పరాక్రమకృతం బగు మేలునఁ గాదె పుత్త్రికా! ౨౬

గీ. అనుచు నే మేము పలుకు దైత్యారిపలుకు
లాదిఁ దన విచారమునకు ననుగతములు
గా, నదే నిజ మనుకొని గరుడగమను
మహిమ మెదియే ననఁగ లేక మసలె నరియు. ౨౭

శా. దానం దేవుఁడు కోపగించి వెడఁగా! దర్పం బిటు ల్సల్లునే?
నీ నా భేద మెఱుంగలే వయితిగా నేలం దగం బుట్టు పా
మ్మనో, నా కగుభంగి నేలెదనులే యీలోకము ల్నీక! నీ
తో నాకింకిట పొత్తు సెల్ల దన వాక్త్రోద్రపతున్నాత్ముఁ డై. ౨౮

శా. స్వామీ! కల్గెను తప్పు నేఁటి కిటు నా స్వాంతమునం దిన్నినా
ళ్లే మీహస్తంబున నున్న పున్నె మెటు వోయెన్? దారి తప్పెం గదా
నా మే లింకిటఁ జూచువా రెవరు? తన్నుం గొన్న నీవే కదా
భూమి ల్మాటికి దిక్కు నిన్నె శరణంబుం బొందెదం గావవే. ౨౯

మ. అని పాదంబులు వట్టి వెక్కివెకి వాఁ డారాటముం బొంది యే
డ్వ నితాంతా త్తదయాంతరుం డయి యనెన్ భవ్యుండు రాజాన్వయం
బున జన్మింపు మబాహుతన్ దొలి భుజంబు ల్వేయి నై యాపయిన్
ఘనతం బొందుము నేన వచ్చెదను ని న్మర్దింప దుర్దాంతతన్. ౩౦

శా. వై కుంఠంబునఁ జొచ్చి విష్ణుకరసంవాసంబు సిద్ధించియున్
నీ కీ యల్పపుబుద్ధి పుట్టుటకు సందేహంబు లేకుండ నీ
లోకు ల్నిశ్చితు లౌటకుం దగు పను ల్గూర్పంగ నౌఁ బొమ్ము వ
త్సా! కల్యాణ మవుం బరశ్వథముచే సాధించెద న్ని న్ననెన్. ౩౧

గీ. అనియు సద్దానఁ గలిగె నాయాయిగాథ
లనియుఁ గలదు పురాణధోరణులఁ బ్రియుఁడ!
వినుము రాముని రోషకారణముకూడ
వరుసతో వచ్చు నద్దేవు చరితమందు. ౮౨

గీ. కార్తవీర్యుఁడు హతుఁడు గాఁగాఁ దదీయ
తనయు లతిదుఃఖమున జమదగ్ని వధము
నందు నాస్థితయత్నులై యరితఁ గొనియు
సందు లేకుండి రథిరామశౌర్యశంక. ౮౩

మ. ఒకనాఁ డాతఁ డెటో చనం గని యిదే యుక్తంబు కాలం బటం
చెకసక్కెంబుగఁ బాపబుద్ధులు కృపాహీనాత్ములై చొచ్చి రే
ణుక యాక్రోశ మొనర్పఁ గైకొనక చండుల్ పాపసాఖండలుల్
మొకముం గోసినరీతిఁ గోసిచని రే మేఁ బ్రేలుచుల్ దూలుచుల్. ౮౪

ఉ. ఆయెడ దుర్నిమిత్తముల నారసి రాముఁడు వేగ వచ్చి యా
శోయమున న్విఖండితు మృతుం దనతండ్రిని దల్లిఁ జెంత నో
హో యని యేడ్చుదానిఁ గని యొక్కట ముంచిన శోకవాహినిం
ద్రోయఁగ లేక చూపఱను దోఁడుగఁ దా విలపించె నార్తుఁడై.

ఆ. బాపనయ్య వోలె భార్గవరామ! నీ
వశ్రుసిక్తముఖుఁడ వై యశక్తు
నట్లు లేడ్వనగునె? యాచరింపందగు
పనిని విస్మరించి యనుచు లేచి. ౮౬

పరశురాముఁడు తండ్రిని సంస్కరించుట

ఉ. భ్రా లు మానులు న్వలదురా యని యడ్డము రా గడింపకే
పాతకు లున్న యన్నగరిపైఁ జని విల్గొని యల్లి భార్గవుం
డాతటి కందుఁ గానసయినట్టి తదాత్మజులం దదీయులం
బ్రేతపతిం గనం బనిచి యింటికి వచ్చె ముహూర్తమాత్రలోన్. ౮౭

ఉ. అచ్చటి మానులు న్నవ్విజను లందఱు నన్నెరువంద రుష్టుఁ డై
వెచ్చనియూర్పు వుచ్చి నొడివెన్ వినుఁ డిర్వదియొక్కసార్లు నే
నిచ్చ మెలంగి రాజకులహీన నొనర్చెద నేలఁ బల్కెదన్
సచ్చెము దుర్వినీతనృపసంహననంబున లే వధర్మముల్. ౭౭

మ. అనుచుండం జగదంబ రేణుక యనెం బ్రాహ్మావకాశంబు ని
ట్లన నే మైనది ? చేత చేయవలెఁ గా కాటోపభీమంబుగా
నని యూపై ద్విజభావముం గొనఁ బరు ల్హాస్యంబు గావింతు రిం
క నిల న్నిల్వఁగఁ జోటు గల్గదనుమా క్ష్మాదేవవంశాలికిన్. ౭౮

మ. పితృభక్తిం దలకొన్నఁ జేసెదవులే పేరా! ప్రతిజ్ఞాతమున్
మతిమంతుండ ! యొనర్పుమీ మొదల సంస్కారంబు నీ తండ్రికిన్
సుతుఁడా! యిక్కడఁ గాదు తత్క్రియకు నెచ్చో “ తిష్ఠతిష్ఠే ” తివా
క్తతి యాకాశమున న్వినంగఁబడుఁ దత్ప్రాంతంబ యర్హం బవున్.

గీ. ఒక్కకావడి దెమ్ము న న్నొక్కదెసను
దండ్రిమొండెంబు నొకదెసఁ దార్పుమయ్య
బుజముపయిఁ బెట్టుకొని పొమ్ము పోవుచుండ
నధ్వమున వినఁగలవు నీ వట్టిమాట. ౮౦

గీ. సర్వవేదార్థశాస్త్రనిశారదుండు
తగిన యాచార్యుఁ డొదవిన తఱి నొనర్పు
ముభయులకు సంప్రతిష్ఠ నాయునికి నెఱిఁగి
వానితోఁ గూడి యుక్త మా వర్తనమున. ౮౧

క. మా పని నెరవేరిచి యట
నీపనిఁ బూనెదవు గాక నిరహంకార
శ్రీపనితము సేయఁగవలె
నేపనియేనియు నవద్యహీనుఁడ ! యనుచున్. ౮౩

ఉ. వీవధముం బుజంబుపయిఁ బెట్టెను దల్లి వచించినట్టు లా
పావనుఁ డల్పకాలమున వార్ధులు దీవులు కాననంబులున్

గ్రామము లాశ్రమంబులు పురంబులు తీర్థము లర్థిఁ జుట్టి నా
నావిధదేశము ల్మునిజనంబులతోఁ జనె సహ్యసీమకున్. ౯౪

గీ. కాన్యకుబ్జాశ్రమము వీడి క్షణములోనె
యామలక్యాశ్రమముపొంత నరుగుచున్న
భృగువరేణ్యునితో నశరీరవాణి
పలికె సాక్షేపముగ గురుభక్తుతోడ. ౯౫

గీ. మంత్రములతోడ విధిగ సంస్కార మిపుడ
తండ్రి కొనరింపు మిచట దత్తమునితోడఁ
బరశురాముఁడ! యిట్లు శవంబు మోచి
కొనుచు దిగ్దేశములు దిరుగుదురె? యొండుః ౯౬

క. అను వాక్యము విని రాముఁడు
మునులు సురలు సిద్ధసాధ్యభుజగేంద్రముఖుల్
కొనియాడుచుఁ జుట్టుకొనం
గను గొనెఁ దనతల్లిమోము కార్యవివిత్సన్. ౯౭

ఉ. తల్లియు నట్ల చెప్పిన నుతప్రతిభుం డతఁ డట్టె చూచె భూ
మోల్లసితద్రుమవల్లిఫలయుక్సుమపుష్కరకందమూలసం
పల్లవితంబు సహ్యమున మౌనివరాశ్రయ మాశ్రమంబుఁ దా
మెల్లన వీవధం బచటి మేదిని డించి పరిక్రమించుచున్. ౯౮

ఉ. కానఁగనయ్యె నందుఁ జపకంబు కరంబునఁ దాల్చి యంకసం
స్థానముఁ జెందియున్న తన చానకు నాసవ మిచుచున్న వహా
నీనుఁ డనంబరుండు దరి కేగి నతుం డయి సన్నుతించి ది
వ్యానుగతుండు భార్గవుఁడు ప్రార్థనసేసె నిజార్థగృధ్నుఁ డై. ౯౯

గీ. స్వామి! కరుణింపు నను భక్తవత్సలుఁడవు
కాన నినుఁ జేరినాఁడ సంస్కార మెట్టు
లాత్మజనకున కేను చేయంగవలయు
నట్టి విధి నుపదేశింపుమయ్య! యనుడు. ౧౦౦

క. ఎఱుఁగను ధర్మ మధర్మము
నెఱుఁగను విధి నెఱుఁగఁ బో యభీష్టము మార్గం
బఱగొఱగాఁ గాని కల పెం
పఱఁ దిరిగెడు వీని నేల యలచెద వనియెన్. ౧౦౧

మ. మరల న్రాముఁడు మ్రొక్కి ధర్మవిధుల న్మర్మంబు నీకన్న నె
వ్వరు గుర్తించినవారు ? దేవమునిభవ్యప్రాప్తి కీవే కదా
పరమశ్రీగురుమూర్తి వీ వొకఁడవే భాస్వన్మహాయోగవి
ద్వరతాఖ్యాతుఁడ విందు సందియము కద్దా ? దేవ ! యం చాడినన్.

సీ. ఎక్కడ దొరకినాఁ డీ దిగంబరుఁడు చా
ల్చాలుఁబో శుద్ధద్విజప్రవరుఁడ!
ప్రమదాసవాతివిహ్వాలలోచనుఁడు వీఁడు
విధిసంస్కృతుల కౌనె ? వెఱ్ఱివాఁడ !
అన్ప్రశ్యుఁ డఖిలభూతాలి కసంభావ్యుఁ
డన కిట్లు స్వకులపాంసనుఁ దవిలితె ?
దుర్వృత్తుతోఁ గూడి దుష్టుఁడ వయ్యెదో?
చవిచూడు మిదె సుర నరస మనఘ!
యనుచు నపలాప మొనరించు నమ్మహాతున
కమ్మయోగతిఁ దెలిపె నాయమ్మ తనయుఁ
డమ్మ వచ్చినదా ? యని యాసనమ్మ
వీడి దోయిలిఁ బన్ని యా వినుత నెనసె. ౧౦౩

శా. దత్తాత్రేయుఁడు భక్తి మ్రొక్కి యనియెం దల్లీ ! సురేశాని ! మా
చిత్తస్థానములందు నీవె కద లక్షింపంగ రాకుందు వా
పత్తుల్ ద్రోవఁగ సౌఖ్య మీయఁగను శర్వాణీ ! జగద్వంద్య వా
ము త్తిం గూర్తు భవార్ణవంబుఁ దరియం బుచ్చం దరిప్రాయ వై.

గీ. చరము లచరమ్ము లగు జగజ్జాలకముల
నేకవీర యనంగ నీవే వెలిఁగెద

వేక వయ్యు ననేకసమాకృతుల ర
హించు నీకు నమస్కృతు లివె పరేశ ! ౧౦౫

చ. అని యిటు లేకవీరఁ గొనియాడి మృతుం జమదగ్నిఁ జేరి యా
తని పదయుగ్మమందుఁ దల దాఁక నతుం డయి రాముతో ననెన్
జను మిపు డెల్లతీర్థముల స్నాన మొనర్చి యరమ్ము రమ్ము నా
యనుమతి సంస్కరింపు విధి నయ్యకళేబర మంచు నాదృతిన్.

చ. అది విని రామదేవుఁడు మహామతి ధర్మభృదగ్రగణ్యుఁ డా
యదనున విల్లుఁ గైకొని మహాశర మొం డరివోసి లాగి యా
పదనున సహ్యభూమిధరభాగము బ్రద్దలుసేసె భుక్తిము
క్తిదములు తీర్థసార్థము లదే వివరమ్మునఁ బొంగిపాఱఁగన్. ౧౦౭

ఆ. గంగ యమున రేవ తుంగభద్ర సరస్వ
తియుఁ బ్రయాగము గయ దేవికయును
పుష్కరమ్ము మొదలు పుణ్యనదీనద
క్షేత్రతీర్థచయవిశిష్టము లయి. ౧౦౮

గీ. వెలయు తీర్థోదముల స్నానవిధులఁ దీర్చి
తండ్రిశవమున కతఁడు ప్రదక్షిణించి
సంస్కరించె సమిత్తుఁడౌ జాతవేదు
నందు గురుదత్తుశాసన మనుసరించి. ౧౦౯

మ. జగదేకప్రసు వైన రేణుక సమస్తస్త్రీయభూషాభృతి
ప్రగలంకారనిరంకమూర్తి యయి పుత్రా ! యత్రిదత్తుండు సా
క్షిగ నామాటలు విన్మ పోఁదలచితిన్ సిద్ధాత్మసంస్థానికిన్
భృగువంశోత్తమ ! భర్తతో నెఱుఁగుదు న్విష్ణుండ వీ వం చెదన్.

క. గురుదేవద్విజజాతులఁ
బరిపాలింపుము ప్రతిజ్ఞ పరిపాటిమెయిన్
నెరవేర్పుము సఫలముగా
మరచెదవో ? యన్నమాట మర్యాద సెడన్. ౧౧౧

చ. అని జగదంబ సొచ్చె సొద నంబరమం దప్పుడే కనంబడెన్
జనులు గనంగ నచ్చెరువు వసన్ బతితో సహచర్య కాచు రా
మన విధిపూర్వ మట్లు లుభయాంగకసంస్కృతి యాచరించి ద
త్తుని గవగూడి పిల్చెను నుతు ల్వొనరించె ముగించెఁ గర్మమున్.

క. దేదీప్యమానవిగ్రహు
లై దివిఁ దోతెంచినట్టి యా పితరులఁ బూ
జాదులఁ దనిపి యజించె సు
రాదుల ద్విజవరుల దేవరాయని దత్తున్. ౧౧౩

ఉ. సత్యపరాక్రముండు భృగుసత్తముఁ డుత్తము లైన వారి న
వ్యత్యయతం బ్రతిజ్ఞ ఫలవంత మొనర్ప ననుజ్ఞ యిం డటం
చత్యనుకూలవాక్యముల నందఱ వేఁడి తదాదృతాత్ముఁ డై
క్షిత్యఖిలస్థలంబుల గ్రసింపఁ జనెన్ బహుబాహుజాతులన్. ౧౧౪

ఉ. అమ్మెయిఁ బోయి క్షత్రియకులాంతకుఁ డిచ్చకు వచ్చిన ట్లధ
ర్మమ్మునఁ బమ్మినట్టి నృపమండలితోఁ క్షితిమండలమ్ము శూ
న్యమ్ము నొనర్చి మచ్చర మహాస్త్రము గాఁగఁ బ్రణీతయందు స్నా
నమ్ములు దానము ల్సలిపి నార మదే కొని సన్నివృత్తుఁ డై. ౧౧౫

ఉ. క్రొంచెము భాస్కరుం డవలికొండచటిం బడకుండ వచ్చి య
భ్యంచితశస్త్రము ల్కడిగి యచ్చటఁ గూర్చి నమస్కరించె భా
వించెఁ బితృప్రసూగురులఁ బెద్దయు భక్తిఁ దదగ్రభాగమం
దించుక నమ్రుఁ డై నిలిచె నిట్టియెడన్ జమదగ్ని యి ట్లనెన్.

శా. సంతోషించితి నీ చరిత్రమునకు న్సత్యంబు దేవుండ వీ
వంతం బందఁగఁ జేసినాఁడవు నృపాలాగ్ర్యాన్వవాయంబులన్
బంతం బొప్ప నఘం బఱన్ జలుపు మన్నా! వాజిమేధం బిఁకన్
స్వాంతంబుం బరిశుద్ధ మౌ న్వకులము న్నస్తం బవున్ ద్వత్కృతిన్.

ఉ. ఇంక ననేకయజ్ఞముల నీశుఁడ వీ వయిన న్యజింపు ని
శ్శంక మహాను లోకముల సంశయ నోదన మాను సత్యధ

ర్మాంకితవర్తనం బవని నంచితఁ జేసిన వాఁడవౌ దనన్
శంకరశిష్యునిం గని విశంకట శక్తి వచించె మాతయున్. ౧౧౮

శా. పుత్త్రా! పెండ్లము లేని నే నెటు మఖంబు ల్సేయఁగా నౌ నటం
చాత్రం బందఁగ నేల? స్వర్ణమయిఁ బత్ని న్యర్థంబునం గూర్చి ద
త్తాత్రేయుండును గశ్యపప్రభుఁడు నం దాచార్యుఁడుం బ్రహ్మయు
న్నత్రాౘమప్రముఖు ల్సదస్యులును గా న్పూరింపు మం చాతఁడున్.

క. వారలకు మ్రొక్కి యప్పుడె
వీరవరుం డనసె నేకవీరాశ్రమమున్
సారసనరసీఫలవృ
క్షారామవిహంగశోభితాభ్యంతరమున్. ౧౨౦

రాముఁడు దత్తదేవు నాచార్యకమునకుఁ బ్రార్థించుట

గీ. అనుపలక్షితుఁ డై విస్మయ మ్మెసఁగఁగ
నుటజమునఁ జొచ్చి పాదము లొత్తి వినతు
లాచరించి దత్త్రాత్రేయు నభినుతించె
సురఖచరసిద్ధమౌనీంద్రపరివృతు ముని. ౧౨౧

ఉ. ప్రత్యభివాదవాక్యములఁ బార్థివఘస్మరు నమ్మునీశ్వరుం
డత్యమలుండు స్వాంకమున నాతనిఁ గైకొని వాఁడనెన్ శిశు
త్వాత్యయ మింకఁ గాదు భవదాహృత మర్థము కొద్ది కాదు సం
పత్త్యభిరామ! రామ! నరమాత్రుఁడవే? తలఁపన్? జగద్ధరా!

ఉ. ఎక్కడి మాట? శూరవరు లెందఱు నెందఱుఁ జూచుచుండ లే
దొక్కఁడు నిన్నుఁ బోలునె! జయోర్జితు నర్జును నొక్కమాత్రలో
నక్కలపాలు సేయుట ఘనం బగు చోద్యము కాదు పిన్నవై
యెక్కటివీరులన్ నృపుల నెందఱఁ జంపితి వాజి లెక్కయే?

ఉ. పుట్టితి వేకవీర కడుపుం జగదుజ్జ్వల మాచరింపఁ జే
పట్టితి శంభుపాదములఁ బాలతనాఁడె తదాజ్ఞ బుట్టలోఁ

బెట్టితి దైత్యదానవుల వేల్పులు గెల్వఁగ లేని వారి, ని
న్నట్టి యెదిర్చువారు వసుధాధిపతుల్ ? భువనైకశోభనా! ౧౨౬

గీ. ప్రాకృతుండవు వీరశూరప్రపంచ
పరిగణితుఁడవు కావు విప్రవరుఁడ వటె?
నాయభిప్రాయ మధిలోకనాథుఁడ వవు
దల్ల నారాయణుఁడ వని యరసె నిన్ను. ౧౨౭

ఉ. బాపనవేస మూని యలుపంబులకుం గడు రుష్టుఁడైన య
ట్లాపను లెల్ల భూమివలయమ్మునఁ దీర్పఁ జరించుచుంటి వ
న్నా! పలుమాట లేటికి జనస్తవనీయము నీ చరిత్ర మ
ధ్యాసిత మయ్యె విష్ణుఁడ వటంచు నెఱింగితి మయ్య! తమ్ముఁడా! ౧౨౮

గీ. అనుడు దోసిలి యొగ్గి వాఁ డనియె స్వామి!
విష్ణుఁడను గాను గా నొకవీరుఁడ నిల
నఖిలవల్లభ! గురుదేవతావనీసు
రావలుల కేఁ బనులు సేయునట్టి వటుఁడ. ౧౨౯

ఉ. దేవతలు న్మహర్షులు పితృప్రవరు ల్మదిఁ దృప్తిఁ జెంద ని
ష్టే వశివర్య! దేని నితఁ డెంచెనొ చేయఁగ? నట్టి దానికిన్
నీ వొనరింపఁగావలె ననిందితసాహ్య మనెం బ్రదక్షిణం
బా విధిఁ జుట్టివచ్చె నతఁ డా నన మ్రొక్కి వరించెఁ గ్రక్కునన్.

గీ. జన్మ మే నొనరింతు నాచార్యకంబు
సేయవలె నం దనఘ! దయసేసి నీవ
యనుచు భార్గవుఁ డడిగె నో మని మనమున
మెచ్చి యాత్రేయుఁ డనియె నిమ్మొయి మొదలిడి. ౧౨౯

మ. అధిసహ్యాచలరమ్యభూమితలమం దాచార్యుతోఁ గూడి యా
బుధుల న్మాబుధులన్ స్మరించె ముని సుస్మార్గాఽహితాకారుఁ డా
యధిదేవుం డవు రైణుకేయుఁ డపు డభ్యాయాతు లైనారు త
ద్విధి శాహ్యాతు లహ్యాతులుం దదుపసంవిద్బద్ధసంబంధు లై. ౧౩౦

ఉ. భార్గవరాముఁ డిమ్మెయి శుభం బవు లగ్నమున న్ద్వితీయుఁ డౌ
భర్గుఁ డనంగ నార్జవసువస్త్రసుభూషణభూషితు ల్మహా
భర్గులు ఋత్విజు ల్ద్విజులు బ్రహ్మవిదు ల్తను జుట్టిరా ద్యుస
ద్వర్గము కోర్కు లూర జనతావృతుఁ డై చనె యాగశాలకున్.

గీ. ద్వారతోరణసంబాధ మధికశోభ
మానసుపతాక మాతోద్యమానితంబు
వేదికాకుండరమణీయ మాదిదేవుఁ
డరసె న య్యాగమండపాభ్యంతరంబు. ౧౩౨

క. దీక్షితుఁడై యజమానుం
డక్షయ్యసమార్జితవివిధార్థంబుల లో
కక్షేమంకరు డై యఖి
లేక్షాసముపాగతులకు నిచ్చెం బ్రీతిన్. ౧౩౩

ఉ. అన్నము పానము న్వసన మర్థిత మన్నెము హైమరాజతా
త్యున్నతవస్తువాహనసముత్కర మా క్రతువేళ లేదు కా
దన్న జనమ్ముఁ గాన మెట నై నను జాలును బూర్ణమయ్యె సం
పన్న మటన్న య న్నుడులె భార్గవు పున్నెము నెన్న శక్యమే? ౧౩౪

## పరశురాముని జన్మము

ఉ. ఆ రమణీయరామవిహితాధ్వర మారయ వచ్చినారు బం
గారము మోపు లద్భుతముగా నఖిలాంగములందు నెత్తినా
రూరును పేరునుం గలుగు నుజ్జ్వలులే యనరాదు కానికిం
గా రనువారు నయ్యదియు గౌరవహీనము కాదు చూడఁగన్.

గీ. దేవగంధర్వులుం బితృదేవతలును
నాగరాక్షసయక్షకిన్నరులు నరులు
తత్క్రతూత్తంసక మవసితమ్ముఁ గాఁగ
నిష్టధనదానమానన లెనసినారు. ౧౩౬

ఉ. ఇంద్రుఁడు సోమమున్ గొని మునీంద్రులు దక్షిణ లంది భూమిదే
వేంద్రులు భూరిభావనల నెంచి మదించుట లెక్క గాదు వా
దం ద్రవు నందు రంచు వెనుకాడెదు దీనుల పంట పండె భూ
మీంద్రులు సేయరే? క్రతువు లీమెయి తీరుపు లేదనంబడెన్. ౧౩౭

శా. చాతుర్హోత్రవిధాన మెంచి యొసఁగె న్సంపూర్ణ భూమండలం
బాతంకం బెడ లేక కశ్యపున కిజ్యాదక్షిణార్థంబుగా
శ్రీతారుండు భృగూద్వహుండు ముని నాత్రేయు న్నిజాచార్యు సం
ధాత న్దత్తు యజించె భక్తి నవరత్నస్యూతభూషాదులన్. ౧౩౮

ఉ. రాముఁ డొసంగి నట్టి ధనరాసులు రత్నము లంశుకమ్ము లు
ద్దాముఁడు దత్తనేత నమితం బొనరించి శిరంబు నిచ్చె గో
త్రామరజాతికిం దనకు నం చొకయింతయు నుంచ కుండ నా
భూమున కేమి కావలె? స్వభూతసమస్తన కా హితార్థికిన్. ౧౩౯

మ. అగు లే రాజులమాట జన్మములఁ దా రర్పించియున్ ధాత్రి నె
చ్చగు నర్థంబు లొసంగి కైకొనుట విద్యాశాలి విప్రుండు త
ద్భృగువంశ్యుం డటు సేయునా?యనుచుఁ గీర్తిస్ఫూర్తిఁ గీర్తించుచున్
భగవంతుం డగు కశ్యపర్షి యిడె సంభావించి విప్రాళికిన్. ౧౪౦

ఉ. ఆనయ మట్టు లారసి మహాత్ముఁడు రాముఁడు తుష్టచిత్తుఁడై
జ్ఞానవిశేషశాలి వయి సంయమినాయక! మేలు నేసి తౌ
నే నిడు భూమిదక్షిణ మహీసురసాత్కృత మయ్యె నీకృతిన్
మానిత మయ్యె నంచు గుణమండితునిం గొనియాడెఁ గశ్యపున్.

సీ. సంపూర్ణ మయ్యె సాకూత్స్వయంవిష్ణుఁ డౌ
దత్తదేవుని దయాదరమువలన
సాగించితివి మునీశ్వర! నిజహస్తంబు
తో నెరవేరె నిస్తుల మనంగ
నుపదిష్ట మొనరించె నుపదిష్ట మాయమ్మ
రేణుక పెరుగు సంప్రీతిఁ జూచి

తగిన ఋత్విజులు వీ రగునని కైకొనఁ
దనపున్నె మెసఁగ నిర్ద్వంద్వ మగుచు
నిందఱ ప్రసాదము సమాప్తి నొందఁజేసె
సులభముగ సిరిదేవి యిచ్చు లలిత మ్మ
టంచుఁ గొనియాడి రాముఁ డర్చించెఁ దగిన
యర్హాణాల నెల్లవారిఁ గృతార్థుఁ డయ్యె. ౧౪౨

శా. అంతేవాసి వచించె నిట్టులను న య్యాచార్యుతో దేవ ! భూ
కాంతుం డొక్కఁడు రేణునాముఁడు గనెం గన్నెం దదాఖ్యాపితం
బింతిం జెండెను రేణుకాపద మటం చే వింటి దత్తప్రభుం
డెంతే భక్తి నమస్కరించె నని మీ రి ప్డంటి రె ట్లీకథల్ ? ౧౪౩

శా. దత్తాత్రేయనుతప్రభావ యవు తద్రామాంబ మాహాత్మ్యసం
పత్తి న్నందియమెల్లఁ బాయ వినెదన్ బ్రారంభమం దెట్లు స్వా
యత్తుం డా హరి రాముఁ డయ్యె నల సహ్యాద్ర్యాశ్రమం బామల
క్యాత్త్రాఖ్యం బయి యొప్పెఁజెప్పు మొగిఁ దద్వ్యాఖ్యాన మంచాడినన్.

క. మరల ననె గురువరుఁడు మును
పరుదుగ శ్రీశైలశిఖరమందున్ స్కందుం
డరుసము మెయి మును లడుగుడుఁ
బొగి వివరించిన విధానమును విను మనెన్. ౧౪౪

గీ. లోకకర్త పితామహుఁ డేకనిష్ఠ
దేవదానవమానవాదికము భువన
మాదికాలమునం దుపాయానుగతుల
నాశ్రమకులాదిధర్మసంస్థల సృజించె. ౧౪౫

## ఆమలకాశ్రమ వృత్తాంతము

చ. నలువకృతిన్ బ్రభూతభువనంబుల జీవులు వేదదృష్టి ని
శ్చలమతులుం దపస్వులు నసంగు లరాగు లదోషు లాత్తవి

ద్యులు కృతశాస్త్రచింతను లదోషులు నై మెలఁగంగ సృష్టివ
ల్లులు కొనసాగకున్న వికలుం డయి ధాత తలంచె యుక్తముల్.

గీ. తలఁచి తలంచి సృజించెను దమము మోహ
మతివిమోహము తామిస్ర మంధతమస
మన నవిద్యను బంచపర్వాఢ్య నపుడు
సర్వసంమోహమున కిది చాలు ననుచు. ౧౪౮

ఉ. వేదకవీంద్రుఁ డా విభుఁ డవిద్యన సేసి స్వయంవిముగ్ధుఁ డై
వేదము లన్నియు న్మఱచి విస్మృతిఁ బాపు నుపాయ మేదియున్
లే దని సహ్యభూధరవనీవివరాంతరమందుఁ జేరి లో
కాది ననాది దేవి జగదంబిక రేణుక సంస్తవించినన్. ౧౪౯

గీ. క్షణములో దర్శనం బిచ్చె జగముతల్లి
యాదరంబునఁ గొనియాడి యధికవినయ
మొనరఁ బ్రపితామహుండు మెల్లన నిజదశ
విన్నప మొనర్చె స్వభువు నిర్విణ్ణుఁ డవుచు. ౧౫౦

శా. దేవీ! వేదము విస్మృతం బయిన దేదీ? లేదు గాయత్రియున్
నా పీఠాపథమందు విస్మయమతిం దై త్రిలోక్యవంద్యాంఘ్రిప
ద్మా! వేదాత్మక! తల్లి! ని న్శరణు జెంద న్వచ్చితిం బ్రోవవే
నా వేదంబుల వేదమాతఁ గనుల న్గాన్పించి యంచద్దయా! ౧౫౧

చ. అని కొనియాడు బ్రహ్మకు సదాత్మిక రేణుక పాపరూపనా
శని కన నైన చతుర్వదన సత్వర మేగుము దత్తదేవుతో
మనవి యొనర్పు మాతఁడు సమస్త మెఱుంగు నటంచుఁ జెప్పి పి
ల్చె నతని సర్వవిజ్ఞుఁడ! వచింపుము ధాతనివేదితం బనెన్. ౧౫౨

గీ. అది రేణుకచరణంబులందు మ్రొక్కి
దత్తమునినాథుఁ డనియె వేధకు మధురిమ
పల్కులం దొల్క నడుగనౌ ప్రశ్న మడుగు
మఖిలవిజ్ఞాత! యనెద నా యరసిన దని. ౧౫౩

గీ. విస్మృతము లయ్యె సాంగము ల్వేదము లుప
నిషదుపేతము లిప్డు మానిప్రధాన!
వర్ణమాత్రస్వరాత్మకవై భవముల
వానినెట్లు నెఱింగింపవలె ననె విధి. ౧౫౪

గీ. మరలఁ బలికె దత్తాత్రేయమానిముఖ్యుఁ
డఖిలవర్ణంబులందు ననంత మేక
మే కదా నాద మందు ననేకవర్ణ
జాల ముద్భవ మందు నిశ్చయము కంటె? ౧౫౫

శా. నానావర్ణనిదాననాదమయి నిర్ణాశాసవర్ణాభిధా
నానేకాప్తి నెసంగు రేణుకయె లే దన్యంబు వేరొండు బ్ర
హ్మానన్యం బదె వేదమాత యన లోకాధాత్రి సావిత్రి నా
జ్ఞానజ్ఞేయ యనంగ హ్లాదిని యనంగా నొప్పు నేకాత్మతన్. ౧౫౬

సీ. ఏకమాత్ర యనంగ నేకవీర యనంగ
నష్టపర్యాయవాచ్య యనఁ జెల్లు
నోంకారరూప నాదాంకురకలిత యై
బ్రహ్మాత్మ యేకమాత్ర యనఁబడెడు
నేకయే యయ్యు ననేకాకృతుల నుండి
నేకవీరాభిఖ్య నెనసి వెలసె
నష్టసంస్థానములందు వర్ణాత్మత
నావిర్భవించి తదాఖ్య కయ్యె
విమల యుత్కర్షిణియు జ్ఞానవిహితయోగ
ఇత్య ఈశాని ప్రహ్వి నా నేడు పేళ్లు
మఱి యనుగ్రహాయుక్తి నమ్మాట వుట్టె
వేదమాత గాయత్రి సంవిత్స్వరూప. ౧౫౭

క. అని యవ్విభుఁ డనుచుండఁగ
వినుచుండ విధాత వెడలె వేదము తా ద

త్తుని శ్రీదేవి ముఖాబ్జ
మ్మునఁ జొచ్చెన్ రేణుకావపుర్దేశమ్మున్. ౧౫౮

చ. అది గని సంప్రహృష్టవదనాంబుజుఁ డై పరమేష్ఠి దత్తదే
వు దయితతోడ రేణుకను బూజలఁ దన్పి నమస్కరించి భ
క్తి దరవికాసిలోచనయుగద్వయుగుం డయి రోమహర్ష సం
పద మివులంగ నంజలులఁ బన్ని నచించె నిదంవిధంబుగన్. ౧౫౯

గీ. అంగములు నీకు ఛందమ్ము లమ్మవారు!
హల్లు లచ్చులు నోంకార మఖిల మాత్మ
యిమ్మయి ననంతరూప ని న్నెఱేఁగి యెఱుఁగ
కపవదించి విఫలపుణ్యు మగు జనమ్ము. ౧౬౦

గీ. అని వచించి దత్తాత్రేయు నతని దేవి
దేవదేవి రేణుక నింకఁ దెలచి నలువ
వేదవిదుఁ డయి హర్షసంవీతుఁ డవుచు
నిజనికేతనమున కేగె నిద్ర గెలిచి. ౧౬౧

క. ఆదేవి రేణుభూధవు
సాదరతపమునకు హృష్ట యై తదుదరసం
పాదితజని యై కొలిచె న
నాది న్శివదేవుని జమదగ్నిసమాఖ్యున్. ౧౬౨

గీ. వార లిరువురు లౌకిక మైన దేహ
యుగము వర్జించి నిజరూప మొంది నిలిచి
రిట్టికథ వర్ణితం బయ్యె నిఁక వచింతు
నామలకిఁ గూర్చి ప్రశ్నించినట్టివిధము. ౧౬౩

ఉ. వేదము విస్మరించి యటు వేఁడెడు పద్మజు నేకవీర ద
త్తాదిమహామహు ల్వనిచి రప్పుడు క్షీరపయోధిసీమకున్
సాదరుఁ డౌచు నేగి చతురాననుఁ డచ్చోట సర్వజంతుహృ
ద్వేదిశయాను విష్ణుఁ బ్రభవిష్ణునిఁ గన్గొనలేక లేకి యై. ౧౬౪

శా. విద్యుత్పుంజనిరంజనాకృతి మహావృక్షంబుఁ గైకొంచు నా
విద్యాభర్త్రి తదాశ్రమాంతమునకు న్వచ్చెసెఁ గృష్ణాస్థితం
బౌ ద్యోభూజముకల్మి నామలికికాఖ్యం గ్రామ మట్లయ్యెఁ ద
త్తద్యోగం బెద రామమాత కని పుత్త్రా! వింటె? యం చిట్లనున్.

గీ. రామదేవుఁడ! విష్ణ్వాదరమ్ము నొచ్చి
శివునిఁ గొనియాడు నీ తండ్రిఁ జిత్తగించి
యామలకమందు విష్ణుండు నందు శివుఁడు
నందు నీ వొంద దేవత్రయాత్మక మవు. ౧౬౬

క. నాయందలి సంప్రీతికి
నీ యామలకమ్ము నాటి యీ యాశ్రమమం
దాయతికి విశ్రమము నా
త్రేయునితో నంది విస్తరింపుము కీర్తిన్. ౧౬౭

ఉ. రామ! భృగూద్వహా! వినవె ప్రాణులు సద్గతి నందువారు కృ
ష్ణామలకిన్ స్పృశించి కని యంజలిసేసి ప్రదక్షిణించి నీ
వీ మెయి స్వస్వరూపమున నేర్పడకుండ జగంబు మన్ని మ
ట్లోముము వృక్షరూపు హరి నుజ్జ్వల! యన్న నతం డితుండు గాన్.

మ. నరులు న్నారులుఁ దత్త్రిదేవమయము న్మాన్యంబు ధాత్రీజమున్
గిరికేతుస్పృహణీయదర్శనముఁ గన్గొ్రవం గటాక్షించిరా?
హరిలోకంబున శాశ్వతంబుగ సుఖం బానాఁటి కీనాఁటి కం
దిర యందంగల రందుచుండి రిది తద్వృక్షప్రభావం బనా! ౧౬౯

గీ. ఇట్లు లన్నగమున రాముఁ డెలమిఁ జొచ్చె
రేణుకకు మ్రొక్కి యద్దానిక్రింద నిలిచె
దత్తదేవుఁ డిందఱకు విధాత వినతు
లాచరించి స్వలోకంబు నందఁగాంచె. ౧౭౦

గీ. ద్విజసమావృతుఁ డయి ధ్యానదృష్టి నున్న
మునిఁ బ్రణీతాతటస్థు సంపూజితునిగఁ

జేసి పింగలనాగసంజ్ఞితమహార్షి
యడిగె భక్తిఁ గృతాంజలి యై వినీతి. ౧౭౦

శా. ఈ మంత్రక్రమముల్ క్షమింపఁదగు స్వామీ! నిన్నుఁ బ్రశ్నింతు నే
నీమార్గం బుపదేశము న్సలుప నై కేదేశికు ల్మున్న ని
ష్కామా! నీవు దిగంబరుడవు త్వదంకంబందు నీ యట్టి దీ
క్ష్యామారత్న మనారతాసవపిపాసావ్యగ్ర మగ్ర్యాగ్రణీ! ౧౭౧

ఉ. వేదపురాణశాస్త్రపదవి న్వినినారము చాతురాశ్రమం
బేది మఱొక్కత్రోవ? సకలేశుఁడ వంచు సుర ల్మునుల్ నుతిం
త్రాదికి నాదివో? యకట యాశ్రమ మేటికి? నాశ్రమంబు వో
నేదియొ పల్కు మన్న ననియె న్మునితో మునిమాననీయుఁడున్.

ఉ. సత్యమురన్న! నీ వనిన చక్కన నాలుగె యాశ్రమమ్ము లిం
దత్యయ మేది? యంత్య మిది యాశ్రమ మెన్నఁగఁ బంచమమ్ము ని
ర్వ్యత్యయ మాత్మరూపము చరాచర మం చవికల్పకల్పనన్
సత్య మెఱుంగు నెవ్వఁ డపసంశయి యాతని యాశ్రమం బిదే. ౧౭౪

గీ. క్రోధకామాదు లైన శత్రువులఁ ద్రుంచి
సర్వభూతాత్మభూతాత్మసంస్థ నుండు
నట్టి వైరాగ్యవంతుని యాశ్రమంబు
పంచమం బిది యని మది నెంచుమయ్య. ౧౭౫

ఉ. ఆవిధ మీవు సెప్పు చతురాశ్రమి నున్నదొ ? లేదొ ? సన్మునీ !
భావ మభావనద్ధము స్వభావమునం గనలేవు కన్ననాఁ
డీవిధ మాశ్రమం బెనయ నీవును నయ్యెదు బ్రహ్మవాదు లీ
త్రోవ నెఱింగి త్రోవ రనఁ దో ననెఁ బింగలనాగుఁ డాదృతిన్.

గీ. సత్య మాతండె యతఁడె విశ్వవిభుఁ డతఁడె
పూరుషోత్తముఁ డనసూయబొజ్జయందు
నత్రితోఁ దోఁచిన మహాత్ముఁ డా సురేశుఁ
డభినుతించెద నద్దేవు నాత్మభూతు. ౧౭౭

క. నీ నిష్ఠ నెఱుంగనివా
రే నిందించెదరు నిన్నుహీనా! స్వామీ!
నా నేరమిఁ గొనక కౌ నను
మే నీ యుదరంబుఁ జొత్తు నిత్తఱి విత్తా! ౧౭౮

క. శ్రీరామా! గోవిందా!
నారాయణ! వాసుదేవ! నరహరి! కృష్ణా!
శౌరీ! వైకుంఠా! సం
సారభుజగదష్టు నితని సాకుము కరుణన్. ౧౭౯

క. అని నిలిచె నతఁ డెదుర వి
చ్చెను మోమతండు సొచ్చె శీఘ్ర మతండున్
ముని నుదరమ్మునఁ దాలిచి
ఘనుఁ డొప్పె న్స్వశివరూపకలితాత్ముం డై. ౧౮౦

చ. జను లటఁ బద్మతీర్థమున స్నానము దానము నాచరించి స
న్ముని నుదరంబులోఁ గొని సమున్నతి నున్న మహామునీను ద
త్తుని గని యల్ల యామలకితో నొకసారి ప్రదక్షిణించినన్
మునుఁగరు సంసృతిం బరమముం బదముం దుదిఁ జెందువార లై.

శా. పీయూషామలకంబు పేరఁ బొడమెన్ వృక్షంబు క్షీరాంబుధి
స్థాయన్మంథనవేళఁ బుష్పఫలభాస్వన్మూర్తి విష్ణ్వర్పితం
బై యాదిత్యులచేత నొప్పె నది కన్యన్ లక్ష్మిఁ దా నిచ్చుచుం
దోయావాస మొసంగుఁ గౌస్తుభమణిస్తోమాఢ్యభూషావళుల్ ౧౮౨

క. క్షీరాబ్ధి మందిరంబున
నా రామ ప్రియంబుఁ గోరి యారామమునన్
శ్రీరాముఁడు నాటె సుధా
సారామలకంబు సురలు సంతసమందన్. ౧౮౩

గీ. అనసూయేయుఁ డైననాఁ డాహరించె
దాని యర్ధాంశమును హరి ధాతచేత

సన్యబృందారకులు నిల్వ నవు నెలవుల
దాని యంశమ్ములం గల్గెఁ దరుచయములు. ౧౮౭

క. శ్రీకృష్ణామలకం బన వైకుంఠమునందు నొప్పెఁ బౌత్రాలమునన్
బ్రాకె నమృతామలక మన జ్యా కొంగి సిద్ధామలకసమాఖ్యం జెందెన్.

శా. ఆసిద్ధామలకంబు దత్తముని దివ్యం బాశ్రమంబందు స్వ
వ్యాసంగంబున నైకరూపముల మొల్వం దానఁ దద్గ్రామసం
జ్ఞాసిద్ధిం గొనె దానిఁ జూచి యవల న్మాతాపురిం జూచి మే
లౌ సిద్ధు ల్వడయంగ నయ్యెదరు మర్త్య ల్మర్త్య లోకమ్మునన్

ఉ. ఆదియుగంబునం దొక ధరామరుఁ డుండెను చాంద్రఘికాభిధుం
డాదృతసత్క్రియుం డతని యంగన భామ యనంగ దానితో
నా దివి నాదివాకరసుధాకరతారము నిల్వ నెంచి తీ
ర్థాదినిషేవణప్రవణుఁ డై తిరుగాడె మహామహీస్థలిన్. ౧౮౮

చ. అల భ్రమమాణుఁ జాంద్రఘికు మహాద్విజు నొక్కపు డాదరించి త
త్కులమునఁ బూర్వు లాకసపుఁ ద్రోవ నిలంబడి పల్కి రూరకే
యిలఁ గల తీర్థజాలముల నేల భ్రమించెదవన్న ! పో నిరా
కులమతి మాతృతీర్థమునకుం గొనియాడు పితృణ మీఁగ నై.

ఉ. ప్రీతిగ మాతృతీర్థమున రేణుక చూచుచునుండఁ బిండసం
పాతన మాచరించుఁ బితృభక్తుఁ డెవం డతఁ డందరాని పు
ణ్యాతిశయాప్యలోకగతు లందును గల్గవు సందియంబు లిం
దాతతకీర్తి ! యం చను తదాలపనంబుల నిచ్చ మెచ్చుచున్. ౧౮౯

గీ. చాంద్రఘికుఁడు మాతృతీర్థంబుచాయఁ బోయె
నట్లు మునిఁగెను మేరుతటాకమందు
దత్తమునియాశ్రమమునఁ దత్తరువుక్రింద
బితరులకు శ్రద్ధ నొసఁగెను బిండములను. ౧౯౦

ఉ. ఆకృష్ణామలకద్రుమాధరతలంబం దా విధిం గూర్చు శ్రా
ద్ధాకల్పంబున మున్నుగాఁ బితరు లింద్రాతిథ్యముం జెంద భా

మాకాంతుం డల చాంద్రికద్విజుఁడు సంపాదించెఁ బౌరందర
ప్రాకామ్యప్రణయప్రసంగసుఖసంపత్సంతతాభీష్టముల్. ౧౯౧

గీ. దీపకుండ! ప్రసంగసంప్రాపితంబు
పద్మతీర్థంబుమహిమంబు పలుకుచుంటి
విమలమతి! నీవు వీనులవిందు సేయు
మాయురారోగ్యసౌఖ్యమ్ము లందఁజేయు. ౧౯౨

క. ఉషయందు భానుమతిఁ గని
విషమేషున కగ్గ మై వివేకము చెడ నై
సుషమాకరుండె పాతక
విషధిం బడెఁ దగ్గదానువిద్ధుం డగుచున్. ౧౯౩

గీ. తనయ విశ్వమోహినిఁ గని తపనుఁ డెనసెఁ
దాప మంతర్బహిస్సంభృతం బనంత
మంత కెక్కుడు సంతాపం మంది కుండె
కూతు రా కన్నవాని యాకూత మరసి. ౧౯౪

చ. మదనుఁడు మా తెలుంగని సుమాళముపాఁ డెది దోఁపనీదు సం
మదము వివేకమా విలుగు మాహిమదుర్గము నాదు పాప మె
న్నఁ దరము కాదు కా దిది యన న్వినఁజాలునె? వాఁడు తండ్రి నే
ను దనయ నక్కటక్కట "మనోభవ! తేస్తు నమాంసి" యం చెదన్. ౧౯౫

గీ. మ్రగ్గిమగ్గి య మ్మానిని మ్రానిగమునె
తనకు శరణంబు కావలె నని తలంచె
మృగి యగుచు మృగ్య యయ్యె నమ్మృగవిలోక
వివశ మై ఘోరఘోరాటవిం జొరఁబడి. ౧౯౬

ఉ. పాప మటంచు మారుపడు పట్టిన పట్టుఁ దలచి భాస్కరుం
డాపని కట్టు నిట్టు లురియాడుచుఁ దాఁ దిరుగాడె మోహసం
తాపము వేప ముజ్జగము తాళఁగనీని విరాళి కగ్గ మై
మోపి కనుంగొనెం దరిసె నూ యనెఁ గై కొనఁ జూచె నింతలోన్,

శా. ఓహో చాలునుఁ జాలు నీ తెలివి కీ యుద్యోగమా? యర్థ్యమా!
యీహం గెల్వని నీకు నిల్వఁ గలవే యీ యున్న యుద్యోగముల్?.
దౌహిత్రుం గని పున్నె మిచ్చు తనయుం దర్పంబునం బట్టెదే?
హీ హీ హీ యను చడ్డ మై నిలిచి రింద్రేశాదిదిక్పాలకుల్. ౧౯౮

ఆ. అనువుదప్పి యప్పు డప్పని చాలించి
జాలిఁ జెంది యంశుమాలి నిలిచె
నిచ్చఁ గొన్న యఘమె యే నని తలయెత్తి
కుష్ఠ మగుచు నొడలిఁ గుతిలపఱిచె. ౧౯౯

క. వికలేంద్రియుఁ డై పడెడు జ
నకుఁ గని మృగి రూపు విడిచి నారీమణి బ్ర
హ్మకు వేల్పుల కెరఁగి మహా
త్మకులార యఘంబు వెలిచి మన్నింపుఁ డనెన్. ౨౦౦

ఉ. ఎవ్వని ధ్యానయోగమున నెంచి భజించు జనంబు సద్గతిన్
నొవ్వలు నెవ్వగ ల్కడజను న్ధర వేనికి మ్రొక్కినంత నా
దివ్వెకు నెక్కునే యిరుల దీప్తి? నుతుం డితఁ డిట్టులయ్యెఁ గా
గవ్వకు నాకు నై యుపమ కారుణికాత్మకులార! చెప్పరే? ౨౦౧

ఉ. ఎవ్వనిగర్భగోళము హరీశవిరించిముఖామరాళికిం
బువ్వులతోట వేదముల పుట్ట యెవం డఖిలైక వంద్యుఁ డా
కవ్వపుఁగొండదాల్పు కుడిక న్నిటు గా గతిగల్గు నే గతిన్?
జవ్వనిఁ గిన్న మోహము మనం బెడయంగ నుపాయ ముండదే?

మ. సురలారా! మునులార! మా జనకుఁ డీ సూర్ఖ్యంపు పాపం బఱన్
సురసిద్ధర్షిసమర్చితుం డవయవస్ఫూర్తిస్ఫురన్మూర్తి యై
చిరకాలంబు యథాపురంబుగ దమశ్ఛేదంబుఁ గావించి యు
ర్వర లి మ్మాడు నెసంగఁజేయు నెటు? లా భవార్థముం జెప్పుఁడా!

క. అను భానుమతికి జేజే
లనుమతు లై పలికి రనఘ! యాకర్ణింపం

జను పరిగత మైనది నీ
జనకుని వృజినంబు మాకసహ్యం బదియున్. ౨౦౪

గీ. ఐదు పాపములందు బ్రాహ్మణనిహనన
మంతకన్నను గురుదార నంటుటయును
జెప్పరానివి కూతును జెట్టపట్టు
నతఁడు వారలకన్న నిందితుఁడు సుదతి! ౨౦౫

క. నీ యభిలాషముతోనే
హేయుం డై నాఁడు తపనుఁ డెఱుఁగఁడె యుడు లి?
ట్లాయతికిఁ బద్మతీర్థము
తోయము గా కొండు గలదె ? తోఁగవలె నటన్. ౨౦౬

క. ఆమలకగ్రామమ్మున శ్రీమద్దత్తాశ్రమంబుఁ జేరువఁ బద్మా
ఖ్యామలతీర్థస్నాతుం డై ముని యై యేకవీర నారాధింపన్. ౨౦౭

ఉ. ఆజగదేకధాత్రి యఘ మంతయుఁ బుచ్చఁ బదం బొసంగు ని
ర్వ్యాజదయాంతరంగమున భక్తుల ప్రోపు తదర్థమే సుమీ
వేఁ జనుఁ డందు హత్తుకొను వేదుఱు వాయు నటంచు దేవతా
యోజిత మాలకించి రవి యుత్తమ మత్తలముం గనం గనెన్.

గీ. పద్మతీర్థంబునం దోఁగెఁ బరిచరించె
దత్తమూర్తి నామలకంబు దరిసి నిష్ఠ
దోసి లొగ్గి నుతించె నిర్దుష్టవివిధ
మంత్రతంత్రప్రసక్తి నిర్మాత్ర జనని. ౨౦౯

మ. అనయం బే నొనరించినాఁడ జగదంబా ! రేణుకా ! యేకవీ
ర ! నయం బేగతిఁ గల్గు ? దిక్కజి కదా ప్రార్థించెద న్నిన్ను నీ
వు నుపేక్షించిన "హాహతోస్మి" యను దేవు న్భాస్కరు న్మెచ్చి తాఁ
గననయ్యె న్వరమిచ్చె బాము దొలఁచెం గారుణ్య మేపారఁగాన్.

శా. తేజోరాశి ! ప్రసన్న నైతి ద్విగుణస్థేమప్రభం బయ్యెడున్
నైజం బీ వపు వీవు స్వీయ మవు స్థానం బందఁగాఁబొ మ్మిఁకన్

రాజతీర్థమహత్త్వ మింత కగు న ప్రార్థింప నో దానికిన్
భ్రాజిష్ణుండ! విముక్తిఁ జెందెదు పునర్జన్మం బపాస్తంబుగన్.

గీ. అని నొడివి ధ్యానగోచర యయ్యె దేవి
భాస్కరుండు నిజస్థానపరిగతుఁ డయి
వరదుఁడై లోకజాలప్రవర్తనమున
కర్హుఁడై మించె వేల్పు లౌ నౌ ననంగ. ౨౧౨

గీ. పద్మతీర్థప్రభావ మీపాటిది చుమి
దానఁ దానం బొనర్చి పిత్ర్యంబు దైవ
మైన తర్పణములు గూర్చు నట్టి నరుఁడు
మూఁడు ఋణములు దగఁ దీర్చి మోక్ష మొనయు. ౨౧౩

గీ. ఇది పరాశరమైత్రేయగదిత మనుచు
ననువదించిన గురునకు ననుగు మ్రొక్కి
నని వచించెడు సూతు మహాత్ముఁ గొలిచి
యవలిసంవాద మడిగె మహర్షిచయము. ౨౧౪

చ. దమశమశాలిమత్పితృపితామహముఖ్యనిరంతరార్చిత
ప్రమితనతస్తుతస్వవిభవా! భవ! సంభవతన్నిరాసనా
ఖ్యమహామదానవిత్తచరణా! రణసంరణనప్రకారతా
విముఖితవిద్రవద్ద్విమతవీరవరా! వర! సంవరాంచితా! ౨౧౫

క. అస్మత్పురాగ్రనిలయా!
విస్మేరకృపాకటాక్షవీక్షితపౌరా!
విస్మయకృన్మహిమా! సిత
భస్మాంచితవిశదదేహ! భామావామా! ౨౧౬

మాలిని. స్వమతమతసమంచత్పండితారాధ్యరత్నా
సమసమయసముద్యత్సార్థలింగోద్భవాఖ్యా!
నమదమరసమర్చానందసంపాదితర్థీ!
శమితమదుపసర్గా! శాశ్వతోత్సర్గ! భర్గా! ౨౧౭

సీ. ఆంధ్రేల రామకథాఽమృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెఁ దనయు వి త్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ ముఖములఁ
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదిగొ
యెనిమిదవు పూలగుత్తి వహింపుము తల. ౨౧౮

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## నవమ గుచ్ఛము

క. శ్రీ విజయైశ్వర్యాయు
ర్భావప్రతిపాదనర్థి వర్ధితసుజనా!
భావాభావకరా! సం
భావితచంద్రపురవాస! భవ్యవిలాసా! ౧

క. లింగోద్భవ! హిమగిరిజా
లింగితవామాంగ! విశ్వలీలాలోలా!
మంగళకరగురుబోధం
బుం గొని మఱి యడిగె శిష్యపుంగవుఁ డతనిన్. ౨

ఆ. అదియు సూతముఖసముదితము యీ భంగి
సురలు ద్రావ లే దసురుల కనుచుఁ
గథలఁ జెప్పు సుధకుఁ గలదె యిమ్మహిమంబు
దత్తదేవుకథకె తగునుగాని. ౩

మ. అతితుచ్ఛం బమృతంబు నాకు నది యేలా? దత్తగాథామృతం
బతిమాత్రంబు గుణప్రవాహసుకృతం బానందసందోహకం
బు తదేతచ్ఛ్రుతియుగ్మపేయము భవంబుం ద్రెంచు జీర్ణింప నౌ
గతికిం గాదు గదంబుఁ బెంపదు బలే కాంక్షింతు నద్దానికిన్. ౪

చ. గురుకరుణానిధాన! కృపకుం గుఱిసేసి గురుప్రధాన! చె
ప్పు రుచిర మేకవీరవిధము న్మును విన్నది చాల దే మనన్
సురభి జగత్ప్రసూతిఖని శోధని ధారిణి యాదిదేవి త
చ్చరిత మెఱుంగు నొం డెవఁడు? చాలు వచింపఁగ నీవు దక్కఁగన్.

చ. గురువరు నాభిముఖ్యమునకుం దగు దత్త్వముఁ బిండఁ గాఁ డెవం
డరుగు నెఱుంగ రే పెవని యంఘ్రులు గైకొని యట్టి పాలసుం
దురుకరుణ న్వచింపు మెదియో? నిజశిష్యుఁ గృతార్థుఁ జేయ నం
చెర వఱ సాదరుం డగుడు ని ట్లనఁజొచ్చెను వేదధర్ముఁడున్. ౬

ఉ. దీపక ! తీర్థశిష్యకులదీపక ! జంతుశివంకరంబు త
త్త్వాపణమార్గణీయము శుభంబు వచించెద సావధానతం
బాపము వో వినంగనుము భార్గవరాముని దోసిలొగ్గి దు
ష్ప్రాపుఁడు దత్తదేవుఁ డొకసారి యెఱుంగనియట్టు లిట్లనున్. ౭

దత్తదేవుఁడు రామునకు రేణుకామహిమంబు సెప్పుట

చ. అడిగెద నిన్ను నొక్కఁ డభయం బది రామ! మదాత్మ కింపుగా
నొడువఁగ నీవె యర్హుఁడవు నూనము మూఁడు జగంబు లేలు దే
వుఁడ వఖిలజ్ఞతాచణుఁడవు ద్దొరవుం గద నీవ నీకు శం
భుఁడు గురుఁడై వచింప నొఱువు ల్తఱువు ల్గలవే? తలంపఁగన్. ౮

ఉ. చెందితి తల్లి గర్భదరిఁ జేసితి వెంతయొ చేత రేణుకా
నందన! చిత్తగించితె? యనంతము తన్మహితస్వరూప మ
స్పందము తేజ మోజము విశాలమతీ! వివరింపు మే వినన్
వందన మందుఁ జెందిన భవద్భవవత్తకు నన్న రాముఁడున్. ౯

ఆ. తొల్లి తల్లి రూపు స్థూలసూక్ష్మాత్మకం
బె నెఱుంగఁ జెప్పు మీవె దేవ!
ఏకవీరమహిమ మే సని వివరింప
నెవ్వఁ డోపుఁ బుడమి నీవు గాక. ౧౦

చ. అనవుడు దత్తదేవుఁడు మహాద్భుత మయ్యది రేణుకాత్మజా!
ఘనుఁడవు నీ వెఱుంగ ననఁగా నెద నమ్మెద నెట్టు లేను న
త్యనఘము స్థూలసూక్ష్మమయ మాకృతిమత్త్వనిరాకృతిత్వసం
పనితము దివ్యతత్త్వము భవజ్జననీవిభవం బనం దగున్. ౧౧

చ. తదుదరమందె యున్న దమితక్రమ మీ భువనత్రయంబు త్వ
ద్విదితము భంగి నే ననెద విజ్ఞవరా! విను మానో? కాదో? నా
యుదితము నిశ్చయింపు మని యోగివరేణ్యపథప్రదర్శకుం
డెదో? యొకత్రోవ నత్తె నతఁ డే మును లేఁ బరు లే బలే యనన్.

క. వనములు సరిత్సముద్రము
లనంత శైలములు ప్రాణులాయీ సకలం
బనిమిషననిమిషనాయక!
మన జననీస్థూలరూపమహిమము సుమ్మీ. ౧౩

క. మును లనిమిషు లెల్లరుఁ దీ
ర్థనికాయము నాకలోకతత్తద్భోగా
వనులు రమణీయధనములు
మన జననీస్థూలరూపమహిమము సుమ్మీ. ౧౪

క. అనుగతములు పాతాలభు
వనంబు లే డందుఁ గూర్మవాసుకిశేషా
ద్యనుశాసకు లనుశిష్టులు
మన జననీస్థూలరూపమహిమము సుమ్మీ. ౧౫

క. విను మింద్రియగోచరములు
మనసును బంచేంద్రియములు మహత్యాదికభూ
తనికర మా మహదాదులు
మన జననీస్థూలరూపమహిమము సుమ్మీ. ౧౬

శా. రామా! రేణుక సూక్ష్మరూప మది ధార్యమ్మింత యత్రోప్త మా
స్థేమప్రస్ఫుటచిన్మయస్వమితినిస్సీమప్రమోదాత్మకం
బేమీ? యిట్టిది బ్రహ్మరూప మనెదే? యే నేమిగా నంటి? నా
భూమం బే యిది యన్య మేది? యిటు లాపూర్ణత్వ మూహించుచోన్

మ. భృగుభాగ్యోదయ! నీకు నాకు నఖిలోర్వీపాళికిం గారణం
బగు నీతల్లి యరూపశక్తి భిద లే దాశక్తిమచ్ఛక్తులం

దు గుణాతీత యసంగ నయ్యు సగుణోద్యోగప్రసక్తి న్నుపరిం
చు గుణభ్రాంతుల దృష్టి కిష్ట యగు లోఁజూపించు నవ్వానికిన్.

క. ఘ్రానలలో దారమువలె నీసకలమునందు నిండి యిది శక్తి యసం
గా సర్వోపాధు లెడల నై సత్య మనంగ వెలుఁగు నది యొకఁ డన్నా!

క. అను దత్తదేవు శాసన
మనుపథమే చెవిబడఁ బడి యాంతర మెనయన్
ఘనమతి భార్గవరాముం
డనుతరువిశ్రాంతుఁ డై యిహస్థితి మఱచెన్. ౨౦

ఉ. ఈ విషయంబె మౌనివరు లెత్తి రొకప్డు షడాస్యునొద్ద స
ర్వావనికి న్నుతీకృతుఁడ వద్భుతమేధుఁడ వీ వొ సంగవ
య్యా వివరించి రేణుకకథామృత మందును మాతృతీర్థసం
భావితవై భవం బనుచు భావి తథా యని వారి కిట్లనెన్. ౨౧

ఉ. మాత యనంగ రేణుక సమస్తజగత్తతి కామె రామును
ద్భూతికిఁ గారణం బయి విభున్ జమదగ్ని ననువ్రజించె న
మ్మాతకు నాలయం బగుట మాతృనివాసము మాతృతీర్థ మం
చాతతవిశ్రుతిం గనె మహాగిరి సహ్యమునం బ్రసక్తితోన్. ౨౨

ఉ. ఆర్యుఁడు రేణుకాయజన మా భృగువర్యుఁ డొనర్చె నందు నా
చార్యుఁడు దత్తయోగి విధి చాలెను బ్రహ్మత కెల్ల వేల్పు లా
కార్యమునందుఁ గింకరతఁ గైకొని చేసిరి బ్రహ్మఘోష మ
ధ్వర్యుని సన్నుఁ గూర్చిరి మునంబున నారదముఖ్యమౌనులున్. ౨౩

గీ. అమ్మహాయజనమ్మున నత్రిపుత్రుఁ
డమ్మవారికి నభిషేక మాచరించె
దత్తదేవుండు సర్వతీర్థప్రసక్త
తత్తదుజ్జ్వలజలములఁ దలఁచి తలఁచి. ౨౪

సీ. క్షీరవారాంనిధీ! క్షీరమ్ము లందిమ్ము
మనమాత కభిషేకమహము నేడు

ఘృతమహోదధి! తెమ్ము ఘృత మాత్మధృత మిందు
మనమాత కభిషేకమహము నేఁడు
దధిమండవార్ధి! నీ దధిఖండ మర్పింపు
మనమాత కభిషేకమహము నేఁడు
మధుసిత లొసఁగు మామలకద్రువర్యమా!
మనమాత కభిషేకమహము నేఁడు

శుద్ధజలములఁ దెండు విశుద్ధజలధు
లార! తత్త్రత్ప్రమదలార! యని యడుగుచు
నడిగినప్పుడె యవ్వార లందఁజేయఁ
దల్లి కభిషేక మొనరించె దత్తవిభుఁడు. ౧౫

గీ. ఏకవీరాభిషేకంబు నివ్విధమున
నాచరించి సురల్ మాను లర్థిఁ గొలువ
ధ్యానయోగంబు నొంది యాధ్యాతతత్త్వఁ
డందె నప్పు డంతర్ధాన మందఱుఁ గన. ౧౬

క. అతివిస్మయపథమునఁ బడి
సుతపులు సుర లన్యు లన్యచోదితస్మృతులం
గతిఁ గొనక యథావతిగా
యతినియతి నుతింపఁజొచ్చి రా యావిధులన్. ౧౭

దత్తదేవుఁడు సురలకు మునులకు సంధ్య రూపు చెప్పుట

ఆ. ధ్యానయుక్తుఁ డైన దత్తవిభుం డిపు
డెచటి కేగనొక్కొ యెఱుఁగబడదు
అమ్మవారి చింత నంతర్హితుం డయ్యె
న మ్మహా మ్మొనసెనో? యనిరి సురలు. ౧౮

ఉ. ఆసనమందు సెజ్జ నభియానకథాదులయందు నెందు న
ధ్యాసము రేణుకామయము ధ్యానము భక్తి సమర్చనంబు స

న్యాస సపర్య సంస్మరణ మన్య మెఱుంగఁ డొకప్పుడేని దు
ర్వాసుని యన్న యి మ్ముని పర మ్మగు న ప్పద మందె చెందెనో?

చ. మునులును రేణుకాహృదయభూతు సురేశ్వరు దత్తదేవు ధ్యా
ననియతితో నలక్ష్యుఁ డగు నట్టి మహామహు నింద జిష్ణుఁ గా
నని పని యమ్మ సన్మహమునం దన భర్తునిఁ గప్పిపుచ్చెనో?
చనెనొ యతండు వేడుక రసాతలసీమకు నంచు నెంచఁగన్. 30

గీ. దృశ్యమానుఁడు గాక యిం దే విభుండు
కౌతుకిత గూఢుఁ డై యుండఁ గాంక్ష సేసె
నొక్కొ? మునిసత్తముఁ డచలయోగయోగి
చెయ్వు లబ్రంబులే యని సిద్ధు లనిరి. 3౧

ఉ. ఈ క్షణమందె యోగి తన యీక్షణదీప్తుల కెంపు నింపువా
మాక్షిని నగ్న నగ్నుఁ డయి యంకమునం గొని శీధుపాత్రముం
దక్షిణహస్తమం దెనసి త్రావుచుఁ ద్రావఁగఁ జేయుచున్ వెసన్
వీక్షితుఁ డౌను బొ మ్మనిరి విద్దెలఁ దాల్చినవారు పెల్చనన్. 3౨

ఉ. ఎక్కడ కేగినాఁడు? ముని యిందఱు ముందరఁ గౌతుకంబునన్
దక్కిన మాయ వాగుర ఘనంబుగ మేన గదించి నెమ్మదిన్
జిక్కని యుక్తి నక్కడనె చెంది వసించుచునున్నవాఁడు పెం
పెక్కిన వాని వర్తనము నెవ్వ రెఱుంగ రటంచుఁ జారణుల్. 33

గీ. పలుకఁ బలికిరి తల కొక పలుకు గాఁగ
యక్షులును బక్షు లన్యులు నాలకింప
నింతలో నిది యెల్లఁ దా నెలమి వినుచు
నచ్చటనె తోఁచె నతఁడు ప్రత్యక్షయుక్తి. 3౪

గీ. సురలు గంధర్వయక్షు లక్షుద్రు లోరులు
పృథుకరంబుల వానిఁ బరిష్వజించి
రంచితంబుగ నెంచి రంఘ్ర్యానతు లయి
రభిముఖంబుగ నిలువ నై రడిగి రవల. 3౫

క. ఇందఱు గగపడకుండఁగ
నేం దరిగితి? మౌనివర్య! యిందాఁక జనా
నందకరము నీ చరితము
నం దొక క్షణ మేము మునుఁగ నైతిమి భ్రాంతిన్. ౩౬

ఆ. మననశీలు రేని మంత్రకృత్ప్రవరులే
నాదిదేవు లేని నరయ లేక
పోయినారు నిన్ను మున్నిప్పు డీ యెల్ల
రడిగి తెలిసికొనఁగఁ గడఁగినారు. ౩౭

చ. ఒక ద్విజు పత్ని గర్భమున నొంది జనించి తపించి తత్త్వముం
బ్రకటముగా నెఱింగి యతిభావముఁ జెందినవానిఁ గా నినున్
సుకరముగా భవత్తపము చోద్యము నెంచి తలంపఁబోము వే
ఱొకఁ డిటు లాచరింపఁగలఁడో? యిల నీదృశ మెందు నుండునే? ౩౮

మ. అనువారిం గని దత్తదేవుఁ డనె సంధ్యావందనం బిందుఁ జే
యను రామాధ్వరకర్మమందుఁ బడి కాలాతీత మై పోయె నా
కనుభావ్యం బిది యజ్ఞ మయ్యది మహాయజ్ఞంబు తప్పింపఁగా
నను వే? దీనికిఁ గాఁ దదీయమహితాధ్యానాధివిధ్యానతుల్. ౩౯

గీ. అనుడు యాదృశి సంధ్య? తదానతి కగు
కాల మెద్ది? తదర్హుఁ డా కర్త యెవ్వఁ?
డెందుఁ దత్తీర్థ మున్నది? యిది సమస్త
మస్తసంశయముగ నను మున్న! యనుచు. ౪౦

చ. మును లడుగంగ దత్తమునిముఖ్యుఁ డను న్మునులార! సంధ్య యో
గిని యది లేనిచో నెదియుఁ గేవల ముండదు యోగిహృత్తలం
బునఁ దనరారు నెప్పుడును ముక్తికిఁ దావల మౌచు నందు వం
దన మొనరించి వచ్చితిని తత్పరతన్ క్షణమాత్ర వింటిరే? ౪౧

శా. ఆనందామృతపూర్ణమానససరఃప్రాంతంబునన్ ధ్యానసం
తానాచ్ఛచ్ఛవిదీపదీపితము సంధ్యాదేవిరూపంబు ని

ర్వాణప్రాయసమస్తతీర్థమయ మా భావాబ్ధిలోఁ దోఁగుచున్
నేనే రేణుక నంచు నుంటి క్షణ మొంటి న్విస్మరింపంగ నై. ౪౨

గీ. ఘన మహామాయ యోగిపుంగవులచేత
సమ్యగాధ్యాయమాన యై సంధ్య యయ్యె
వృత్తిసంధులఁ దోఁచు చా పేర వడసె
రేణుక యనంగ నతిసూక్ష్మరీతి నెసఁగు. ౪౩

క. రేయుంబవళుల సంధుల
నాయమ్మ ప్రసక్తి నుండునది సంధ్య యవున్
గాయత్రి యనఁ దదర్థమ
యా యునికిన యెప్పు డుంటయు తృతీయ యగున్. ౪౪

గీ. వృత్తిసంధుల నున్నదే వృత్తు లున్న
యపుడు నున్నది పవలింటి కవల నివల
నున్నదియె కద్దు వ్యవహృతి నున్నయప్పు
డనియు బోధించు మించు మధ్యాహ్నసంధ్య. ౪౫

ఆ. అట్టు లర్ధరాత్రమందు నింకొక సంధ్య
యుండవలదొ? యందురో? యనవల
దాదుఁ దమము గ్రమ్మ నబ్బెసనము సేయు
టరిది గానఁ బెద్ద లది నొడువరు. ౪౬

ఆ. అదియె మాయ సంధ్య యదె యేకవీర య
య్యదియె రేణుక యన ననఘులార!
సంశయమ్ము లేదు సాధ్యసిద్ధర్షిగం
ధర్వపూర్వవంద్య సర్వపర్వ. ౪౭

ఉ. జన్నము సేయుచున్నతఱి సంధ్యకుఁ గాలము తప్పెనంటి వా
సన్న వచింపు మందఱికొ? సంయమివంద్యుఁడ! నీకు మాత్రమో?
యెన్నఁగ నైన కాల మెది? యీ పనికి న్వివరింపు మున్న య
ట్లన్న సురర్షులం గని మహాత్ముఁడు వల్కె నిదంవిధంబుగన్. ౪౮

గీ. శయనయానాసనముల భోజనమువేళ
నెల్లవారల కెల్లప్పు డేకవంద
నీయ సంధ్యామహాదేవి నియతి ననుచు
పలుకుచుండఁగ వా రడ్డపడి యడిగిరి. ౪౯

ఉ. దారుణకర్మబంధములఁ ద త్తదుపాధుల నొంది ప్రాణు లే
వా రయిన న్సదావ్యథల పాలయి కుందుచునుందు రేకదా
వారల కెల్ల సంధ్య యెటు వందిత యయ్యెడు? సందె కొ ల్వధీ
కారముఁబట్టి భిన్నవిధిగాఁ గలదో? వలదో? యటం చొగిన్. ౫౦

ఉ. దానికి మాని మార్వలికెఁ దథ్యము రేణుక బ్రహ్మరూప సం
ధ్యావతి యన్నఁ దత్పరత దానికిఁ గాలము సర్వ మేకమే
కాన సదా తదర్చనకుఁ గాని జనంబులకై త్రికాలసం
ధ్యానియమప్రకారము బుధప్రకరమ్ములవల్ల నేర్పడెన్. ౫౧

గీ. ముక్తులయందు సంధ్య రూపు గనుఁగొన
వారి కద్దేవి సర్వదావందిత యవుఁ
జైత్రికాషాఢకార్తికత్రయమ్ము
తత్సమాధానమున కెందుఁ దగిన దండ్రు. ౫౨

క. కాలత్రయసంధ్యానతి
శీలురు భోగంబు లెల్లఁ జెంది యిటఁ దుదిన్
గాలము గ్రసించి పరగతిఁ
గేలిగతిఁ గొందు రెందుఁ గీర్తితు లగుచున్. ౫౩

శా. నాచే వందిత యైన రేణుక యె సంధ్యాదేవి బ్రహ్మాభిధా
నూచానప్రతివర్ణ్యవైభవ యన యెపు డెందు న్మిన్నన న్వాల్చెదున్
ధీచాతుర్యముబట్టి కొల్చెదరు తద్దివ్యప్రసాదార్థు లై
ప్రాచీనప్రభులే రచించియిడి రధ్వంబు ల్తదారాధనన్. ౫౪

గీ. ఎందుఁ దిరుగుచు నేపనియేనిఁ జేయు
చెడద నెడపడకుండఁ దద్వృత్తి నులిమి

యమ్మహాదేవిఁ దప్ప నన్య మెఱుఁగక
తవిలియుండుట మొదలి సంధ్యానతివిధి. ౫౫

గీ. ఇడను బింగలను గుదించి యేకనియమ
మున సుషుమ్నకు నెక్కుచుఁ బుడమి మఱచి
హృదయమధ్యమునం దిరమ్మదమహమ్ముఁ
గనుచు నున్నది మధ్యసాంధ్యనియమమ్ము. ౫౬

గీ. కాళి లక్ష్మి సరస్వతి గాఁ దలఁచుచుఁ
బ్రాతరాదికాలంబుల వందనమ్ము
వేదమంత్రము ల్చదువుచు వేదమాత
కాచరించెద రింట నొం డ్లది యధమము. ౫౭

గీ. అధమ మనఁగఁ బనికిమాలినది యనఁ దగ
దాది సాధన మిదె యన్ని యధ్వములకు
నుత్తమము సిద్ధిఁ గైకొనియున్నవాని
కన్నెము రుచింపకుండ న ట్లుంటెఁ గాని. ౫౮

గీ. గంగ యమున సరస్వతి గా గ్రహించి
మూడు సందెల వార్తురు ముక్కుసూటి
బాహ్యమున నంతరమ్మున వలచినట్టు
లదియు నొక దారి కా దన నన్యతరమె ? ౫౯

గీ. భక్తి మునిఁగి సంధ్యాదేవిఁ బరిచరించు
వాఁడు పరికించు రేణుకావైభవంబు
నతులభోగావళుల నిందె యనుభవించుఁ
బొందుఁ బరమపదంబు నీ బొంది విడిచి. ౬౦

ఆ. సంధ్య వందనీయ సన్మార్గకాంక్షుల
కనుచు దివిజమునుల కాన తిచ్చి
శ్రీమదత్రిపుత్త్రుఁ డా మహాని యంతర్ధి
నెనసె నంతవట్టు గనుచునుండ. ౬౧

శా. దత్తాత్రేయమహాశ్రమమ్మున మునుల్ దైవంబులు న్సర్వతీ
ర్థార్తానుత్తమతీర్థసార్థములఁ గోలాకారునిం దోఁచుచున్
దత్తస్వామిని దివ్య మామలకముం దద్రేణుకాదేవి సం
వర్తి న్మెచ్చుచు మ్రొక్కుచుం జనిరి స్వస్వస్థానము ల్వేరఁగన్. ౮౬

చ. అని వివరించు సద్గురున కానతులు న్నుతులుం బొనర్చి శి
ష్యనిచయమాళిమండనుఁడు సద్గతిదీపకుఁ డాడె దీపకుం
డనితరదుర్లభం బయిన యట్టి ప్రభావము గల్గు కార్తవీ
ర్యునిఁ గనఁ దల్లి తండ్రియు మహోన్నత మే వ్రత మాచరించిరో ?

చ. ఇదివఱ కొక్కసారి వచియించితి రైనను దృప్తి లేదు త
ప్పదు తగు హేతు వుండక శుభం బనపూర్వము సంభవించునే ?
విదితసమస్తలోకపదవీపరివర్తన! యంచుఁ బల్క ఛా
త్రదయితు మెచ్చి యిచ్చఁగొని తత్పరత న్గురువర్యుఁ డిట్లనెన్.

ఆ. సామరాజ్యుఁ డొన జాతశాత్రవుఁ డడు
గంగ సాత్వతుం డనంగ బరగు
నైతిహాసికంబు ననువదించెద వత్స !
వినుము సంశయములు వెనుకవడఁగ. ౮౭

మ. చను నీ శ్వేతవరాహకల్పము వివస్వత్సూతిమన్వంతరం
బున నాద్యంబు యుగంబు చాయ విభుఁ డొప్పున్ హేహయాధీశ్వరులం
బున నాఖ్యం గృతవీర్యుఁ డాతఁడు ధరాభోగంబుఁ బాలించె నా
నన శౌర్యంబున సప్తసప్తతిసహస్రాబ్దంబు లేకాకృతిన్. ౮౮

చ. అతనికిఁ బుట్టుచుండఁగనె యంతము నొందుచువచ్చెఁ బుత్త్రసం
తతిశతకంబు తచ్ఛ్యవనదత్తము శాపము కారణంబు గా
నతఁ డతివిహ్వలుం డయి నిజాన్వయవృద్ధిసమీహితున్ బృహ
స్పతి నడిగె న్నతుం డయి యపత్య మనత్యయ మా విధానమున్.

ఉ. నీవు నరాధినాథ! గనునింపఁగరాని శ్రమంబునం జిరం
జీవిఁ గుమారునిం గనెదు చేయుము మిత్రసుతానుభాషితం

బా విధి సప్తమీస్నపన మన్న వ్రతం బఖిలాఘనాశనం
బీవహిఁ దుష్టుఁ డై సుతుఁ ద్రయీమయుఁ డిచ్చు ననెన్ గురుం డనున్.

సప్తమీస్నపన వ్రతము

చ. అది విని మాస మేకము సహస్రమరీచి నుపాస్తి సేసె స
మ్మదమున హైహయాన్వయసమస్తధురంధరుఁ డల్ల జేఁడు నై
జదయితతో ద్విజప్రకరసాహ్యముతో నుపవాసవేదపా
ఠదురితహారిసత్కృతివిడంబనలం గడు భక్తియుక్తుఁ డై. ౧౯

గీ. దర్శనం బిచ్చెఁ గృతవీర్యధరణిపతికి
భానుమంతుండు భక్తిసంపత్తి మెచ్చి
నమ్రకంధరుఁ డౌచుఁ బ్రణామము లిడి
లోకబాంధవు సేవించె నా కృతియును. ౨౦

క. జీవోదితమార్గంబున సేవింపుము క్షిప్రఫలముఁ జెందెద వనుచున్
దా వినిపించెఁ బ్రసన్నుం డై వేదమయుండు నృపతి హర్షం బెనయన్.

చ. తెలిపెదఁ దత్క్రమం బిది యుధిష్ఠిర! వి న్మవధానయుక్తి మున్
సలిపిన పుణ్యపాపములె సద్ధనపుత్త్రకలత్రసౌఖ్యసం
కలనల రోగదుర్గతిసుఖప్రతిబంధముఖప్రకారతన్
ఫల మిదు నెందు దుష్కృతి వినాశము సేయు విధం బెఱుంగుమీ.

గీ. వ్యాధిపీడావినాశకం బైన విధము
సప్తమీస్నపనం బను సత్కృతిఁ గల
దర్భకులు క్షీరపులు నచ్చు టరయలేదె ?
తద్విఘాతమ్మున కొనర్పఁ దగును దాని. ౨౩

గీ. అద్భుతోద్వేగచింతాభ్రమాపనోద
కర మిదియె చుమ్ము శాంతికకర్మ మన్న !
సలుపవలయును మృతవత్స సప్తమంబు
మాసమున తారకాగ్రహామైత్రి నెఱిఁగి. ౨౪

ఉ. కాంతునితోడ స్నాతకృతకౌతుకమంగలసంనిధాన యౌ
కాంత ద్విజప్రకాండపరికల్పితపుణ్యాదినానువాచనా
నంతర ముర్వి గోమయచయప్రతిలిప్త నొవర్చి యందు ధీ
మంతుఁడు యాజకుండుగ సమాహితుఁ జేయవలె ర్గ్రావిర్భుజున్. ౭౫

గీ. రక్తశాలేయతండులప్రాయ మైన
చరువు రవిరుద్రులకు మాతృసప్తకమున
కాల పాల విధానంబు ననుసరించి
నిర్వాపింపఁగవలయు సన్నియతి దనర. ౭౬

గీ. అర్కదైవత్య మిదియు సప్తార్చియందు
సప్తమాతల కాహుతిస ప్తకంబు
నాది నిది దీని కనుచు నామానుకీర్త
నం బెసంగ నొనంగి యనంతరంబ. ౭౭

గీ. సౌరసూక్తంబుతో సహస్కరున కట్లు
రుద్రసూక్తంబుతో నల రుద్రునకును
నర్కపాలాశసమిధల యవలఁ దిలల
నష్టశతహోమ మొనరింప నొఁ గ్రమమున. ౭౮

చ. కలశము లేడు నవ్యములు గాంగజలంబుల నింపి మంటప
మ్ము లలి నొనర్చి కోణములఁ బూర్వమునం దపరాశ మధ్యమం
దలఘువిధిజ్ఞవిప్రవరహారిహిరణ్యపవిత్రపాణితో
నిలుపఁగఁజేసి వానిపయి నిల్పఁదగు న్ముకురంబు లన్నియున్. ౭౯

క. సప్తర్షి మంత్రములఁ ద
త్సప్తక మభిమంత్రితముగ సలిపి మఱియుఁ బ
ద్మాప్తమనుమంత్రితముఁ గుము
దాప్తాప్తము పూర్వ మపర మవుఁ జేయంగన్. ౮౦

ఉ. అక్షతగంధపుష్పముల స్వర్చితము ల్లలితప్రకారసం
ధుక్షితపంచపల్లవమనోహరము ల్ఫలరత్నయుక్తముల్

ప్రోక్షితపంచభంగజలము ల్సకలౌషధిసూక్తసూక్తముల్
రక్షితము లొనర్చి తఱి బ్రాహ్మణుఁ డర్కమనుప్రపాఠి యై. ౮౧

గీ. గోకులగజాశ్వరథ్యావ్రజాకలితము
వామలూరుగతమ్ము పావనము మృత్తు
వైచి సంస్కరించిన సప్తపాత్రములను
మధ్యమం బెత్తి యెత్తిన మమత వెలయ. ౮౨

ఉ. భోజితు లైన దంపతులు భూషణవస్త్రసుమస్రగర్చిత
భ్రాజితు లేద్విజుం దన శుభం బనువాదము సేసి చుట్టిరాఁ
గా జను లెల్ల మెచ్చ నల గర్భిణి దీనన లొప్పఁ జేయనా
నోజ మహాభిషేకమహిమోజ్జ్వలఁ గా నపపాపఁ గా దయన్. ౮౩

సీ. అతివ! జీవత్పుత్ర మగుమమ్మ గర్భస్థ
డర్భకుం డితఁడు దీర్ఘాయు వగుత
బ్రహ్మవిష్ణుమహేశ్వరత్రయి తత్త్రయి
లోకపాలురతోడి నాకపాలుఁ
డాదిత్యచంద్రు లన్యగ్రహామండలి
నక్షత్రతారాప్రణాళికయును
నిండఱు మఱికొండ ఱీ కుమారకు వేల్పు
లభిరక్షితు నొనర్ప నగుదు రెప్పుడుఁ
గా దశని గాని శని గాని కాఁడు కాఁడు
యసలుఁడేనియు బాలగ్రహంబులేనిఁ
గావు కా వన్యములుఁ బీడఁ గలుగఁ జేయ
శాబకునకును జననికి జనకున కని. ౮౪

గీ. అంత శుక్లాంబరధర మై యగజకొడుకు
స్కందదేవు జాయాపతిసప్తకంబు
పుష్పగంధాక్షతాదులఁ బూజసేసి
ప్రస్తుతప్రార్థన మొనర్పవలయు నెలమి. ౮౫

గీ. కార్తికేయుని ప్రతిమ సత్కార మొప్ప
సలిలపాత్రంబు హైమ మాచార్యున కిడి
రత్నకాంచనవస్త్రానురంజితంబు
ద్విజసమూహంబు భక్తిఁ బ్రార్థించి మ్రొక్కి. ౮౬

గీ. భక్ష్యభోజ్యంబులను ఘృతపాయసముల
గురువుతోఁ గూడ విప్రులఁ గుడువఁబెట్టి
విత్తశాఠ్యంబు లేకుండ వివిధము లగు
దీవనల నొందవలయుఁ దద్వ్రతతివలన. ౮౭

సీ. ఆవర్షశతము దీర్ఘాయువు సుఖియు నౌ
బాలుం డువిదకు నుత్పత్స్యమానుఁ
డేతత్ప్రబాధక మేనంబు కలిగిన
నది యెల్ల బడబాముఖాహిత మగు
బ్రహ్మ రుద్రుఁడు జనార్దనుఁడు స్కందుఁడు గాఢ్వ
పరిరక్షితు నొనర్పవలయు నెపుడు
వరదు లై దుష్టులవలన రక్షించెద
రగ్ని శక్రుం డాది యైన వేల్పు
లనెడు నాచార్య సూక్తి తథాస్తటంచు
ననువదింపంగవలయు నన్యద్విజౌఘ
మంతఁ గపిల నొసంగి య య్యనఘు మ్రొక్కి
విడిచి పుత్తెంచవలయు సద్విదితభక్తి. ౮౮

క. అవలఁ జరువు హుతశేషము
రవిశంకరులకు నమస్కరణము సలుపుచుఁ
ధవుఁ డర్భకగర్భిణి యవు
నువిదయును భుజింపవలయు నుత్సుకమతు లై. ౮౯

ఉ. ఈ విధి సప్తమీస్నపన మెవ్వఁడు సేసియు జితవోఁడు సం
జీవి సుతుండు కావలయు సృష్టికి నిద్ధి యవశ్యకార్య మం

చా వివ మెుప్పు వేల్పు సన నమ్మెయిఁ జేసి కృతార్థుఁ డైన యా
భూవిభు సిద్ధిఁ గాదె జనము ల్కొనియాడుట కార్తవీర్యుఁగన్. ౯౦

గీ. భాస్కరునిఁ గొల్చి యపరోగభావ మెునయు
ధనముఁ జెందు హుతాశుఁ దత్పరతఁ గొలిచి
శంకరారాధనమున సుజ్ఞాని యగును
బంచజనుఁడు హరిం గోరి పడయు సుగతి. ౯౧

క. ఇది పాతకనాశన మని
చదివినవారలకు విన్నజనులకు సిద్ధి
ప్రద మని యతఁయ్యం బని
విదితులు వలికెద రిదియును వినుము నరేంద్రా! ౯౨

అ న ం త వ్ర త ము

చ. అని భగవంతుఁ డిట్లనుఁ బృథాత్మజుతో నొక పక్షపాటుతో
ననితరతుల్యు నట్టి సుతు నందఁగఁ బ్రాతెకె తదీయపత్ని యు
న్మను ధవు నెంచి శీలధర మానవతీజనమాననీయ సాం
త్వనమున యాజ్ఞవల్క్యమునిభావినిఁ దా నడిగెన్ దదాదృతిన్. ౯౩

గీ. బ్రహ్మవాదిని మైత్రేయి పార్థివేంద్ర
పత్ని చే గుణిపుత్త్రిలాభమున కడుగఁ
బడిన దై సర్వకామసత్ఫలద మఘవి
నాశక మటంచు నన నంతవ్రతంబు. ౯౪

గీ. నారి గాని నరుఁడు గాని కోరు దేని
దేని నది యది యెల్ల నిద్దానఁ బడయు
నిదె యనంతవ్రతం బిందు నేకభక్తి
విభు జనార్దను విధిగ సేవింపవలయు. ౯౫

సీ. మార్గశీర్షంబున మానిని! మృగశిరో
భమునాఁడు స్నాతుఁ డై పరమనియతిఁ

ప్రాశించి గోమూత్ర మాశలను జయించి
ధూపదీపోపవాసోపచార
ములు ననంతునిపాదమును వామము స్వశక్తి
భక్తిఁ బూజింపఁగా వలయును ప్రతి
స్వర్చితుం డయిన యనంతదేవుఁడు తుష్టుఁ
డై జన్మజన్మంబులందు మాకు
నఖిలకామఫలాలి ననంత మొసఁగు
క్షయము లేకుండు పుణ్యోపచయ మమర్పఁ
గాత మని విప్రు దక్షిణఁ బ్రీతుఁ జేసి
రే భుజించెదుఁ దైలవర్జితము గాఁగ. ౯౬

మ. భగవద్వామకటి న్భజింపవలయు న్బైషంపు బుష్యర్క్షమం
దగు గోమూత్రమె ప్రాశ్య మందు మఱి విప్రాశీస్సులం బొంది పూ
ర్వగతిం దేవు ననంతకామదుని గాఁ బ్రార్థించి పూరింపఁగా
నగు నట్లే సకలంబు శిష్టనియమం బౌ తద్వ్రతస్ఫూర్తికిన్. ౯౭

చ. ఘన హరి వామవక్త్రము మఘాయుతమాఘదినమ్మునందు ఫా
ల్గునమున ఫల్గునీతిథి నగు న్విధు స్కంధము సవ్య మర్చ్య మీ
య నవు యవల్ విశిష్టనియమావలి మాసచతుష్టయంబునం
దును సమ మందు ర వ్విధికిఁ దోయజలోచన! నీకు మే లవున్.

సీ. చిత్రతోఁ గలిసిన చైత్రపూర్ణిమనాఁడు
తగుఁ బూజ క ద్దేవు దక్షిణకటి
దక్షిణపాదమ్ము తద్వదర్చ్యము విశా
ఖాయుతవై శాఖఘుస్రమందు
జ్యేష్ఠమాసంబున జ్యేష్ఠర్క్షమునఁ బూజ్య
మావిభు కటితట మ్మఖిల మట్టు
లాషాఢమున నషాఢాన్వితదినమున
నుభయపాదార్చనం బొనరుపవలె

శ్రావణాశ్రవణంబునఁ జరణయుగము
ప్రోష్ఠపదభాద్రపదమున పురుషు గుహ్య
మర్చనీయము ప్రాశనీయంబు ఘృతము
చైత్రమాది గ సర్వమాసమ్ములందు. ౯౯

గీ. ఆశ్వినాశ్వినిఁ దద్హృదయంబు కార్తి
కమునఁ గృత్తికనాఁడు శీర్షము సమర్చ్య
ములు తుంతాదులఁ దన్నామములు జపింప
వలయును హవిష్యము భుజాపవలయు నెపుడు. ౧౧౦

గీ. వ్రతదినమ్ముల స్నానసంప్రాశనార్చ
నము సమాహితమతి యై యొనర్పవలయు
నాలుగేసి నెలల కొక్కనాఁడు సేయ
వలయు మిక్కిలి గా ద్విజపారణంబు. ౧౧౧

ఉ. ద్వాదశమాసము ల్వ్రత ముదారత సల్పి యనంతరంబ సం
పాదిత మైన మేల్మి ప్రతిమం దదనంతరూప ముంచి యు
త్పాదితవేదిఁ బార్శ్వములఁ దన్మసలంబు హలంబు రాజతం
బాదరి నీదరి న్నిలిపి యర్చనసేయవలె న్యథావిధిన్. ౧౧౨

గీ. పాదుకలు ఛత్రమును తలపాగ పూల
మాలలు విభూషణమ్ములు జాలములును
జేర్చి గోవిందు భక్తిఁ బూజించి మించు
కుతుకమున నాప్తుఁ డాచార్యు మతము నూది. ౧౧౩

గీ. సర్వతోభద్రమంటపస్థములఁ జేసి
సరవి మృగశిర మొదలు నక్షత్రములను
నడుమ నక్షత్రరాజు నెన్నంగ సోము
నిలిపి తత్తన్మనువుల మానింపవలయు. ౧౧౪

క. ద్వాదశమాసమ్ములకున్
ద్వాదశఘటముల నమర్చి స్వర్ణప్రతిమా

నూదితముల ఖజలమ్ముల
నాద్భుతి సంవత్సరమ్ము నర్పింపనగున్. ౧౦౫

గీ. ఇమ్మెయి జనార్దనుని ప్రాజ తెలమిఁ జలిపి
స్వీయ నాచార్య ద్విజు వేదవిదుని భక్తి
నంశుకాదులఁ బూజించి య య్యనంతు
ప్రీతి కింతయు నతని కర్పింపవలయు. ౧౦౬

చ. మిగిలిన బ్రాహ్మణోత్తముల మిక్కిలి దక్షిణల న్యజించి యు
త్సవ మలరార నిమ్మెయిన తద్వ్రతపూర్తి యొనర్పఁ దద్దయున్
దనిలిన కోర్కు లెల్ల ఫలితమ్ము లవున్ సుఖసంప్రదాయపు
త్త్రివసువిశేషసంపదలు ప్రస్తుతము ల్సమకూరుఁ గామినీ! ౧౦౭

మ. అని మైత్రేయి వచింప శీలధర తద్వ్యావక్త్రధానంబుఁ దా
వినినట్లే ఘోనరించి స్వప్నమునఁ దద్విష్ణుఁ బ్రసాదోన్ముఖుం
గనె నాశాంబరు దత్తమూర్తి ద్విజుఁ బ్రఖ్యాతుం దదాఖ్యాతితోఁ
గనె యోగిప్రియు యోగపారగు సమజ్ఞాకార్తవీర్యార్జునున్. ౧౦౮

ఉ. వాని విశేష మెల్ల మును పాడిన పాటను భానునప్తమీ
స్నాన విధివ్రతం బటు లనంతకృతవ్రతము న్మహత్త్వసం
ధానచణంబు లిం దుపనతంబులు వర్ణితవృత్తు లయ్యె సా
ఖ్యానయనంబు దుఃఖవినయంబు తదీయఫలంబు లర్భకా! ౧౦౯

గీ. చదివినను విన్నఁ జాలు నీ చరిత మిచ్చు
సకలఫలముల నింక నాచరితమందు
మే లిదంవిధ మని యెన్న నే వలంతి
నే? సమూహింపు మది మది హితకరుండ! ౧౧౦

క. అను గురు నడిగెను శిష్యుం
డనఘవ్రత మందు రెదియొ? యది విన ననఘా!
మన మురియాడుచు నున్నది
యని యనుపదమే యతండు నన్ఁ జొచ్చె నిట్లుల్. ౧౧౧

గీ. ఆ యుధిష్ఠిరుఁ డడిగె ని ట్లనఘమూర్తి
వాసుదేవుండు దానికి బదులు సెప్పె
వినుతు విను మల్ల యర్థంబు విశ్వజనస
మాహితవిధానచణ! శిష్య! హృదయనివృతి. ౧౧౨

## అనఘ వ్రతము

సీ. అధికతేజస్వి బ్రహ్మాత్మజుం డత్రి మ
హాముని యనసూయ యతనిపత్ని
దత్తాత్ముఁ డై హరి దత్తనామంబునఁ
దత్తనూజననసందర్భ మెనసె
సద్వితీయుం డయ్యె నద్వితీయుం డయ్యుఁ
దన సహచారిణి యనఘ గాఁగ
నెనమండ్రఁ గొడుకులఁ గనె నది యనఘతో
బ్రాహ్మణి లక్ష్మి సబ్రహ్మగుణుల
ననఘుఁ డనఘయు యోగికాభ్యాసరతత
నుండ వచ్చిరి వేల్పులు నుటజవాసు
లండఁగొన జంభముఖ్య దైత్యాభిభూతు
లై గతులు గాన లేక దేవా! శరణని. ౧౧౩

మ. మును విన్నాఁడవు తచ్చరిత్ర మఖిలంబు న్నీవు నాతో సుర
ల్మను లా దేవుని దేవిఁ గొల్చుటయు సంమూఢాత్ము లై దైత్యు ల
మ్మను గామించి శిరంబులందుఁ గొని సంపద్దూరు లై పోకయు౯
ఘనుఁ డై జంభవిరోధి దిక్పతులు పొంగ న్స్వస్థితిం గాంచుటల్.

క. అష్టమినాఁ డనఘుల దయ
స్వేష్టము సంపన్న మగుట నిది వ్రతముగ నా
యిష్టభుజులు వెలయించిరి
విష్టపములు మూఁడు నొక్క వేశ్మము గాఁగ౯. ౧౧౪

సీ. కర్కోటకునిఁ దెచ్చి కావలివెట్టినాఁ
డా నని మాహిష్మతీనగరికిఁ
గావలె నన్న భైక్షం బిడినాఁ డగ్ని
కర్థి సప్తద్వీప మవనిచక్ర
మటు బందెగొన్నాఁ డహంకృతి రావణు
లోకవిద్రావణు వీకఁ గొనక
చేతు లడ్డము వెట్టి చెడఁగొట్టినాఁడు పే
రేటి పత్యభిస్రుతిధాటి సూటి
కలకవెట్టినాఁడు కల్లోలమాలిఁ ద
న్మకరనికర మెందొ మాటుమడఁగ
నన ననంబు నెనసె నర్జుననరనాథుఁ
డెవనినెనరువెల్లి కెల్ల యగుట. ౧౧౬

ఉ. ఆ యనఘాత్ము నష్టమి మహావ్రత మా యవనీశశేఖరుం
డే యిలఁ జాటి చెప్ప తగ నిల్వరుసం బొనరింపఁజేసె నా
చాయఁ బ్రసిద్ధ మైనది విశాలఫలం బనఘవ్రతం బనన్
జే యనువాఁడు కాక నతిఁ జేయనివాఁ డపు డొక్కఁ డుండెనే ?

ఆ. అఘు మనంగఁ బాప మది ముత్తెఱఁగు వాచి
కంబు మానసంబు కాయిక మనఁ
బలుకఁ దలఁపఁ గొలువ భంజించు నద్దాని
నెల్లఁ గాన ననఘు యిది ధరిత్రి. ౧౧౭

చ. అనఘు సగర్భగాఁ బొడమె నాత్మజత న్మహిమాదిసిద్ధు ల
య్యోనిమిది దత్తదేవుని యహీనతకుం దగు ప్రత్యయంబు లై
యనఘుఁడ కాఁడె వాఁడు జగమంతయు నాఘముఁ జేయఁజాలి? యె
వ్వని మది భక్తిఁ జేర్కొనినఁ బాయని పాపము లుండవో ధరన్.

చ. అనఘుఁడ నేన లక్ష్మి యనఘాత్మిక బ్రాహ్మణమానిరూపుఁ జెం
ది నిగమబోధము న్సలిపితి న్మను గొల్చిరి నన్ దథావిధం

బున నను యాదవాన్వయనభోమణిం బాండవపుంగవుండు మె
చ్చి నుతు లొనర్చి యిమ్మెయి వచించె నెఱుంగఁగ నైన దానికిన్.

క. ఏకాలమ్మున నే తిథి
నాకృతవీర్యాత్మజుం డనఘులఁ గొలిచె నే
యే కల్పంబుల మంత్రము
లేకరణివి తన్నియమము లెయ్యవి యనుచున్. ౧౨౧

శా. శ్రీకృష్ణుం డను మార్గశీర్షము నెలం గృష్ణాష్టమిన్ దర్భతో
నా కల్యాణవధూవరప్రతిమ లాయస్త్రాత్మజశ్రేణితోఁ
బ్రాకట్యంబుగ నుంచి మంటపమునన్ బ్రార్థించి పూజింప నౌ
నైకప్రస్ఫుటపుష్పపల్లవసుగంధాద్యర్థసంపత్తులన్. ౧౨౨

గీ. స్నాన మొనరించి వ్రతి పూజ సలుపునపుడు
ధ్యాన మొనరించు వేదమంత్రప్రచార
కలన ధూపదీపాదులఁ గాలసంభ
వముల నైవేద్యముల భక్తి వరుసఁ గూర్చు. ౧౨౩

గీ. ద్విజసుహృద్బంధుసంబంధివివిధజనుల
భోజనమ్ముల మేలి తాంబూలములను
సత్కరించి వ్రతాంతమం దుత్క నొకని
సంగృహీతవ్రతునిఁ జేయఁజను వ్రతికిని. ౧౨౪

గీ. రాత్రి నటగాయకాదినర్తనముఖముల
జాగరణ మొనరించి రే వేఁగుచుండ
నవమినాఁడు తోయంబుల నట్టనడుమ
వదలవలెఁ బూలపూజతో బ్రతిమగూడ. ౧౨౫

ఉ. ఇమ్మెయి వర్షవర్షమున నెవ్వఁడు భక్తియు శ్రద్ధ గల్గి చే
తమ్మునఁ జేయు వాని దురితమ్ములు వమ్మవు వృద్ధిఁ బొందుఁ బు
న్నెమ్ములు వంగడమ్మెలయు నిర్గదుఁడై సుఖియై యతండు జ
న్మమ్ములు మూఁడు నాల్గు సన మంచి గతిం గను రాజసత్తమా!

గీ. ఇహపరమ్ముల నొడఁగూర్చు నీ వ్రతంబు
సేయవచ్చు యావజ్జీవ మాయతి కయి
చాలఁడో? యొకేటఁ జేసినఁ జాలుఁ జాల
మే లెనయఁ బొలువడు దీన జాలి తలఁగు. ౧౨౮

శా. కుంతీనందన! నీ హితం బెడఁద నాకుం బ్రార్థ్య మాట న్వకా
ణింతుం జు మ్మనఘాష్టమీవ్రతము నిర్ణీతప్రకారంబు సు
స్వాంతుం డై యొవఁ డాచరించు నరుఁ డవ్వాఁ డెందు నుద్యద్యశ
స్సంతానుం డవుఁ గార్తవీర్యుఁ డెన గా సంసిద్ధుఁ డౌ భూవరా!

క. అని నొడివిన నందుని నం
దను బోధంబున ముదంబునం గ్రాలుచుఁ జే
సెన యనఘవ్రత మతఁ డం
దెన యుభయజగత్ప్రసిద్ధి దీపక! వింటే? ౧౨౯

క. అను గురు శిష్యుల బోధ
మ్మనుపద మాలించి మాను లామీఁది విధం
బని కొనరి బాదరాయణ
మునిశిష్యు నుతించి రతఁడు మోమోటపడక. ౧౩౦

శా. విద్యాదానచణానుభావ! యుదయద్విద్యానుసంవేద్యసం
విద్యావత్స్ఫుటభావరూప! యపనిర్వేదప్రియంభావుకా!
సద్యోముక్తికరస్వభక్తివిభవా! సమ్యగ్గుణానందసం
పద్యోగాస్థితతత్పురాణనిగమప్రఖ్యాపితాఖ్యాయికా! ౧౩౧

క. గాయత్రీమహితార్థశి
ఖాయితలింగానుమేయఘనసనిజలింగ
స్వాయత్తశ్రీరాఘవనా
రాయణకవిమానసాధ్వరప్రతిపన్నా! ౧౩౨

మాలిని. వివిధనిగమపద్యావిశ్వవిశ్వప్రపద్యా!
పవిధరముఖదివ్యాపన్నిరాసైకసేవ్యా!

కవనసవనసంపత్కల్పకాకల్పశంపా
చ్ఛవినిజతనుశంకాశంకిభాస్వచ్ఛశాంకా ! ౧౩౩

సీ. ఆంధ్రేల రామకథాఽమృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెఁ దనయు వి త్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ మఖములఁ
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
ద త్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదుగొ
నవమ గుచ్ఛమ్ము మూర్ధమ్మునఁ ధరింపు. ౧౩౪

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## దశమ గుచ్ఛము

క. శ్రీరామకథాఽమృతకృతి భారోద్వహ వేంకటప్పపండితకవిసం
భారాయితస్వయోగా ! నారదముఖవినుతచంద్రనగరాభోగా! ౧

ఆ. అవధరింపు మీశ! యామీఁది దత్తభా
గవతనవకథానకంబుడంబు
దత్తుఁ డచ్యుతు నవతారమ్ము ముని యని
యెందు సుప్రసిద్ధమే? యిది యని. ౨

### దత్తదేవుఁడు విష్ణు నవతార మని నిరూపించుట

చ. అడిగిన శిష్యుతోడ గురుఁ డాదృతిఁ జెప్పె నటంచుఁ జెప్పె సూ
తుఁడు ఘనయోగిపుంగవులతోఁ గలదా? మది నిట్టి సందియం
బడిగితి లెస్స నేసితి సహస్రముఖంబుల నొక్క వక్కణిం
చెదఁ గడు నప్పురాణము లశేషము లా ద్వితయప్రసక్తులన్. ౩

సీ. దత్తనిశ్చ్యవనులు స్తంభుండు ప్రాణుండు
నౌర్వకశ్యపులు బృహస్పతియును
స్వారోచిషాంతరసప్తర్షు లా వేళఁ
దుషితు లన న్విశ్రుతులు సుర లని
మత్స్యపురాణోక్తి మఱి హరివంశంబు
నందు వైశంపాయనాభిహితము
నేతాదృశంబ తదేతత్ప్రసక్తి వా
యుప్రోక్తు లగు మును లురుగుణు లని

యింక నవతారవిషయ మూందే వచింతు
నారదునకు గణాగ్రణి నంది సెప్పె
శివకరము విభూతిద్వాదశీవ్రతంబు
తద్విధానంబు నదియు వత్సా! గ్రహింపు. ౪

సీ. మత్స్యకూర్మవరాహమనుజహర్యక్షవా
మనరామరామరామప్రబుద్ధు
లటు కల్కి యవల దత్తాత్రేయముని ముస
లాయుధధారి వ్యాసగ్ని పిదపఁ
బ్రతిమాస మొకఁడు గా ద్వాదశమాసంబు
లందు నారాధింప నగుదు రోలి
నవతారకములు వైష్ణవములు పండ్రెండు
వ్రతసిద్ధి యగుఁబొంగెు భక్తియుక్తి.
ననియు మత్స్యపురాణంబునంద కలదు
భాగవతమందు నిమినామపార్థివునకు
సిద్ధసంవర్ణితంబు ప్రసిద్ధతమము
నాలకింపుము హంసగీతానుషక్తి. ౫

ఉ. అచ్యుతుఁ డైన దత్తుఁ డొక హంసమురూపము దాల్చి లోకసం
గచ్యుతి కార్యయోగము నఖండము బోధ మొనర్చు నంచు న
ట్లచ్యుతవర్మమందు నను హంసమువల్ల నరుండు ప్రోఁచు యో
గచ్యుతినుండి దత్తుఁడును కర్మ మఖం గపిలుండు నోమెదుర్గా. ౬

గీ. అనియుఁ గల దింక లోమశచ్యవనదత్తు
లాసురి పతంజలి ఋతుధ్వజాభిధుండు
పంచశిఖుఁ డాది సిద్ధేశ్వరు లనేకు
లిలఁ దిరుగుచుండిరి విబోధ మిడ నవియును. ౭

గీ. తార్క్ష్యకేతను నంశావతారము లను
నా ప్రసంగతి హరివంశమందుఁ జెప్పె

వ్యాసు ననుగు వైశంపాయనర్షి వర్యుఁ
డదియు వినుమయ్య సంశయం బపగత మగు. ౮

గీ. మఱియు భూతాత్మకుం డవు మాధవుని మ
హానుభావు నావిర్భావ మై రహించు
విశ్రుతుం డవు దత్తాత్రేయవిభు చరిత్ర
మతని క్షమయును వర్ణింప నలవి యవునె? ౯

ఉ. వేదములుం గ్రియ ల్పవనవృత్తు లడంగఁగ నాల్గుజాతులుం
బాదులు దప్పి సంకరముపాలయి వో శిథిలత్వ మంది ధ
ర్మాదర మేద నేదు జగ మంతయు నాఁడు సముద్ధరించె లో
కాది త్రిలోకపూజ్యుఁ డనఘానఘరూపుఁడు దత్తుఁ డల్పుఁడే? ౧౦

సీ. నిజబోధసంపత్తి నిర్ణిద్రు నొనరించి
పితృశాపహతు యదుఁ బెద్దసేసె
నల యలర్కుని వేదు అడఁచి యొక్కింతలోఁ
దన యంతవాని నేస్తమునఁ జలిపెఁ
దన నడవడిఁ దెల్పు దారిన దారిలో
జతఁబడు ప్రహ్లాదుఁ గృతి నొనర్చె
హంసగీత లటంచు నానతి యిచ్చె సి
ద్ధాంతరంగముల మే లతిశయింప
వేయిచేతుల నిచ్చెను విభుత నిచ్చె
భూమిచక్రంబ కాక నభోభువనము
లనియుఁ గాక యోగమ్మున నఖిలసిద్ధు
లనువు పఱిచెను గృతవీర్యజని కతండు. ౧౧

గీ. అతఁ డతని నెంతవానిఁ గా నాచరించె
నట్టిఁ డిట్టిఁ డటంచు నే నన వలఁతినె?
ఇంతో? యంతో? వచించితి నింతకుమును
పదియె మొదలెత్తఁ దలఁగునా? యని వదలితి. ౧౨

గీ. అనుడు నాచార్య! త్వద్వదనారవింద
గళితమకరంద మెంత త్రాఁగఁగలఁ డితఁడు?
భారతమ్మున న్యాయముగా న్వ్యాసమౌని
యనిన రామాదిచరితంబు నను మన ననె. ౧౩

## పరశురామ ధర్మరాజ సమాగమము

మ. వనవాసమ్మున నున్న ధర్మజుఁడు సద్భ్రాతృండును న్సాంగనుం
డును సర్షి ప్రవరుండు సద్విజుఁడు సాటోపస్వకీయుండు నై
ఘనతీర్థంబుల నాడుచుం జని కనెం గాంతు న్మహేంద్రాద్రి రా
ముని దివ్యాశ్రమ మందుఁ జొచ్చి సకలమ్ము న్మెచ్చెఁ దత్రత్యముల్.

ఆ. ఆచమించి సలిల మట దేవతర్షి పి
తృవరతర్పణములఁ దృప్తిఁ గూర్చి
రజని నంద యుండి రాజర్షి యడిగెను
మునులఁ గొలిచి రాముఁ గనవలె నని. ౧౪

మ. భగవంతుం డతఁ డెప్పు డీ మునుల కీ వచ్చు౯ స్వసందర్శనం
బగువేళం గన నెంతు నేను నతని౯ హర్షాప్తి నం చున్నచో
భృగువంశోత్తముఁడే నినుం గనఁగ నీ కే వేఁగ వచ్చుంజుమీ
సుగుణోత్తంసమ! నీ పయిం బ్రియము లస్తోకంబు లా మహానికి౯.

గీ. అష్టమిఁ జతుర్దశిం గూడ నాత్మదర్శ
నం బొసంగెడు నిచటి మహావ్రతులకు
నేఁడు వేఁగఁ జతుర్దశి నీకు వాని
కదియు నిదియుం గలసివచ్చె నను మునిఁ గని. ౧౬

చ. అతఁ డకృతవ్రణుం డను రహస్య మెఱింగి యజాతశత్రువుం
డతని సదర్చితుం గొలిచి యన్న! మహాబలు జామదగ్న్యు సం
తత మెడఁబాయ వీవు చరితం బఖిలం బపరోక్షమేకదా
యతులము రాజకంబు ముని యాహాత మేటికిఁ జేసె నావృషుల్. ౧౭

ఆ. అమ్మహాత్ము చరిత మాద్యంతము వచింతు
నంత యింత సెప్ప నదుకఁబోవ
దధిగుణా! విను మని యకృతవ్రణుం డెత్తె
రాణ నెసఁగు తత్పురాణగాథ. ౧౯

శా. దత్తాత్రేయుఁడు హైహయాధిపతికి న్దాక్షిణ్య మేపార సం
పత్తిన్ నూరుపదు ల్కరంబులును సౌవర్ణంబు దీవ్యద్విమా
నోత్తంసంబు సమస్తభూతవిజయం బుద్యోగ మైశ్వర్య మా
పత్తిం జెందని స్యందనానుగతి భాస్వద్విక్రమం బిచ్చినన్. ౨౦

ఉ. ఇమ్మహిఁ బార్థివోత్తముల నిందఱనుం దల యెత్తనీక గ
ర్వమ్మున సన్నివారితపరాక్రములం బొనరించు టేమి చి
త్ర? మ్మెదిరించె వేల్పుల నదల్చె మునీశులఁ బీడపెట్టె భూ
తమ్ముల నెల్ల దత్తవిభుదత్తము నెక్కి రథ మ్మతంద్రుఁడై. ౨౧

చ. అమరవరేణ్యు లన్యులు మహావ్రతులు న్సురవైరిఘస్మరున్
శమితజగత్యుపప్లవుని సత్యపరాక్రము నాదిదేవు వి
ష్ణు మహితుఁ గానఁబోయి మధుసూదన! భూతచయావనంబు నీ
సమయము కాదె? యర్జునునిఁ జంపవె మా మొఱ లాలకింపవే. ౨౨

మ. ఉచితం బెంచఁడు నన్నుఁ గొట్టె నను మొట్టో యన్న వీఁడంచు త
ద్రచితం బైన విమాననన్ నొడువఁ గా రా దాస్య మం చిమ్మెయిన్
సుచిరం బిందఱు విన్నవించుకొనుచో శూరుండు రా జింతలో
శచితోఁ గూడి విహారము న్సలుప నా శక్రుం బ్రధర్షించినన్. ౨౩

మ. భగవంతుం గనవచ్చి వాసవుఁడు దేవా! జోత లే మింక నే
మిగతి న్వర్తిల నా నటంచుఁ దన సంవేగంబు వాక్రుచ్చి నన్
దగవే? కావఁగ నిష్క్రైనఁ దగవే తాత్పర్యముం గూర్చి మిం
తగ నే నేల యిదంవిధం బనవలెన్ దైత్యారి! యం చూర్చుచున్.

చ. భువనసమర్చితుం డయిన పూరుషసత్తముఁ డెల్లవారి మే
లవు నవ్వుఁ బొం డటం చనిపి యప్పుడ పోయె సురేంద్రుఁ గొంచుఁ దా

నవనికి నయ్యెడం బదరికాశ్రమసీమ నసించె మంత్రవి
త్ప్రవరుఁడు మంత్రముం బొనరుప న్మనుపన్ని యుఁడా నెఱింగియున్.

గీ. ఇంతలోఁ గాన్యకుబ్జమహీశుఁ డొకఁడు
గాధి యను పేరివాఁడు విక్రమఘనుండు
వనమున వసించుచుం గనె వనజవాసి
నీనిభఁ దనూజ నొక్కర్తు నిఖలసార. ౧౬

సీ. కోరె భార్గవఋచీకుఁడు దానిఁ బత్నిగా
నిమ్మని గాధి మహీశలత్రు
నతఁడును సంశితవ్రతు విప్రుఁ గా దన్న
నేమి యూఁడునొ? యని యెడఁద నలికి
వానితో ననియె నీవంటి మహామహు
నడుగఁ గా రాదు శుల్కాదు లెందు
నుచిత మెంచియె పూర్వు లొనరించి యుంచిన
యాచారముం ద్రోయు టనుచితంబు
ఏమిసేయుదు నొక చెవి శ్యామ మయిన
పాండురాఖిలాంగకము లశ్వములు వేయి
యీఁ గలిగినట్టి వరునకే యీవలె సుత
నని యనుడు భార్గవుం డనె నతనితోడ. ౧౭

శా. శ్యామైకశ్రవణంబు లశ్వములు శ్వేతాన్యాఖిలాంగంబు లే
నే మే నిచ్చెదఁ దెచ్చి వేయి సతి యా నీ సుతారత్న మం
చామర్యాదఁ దలంగకుండు మని యభ్యర్థించె నర్థిం దథా
త్వామేయార్థము లప్పతిన్ వెస నతం డర్పించె నవ్వానికిన్. ౧౮

చ. అడిగిన శుల్క మిచ్చు ముని నట్టిటు లాడఁగ నెట్టు లౌ నటం
చొడయఁడు కన్య సత్యవతి నొప్పు విధి న్మని కిచ్చి పుచ్చినన్
విడువక ధర్మము న్సుఖ మవేలముఁ జెందు ఋచీకు వాని చొ
ప్పడు గృహిభావముం గని సెబా సని వేల్పులు మెచ్చి రిచ్చలన్.

చ. కొడుకు వివాహ మైన దని కోడలు నింటికిఁ బేరు పెంపు దె
చ్చెడు గుణవంతురా లని వచించు జనంబులవల్ల విం చు న
ప్పుడ భృగుమౌని వచ్చి కని మోదమున న్మది దోచుచుండ వా
రడుగుల వ్రాలి పాద్యముల నర్ఘ్యములన్ గురుఁ బూజసేయుచున్.
గీ. వరము గోరుము సౌభాగ్యవతి! యటంచు
నలరు మతి మామ కోడలి నడుగుటయును
దగిన కారణములు వల్కి తల్లికిఁ దన
కాత్మజుల నరులను గోరె నా లతాంగి. ౩౦
గీ. సుప్రసాదంబు సొప్పడఁ జూచి శ్వశురుఁ
డనియె సాధ్వి! ఋతుస్నాత వైన యపుడు
నీ వుదుంబర మశ్వత్థ మా వెలంది
పుంప్రసూతికిఁ గౌఁగిలింపుఁడు వెరవుగ. ౩౧
చ. చరువులు రెండు గూర్చితి విశాలవిలోచన! బ్రాహ్మతేజ మ
చ్చెరు వవు క్షాత్త్ర తేజము నశేషము నం దొకఁ డిం దొకండుఁ గా
వరలఁగఁజేసితిం దినుము భావిని! దానినిఁ దీనిఁ దల్లి కి
మ్మెరువుర కిర్వు రాత్మజు లహీనులు పుట్టెద రన్వయాన్వయుల్. 33
చ. అని వెసఁ జూపి చెప్పి చనె నంతరితుం డయి కొంతకాల మే
గిన మఱివచ్చి కోడలి నొగిం గని గర్భిణి నిర్భరంబు తే
జున కులుకంగ నై యనియె సుందరి! నీ యుదరంబునందు బ్రా
హ్మణకల లేదు క్షాత్త్రము మహాం బిది క్రూరము గాని మానినీ!
ఉ. అంచితురాల! లో నెఱ్ఱ యనర్హ దురాహ వహించు మాతచే
వంచితురాల వై తి విది భావ్యమొ? వ్యత్యయ మై తరు ల్చరుల్
మించిఁ దొలంచె నన్నుఁ దన మామకు మ్రొక్కి మృగాక్షి వా ని మే
లెంచి వరించె ని వ్వరము నిం డని మాటికి దోసి లొగ్గుచున్. 3౪
గీ. ఉత్తమబ్రాహ్మణుఁడు పుత్త్రుఁ డుదితుఁ డగుత
నాకు వాని కుమారునం దీ కృతమునఁ

గ్రూర మవు తే జెనయుఁగాత మీర లెట్టు
లెంత దలఁచిన నంత గాదే? జగమున. ౩౬

మ. అని ప్రార్థించు వధూవిధం బరసి య ట్లా లెమ్ము పొ మ్మంచు న
మ్ముని వోయెం జమదగ్నిఁ గాంచె సతి నంభూత్యర్హకాలంబునన్
ఘనుఁ జాతండును వర్ధమానుఁ డగుచు న్మౌనీంద్రులం బల్వురన్
దన తేజోఽధ్యయనాదిసంపదలచందంబందు మీఱెం గడున్. ౩౭

గీ. భాస్కరోపమవర్చస్కు వాని నెనసి
వెలిఁగెఁ గృత్స్నం బయిన ధనుర్వేదవిద్య
తన వశ మొనర్చుకొనియె నుత్తపుఁడు తపము
పేర్మి నర్మిలి నాలుగు వేదములను. ౩౮

క. భూనాథుఁ బ్రసేనజితుం
గానంగాఁ బోయి రేణుకాసంజ్ఞిత న
వ్యానితనయను వరించెం
దా నడిగినమాత్ర నిచ్చి ధన్యుఁ డతఁడు గాన్. ౩౯

ఉ. భార్గవనందనుండు దన భాగ్య మనం దగు భార్యఁ జెంది స
న్మార్గమున న్నిజాశ్రమవనంబున మే ల్తప మాచరించుచున్
స్వర్గముఁ గాంతుసేయని నిసర్గధృతిన్ దయితానుకూల్యసం
సర్గసుఖంబులం దనిసి సర్గ మొనర్చె విరించియో? యనన్. ౪౦

గీ. రామపంచములను బుత్రరత్నములను
వారిలోఁ జిన్న యయ్యు నెవ్వారికన్నఁ
బెద్ద గొనముల రాముఁ డపేతదురితుఁ
డభవుఁ జిననాఁడె విద్దెల కాశ్రయించె. ౪౧

గీ. బదరికాశ్రమమున కట్లు వచ్చియున్న
యచ్యుతుఁడు భృగుమంత్రపద్యలఁ జరువునఁ
జొచ్చి జమదగ్నిహృదయనిష్ఠుండు నగుచు
నగుతఱి జనించె రాముఁ డై యనితరగతి. ౪౨

ఉ. రేణుక దేవి యంశము ధరిత్రి వహించిన రూపు తెల్పఁగా
వాణికి నేర్పు నేరు పనవద్యము పుట్టిన యన్వయంబు ని
ర్వాణరమాస్పదం బయిన భర్తృకులంబునఁ జేరు గాంచె గీ
ర్వాణుల నేలునంతటి యపత్యములం గనె రేణుకల్పయే? ౪౩

గీ. రాజముని బిడ్డ కై పట్టె బ్రహ్మవాని
యౌవనమున నిరంకశశాంతమూర్తి
కన్న దవతారపురుషులఁ గలిగె వాడు
ముదిమి దైవంబు చెయిది కెయ్యది తగనిది. ౪౪

సీ. తత తమ పనులకై తనయు లందఱు వోయి
యారణ్యకప్రదేశాంతరముల
కరిగెఁ దాను జలాశయమునకు నియతవ్ర
తాఢ్య స్నానముసేయ నైన పనికి
మార్తికావత మేలు మహినాథుఁడట వాఁడు
నప్పుడ వచ్చె భార్యలును దాను
బుద్ధిమంతుఁడు జలక్రీడ లాడుచునుండెఁ
జిత్రరథుండు విచిత్రవృత్తి
వాని లోకంబు కాని దీ వనితఁ గనఁడు
గాని కానిపనులఁ జూర్చు కాముని కృతి
సనుగ్రహంబుగఁ జూచె రాచఱికము సుఖ
ముండునా? బ్రాహ్మణుల కని యువిదమిన్న. ౪౫

గీ. అంతలో వచ్చె వ్యభిచార మెంత వలయు?
సతులచరితము కదలికాచ్ఛదముఁ జెఱుపఁ
దెలివి మాలి యంభఃక్లిన్నదేహ యగుచుఁ
ద్రస్తయై యాశ్రమముఁ జొచ్చుదానిఁ గాంచి. ౪౬

క. ధైర్యము విచ్యుత మయ్యె న
నార్యకు బ్రాహ్మి సిరి దొలఁగె నని మెఱిఁగి తపో

ధుర్యుండు ధిక్కరించెను
దుర్యశము భరింపఁగలరె స్తుతమతు లెందుర్? ౪౭

గీ. అసలె జమదగ్ని ప్రలయకాలాగ్ని యయ్యె
వీర్యవంతుండు గర్జించె వివిధగతులఁ
జేరె వసుమంతుఁ డనల సుషేణుఁ డంత
వసు వతనివెంట వచ్చె విశ్వావసుండు. ౪౮

క. వచ్చిన కొడుకులఁ గోపపు
బిచ్చిం బడు నాథుఁ జెడ్డ పెద్దఱికంబుల్
మ్రుచ్చిలనేరక యా సతి
చచ్చినయటు లుండె నధికసంతాపమునన్. ౪౯

ఉ. అమ్మహితానుభావుఁడు రయమ్మున జ్యేష్ఠునిఁ బంచెఁ జంపు మీ
యమ్మ నటం చతండును ధరామరుఁడా? మునిబిడ్డఁడా? శమం
బెమ్మెయి వీడఁజాలు నెది యెట్టులు పోయినఁ గాంచి పెంచి నా
యమ్మున కింతఁజేసినది యమ్మ గదా యని యూరకుండినన్. ౫౦

గీ. అతని యనుజు నతని తమ్ము నతని తమ్ము
నతఁడు పురికొల్పెఁ గాని చేయఁ డొకఁ డేని
తండ్రివాక్యం బలంఘ్యమే తల్లిఁ జంపు
నట్టిపని కెట్టు లూన నౌ? నని తలంకి. ౫౧

ఉ. చిత్తము రాయి యై యెదియుఁ జేయఁగ లేని నిజాత్మజన్ములన్
మత్తత నా వచించు నొకమాటకుఁ గా రకొ తెల్వి మాలు నా
పత్రికి నై మృగంబు లనఁ బశు లనం దిరుగుండు పొం డటం
చత్తఱి శప్తులం జలిపె నా పిత యై రటు లప్డె వారలున్. ౫౨

ఉ. అంతట వచ్చె రాముడు నిజాశ్రమసీమ కరిఘ్నుఁ డాతనిం
బంత మెలర్పఁ బంచెఁ గుణవంతుఁడ! పుత్త్ర! భవత్సవిత్రి దు
స్స్వాంత హరింపరా వ్యధకు స్వాంతముఁ గూర్పకు మంచు వాఁడు ని
శ్చింతఁ గుఠారముం గొని యుసి న్విసరెం దల మేను వేఱు గాన్.

ఉ. కోపము వోఁ బ్రసన్నత నకుంఠ మహామహుఁ డాదరించి రా
మా! పరితోష మైనది భవత్పితృభక్తికి నెంత దుష్కరం
బౌ పని సేసినాఁడవు? మదాప్తికి మెచ్చితిఁ గోరుకో నిజా
జ్ఞాపర! కోర్కె లే వయినఁ జయ్యన నన్ను సుతుండు నమ్రుఁడై.

ఉ. తాతుఁడ! నే నొనర్చిన వధంబు విధంబును విస్మరించి మా
మాత సజీవ యౌట మును మానసమం దొనరించినట్టి య
ప్పాతక మామె కంటమి నప్రభము లై ప్రకృతిస్థు లైన మ
ద్భ్రాతలు నిన్నుఁ గొల్చుట సురస్తుత! యీవె కృతార్థుఁ డయ్యెదన్.

గీ. అని వరించిన వానిఁ దథాస్తు టంచుఁ
దఱుగని మహాయు వప్రతిద్వంద్వత నని
నొసఁగితి నటంచు నధితపోయుక్తుఁ డనుడు
నన్నియు ఫలించెఁ బ్రదికి యా యమ్మ లేచి. ౫౬

ఉ. నాథుని దివ్యపాదనలినమ్ముల నంటి నుతించి యంచితా
రాధన మాచరించి యపరాధ మొకం డిది సైపవే యనన్
సాధుని పేవితుండు తనుసంభవుఁ డీతఁడె నిన్ను నన్ను సం
శోధన మాచరించె నలుసు ల్గలవే? మన జన్మమం దిఁకన్. ౫౭

గీ. అచ్యుతుఁడు వాఁడు సురకృతి కవతరించె
వేచి తిరుగుచునున్నాఁడు వినుతులైన
దుష్టుల నడంప నెటు లైన దొడ్డుసేసె
జన్మకర్మప్రసక్తి నీసారి మనల. ౫౮

క. అని యాదరించె సతిఁ బతి
మనమున నమ్మాట మఱచి మానితు లుండన్
వనమున కొకపరిఁ దనయులు
సనియుండఁగఁ గార్తవీర్యజనపతి వచ్చెన్. ౫౯

ఉ. వేటనెపంబునం దివిచి విశ్రుతు నాతని దైవ మా తపో
వాటికిఁ దెచ్చె తత్కృతసపర్యల నెమ్మది మెచ్చనీక య

ప్పాట నటింపఁజేయ నటఁ బాదపముల్ సటికించి తీవ లు
త్పాటితము ల్గావించి చనె వత్సమొ? ధేనువొ? చిక్కఁ గొం చొగిన్.

ఉ. రాముడు స్వాశ్రమం బెనయ రా వివరించిరి తల్లి తండ్రి యా
బాము సహింపలేక చని బాహుసహస్రముఁ ద్రెంచి యర్జునున్
మే మని యడ్డువచ్చు నవనీవిభుల న్వెసఁ ద్రుంచి తత్సుత
స్తోమము భంగపెట్టి తన దూడను గైకొని వాఁడు వోయినన్. ౬౧

ఉ. రాసుతు లట్లు భంగపడి క్రోధముల పోలికి దుష్టు లౌట ను
చ్చాశ్వసముఁ బుచ్చుచున్ బఱచి భార్గవరాముఁడు లేని వేళఁ ద
ద్వాసముఁ జొచ్చి కిన్క జమదగ్నిశిరంబు హరించి వోయినా
రాసతి రామ రామ యని యార్చుచు రోదన మాచరింపఁగన్. ౬౨

గీ. ఇంతలో వచ్చె నింటికి నెల్లఁ జూచెఁ
దల్లి యేడుపు తెలుఁగునఁ దల్లడిల్లె
నింత యైనది నా మూల మే యటంచుఁ
జింత మునిఁగి యొకింతసే పంతకుఁ డయి. ౬౩

చ. పరశువుఁ గొంచుఁ బోయి యతిపాతకు లౌ నృపసూతులన్ వెసన్
ధరఁ బడవైచి యవ్విపశతన్ మద మెక్కినవారిఁ జంప సం
గర మొనరించి వచ్చి తగుకాలము దేశ మెఱింగి తండ్రికిం
బరమము పారలౌకికము వర్తిలఁజేయుచు నుండ నింతలోన్. ౬౪

గీ. దైవమున కెన్ని దారులు ధారుణీశ!
తారసిల్లి కాశ్యుండు ప్రతర్దనుండు
నీతరమె? యెల్ల నృపుల నని న్హరింప
రామ! నాతోడ రమ్ము బీర మని యున్న. ౬౫

క. బాసలు సేసితి వట సే
బా సని రాజన్యజాతిఁ బరిమార్చెద నం
చాసరుకుఁ జూడ వచ్చితి
గాసిపడకు మసులొ? కుశలొ? కైకొను మనియెన్. ౬౬

ఉ. దానికిఁ గోపతాపము లెదం బురివెట్టఁగఁ బంబి గొడ్డలిం
బూనికఁ బూని వాని నిజముం గనఁ బుచ్చి యదే ప్రసక్తి భూ
జానుల నొండు నిర్వదియు సారులు నేలఁ బ్రదక్షిణించుచుం
జా నడఁచెన్ బ్రశాంతుఁ డయి జన్నము సేసె సదక్షిణంబుగన్. ౧౭

గీ. పుడమి సకల మ్మొసఁగెఁ గశ్యపునకు భక్తి
నతఁడు వా మ్మన్న ని మ్మహేంద్రాద్రిఁ జెందె
విభుఁ డొసంగిన కాంచనవేదిఁ బంచు
కొని ద్విజులు ఖాండవాయను లనఁ బరగిరి. ౧౮

క. ఆయామనవోత్సేధ ద
శాయవ్యాయామ వాని యష్టాపదసం
స్థాయద్వేది పరంతప!
యేయెడఁ జూచితిమె? వింటిమే యీ భంగుల్. ౧౯

క. క్షాత్రబ్రాహ్మవ్యతికర మత్రాసం బెందుఁ దేజ మది మహిఁ గలిచెన్
సత్త్రిముల నట్లు నడిపె నమిత్త్రుల నిపు డాంతరుల శమింపఁగ జేసెన్.

క. అని యకృతవ్రణుఁ డనునెడ
విను పార్థుల హర్షలక్ష్మిఁ బెరసెనొ? ప్రాచ్యా
వనమున నన వెలివాఱెం
బనివినియె న్నిశయు వచ్చె భార్గవుఁ డంతన్. ౨౧

గీ. దర్శనం బిచ్చి యా చతుర్దశిఁ దపస్వి
జనుల ధర్మజు సానుజు సంతసమున
ముంచె రాముఁడు రాముని మునివరులను
బూజసేసిరి పార్థు లవ్యాజభక్తి. ౨౨

గీ. ఎంతవాఁడవో? నీవు నే నెంచఁగలనె?
ఎంతవాఁడవో? నీవు నే నెంచఁగలనె?
అలకించితిఁ గంటి బ్రహ్మర్షివర్య!
అలకించితిఁ గంటి రాజర్షివర్య! ౨౩

క. నీ యట్టివారు గలరే? యీ యవనిన్ లేరు నీకు నెన యవ్వారున్
ధీయుతుఁడ వీవు నేనా? నీ యా ధీశక్తిఁ బొగడనేర్తు నధీశా! ౨౪

క. అని యొకరి నొకరు మెచ్చెడు
మినుకుల కచ్చోటివారు మేల్మే లనఁగాఁ
జనెఁ గొంతకాల మాదట
విన్రముఁ డా రాజఋషికి విప్రర్షి యనెన్. ౨౫

క. కేశములు పట్టి ద్రోవది నాశోన్ముఖు లట్లు దివ్య నరపతి వై ద
ర్పాశాశక్తులు గలిగిన నీ శమమే జగతిఁ గీర్తనీయము తండ్రీ! ౨౬

క. నీయట్టివాఁడు పుట్టఁడు పో యని యన్నాఁడ నట్టి పున్నెముఁ గంటిన్
జే యంటి నాఁడె యిపు డిట్లాయె న్మను పోర్వనై తినా? విప్రుఁడనై.

క. అపకారి సపరివారునిఁ
గృప విడిచి యడంచుట యొక రీతి యనఁ దగున్
నృపజాతి రూపుమాపుట
విపరీతము జన్మ కర్మ విధములకుఁ గదా? ౨౮

క. నీదర్శన మేఁ జేయం గా దిక్కులు నూచుచుంటిఁ గలిగె నిటులు నేఁ
డాదృతి ననుఁ గన వచ్చితె? నాదురిత మడంపఁ గాని నరనాథమణీ!

క. అని యేమేమొ వచించుచు
మునిముఖ్యుం డా తిథి నటు పుచ్చి జనపతిన్
వినతుని దీవించి వెసం
జనియెం దక్షిణపుదిక్కు చక్కం జక్కన్. ౩౦

ఆ. అంతవానిఁ జేసె నర్జును దత్తుఁ డై
రాముఁ డగుచు సంహరణ మొనర్చె
విష్ణువై భవంబు వింటివా? దీన నిం
కేమి వినవలచె దహీన! యనుడు. ౩౧

క. ముని హంసము దత్తాత్రేయునివల్లన శమోపదేశ మొందిరి సాధ్యుల్
మును పంటివి తత్సారం బనునూ యనుమానమెడల నను దీపకుతోన్

ఆ. వేదధర్ముఁ డనియె విదురు నగ్రజుఁడైన
రాజు కలఁగిన ధృతరాష్ట్రుఁ డడిగె
నుచితవేది వాని కుపదేశ మొనరించి
నట్టి మార్గ మదియు నాలకింపు. ౭౩

సీ. అత్రిపుత్త్రత్వమ్ము నవధరించెను దత్తుఁ
డాత్రేయుఁ డనఁగ స్వాయంభువుండె
జ్ఞానఘనుండు సాక్షాల్లోకగురుఁ డతం
డమరుల మునుల మర్త్యాదిజనుల
నెవఁ డేది యడిగిన నిదియె మార్గ మటంచు
బోధించి భవపారము నెనయించుఁ
గొందఱు జ్ఞానంబుఁ గొందఱు యోగంబు
గొందఱు తపముఁ గైకొనుచునుండ

సాధ్యు లొకసారి పదనమస్కార మమరఁ
జేరి సేవించి యడిగిరి సిద్ధితెఱఁగు
హంసగీతలు నా నితిహాస మగుచుఁ
బరగు న ప్పరిపాటిఁ జెప్ప వినవయ్య. ౭౪

## హంసగీత

గీ. ఇదియె కార్యంబు మనమున కే వినినది
ధృతి శమము సత్య మెపు డనువృత్తిఁ గూర్చు
చెడఁదఁ గల కామవాసన లెల్ల గ్రంథు
లొక్క మతిఁ జూచి విప్పిన నుపశమించు. ౭౫

క. ఆక్రుశ్యమానుఁ డిరిగియు
నాక్రోశింపని తితిక్ష కల మన్యువె య
య్యాక్రోష్టనే దహించు న
పక్రాంత మొనర్చు నతనిబహుసుకృతమ్ముల్. ౭౬

క. అవమానాక్రోశంబుల
నెవనియెడం బొడమనీఁడు హితవిద్రోహం
బు విగీతసేవ సేయం
డవాచ్యవచనంబు లాడఁ డతఁడు కృతి యనన్. ౭౬

శా. మర్మాస్థిశిరమానసప్రముఖము ల్ఖండించు రూక్షోక్షరా
శర్మంబు ల్వచనంబు లట్టు లగుటం జాలించు వానిన్ సదా
ధర్మారాముఁడు హీనవృత్త మెడయుం దర్పంబుఁ జేర్పం డెటన్
నిర్మర్యాదుఁడు గాఁ డెడన్ దురభిమానిత్వంబు వర్జించెడున్. ౭౭

క. పరుషవచనకంటకముల
నరుంతుదుం డగుచుఁ బరుల నలఁచెడు చెడు గా
పురుషుని మొగమున లక్ష్మియు
సరస్వతియుఁ దొలఁగు మృత్యుజాలము లెనయన్. ౭౮

చ. పరవచనంబుల న్సవిషబాణములన్ జ్వలనాగ్రదీప్తిని
క్షురముల నిర్దహించినఁ గడుం బడఁగొచ్చిన నెవ్వఁ డాత్మ ని
ర్భరుఁ డయి యోటు పోటు ననరాక బలే సుకృతంబుఁ బెంచు నీ
నరులు కదా స్వబంధు లని నవ్వ జనుం గవి యందు రుత్తముల్.

గీ. సజ్జను నసజ్జనుఁ దపస్వి జడుని దొంగ
నెట్టివాని సేవించువాఁ డట్టిఁ డగును
వసన మసితాదివర్ణసంవాసిత మయి
తద్వశం బగు నట్లె తత్తద్గుణములు. ౮౦

గీ. కొట్టువానినిఁ గొట్టింపఁ గొట్టఁ బోక
తిట్టువానిని దిట్టింపఁ దిట్టఁ బోక
ద్రోహియెడ ద్రోహిగాక నరుం డరుగుడు
నెదురువచ్చెద రమరులు నిచ్చమెచ్చి. ౮౧

గీ. వ్యాహృతముకంటె మేలు మాటాడకుంట
తద్ద్వితీయమ్ము మేలు సత్యమె పలుకుట

అదియుఁ బ్రియ మయి యొదవుట యవలిమేలు
ధర్మ్య మది యాట మే ల్చతుర్థమ్ము సుమ్ము. ౯౩

క. యాదృశులఁ గొలుచు నిచ్చలు
యాదృశులం గూర్చుకొనును? యాదృగ్భావం
బాదరముసేయు నెమ్మదిఁ
దాదృక్త్వము బురుషుఁ డొందుఁ దప్పక చెందున్. ౯౪

క. ఎది యెది వదలుకొను న్నరుఁ
డది యది యవ్వాని విడిచి యవలఁ జనఁ జన్
దుది సర్వనివర్తన మవు
నది సూవే యందు దుఃఖ మణు వెఱుఁగమికిన్. ౯౫

గీ. మఱియు నిందాప్రశంసాసమస్వభావుఁ
డోడఁ డొరులకు నోడింప నూఁకొనండు
పరులఁ బ్రతిఘాతకుఁడు గాఁడు పగగొనండు
హర్షమును శోకమును లేవ య న్నరునకు. ౯౬

క. అందఱి భావము కోరుం
డెంద మభావమున వెంబడిం బో నీఁ డా
నందము సత్యము మార్దవ
ముం దమము వహించు నుత్తముఁడు నరుఁ డెపుడున్. ౯౭

క. ఇచ్చెద నని యిచ్చు ధనం
బొచ్చెము లేకుండ నర్థి నుపలాలించున్
జొచ్చఁగనీఁ డొరు రంధ్రము
నిచ్చం బురుషోత్తముఁ డతఁ డెల్ల జయించెన్. ౯౮

ఉ. కోపమునం గృతఘ్నుఁడై యగు న్వినఁ డెవ్వరు సెప్పి రేనిఁ గా
మోపహతాంతరాత్ముఁ డొకఁ డుండఁడు మిత్రుఁ డటంచు నుండెనా?
పాప మొనర్చు నన్యులు శుభం బొనరించిన నమ్మఁబోవఁ డా
త్మోపమితిన్ స్వభావము లహో యధముం డవు వాని కిన్నియున్.

క. సేవింపవలయు నుత్తములౌ వారి న్మధ్యములనొ? యవ్వఁ గా దనరా
దేవేల నపుడు గైకొన నౌ వల దేనాఁడు నధము నారాధింపన్. ౧౦౦

గీ. అధముఁడేనియు నార్జించు నర్థము బల
పౌరుషంబుల నుద్యమపరతఁ దెలివిఁ
గాని సమ్యక్ప్రశంసకుఁ గాఁ డతండు
కులము గలిగియు వెలి యగు గొనము లేమి. ౧౦౧

గీ. ఇన్నిఁటికి నాస్పదం బగు నెఱిఁగనేని
స్వస్వరూపంబు నెఱుఁగు నీ సాధనమ్ము
లిన్ని కలిగినఁ బెండ్లి యౌ నేని వదలుఁ
బిచ్చి యది పోయినం గాని పెండ్లి కాద. ౧౦౨

ఉ. గట్టిగ నింద్రియాశ్వముల గళ్ళెములం గొని పట్టుపట్టి యు
న్నట్టి నిజస్వరూపమున హాయి నెఱింగి యనంతరంబ తా
నెట్టులు సంచరించినను నిట్టటుపోక వశంబు లవ్వి యా
నిట్టిగొనంబు లౌ గుణవిహీనుని సొమ్ములు వీడ వెన్నఁడున్. ౧౦౩

చ. అని ముని యానతిచ్చు నమృతామృత మాని యథాగతంబుగాఁ
బనివిని రల్ల సాధ్యులు శుభం బగు న వ్విభు రూపు మాట నె
మ్మనమునఁ బాయకుండు గరిమంబునఁ దాల్చి యనేకు లిట్టులా
జనునుతు నాశ్రయించిరి నిజస్థితిఁ గాంచిరి సిద్ధి సేకురన్. ౧౦౪

క. అల కార్తవీర్యవిభవము
కులపతి సదనుగ్రహం బకుంఠము వినవా?
యలఘుమహిమంబుఁ దెలుపఁగ
నల చరితమ యెన్నిసార్లకైనం జాలున్. ౧౦౫

ఉ. ధాత్రిపతీంద్ర! యిం [illegible] క్షత్రి [illegible] భవ్యవృతంబు చా
రిత్రము పేరు పెట్టి వివరింపు మహత్త్వ మటంచు నెంచ నే
నాత్రము సూప దత్తవిభవాతిశయంబు నవం బనంగ నై
చిత్రితముం బొనర్చినది చిత్తము నెంతటి పున్నెమో కదే? ౧౦౬

క. ఈ మునులు నీవు వినఁగా
శ్రీమద్దత్తప్రభావసిద్ధులు యోగ
జ్ఞే మోపదేశపథములు
నీ మెయి వివరించు మేల్మి నెన్నం దరమే? ౧౦౭

కుంజల కపింజల సంవాదము

ఉ. అండజ మొండు కుంజలసమాహ్వాయ మున్నది నల్వు రాత్మజుల్
పండితు లుండి రాపతగవర్యునకున్ బలవీర్యశౌర్యతు
ల్యుం డొకరుండె వారికి ఖగోత్తముఁ డాతఁడు గూడఁ బోలరా
కుండు సఖండబోధవిభవోజ్జ్వలసంగతి నెట్టిపిట్టలో? ౧౦౮

ఉ. నాలుగు పక్షులుం దెసలు నాలుగు నిత్యముఁ జుట్టివచ్చు న
వ్వేలకుఁ గుంజలం బెదురు లేచి సముత్కట నుండు వచ్చి య
న్నాలుగు రాత్రి వేగఁ దమ నాయనకు న్వివరించుచుండు నా
యా లలి నెక్కడక్కడ స్వయమ్ముగఁ గన్నవి విన్న వెన్ని యోన్. 

క. అందు నొకనాఁటి సాయం
బందు నిజానందమేదురాత్మం బగుచున్
వందన మొనరిచి తండ్రి క
నెం దదపత్యమునఁ బెద్ద నిరుపమఘణితిన్. ౧౧౦

మ. జనకా! చూచితి దిక్కులం దిరుగుచున్ జాజ్జ్వల్యమానప్రభా
పనితం బొ వినతాసుతాంసమున సంపన్నంబు బ్రహ్మాంబు గృ
ష్ణనిభంబు న్సకలప్రజాదహరసంస్థానంబు, నేఁ డెవ్వఁడో
మునికిం దోఁచి వరంబు లిచ్చునెడ నా పుణ్యా మ్మగణ్యా మ్మనన్.

క. ఏ వాఁ డా పురుషుండు? ప్ర
భావం బెట్టిది? పరేశుభావము తుష్టిం
గావించె నెటు? ప్రసన్నుం
డా వరదుం డేమి వరము లర్థికి నిచ్చెన్? ౧౧౨

ఉ. వత్స! కపింజలా! సకలవర్తనము న్విదితంబ నీకు ని
ర్మత్సర! భాగ్యవంతుఁడ వరాతుల నోర్చిన యోగి వెందు నీ
వ్రాత్సరసీజమం దిముడవే? భువనంబులు మూఁడు నాకుఁ గ
ణ్ణోత్సవ మాచరింపు మను నూర్జితుతోఁడ నపత్య మిట్లనున్. ౧౧౩

వేన చరిత్రము

సీ. గురుసేవకుఁడు తపఃపరుఁడు తుంగాఖ్యుండు
వరమౌని గలఁడు శ్రీపర్వతమున
నా యోగి కే భాగధేయయోగంబున
నో? వేనుఁ డను సుతుఁ డుద్భవించెఁ
బాపుఁడు పాపసంప్రాప్తరోగంబులఁ
బరమాతురుఁడు దుఃఖభాగి యయ్యెఁ
దండ్రి నిదేశంబు దారిసూపఁ దపించు
చుండెను బెక్కేండ్లనుండి వాఁడు
మొదల నారోగ్య మామీఁద భూమిరాజ్య
మెద నిడి తపించువాఁడు దేవేశుఁ డొదవ
నవియు నీఁకకొన్ని వరముల నడిగి చెంది
సంతతికిఁ గూడ నవి సేర సంతరించి. ౧౧౪

క. కొనియాడి వారి స్వభాగ్యముఁ
గొనియాడి రమేశ! నీ యకుంఠచరిత్రం
బును ధర్మాధర్మంబుల
వినిశ్చయము ధర్మనృపుల విధముల ననుమా. ౧౧౫

గీ. శంఖచక్రగదాధర! జగదధీశ!
నీదు నవతారములు పెక్కు నేల సుప్ర
సిద్ధములు వానిలో నెల్లఁ జిత్రతరము
లరయ నెందు దత్తాత్రేయగరిమము లని. ౧౧౬

గీ. అతఁడు సంతుష్టుఁ డై సంకటాబ్ధినుండి
పృథివిపతుల నెందఱినో? తప్పించె ననియు
వింటిఁ దచ్చరితంబున విధము నాకు
వేడుక భవన్ముఖంబున వినఁగ ననుడు. ౧౧౭

## నహుషచరిత్రము

చ. కడుఁ గృపఁ గేశవుం డనె సుఖప్రియ! తుంగసుతుండ! వేన! నీ
యడిగిన విన్ని యున్న యితిహాసముఁ జెప్పెద నొండు వింటివా?
పుడమికిఁ జెడ్డ కూర్చు నృపపుంగవుఁ డాయువు వాని పే రొక
ప్పుడు విడఁబోవఁ డన్ననుడిఁ బున్నెము కాక తలంపఁ డన్నెముల్.

ఉ. ఐలసుతుం డతండు బలమా? యశమా? తపమా? విలాసమా?
శీలవివేకదానమఖశీలిమతిక్రమమా? తదన్యు నే
వేల నిదంవిధంబుగ భవిన్ భువి నొక్కని నాశ్రయింప వా
వేలుపుఱేఁడె తేఁడు పృథివిన్ దదుపజ్ఞుఁ డతండె తేఁ డనన్. ౧౧౯

గీ. సత్యధర్మజ్ఞుఁ డిందువంశమ్ముసొమ్ము
నృపతిసత్తముఁ డొకఁడె తా నేలు నేల
నిన్నిఁటి కలంకరణ మగు చిన్నికొమరు
డుండరాడా? ధయుకం డను నూర్మిఁ దవిలె. ౧౨౦

చ. కొడుకులు లేని చింతఁ బడి కుందుచుఁ గూర్చె ననేకయత్నముల్
కడచెడు గాల మొంటఁ గనఁ గానఁడు తత్ఫల మించుకేని త
య్యొడయఁడు వారు వారుఁ దనయొద్ద వచింప సమాహితాత్ముఁ డై
వడివడిఁ బోయి దత్తవిభు పాదములం బడి మ్రొక్కవెట్టఁగన్. ౧౨౧

సీ. పూవుల క్రోవులు ముత్యాలసరులు హ
ర్మ్యాచ్ఛచందనగంధ మంటి తేప
మదిరారసంబు నర్మదసమ్మదక్రమం
బత్తుల కెగదట్టి హాయి నొసఁగ

నంబరమధ్య దిగంబరమధ్యంబు
నన్యదర్శనముల నాఁగి మెఱయ
నాట్యవేదంబు గాంధర్వసర్వస్వంబు
నొండొంటి కలయిక నుజ్జ్వలముగ
వయసులో నున్న చక్కని వారిజాక్షు
లోలసి చుట్టును దోడునీడలుగఁ గొల్వ
జ్ఞానయజ్ఞోపవీతి యై స్వమతి నున్న
విప్రమునిఁ జూచె నల్ల భూమిప్రభుండు. ౧౨౨

క. అ క్కలిమి నున్న యమ్మునిఁ
జక్కం గనలేక చేరి చరణనలినముల్
గ్రక్కున నిరుసేతులఁ గొని
మ్రొక్కె నృపాలుండు దన్నె మొద వన నతఁడుక్. ౧౨౩

సీ. ఎఱుఁగవా? నన్ను పో ప్పిమ్మప్పుడ కడదేర్తు
నింతకన్నఁ బ్రసాద మేది? దేవ!
యున్మత్తుఁ గొనియాడె దుమ్మొత్తలం దింకె?
యన్నిపిచ్చి లడంప నాశ్రయింతుఁ
ద్రావరా! నాతో సురలు నేర రోరు లిట్లు
నీ యాన కన్నె మా నియతి కలదె?
యెవ్వరు నేర్పిరో యింత మొండితనంబు
గురువు లీశు దృఢా ప్తిఁ గూర్తురె కదె?
యనుచు దర్పంబునం బల్కు నట్టి తనకు
ననునయంబుగ నొడువు నయ్యాశ్రవుపయిఁ
గనలు కన్నుల మెఱయింపఁ గ్రాచి యుమిచె
శీధురసగంధిలోష్ఠనిష్ఠీవహాళిక. ౧౨౪

ఉ. శా దనఁ దూదిపల్కఁడు సుఖం బనుఁ గష్టమ యేని భక్తిసం
పాదితతత్పరత్వమున మానసముం బరిపూర్ణ మయ్యె ని

తోన్మదయదుత్సుకత్వమున నుర్విపిభుండు విభుణ్ భజించె ని
ర్వేదము లేక రాజసమురీతి యెటో? చనఁగా శతాబ్దముల్. ౧౩౫

సీ. అత్రియు ననసూయ య ష్టవిచారంబు
విడిచి పుత్త్రముల ని న్వొలుచుకొనిరి
బ్రాహ్మణాకృతిఁ గొన్న పరమపూరుషుఁడవు
గరుడధ్వజుండవు హరివి వరద!
యిన్నిపోకలు పోయె దీశ్వరేశ్వర! యిదె
మా యమ్మ మాయ యిమ్మాడ్కిఁ గొలువ
శరణాగతాతివత్సల! శర ణంటి న
ముద్ధరింపుము హృషీకోజ్జ్వలుండ!
వందనమ్ములు దేవదేవా! రమేశ!
ప్రణతు లష్టాంగసంగతాస్పదము లనఘ!
విశ్వనాయకుఁడ వని ని న్విశ్వరూప!
విశ్వదాత వటంచు నే వింటిఁ గొంటి. ౧౩౬

క. భగవంతుఁడ! ని న్నెఱుఁగుదు
జగన్నియంత వని యింక స్వామి! విడుతునే?
వగ లేల? చింతకొమ్మం
దగఁ బట్టితి గాదు సిగ్గుతరు విది యనుచున్. ౧౩౭

చ. విడువక పట్టు పట్టి తను వేయి విధాల భజించు వాని దే
వుఁ డెటు త్యజింపఁగల్గు నొకపూట తగం గని రాచవాఁడ! నా
నుడి విను వంచుఁ జేసెదే? యనుత్తమమాంసముఁ దెమ్ము భోజన
మ్మడిగెద మేలి శీధురస మానఁగ నిమ్ము కపాలసంస్థమున్. ౧౩౮

మ. అనుచుండ న్మునినాథునర్థితము నత్యర్థప్రియస్వాంతుఁ డై
యనువొప్ప న్నమకూర్చెఁ దాన నియమం బొస త్తియు న్శ్రద్ధయుం
దనరం ద న్నటు సేవ సేయ నవు గోత్రానాథుచిత్తంబు మె
చ్చి నితాంతా ప్తి వచించె నత్రితనయశ్రీపాలుఁ డుద్వేలుఁడై. ౧౩౯

క. మానస సంపాతంబు
న్మాని నృపేంద్రుండ! యడుగుమా వర మెదియే
న్మానుషదుర్లభ మే నది
నానావిధమే నొసఁగుదు నాకపతితత్త్వోర్క్. ౧౩౦

క. అని యను మునివరు వరవా
గ్జనితానందుఁ డయి మధ్యజగతీనాథుం
డనుపదము చుట్టి వచ్చెను
వినయమ్మున మూడుమార్లు విజ్ఞాపించెన్. ౧౩౧

సీ. ఇచ్చెద వర మంటి వీతనికిం గృప
మునిసత్తమా! యంత పున్నెమున్నఁ
బుత్రు నిమ్ము గుణాఢ్యు భూమజ్ఞు పాడ్గుణ్య
గణ్యువిజ్ఞాను విక్రమనిధాను
నాతఁ డజేయుఁ డౌఁ గాత క్షత్రియులకే
కాక దేవాసురానీకములకు
నమరధరామరస్వాధీనుఁ డై వాఁడు
ప్రజఁ బరిపాలింపవలెఁ బ్రజ వలె
యజ్వ శూరుఁడు దాత సంత్యాగి భోక్త
వేదశాస్త్రాబ్ధివనిష్ణాతుఁ డాదిరాజ
యశుఁడు శరణాగతావనుఁ డహతమతి ని
రామయుండు సంగ్రామాపరాజితుంగను. ౧౩౨

ఉ. సాదితశత్రుఁ డుత్తపుఁ డసప్రతిపక్షి సమగ్ర మహా ధను
ర్వేద మపారముగ్ హృదయవీధి గడించినవాఁడు వంశసం
పాదకుఁ డిన్ని యేటికి భవత్కృపతోడ జనించినాతఁ డే
మాదిరివాఁడు గావలెనో? మా కగు నట్టి సుతుం డమేయుఁడా! ౧౩౩

క. అను వాని కనెఁ దథాస్తని
యనితరసులభుఁడు విభుం డనన్యాదృశుఁడే

జననాథ! సీతనూజుం
డనూనుఁ డుదయించు వైష్ణవాంశధరుం డై. ౧౩౪

ఆ. ధనము లేని వాఁడ ధారుణీనాథ! నీ
కేమి యిడఁగలాఁడ నిదె ధనంబు
దత్తదత్త మనుచు దయితకు నిమ్మని
ఫల మొకొం డొసంగి పంచె నృపుని. ౧౩౫

మ. ఫలముం గైకొని మ్రొక్కి దీవనల సంపాదించి యభ్యంచితున్
సెలవా? యం చతఁ డూ యనన్ గదలి నిర్నిద్రుండు తేఁ డింటికిన్
లలిఁ జేరం జని డాయవచ్చు దయితన్ లాలించి యర్పించెఁ ద
త్ఫల ముద్యత్పులకాంగి యై ప్రియ ప్రసాదం బంచుఁ గన్నుద్దఁగన్.

గీ. ఇందుమతి పేర స్వర్భానునందన యది
ఫలఫలం బారగించె గర్భము ధరించె
నట్టి విధ మాలకించి రమాంచితుండు
రాజవరుఁ డెంచరాని హర్షమున మించె. ౧౩౭

ఉ. ఆ వరవర్ణినీతిలక మా రజనిం గలఁ గాంచె నొక్క ది
వ్యావయవుం గృహాగతు మహాపురుషున్ శుభదున్ రవిప్రభున్
భావితకుండలున్ విశదభాసితవస్త్రవిభూషణాంగరా
గావృతు ఛత్రి నత్రితనయాకృతి నాకృతిమానసీయునిన్. ౧౩౮

చ. అతఁడును భావినిం బిలిచి యాత్మకరస్థితశంఖనిస్సర
ద్వితతపయఃప్రసారముల వేమఱు స్నాపితఁ జేసి రత్నసం
యుతఫణవత్సహస్రఫణ మొక్క భుజంగము ధామభాసకం
బతిసితము న్సుధాకలశ మం దిడి నవ్వుచుఁ బువ్వుఁబోఁడికిన్. ౧౩౯

గీ. అమలచరితుండు భర్త మహాయశంబు
మూర్తి వోని దీనిని గళమున వహింపు
మనుచు ముక్తాకలాపంబు నట్లొసర్చి
హస్తమునఁ బద్మ మొసఁగి వాఁ డరుగుటయును. ౧౪౦

ఉ. నిద్దుర లేచి యత్తరుణి నేతకుఁ జెప్పె సమస్త మాతఁడుం
బెద్దలఁ బిల్చి యప్డె వినిపించె నిదంవిధ మందు శౌనకుం
డద్దిర యిస్థలం బొసఁగినట్టిఁడ యిప్పుడు నిర్వహించెదుం
దద్దయ కిద్ది యెంత? యని తద్వ్రతిం బొనరించెఁ గ్రమ్మఱన్. ౧౪౧

శా. దత్తాత్రేయవిభుప్రసాదమున నుద్యద్వైష్ణవాంశంబు పు
త్రోత్తంసం బుదయించుఁ దల్లి కది కాదో? కంఠసంభూష నీ
విత్తం బాతనిచేత రక్షితము గావింపంబడుం దివ్యసం
పత్తిం గూర్చెడు నిందువంశమునకున్ భద్రం బవున్ భూవరా! ౧౪౨

క. ఇంద్రోపేంద్రసమద్యుతి
చంద్రయశుఁడు వంశకరుఁడు శస్త్రము శాస్త్రం
బుం ద్రయితో నాఁకగొనుం
దంద్రారహితుండు వాఁడము తనయుం డధిపా! ౧౪౩

క. అని శౌనకముని యింటికిఁ
జనె నితరులఁ బుచ్చి తేఁడు చానయుఁ దానున్
ఘనహర్షావిష్టము లౌ
మనములతో నుండఁ గాలమానము గడచెన్. ౧౪౪

ఉ. హుండుఁ డనంగ నుండె నపు డొక్కఁడు రక్కసుఁ డుక్కుమీఱి యా
ఖండులునందనంబున సుఖంబుగ నాడఁ దదాత్మజాత యా
నందజయాన పిండుగొను నాలులతోఁ జనుచు న్వినె న్సుఖం
బెండ పదంబు లొండొక వహిం బడఁ జారణగీత మొక్కెడన్.

గీ. ఆయువుగృహంబునందు మహామహుండు
విష్ణుతుల్యపరాక్రమవిక్రముండు
హుండుచావున కుదయింపనుండె రేపొ?
మాపొ? సిద్ధప్రసాదసంపన్నుఁ డతఁడు. ౧౪౬

క. అను గీతము విన్నంతనె
వినిపాతం బొదవె ననుచు వెసఁ జని తండ్రిన్

విని పించెఁ దద్గతార్థం
బును సాకల్యంబుఁ జిత్రమున మది మునుఁగన్. ౧౪౭

చ. వెనుక నశోకసుందరి శపించిన దిమ్మెయి మత్స్యరాకృత
మ్మున సమకూరె నంచు మనమున్ స్మృత మై వికలంబు గాఁగ న
మ్మునిజనదేవమానవవిమోహనుఁ డుండి క్షణంబు గర్భనా
శన మొనరింతుఁగాక నృపుసాధ్వి కటంచుఁ దలంచె నెమ్మదిన్.

క. రూపౌదార్యగుణాన్విత
భూపాలకపత్నిఁ జూచె సంతతతేజ
శ్రీపూజిత నభిభూతా
లీపాలిత నప్రధృష్య లీలాలోలన్. ౧౪౯

ఉ. భీషణభాషణాకృతివిభీషణసత్త్వవిశేషతత్త్వను
ద్వేషభిభీషికల్ నృపసతీమణికిం గలఁ గానిపించి యా
ద్వేషి ఫలం బొకింతయు మతిం బొడగానఁడ విష్ణుతేజ మ
య్యోషకు మూఁడు రూపముల నోపి స్వరక్షణ మాచరింపఁగన్.

క. చేసిన యుద్యోగమ్ములు
వాసిచనన్ రంధ్ర మరయు వాఁ డటు లుండన్
భూసూర్యుఁ గొడుకుఁ గనెఁ దతి
నాసతి సద్గ్రహము లుదయ మం దెనయంగన్. ౧౫౧

ఉ. లోపలి కేగఁగా నులికి లోఁబడి వాకిలిఁ గాచు దానవుం
డేపున నట్టి వార్త చెవి కింపుగఁ జెప్పెడు దాసిఁ బట్టి ని
ద్రాపితతద్గృహాంతర మరంబ చొరంబడి దైవగర్భసం
దీపిత మర్భకాంగకముఁ దెచ్చి నిజాలయమందుఁ జొచ్చినన్. ౧౫౨

గీ. ఎదురుగా వచ్చి తద్దేవి యేమి యిది య
టంచుఁ బ్రశ్నింప బాలకు నంచిత కిడి
పీనిఁ దణిగించి వండించి భిస్స యొసఁగు
మంతకుఁ డితం డటంచు నుదంత మనిన. ౧౫౩

శా. ఔరా యెంతకు నైన నిర్దయత నర్హం బౌనె! యిబ్బాలు నం
హారం బందు నొనర్పఁగావలెనె? యాహారంబుగా నంచు నా
ధీరప్రజ్ఞ పతీప్సితం బుడుప నౌ ధీ లేక రావించె వే
సైరంధ్రీ! యని మేకలాభిధ సమాజ్ఞాపించె నాథోక్తముగ. ౧౫౪

గీ. అదియు న బ్బాలుఁ గొని చని యందియిచ్చె
వంటవానికి విభున కై వండు మనియె
వాఁడు వడిఁ గత్తి యెత్తి యవ్వానిఁ గొట్టె
నది విఱిగె నవ్వె నొత్తిలి యర్భకుండు. ౧౫౫

గీ. అది వినియోఁ జూచె సైరంధ్రి యర్భకుండు
కాఁడు వధ్యుండు సూద! లక్షణము లెన్న
దేవరాజును మఱపించు దివ్యమూర్తి
యన్న సూదుండు దానితో ననియె మరల. ౧౫౬

సీ. ఎవ్వని బాలుఁడో? యీతండు తేజస్వి
రాజలక్షణతనుభ్రాజమానుఁ
డేల భక్షింపఁగా నెంచెఁ బాపాత్ముండు
హాలుండాధముండు గానండు మీఁద
ముద్దులు ముడివైచు నిద్దారకునిఁ జంప
వచ్చునే? గళముపై వచ్చుఁగాక
దైవం బెవనికిఁ బ్రదక్షిణం బై యుండె?
రక్షించు నెవనిఁ గర్మంబె సతత
మాపదలనుండి జీవించు నతఁడు దుర్గ
ము లవు నెలవులనుండి విముక్తుఁ డగును
విసరి నదిమధ్యమున వైవ వెలువడు నతఁ
డగ్గిఁ బడవైవ మ్రగ్గఁ డయ్యావిధి నతఁడు. ౧౫౭

ఉ. రాజకుమారుఁడో? యమరరాజకుమారుఁడొ? వీనిఁ జంప నౌ
నా? జనమాన్యుఁ డౌ నితఁ డనంతపదం బొనయుగా ధరిత్రి లే

రా? జనకుల్ పవిత్రులు సుర ల్గననేర్తురె? యిట్టి సంతతిన్
భూజముఁ గొట్టవచ్చుఁ బసి మొక్కను గిల్లఁగవచ్చు నెమ్మొయిన్?

ఆ. ఇట్టి వెన్ని సేసి యీ గర్భదాసత్వ
మెనసినారమో? రమేశ! చాలు
ననుచు మెత్తపడియె నాతండు సైరంధ్రి
వాని గతికె దైవవశత నయ్యె. ౧౫౯

ఉ. ఇమ్మెయిఁ జింతితం బొలసి యిద్దఱు నద్దమరేయి నాక ధై
ర్యమ్మున బాలుఁ గైకొని యరణ్య వశిష్ఠుని యాశ్రమ మ్ముపాం
తమ్మున కేగి భద్రముగ ద్వారతలంబున వానిఁ బెట్టి యే
ణామ్ముపలాలము న్వరగుణమ్ముగ వండిరి పెట్టి రిమ్ముగన్. ౧౬౦

గీ. దానిఁ దిని త్రేపి సంతుష్టతనుహృదయత
నదయుఁ డా రక్కసుండు నిద్రాప్తుఁ డయ్యె
వాని నటు పుచ్చి తినిపించి వీని నెదియొ
యత్ను లిటు మూసి విధి సాధితార్థ మయ్యె. ౧౬౧

గీ. పాండరాక్షసు చింతిత మొందు సేయు
వారి కటు తోడుపడి యామవతి సుడివడి
యెఱుకపడనేనిఁ దనదెస నేమి వచ్చి
పడునో? యని తెల్లమొగ మయి పాఱిపోయె. ౧౬౨

ఉ. అంతకుమున్న కృత్యపరుఁడై నిదురం బెడఁబాసి మౌని వృ
త్త్యంతరహీన మైన మతి హంసగతిం గమనించుచుండి వి
శ్రాంతికి లేచి వచ్చి యుటజప్రతిహారమునందుఁ జూచె న
త్యంతమనోహరంబు వనితాద్భుతము న్నృపసింహశాబమున్. ౧౬౩

ఉ. చూచిన యంతనే మునుల సూరెల వారలఁ బిల్చి కంటిరే?
యీ చినవాని నబ్జవదనేక్షణు రాజసలక్షణు న్ద్విజో
కోచితజాతిధర్మ్మ నెవరో యిడిపోయిరి నాదు వాకిటన్
దాచిన దాగునే? మణి సుతార మటంచు వసిష్ఠుఁ డాడినన్. ౧౬౪

క. చెచ్చెర మునిమునిపత్నులు
వచ్చిరి కనుఁగొనిరి దివ్యవర్చసు శిశువు
న్లచ్చిమగఁ డనిరి కా దని
రచ్చెరు వని రాత్మఁ గుతుక మతిశయితము గాన్. ౧౬౫

ఉ. చేతులు సాచి కైకొనె వసిష్ఠుఁడు బాలు వరిష్ఠు నంతలో
భూతములుం బ్రసాదముఖభూతము లయ్యె నిలింపసృష్టమా
నాతతపుష్పవృష్టికి ననంతర మై విలసిల్లెఁ గిన్నరీ
గీతియు దుందుభిధ్వనియుఁ గేవలవేదమునిప్రవాదముల్. ౧౬౬

క. నహుషుఁ డను పేర వెలయు
న్విహతాఖిలదోషుఁ డగుట వీఁ డని ముని త
ద్బహుభావిచరితదర్శన
గృహీతసకలార్థుఁ డనియెఁ బ్రీతి వెలిఁ బడన్. ౧౬౭

ఉ. ఆతని జాతకర్మము తదాది వారిం గరణీయ మెల్ల వి
ఖ్యాతతకీర్తి బ్రహ్మతనయప్రవరుం డొనరించెఁ దండ్రి యై
యా తరువాత శిష్యుఁ డగు నాతనికిం గురుఁ డై యొసంగె వి
ద్యాతతి వేదశాస్త్రవిహితాగమగీతపురాణధోరణుల్. ౧౬౮

గీ. తానె చేయించె నోలి వేదవ్రతములు
దానె నేర్పె ధనుర్వేదతద్రహస్య
మతులకలల నితరముల నారితేఱఁ
దానె వేదాంతవిజ్ఞాన మానతిచ్చె. ౧౬౯

శా. వేదమ్ము ల్స్మృతులుం బురాణములు హృద్వీథి న్వసింపన్ ధను
ర్వేద మ్మస్త్రము శస్త్ర మయ్యెడనె చేరెన్ బ్రాహ్మణక్షాత్త్రతే
జోదర్పమ్ములు మోమునన్ భుజములం జూపట్టె వేర్వేఱ సం
పాదించె న్సుగుణంబు రాజనయముల్ బాలుం డబాలుం డనన్.

క. దత్తప్రసాదమం దే తత్త్వాదృగ్విభవ ముండె దాని వసిష్ఠుం
డెత్తి వివరించెఁ గాలము విత్తనమున నిమిడి యున్న వృక్షముఁబోలెన్

మ. శరచాపంబులు దాల్చి శూరమణి యాచార్యుం దగం గొల్చి పో
పురమం గాంతురు తెప్ప వాల్పని కనుల్ పున్నెంబునం గల్గు నా
మరమూర్ధన్యు లటన్న భాగ్యమున సామ్యం బంద కున్నారొకో?
నరు లీ నాఁటికిఁ గాననాంతచరసంతానంబు లంతంత గాఁన్. ౧౨౨

క. కుంజలుఁ డమ్మొయి ననెడు క
పింజలు నడిగెం దనూజ! పిత మాతయుఁ ద
త్సంజాతు నట్లు గోల్పడి
మంజిమ మెడలంగ నెట్టి మాదిరి కైరో? ౧౨౩

క. అనుఁడుఁ గొడుకు కిట్టు లనె నది
విన నన శక్యంబు గానివిధ మైనం ద
ప్పునె? శ్రోతకు వక్తకు నె
మ్మన మనువొనరించుకొని క్రమం బెనయవలెన్. ౧౨౪

సీ. ప్రసవవేదనఁ జొక్కి ప్రాల్మాలి కనుమూసి
యంతలో లేచి హా హా యటంచు
నటు నిటుఁ గనియెఁ గంకటిక్రింద లో వెలి
నెక్కడఁ జూచిన నేమి గలదు?
ఉపమారహితు దేవతోపము నా బిడ్డ
నెవరు హరించి? రే నేమి సేతు?
నని రోదన మొనర్చె యక్షులు పక్షులు
నాలకింపంగ మర్యాద వాసి
యాయు వను రాజు దేవేరి యధికభాగ్య
మానినీమణి మృద్వి స్వర్భానుతనయ
దాని విని నిద్ర వదలి యద్దానిచుట్టుఁ
జేరి నిర్ఘాతపడినట్లు చెలు లొదిగిరి. ౧౨౫

ఉ. వారలఁ జూచి మొత్తుకొనె వారిజలోచన లోచనాబ్జము
ల్వారిధు లై పయోధరముల న్సుహితార్థములం బొనర్ప నె

వ్వారికి నెందుఁ గల్గవె విపత్తులు? నోములు నోచి నోచి నే
నోరిచి కన్న కాన్పు జగ మో యనఁ బోయిన దేమి మాయయో?

సీ. ఆ మహాత్ముండు దత్తాత్రేయదేవుండు
సంతుష్టు డగుచు బిచ్చ మిడినాఁడు
తన సంపదల కెల్ల యని కొంగుఁ జాచినాఁ
డఖిలావనీశుఁ డీ యాయునృపతి
యిది నా యదియె యంచు నిది మురిసెన కాని
యమరునే? మందభాగ్యకు నిధి యది
పొంచి సకాము లై పుత్త్రికుఁ గొనిపోయి
రెంతటి దారుణస్వాంతులో కదె
కొడుక! యెక్కడ నున్నావొ? గుణనిధాన!
యెవరు గొనిపోయినారొ? నీ యెలుగు సూపు
సోమవంశాభరణము నే చోరు లిట్లు
దోచుకొనిపోయిరొక్కొ? బ్రదుకఁగలరొకో? ౧౭౭

గీ. రాజలక్షణలక్షితు రాజమాను
నిన్ను నా ప్రాణములతోడఁ గొన్నవార
లెవ్వరో? యెఱుంగరాదాయె నేమి సేతు
నెక్కడకుఁ బోదు? మొఱ వెట్ట నేది దిక్కు? ౧౭౮

సీ. లేదు పొమ్మంటినొక్కొ? దాచుకొన్నట్టి
యర్థ మన్యులకు జన్మాంతరమునఁ
బాపాత్మురాల నై పరులబిడ్డల నెడఁ
బాపితినొక్కొ? యెూర్వమి నిటులనె
యపహరించితినొ? మే లవు రత్నముల మున్ను
పుత్త్రిరత్నమె కాకపోయె నాకు
సఖులు తల్లడపడ సాధించితినొ పగ?
తత్పాపఫల మింత దారుణంబె?

వైశ్వదేవంబు తటిఁ గని వచ్చినట్టి
విప్రునకు నన్న మిడకుండ వెడలనడఁచి
తింటినో? శ్రాద్ధభోక్తలు "దేహి" యనిన
మాంస మిడక మొఱంగు సంబరమొ యిది? ౧౭౯

చ. అని కరుణాకులమ్ముగ మహార్త్తి వచించి విరించిత్రాత మొ
ట్లును దొలఁగింపరాని దని లోఁగొని గో వన నూర్పువుచ్చుచున్
మనుగడ కింక నున్నదియొ? మార్గ మనం బుడమిం బడెన్ వెసన్
బనవుచు మూర్ఛవచ్చి నరపాలుఁడు నో యన నాలు లాగఁగన్.

ఆ. లేదు తపముఫలము లేదు దానఫలంబు
లేదు లేదు సుకృతలేశఫలము
దారి డొంక లేక దైవమే చెడుచోట
నడ్డపడెడువార లనియు లేరు. ౧౮౧

మ. అని రాజేంద్రుఁడు సొమ్మవోయి విదితుం డై చిత్త మట్టిట్టు గా
ననుచింతం బడి యెంతమాట? తన కొనాపత్తితో నిన్నిఁటిం
గొనబే లే దన నా తరంబె? తనయుం గోల్పోక నా పున్నెమం
దనిరూప్యంబు కొఱంత గల్గి యనరాదా? యాయె ని ట్లేదియేన్.

ఉ. ఆయు వనంగ రాజు గలఁ డాతని కెట్టులొ? లేక లేక భూ
మాయువు పుట్టెఁ బుత్త్రుఁడొకఁ డాతఁడు నూచుచునుండ మాయనై
పోయెఁ బరక్షణంబునన పున్నెము లట్టి వటంచు లోకు లా
ఖ్యాయికఁ జెప్పుకొందు, రరియా? కనరాఁ డెది యాచరింప నౌ?

చ. అమృతుఁడు పుత్త్రుఁ డెవ్వనికి నా యని యేమిటి కేడ్వఁగావలెన్?
విమతహ్కృతుండు; లేఁడు పృథివీపతికిం బరుఁ డం చొకండు, పు
ణ్యమున నవద్య మున్న నెటు లబ్బును? దాదృశదత్తసుప్రసా
దము, పయిమాట కుండదు పథం బెటులు న్వొలిఁబాఱ దైవమా!

శా. అక్షయ్యం దనయుం గుణాకరుఁ బవిత్రాఖ్యాయికోపేతు భ
వ్యక్షాత్రుం గను మన్న దత్తవిభు దీవ్యద్వాణికిం గల్గ దే

విక్షోభంబున నన్యథాత్వ మనియో వీక్షించె నాకాశముం
జాక్షాన్నారదమౌని గానఁబడియో సంభ్రాంతుఁ డా జేఁడు గాన్.

గీ. అతఁడు దరిసె నభ్యుత్థాన మాచరించె
యితడుఁ బ్రొక్కెను దీవించె నతఁడు మరల
పాద్య మర్ఘ్యం బటంచు నృపాలుఁ డలిచె
నారదుఁడు చాలుఁ జాలు నాచార మనియె. ౧౮౬

శా. రాజేంద్రా! యొకమాట కే నిట కిటుల్ రాఁగల్గె నేమంటివే వ
వ్యాజం బైనది దత్తదేవుని ప్రసాదార్థం బటం చట్టిదే
యాజాడ న్మదిఁ ద్రిప్పఁబోకు మనవద్యత్వమ్ము నన్మెచ్చ యా
నీ జాతుం డొక దేవకార్యమున కున్నీతుం డఘుం జేటికిన్? ౧౮౭

ఉ. ఆ సుఖజీవి యింతకు మహాత్ముఁ డనం దగువానిఁ జెందె హా
డాసురు సంహరించి భవదంతికమం దెనయు న్సతీయుతుం
డై సిరివల్లభుం డన మహావని నేలు దివంబు నేలు వీ
లౌ సమయంబునందు విజితాశుల యావులు వేల్పుటాలపో. ౧౮౮

క. అని యింతకు మిక్కిలి చె
ప్పన రా దని చెప్పిపోయెఁ బరమర్షివరుం
డు సభావీధి నృపాలుం
డనుకూలకలత్రమునకు నది వినిపించెన్. ౧౮౯

మ. మృతసంజీవనతుల్య మా నుడి విన న్మిన్నందె నమ్మేదినీ
పతిరాజ్ఞీతిలకంబు హర్షమున సంభావించె దత్తేశ్వర
ప్రతిపన్నంబు వరంబు రిత్తచనునా? ప్రధ్వంసితాశేషసం
సృతిబంధుం డయథార్థము ల్వలుకునా? క్షేమంబె మా కంచెదన్.

క. అజరామరసంతానము
ద్విజవర్యుఁడు మాకు దత్తదేవుఁ డొసఁగినాఁ
డజవంద్యపదుఁడు వానికి
నజాయు విడకున్నవాఁడె? యన్యాదృశుఁడే? ౧౯౧

గీ. అనుచు నిందుమతీదేవి యతిశయించు
ప్రేమబంధమునం బుత్రుక్షేమ మెంచి
భక్తిసంజాత భక్తిసంపత్తి కగుచు
మౌనిపుంగవునకుఁ బలుమారు మ్రొక్కె. ౧౯౨

ఉ. ఆనతు లాచరించెదఁ బరాత్మున కీశునకున్ షడింద్రియ
జ్ఞానవిదూరవర్త్మన కజాగుణజాలనిబద్ధులై యహం
మానవిదూషితాత్ము లగు మానవదానవదేవతాదిక
ప్రాణుల నాదిసంసరణపద్ధతికారణ మాఁగువానికిన్. ౧౯౩

చ. పరముఁడు పూరుషుం డయినవానికి సాక్షికి శుద్ధబుద్ధికిన్
పరమవిశుద్ధబోధఘనభావవిభావ్యునకున్ మహామునీ
శ్వరునకు నత్త్రిపుత్త్రున కపత్రప యూడ్చిన వానికిన్ సురా
సురజనిహేతు వైన ద్విజసూత్రికి యోగికిఁ గూర్తు నంజలుల్. ౧౯౪

ఉ. పాతకవార్ధియొడ్డునఁ బ్రపన్నులఁ జేర్చు నెవండు దానవా
రాతిమహాశ్రితంబు సుతరత్నము మా కెవఁ డిచ్చె నట్టి వి
శ్వాతిశయప్రభావుఁ బురుషర్షభు నాద్యు శరణ్యు దేవతా
ధ్యాతుని సిద్ధవంద్యపదు నన్వహము న్స్మరణంబుఁ జెందెదన్. ౧౯౫

గీ. బ్రహ్మ యెవనిప్రసాదంబువలన వెలసె
రుద్రుఁ డంగాంగిభావసంరూఢుఁ డెవని
కెవనిఁ గింకరులై సుర లెపుడు గొలుతు?
రట్టి హరి దత్తమూర్తి మా కభయ మిచ్చు. ౧౯౬

గీ. నారు వోసిన పురుషుఁడే నీరు వోయు
నర్థి నర్భకు మా కిచ్చినట్టి విభుఁడె
యింతకుం గతి గావున నెచట నున్న
నోముఁగావుత వాని మా నోము తెంచి. ౧౯౭

క. అని యా లన మగఁ డనియెన్
నినుఁ జెందితి దత్తదేవ! నిఖిలసుఖములన్

గన నైతి నీ పదంబే
యనఘా! గతి యగుత మాకు నన్యము వలవన్. ౧౯౮

క. పురుషాధ్యక్షుండ! జగ
ద్గురుఁడ! సురేశుండ! నతులు గూర్తు నజస్రం
బురుగుణ! యేకాధ్యక్షా!
హరి! భవసంకట మెడల్పు మయ్యా! కరుణన్. ౧౯౯

క. దంపతు లీ మాదిరిగ ని
లింపస్తుతు శరణుఁ జెంది లీలామునితే
జింపు నెఱి నారదుని వా
క్యంపుస్మృతి న్నమ్మి సుఖితు లై యుండంగన్. ౨౦౦

మ. ఒకనాఁ డల్ల వసిష్ఠమౌని గురుఁ డిత్థౌజుండు బ్రహ్మాత్మజుం
డకలంకుండు సమాదృతిం బిలిచి వత్సా! భద్ర మాఁ గాత వ
న్యకు వేగం జని పుష్కలంబులుగ వన్యార్థంబులం దెమ్మనం
బ్రకటౌజుం డరిగెం బదార్థములు సంపాదించె రవ్వంతలోన్. ౨౦౧

క. గురువాక్యముఁ దలఁచుచు స
త్వరమె పరావృత్తుఁ డైన పార్థివతనయుం
డరుదుగఁ గిన్నరమిథునం
బరుగుచు దివి నాడుకొను వచోర్థము వినియెన్. ౨౦౨

సీ. ఆయువుకొడుకు మహాతేజుఁ డీతండె
యా నహుషుండు ధర్మాత్ముఁ డెందుఁ
దల్లిదండ్రులఁ జిన్నతనమున నెడబాపి
చేర్చె దైవమ్ము వసిష్ఠునండ
నిట్టి పుత్త్రుఁడు లేమి నిందుమతీదేవి
దుఃఖించు దానికిఁ దుది యెదో కదె?
యితనికి నై కదా యెంతయేనిఁ దపించె
శివకన్య సురుచిర తపసకాము

య య్యశోకసుందరి భాగ్య మది ఫలింప
నితనికో సంగ మిం కెవ్వ డెనయునాగునొ?
దత్తుఁడు వసిష్ఠుఁ డేదారిఁ దలఁచినారొ?
యవనికి దివికిఁ బండుగ యనఁగ నదియె. ౨౦౩

మ. అను పల్కు ల్విని చిత్రితాంతరుఁ డతం డాచార్యసంప్రార్థితం
బు నివేదించి ఫలాదికం బడిగె దివ్యు ల్వల్కు లి ట్లాడి శే
మని యాతండు వచించె వానికిఁ దదాద్యంతంబు నాజ్ఞాపనం
బొనరించెం దరువాతి య క్కథను నన్యు ల్మాను లా నా ననన్.

శా. వీరుం డా నృపసూతి సప్రదర మా విల్లంది మిన్నంది వి
స్తారోత్సాహత ద్రెుక్కె మానితతి కాచార్యాని కాదేష్టుకన్
ఘోరా వైరి నడంచి పత్నిఁ గొని సమ్మోదంబుతోఁ గన్నయ
వ్వారి న్నోక మడంగఁ గాంచు మని యవ్వా రెల్ల దీవింపగన్.

గీ. పూలవానలతో దుందుభులు సఱచుచు
వేల్పుగూడెమువా రెల్ల వింటఁ గూడ
వింటి శింజిని మొఱయంగ వెడలు రాజ
సుతున కెటు చూచినను శుభసూచకములె. ౨౦౪

ఉ. ఆక్షణమందు దేవనిచయంబులతో నెదు రై స్ఫురత్సహ
స్రాక్షుఁడు దేవదేవుఁడు నృపాత్మజ! భద్రము నీకు నస్మదీ
యాక్షతసూత కేతనసహస్రమహాశ్వరథంబు నెక్కి వై
రిక్షయ మాచరింపుము వరింపుము కాంత నటంచు నెమ్మితోన్.

గీ. అస్త్రశస్త్రంబు లొసఁగి మహార్హ్యము లటు
తీవిచి యాలింగన మొనర్చి దివ్యరథము
నందు నెక్కించె విజగీషు న న్నహుషుని
సారతాపసస్వాశీఃప్రసంగ మొప్ప. ౨౦౫

గీ. తీవ దివిచిన మాదిరి తేరు మెఱయ
నాకసమున వేఱొక్క యహస్కరుండు

దోఁచె నస నొండు క్షణమునఁ ద్రోవఁ గడచి
యాక్రమించె నరాతిపురాంతికమ్ము. ౨౦౯

ఉ. ముందరగా రథోత్తమము మ్రోతకు వీనులు విచ్చిపోఁగ నా
కందువ యిట్టిదంచు శివకన్య మతిం గని రంభ నంప నా
సుందరి యైయొదవు న్నహుషుఁ జూచి వచించె మహాభుజుండ! నీ
కుం దెలియంగ రానిది యొకొండును లే దయిన న్వినందగున్. ౨౧౦

ఉ. భవ్య! యశోకసుందరి తపస్విని నీకయి తన్వి తన్వి యా
నవ్యథ నవ్యధాత్రి నెనయంగ నసుందరి యయ్యె మాకు సం
భావ్య భవత్కటాక్షరస మాలిమి శోక మడంచు నింక నా
స్తవ్య యశోకసుందరియు సాధ్వియు నై యలయించెడి న్నినున్.

ఉ. దత్తవరప్రదత్తుఁడవు తాదృశరాజకులాభిజాత్య సం
పత్తి వశిష్ఠబోధకృతమంజిమ మెంతకుఁ జాల? దిట్టి ని
న్నుత్తరుణీలలామము స్వయమ్ముగఁ జేరి భజింప నిప్డు స్వా
యత్తత లేమి నీశ! నను నంపెఁ బ్రసత్తి వహింపు మా దెసన్.

క. ఈ హుండుఁడె నీ యర్థము
నా హరిణీదృశ హరించి యపపాపను ద
ద్గేహమున బద్ధఁ జేయుట
దేహము నెడవెట్టి యిదె మది న్నినుఁ జేర్చెన్. ౨౧౩

శా. ఆ యున్మత్తునిచేతి కందెగద య్యేమో ? యందువా? చాలుఁ గాల్
స్వీయాజ్ఞాపరిరక్ష్యమాణ సతి ధర్షింపగ వాఁ డెవ్వఁ డా
త్మీయం బైన తపంబు పెంపున నరాతి న్హస్తతప్తాత్మ సా
పాయుం జేసిన దీవు వచ్చితివి సర్వం బింక నిర్వృత్త మౌ. ౨౧౪

గీ. భాగ్యవంతుండు నతిబలవంతుఁ డైన
యాయుతనయుం డెడల్చు నీ యాయు వనుచుఁ
గోమలి శపించె నతని నా గొడవ సఖుఁడ
వైన నీతోడ మొఱవెట్ట నతివ దలఁచె. ౨౧౫

గీ. స్మరుఁడు హంసుఁడు నిద్దఱు శాత్రవు లిన
తనయ! నీ దేవి దుఃఖభాజన మొనర్చి
రాదిముఁడు మిత్త్రుఁ డౌ నంతిమారి మాఱి
మసఁగి నీ వేచి కై దండ యొసఁగితేని. ౨౦౬

క. నినుఁ గానఁగోరు నెచ్చెలి
కనువిం దవు విందు గుడిచి ఘనవాహనశ
త్రునిఁ బోరిగొనఁగా బిమ్మటఁ
జనెదవు రావయ్య యిపుడు సతి నెలయింపన్. ౨౦౭

ఆ. అనుడు రంభతోడ నవ్వు నింత యెఱుఁగుదు
నరి వధించి దయిత నరయవత్తు
ప్రాణసదృశ యంటి నని చెప్పి బుజ్జవిం
పు మని పంచి శంఖ మమితుఁ డొత్తె. ౨౦౮

ఉ. తన్నినదమ్మునం గలఁగె దానవహంసమహోదయాతిసం
పన్నగరమ్ము సర్వము విపన్నదవీయుఁడు వాని యంతరం
బన్న విశేష మున్నదె? మహాంబుధివర్గ మనర్గళక్రమా
భ్యున్నతి నట్లు గా నపుడ పుచ్చె స్వదూతు నిమిత్త మారయన్.

ఉ. దూతుఁడు పోయి వచ్చి తనతో దనుజు ల్దితిజు ల్పరిభ్రమ
చ్చేతను లై యిదే మని వచింపు మరం బని సంచలింప నా
యాతుఁ డరాతి పేఁ డిపు డహా మ్మని ని న్నెదిరింపనయ్యె న
య్యా! తఱితోడ సన్నహన మంచిత మౌ నటు లీవుఁ బోనవుఁన్.

క. అనవుడు నెవఁ డా శాత్రవుఁ ?
డను వెయ్యది? యెచటినుండి యాగతుఁ డయ్యెన్ ?
ఘనవైరకారణం బెది?
యని యడిగెను నసురవరుఁన కను గి ట్లనియెన్. ౨౧౦

సీ. పుట్టక పుట్టక పుట్టినాఁడఁట గోచి
మొలత్రాఁ డెఱుంగని మునివరమునఁ

దల్లిగర్భమునుండి ధరఁ బడెనో? లేదో?
చిక్కె నొంటనివాని చేతికి నఁట
యెటొ? తప్పించనెనఁట యింతవాఁ డౌట య
రుంధతీదయితు కారుణ్యమయఁట
యంతకు నంత తై యరి లెక్కఁ గొనఁ డఁట
యాయువుకొడుకు దీర్ఘాయువు నఁట
నహుషనాముఁ డంట నముచిద్విషుం డంపె
నంట స్యందనంబు నఖిల మిచ్చి
పొడుచుప్రొద్దుఁ దేజమునఁ జిన్నఁ జేసి వాఁ
డున్నవాఁడు దుస్సహుం డోరులకు. ౨౨౨

మ. అనుమాట ల్విని గుండె జల్లు మన నన్నా! తప్పెనే? దైవ మి
ట్లని పిల్చె న్వినఁ బత్ని దాని నుడి నాహ్వానించె దాసిన్ స్వసూ
దుని దోషాటుఁడు గ్రుచ్చి గ్రుచ్చి యడిగెన్ దూషించి యానాఁటి బా
లుని వృత్తాంత మదృష్టుఁ డయ్యె నతఁ డాలో నంచు వా రాడిరన్.

శా. ఇం కేమీ? ప్రతికూలదైవ మిది యె ట్లేఁ ద్రోవఁగా నేర్తు ని
శ్శంకాతంకతఁ బోర మార్కొని రిపుల్ జంకింతుఁ దేజోయశో
నంకంబు ల్సమకూరు దానభయ మేలా? చావకే యుందురే?
కంకాళంబు ధరించువార లెవరున్ గా ని మ్మటం చుగ్రుఁడై.

శా. లేదే? యింకొకదారి దీని కనుచున్ లీలావతీమంత్రిపౌ
రాదు ల్వల్కెడు పల్కులం దెగడి నిర్యాతుండు సన్నద్ధుఁడై
యా దుర్వారదురంతశాత్రవసముద్రాభిద్రుతుం డయ్యె మ
ర్యాద ల్దప్పు పయోధులా? యనఁగ సైన్యంబు ల్దనుం జుట్టి రాన్.

ఉ. దుస్సహుఁ డైన శాత్రవు నెదుర్కొని తీటతీర దింక నీవు నా
యు స్సని న న్ననిం గెలిచెనో? నరడింభక! నాలి చేతి హు
మ్మ స్సని యెన్న రాని యిషుమార్గణము ల్గురియించి మించు రం
హాస్సున సైన్యము ల్మిపుల నా సురసూదనుఁ డేపుమీఱెరన్.

మ. గదలుం గుత్తులు సత్తులు న్ముసలముల్ ఖడ్గాలు గొడ్డళ్లు మే
ల్ప్రదరంబు ల్పరిఘంబులు న్హలలు శూలంబు ల్బచక్రంబు లె
య్యది యెవ్వానికిఁ జేతి కందె నదియే యు య్యందఱుఁ జుట్టి రు
న్మదులై రక్కసు లొక్క లక్ష్యమున భూనాథాత్మసంజాతుపైన్.

ఉ. ఆయువు బిడ్డఁ డస్త్యుల పరాక్రమముం గని చాప మెత్తె నిం
ద్రాయుధసోదర మ్మొక శర మ్మరివోసెను టంకరించె సం
స్థాయదదస్స్వనంబునకె చచ్చిరి నొచ్చిరి విచ్చి రుచ్చల
త్కాయు లొగిం బలాయితులు దారితచిత్తులు నైరి శాత్రవుల్.

గీ. ఆహవం బొనరించిర యందుఁ గొంద
అధికధీరత హుండవీరానుచరులు
నభమున విమానములనుండి నాకులు గని
రొకని కిందఱితోడి యాయోధనంబు. ౨౨౯

సీ. మూడవ కూడెము లొంట పుట్టించె ముక్కంటి
యానాఁటి మంట చల్లారకుండె
దక్షాధ్వరమ్ము ప్రధ్వంసమ్ము గావించు
వీరభద్రు మొగానఁ బెచ్చు పెరిగెఁ
బరమేశ్వరుండు శంబరవైరి నేర్పుట
కల్లార్చు కనుదమ్మి నారి తేఱె
రాజులఁ జెండు భార్గవు పరశ్వధధార
మచ్చిక గ్రోతికొమ్మచ్చు లాడె
నదె ప్రతాపాగ్ని యన్న పే రవధరించి
దత్తువరము వశిష్ఠు ప్రసత్తిఁ గొన్న
నహుషుఁ జేకొని నేఁడు దానవకులముల
నీరుసేయుచుఁ గవిసిన దాఱి దింక. ౨౩౦

మ. అని దేవాంగన లాడు మాటలకు నీ రై పోవఁ జిత్తాబ్జ మా
తని విక్రాంతి ప్రభావశౌర్యములు సందర్శించి హుండాసురుం

డనివార్యక్రుధఁ బంచి గ్రుస్సుఱిమి నా యగ్రంబునన్ నిల్వ మి
ష్ఠ నినుం బుత్తు యమాలయంబునకు మర్త్యాపత్యమా! యం చనెన్.

చ. నిలిచితి నొంటి యుద్ధధరణిన్ నినుఁ జంపనె వచ్చినాఁడఁ బోఁ
గల వెటు పాపచేతసు నగల్పక పాఱకు మంత కంచు ను
ద్బలుఁ డల రాజసూతి విలు బాణములుం గొని సారథీ! యనం
గలన నొనర్చి హుండసముఖంబు రథం బతఁ డొక్క మాత్రలోన్.

గీ. అతిపతాకాఢ్య మైన రథాంతరమున
ఛత్రము ధరించి నిలిచి రాజప్రసవము
వొలిచె గగనస్థుఁ డవు రవి కలిమి నులిమి
హుండుఁ డాతని సమయింప నొనరి నిలిచె. ౨౩౩

ఉ. మాయకు మాయ మాట కొక మాటయు నేటున కేటు గాఁగ ను
న్మాయులు వోరి రిర్వు రల మానవదానవవీరపుంగవుల్
వాయక యట్టిటు ల్తొలఁగఁ బాఱక పాఱక మంత్రతంత్రసో
పాయవివర్తనంబు లనపాయము లై మది కూపు రెచ్చినన్. ౨౩౪

ఉ. జన్యము జన్యమా? వివిధశస్త్రము లస్త్రము లెత్తి యెత్తి య
న్యోన్యజిఘాంసఁ గొట్టుకొను నాతని యీతని యోట గెల్పు సా
మాన్యము లౌట నిర్ణయముమార్గము దోఁపమి వేల్పుసాములే
దైన్యము మోములం దెనయ దారితమానసు లై రదార్ధ్యతన్.

గీ. గర్జమానుఁ డా దానవు కడిమి కులికి
మునుల దఱిమిరి సందేశమున కమరులు
వాయుభూతులు వార ల వ్వార్త చెవులఁ
జొనుప జనపతిసుతుఁ డుద్భుజుండు పెరిగి. ౨౩౬

క. వందనములు వొనరించెన్
బృందారకవరుల కెల్ల విచ్ఛేయు మటం
చుం దలఁచె నెడఁద బ్రహ్మసు
తుం దత్పరత న్గురున్ సుదుస్సహుఁ డయ్యెన్. ౨౩౭

గీ. అర్ధచంద్రాకృతిశరంబు లప్పు డెత్తెఁ
దూణముననుండి రెండును దొడిగె వింట
నొక్కసారిగ మంత్రించె నుక్కసంగఁ
జూచెఁ జూడెడు విధమున సురవిమతుని. ౨౩౮

క. తెగయందవానిఁ దునుమఁగ
నగవైరివిరోధి చూచె నాతురుఁడై యీ
ర్తిగ తూఁపు లనిచె నిప్పని
యగునా? మనవలన ననుచు నవియె యడంగెన్. ౨౩౯

గీ. నహుషు రెండరనెల తూపు లనాతరయము
లగుచుఁ బరతెంచి త్రెంచె నయ్యసుర దేవు
సౌత్రదక్షిణకరము సవ్యము సచాప
మరయుచుండంగ నింకేమి యనఁగఁ గలదు? ౨౪౦

చ. అవి దునియంగఁ గ్రమ్మఁగొను నస్రపరంపరఁ దోఁగు మేను ప
ల్లవితరసాలజాలకపలాశనమంబుగ నప్పలాశియుం
బవి నవి బెట్టు గొట్టుకొను ధ్యానము నూన మొనర్చు నుచ్చల
ద్రవణముతో నరేంద్రజని గ్రస్తమనస్కత నాక్రమించినన్. ౨౪౧

ఉ. కోపము రూపుతో నెదురుకొన్నదియో? యన ధావమానుఁ డై
నా పరమారిఁ గన్గొనుట కామరవర్గమె కాకపోయె న
ద్దోపని తెప్పలే కనుల నోరలువారఁగ జచ్చెఁ జచ్చె న
య్యో పృథివీంద్రసూతి యని యూర్చుచు నార్చుచు నుండి రెల్లరున్.

ఉ. అమ్మెయి దుర్నివారుఁ డయి యాఁకఁగొనం గను దేవవైరి ధై
ర్యమ్మునఁ జీరికిం గొనక యైంద్రి నిలేంద్రకుమారుఁ డెత్తె వే
గమ్మున గాలి సారమున గ్రావవరమ్మును వైద్యుతాగ్నిఁ దే
జమ్మున లెక్కకుం గొనని శక్తి సులక్ష్యము సేసె శాత్రవున్. ౨౪౩

మ. బలవంతుం డటు లార్చుచు న్విసరి వైవం బోఱు నా సత్తి యు
జ్జ్వలతం గన్నులు మ్రోతలం జెవు లపాస్త్రప్రాయము ల్గా వెసన్

వలమానుం డవు లోకకంటకు మహోవతుంబునం జొచ్చి ర
క్తలసత్సాన్వకృతి వీపున న్వెడలి పోఁగాఁ బోయె దైవాధృతుల్. ౨౮౪

తే. శక్తిఁ జూచి యవియె సడలిపోయెనో? ముందు
సంగ్రహించుకొనియె శక్తి చనెనో?
యెట్టులైన నేమి? యెడసెఁ దత్ప్రాణమ్ము
లచల నొడలు వడియె నచల మనఁగ. ౨౮౫

వ. అది గని శోకమెక్కఁ జని రాసురవర్గమువారు శైలదు
ర్గదురవసానకాననసరస్సరసాతలసీమ లాముకో
నది గని తోష మెక్కఁ గని రా సురవర్గమువారు శైలదు
ర్గదురవసానకాననసరస్సరసాతలసీమల న్వెడక. ౨౮౬

ఆ. అట్టి పండువ తమ కమరఁజేసిన వీరు
నహుషు ముంచి తేల్చినారు సురలు
నందనంబునందు నందంబు చందంబు
వెలయ నపుడ విరియు విరుల సురలు. ౨౮౭

సీ. నోములు నోచిన రామణీయకసీమ
దరిసె నశోకసుందరి తటిఁ యని
రంభతో హర్షసంరంభాకృతిఁ గనంగ
నై పవిత్రచరిత్ర యా నహుషుని
సూర్యసంనిభు నతిశూరు నృపాలనం
దనుఁ దపస్విని ప్రీతి వినుతుఁ జేసి
మునుపటి విస్రంభమున సిగ్గుఁ దగ్గించి
ప్రాప్తకాలం బెంచి పలికె నబల
వీర! నేను నీకు విధివిహితం బత్ని
నమర నుద్వహింపు మమరదత్తఁ
దప మొనర్చుచున్నదాన నీయెడఁ బతి
ధర్మ మిచ్చఁ గొలిపి దారితారి! ౨౮౮

క. ఎన్నఁడు నన్నె మ్మెఱుఁగని
యన్నయమున నిన్నె తలఁచు నాత్మకృతం బా
పున్నెమ్మునఁ జెందితి నీ
పున్నె మ్మ్మేశ దీని నెట్లు ప్రోచెదొ? యనుడున్. ౨౮౯

చ. నియతముగా మదర్థ మవనిన్ శుభమూర్తి! తపించుచుంటివే
ని యతమనుండు మద్గురుఁడు నిన్నును నన్ను నెఱింగి కూర్చు నం
చయమహితుండు వోయె నల యంగద రంభను గొంచు నేకని
శ్చయమున న వ్వసిష్ఠునుటజంబునకుం బురుహూతు తేరితోన్.

క. తానును వారలు భక్తిన
తానను లై మ్రొక్కి నిలువ నందఱఁ దగ న
వ్వాన్మానియు దీవించెను త
ద్దానవవధవిధ మతండు తన గురున కనెన్. ౨౯౧

ఉ. పాపుఁడు రూపుమాసెఁ దన వాని పరాక్రమ మాక్రమించె ద్యో
భూపరభాగభోగ మని భూసురవర్యుఁడు హృష్టరోముఁ డై
తాన్మపతివంశవర్ధనునిఁ గౌఁగిటఁ జేర్చి స్వశిష్యుఁ డంచు ని
క్షేప మొనర్చె కల్యనిజగీర్వ్యపయాతిశయప్రియాళికిన్. ౨౯౨

ఉ. వారము లగ్నమున్ దిథి శుభంబు భ మెంచి యరుంధతీప్రియుం
డారసి బ్రహ్మవాదు లగునట్టి మునీంద్రులఁ జేర్చి కూర్చె న
వ్వారి వివాహమంగళ మవారిగ వారికిఁ దోడుసూపె నా
సారసమాజ మ మ్మహ మసామ్య మన న్వలసెం ద్రిలోకికిన్.

ఉ. అన్నెఱిఁ గొన్నినాళ్లు సన నా ముని రాజకుమారుఁ బిల్చి మా
యన్న! సురేంద్రుల న్మనుల హర్షపయోనిధి ముంచి తీవు నీ
చిన్నతనంపు వన్నెలకుఁ జిన్నెలకుం గుఱిసేసి దైవ మ
న్నన్న యిదంవిధంబు దగదా? యిఁక నేఁ దలిదండ్రులం గనన్.

గీ. పుట్టి యగపడకుండిన పుత్త్రుఁ డిపుడు
పండితుండును వీరుఁ డై పత్నిని గొని

వచ్చుచున్నాఁ డటన్న న వ్వారి పొంగు
వార్ధులై పాఱదే? యట్టివనికిఁ గమ్ము. ౨౫౫

క. అని బ్రహ్మసూనుఁ డనిచినఁ
బ్రణామములు గూర్చి తాను బత్నియు నాచా
ర్యుని విడలేక విడిచి చనె
ననూన మ య్యింద్రరథమునం దమరి వెసన్. ౨౫౬

గీ. తేరి వేగంబునం బోవు ధీరు నెదురు
కొనిరె జననీజనకులఁ గన్గొను నరుసము
తదుభయరయమ్ము లటు లాగఁ దా వెనుఁబడె
గురువియోగచింతాభరాధరయయుక్తి. ౨౫౭

క. ఈలో నచ్చర మేనక
వేలుపు లంపంగ వచ్చి వివరించె సతిన్
శీలవతి నిందుమతిఁ గని
బాలుని వృత్తాంత మెల్లఁ బరిపాటిమెయిన్. ౨౫౮

ఉ. దానవు హుండుఁ జంపి ముదితా! నహుషుం డన నీ కొమారుఁ డిం
ద్రానుజవిక్రమక్రముఁ డనంగరతి న్నతిఁ గొంచు వచ్చెడున్
మానుము శోక మింకిట సుమాళము మీఱ నశోకసుందరిన్
మానినిఁ గోడలిం గొడుకు మాలిమిఁ గైకొనుమా వరాననా!

గీ. అనుచు నేమేమొ మేనక యనుచునుండ
హర్షపారిప్లవవిలోచనాబ్జ యగుచు
నంతవట్టు వచించె ప్రాణాధినాథు
నకుఁ బ్రియంవదఁ గాన్పించి నహుషమాత. ౨౬౦

గీ. తనదు మెడ నున్న దివ్యరత్నమయ మైన
హార మెడలించి యిచ్చె నా త్మ్మోరమణుఁడు
దేని నద్దాని మేనకాదేవి కిచ్చి
యధిపు దేవేరి కృతకృత్య యై దలిర్చె. ౨౬౧

ఉ. అపుడు ప్రసన్నచిత్తుఁ డయి యాయునృపాలుఁ డనె న్వధూటి! స
త్యపుస్మృతి యింత నారదమహాముని చెప్పఁడె నాఁడు సంస్మృతం
బిపు డది యయ్యెఁ దుర్ మది మహీసురదేవుఁడు దత్తదేవు నె
య్యపు వరదాన మె య్యనువు నంది రహించెడు నిట్లుకానిచోన్?

శా. శుశ్రూషావిధి కిచ్చ మెచ్చి యొసఁగెన్ శూరున్ బ్రజాపాలుఁ బు
త్రశ్రేష్ఠు న్సకలాసురాసుహరణోదారప్రభావు న్సమ
స్తశ్రేయఃఖని వైష్ణవాంశధరు దత్తాత్రేయదేవుండు ది
వ్యశ్రీతుండు జనార్దనుండె వితయానా? తత్ప్రదత్తార్థముల్? ౨౬౩

మ. అని సోత్సాహత నందనాగమనభవ్యం బూర రాష్ట్రింబునం
దును జాటంబనిచెన్ బ్రహర్షమున నెందున్ వాద్యఘోషంబు లెం
దును నానాముఖదేవతార్చనము లెందున్ విప్రపుణ్యాహవా
చనమాంగల్యవిధానము ల్వొలిచె విస్తారంబు లై యయ్యెడన్.

గీ. అత్రి కని పెట్టి నట్టి దేవాదిదేవు
శోకములఁ బుచ్చి నరులకు శుభము లిచ్చు
నుత్తమోత్తము సర్వగుణోపపన్ను
నాశ్రయింతు నానందయథార్థరూపు. ౨౬౪

మ. అని తద్ధ్యాననిబద్ధబుద్ధి యయి రాజిల్లుండఁగా నింద్రు స్యం
దనమందుం దన పత్ని గొల్వ సురవాద్యధ్వానసంపత్తితో
ఘుసరంభాదివిలాసవత్యభినయోద్గానప్రబంధాళితో
జననేత్రోత్సవకారి యై నృపతిసంజాతుండు రా నై వెసన్. ౨౬౬

ఉ. తల్లికిఁ దండ్రికిన్ స్నుషయు దాను నమస్కృతు లాచరించె నా
తల్లియుఁ దండ్రియుం గొడుకుఁ దత్సతి దీవన లొప్ప నేత్రహ
ర్షోల్లసితాశ్రులం దడిపి రొయ్యనఁ గౌఁగిటఁ జేర్చి రౌచితిం
జెల్లె సమాగమక్రమము సిందులు ద్రొక్కిరి తృప్తితో నరుల్.

ఉ. వేసఁడ! వింటె? యత్రిసుతవిశ్రుతదానము న వ్వసిష్ఠస
న్మానవిధానమున్ హరి ప్రమాణము ధర్మము భానముం గథా౽

నానారసప్రభాసము మహోదయసాధన నిరాప్తితార్థని
ర్వాణస మిచ్చుచున్ మహిఁ బ్రశస్తముగా సేయుము పోయివచ్చెదన్.

క. అని ధ్యానగోచరుం డన
జనార్దను ననుగ్రహించు సంస్తవమున స
మ్మునిఁ దనియ నేను వచ్చితి
ననంతకార్యసంపదాత్మాత్ముఁడ నై. ౨౬౯

క. అనుచుఁ గపింజలు నోడివిన
యనూనచారిత్రమునకు నల కపింజలుఁడున్
దనయులు నలరిరి వానిం
గొనియాడిరి విష్ణునిఁ గనుఁగొను పుణ్యములన్. ౨౭౦

ఆ. వేదధర్మదీపకోదారసంవాద
భంగి యిట్టి దనుచుఁ బలుకు సూతుఁ
ద్రికరణములఁ గొలిచి దీవించి భావించి
మునులు పై విధాన మను మమటయు. ౨౭౧

శా. లీలాస్వీకృతశూల! భూమిరథ! వ్యాలీవ్యాలకాలంకృతీ!
ఫాలప్రేక్షణశిక్షితస్మర! సురప్రత్యర్థినిర్భర్త్సనా!
హాలాహాలహాలానుపానవిహితాహారా! హరా! చంద్రవు
ర్యాలంబా! మహితాస్మదర్పితసపర్యాతర్పితాభ్యంతరా! ౨౭౨

క. కారణకారణకారణ! కారణనిగృహీతవినుతకరణ! మఖకృతా
కారణ! సృష్టిస్థితిలయకారణనిగృహీతనైకకరణావరణా! ౨౭౩

మాలిని. మహితసుకృతచర్యామధ్యలోకానుబద్ధా!
మహానిచయవిధిత్వామధ్యదేశస్థ! సద్ధా
మహాతదురితచందోల్మధ్యరత్నాయితశ్రీ!
మహాదనుగతతత్త్వామధ్యభాస్వత్స్వయంశ్రీ! ౨౭౪

సీ. ఆంధ్రేల రామకథాఽమృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు

హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెఁ దనయు వి త్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ మఖములఁ
ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదిగో
దశమ కుసుమగుచ్ఛము కేలఁ దాల్పు మభవ! ౧౭౫

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## ఏకాదశ గుచ్ఛము

క. శ్రీమద్ధర్మాధర్మప్రామాణ్యపరానుగుణ్యఫలదానచణా
స్వామిత్వాపితకృత్యా ! నామసుహితచందవోలునగరాత్రత్యా !

ఆ. అవధరింపు మడిగె నాచార్యు ననుగతుఁ
డనఘ ! దత్తదేవుఁ డనుస్మృతులకు
జ్ఞాన మొండె నొడివెనా ? నయ మెంచి వ
ర్ణించెనా ? స్వధర్మనిర్ణయములు.

క. వర్ణాశ్రమధర్మము లను
వర్ణితములు సద్వ్రతములు వైదికకర్మా
కర్ణనములు తద్విహితవి
నిర్ణయములు కలిగినఁ మునీ! యను మనుచున్.

చ. అది విని వేదధర్ముఁడు మహానియతీ! విను వత్స! తెల్పెదన్
విదితుఁడు మేరుశృంగమున విష్ణువిచారపరాయణుండు నా
రదుఁడు సనత్కుమారముని ప్రశ్నము సోత్తర మాచరించె ద
త్తదివిజవంద్యయోగిగదితం బిది యంచు సమంచితాదృతిన్.

### ఏకాదశీవ్రతము

క. అడిగితివి చిత్రచిత్రము
లుడుగక నొడివితి వ్రతాదు లొయ్యన నిదియుం
బుడమిలు మాటఁ బ్రసిద్ధం
బడఁచుం బాపాళి విను మహావ్రతమార్యా !

సీ. ఏకాదశీవ్రతం బెవ రెఱుంగరు? దీని
నెఱిఁగియుఁ బ్రాల్మాలుచే విచిత్ర
మఘములు కృతము లాయతి కష్టపడు నెట్లుఁ
దెలిపి సేసికొన యత్నింపవలయు
విష్ణుసంప్రీతి కీ విధము మించిన పని
లేదు వ్యయం బందు లేదు తలఁప
నారోగ్యశాఖవా రాదరింతురు దీని
నొకపనితో ఫలయుగ మమరెడు
నాల్గు భుక్తులు సాలించెనా? శ్రమపడి
నాల్గుపురుషార్థములు గల్గు నరుఁ డమరుఁడై
యద్విజులు ద్విజు లాం డ్రని యను విభేద
మరయరా దర్హు లంద తీ యర్థమునకు. ౬

ఉ. పాతకి కానివాఁ డుభయపక్షములన్ హరివాసరంబుల
న్నాతికి నాతికిన్ మొగమువాచినరీతిఁ జరింపఁబోఁడు నాఁ
డాతతదుష్కృతప్రతతు లన్నము తెన్నున సంవసించుఁ ది
న్నాతనిఁ బట్టుపట్టి తిను నజ్ఞుఁడు గానఁడు దన్మహత్త్వమున్. ౭

గీ. బ్రహ్మహత్యాద్యఘంబులఁ బాపవచ్చు
నతిఘనములఁ బ్రాయశ్చిత్త మాచరించి
తెలివి మాలి యేకాదశిఁ దిన్నవాని
కెన్నఁటికిని నిష్కృతి మాట యెత్తరాద. ౮

క. ఏనము లాగమ్ము లహము
లేనెఱి నొనరించెనేని నేకాదశినాఁ
డే నరుఁడు బుద్ధి వెట్టఁడొ
భోనముపై? నతఁడు విష్ణుపురమున కరుగున్. ౯

క. బారసి విష్ణుప్రియకరి
యారాధింపంగ దాని యమదినమున సం

సారచ్ఛేదముఁ గోరెడు
వార లుపవసింత్రు నాఁటి పారణవిధికిన్. ౧౦

గీ. కాంతుఁ హరి సంస్మరించు చేకాదశిఁ దిథి
రెండుపూఁట లెదియుఁ దినకుండువారి
కిటు నటు దినంబులందును నేకభుక్తి
వలయు నిశలందు మఱి తినవలవ దందు. ౧౧

ఉ. ప్రొద్దున లేచి స్నానవిధిపూర్వముగా భగవంతు విష్ణు సం
పద్దయితు న్సమర్చితు విభాస్వరుఁ గూర్చి యుపమర్చి తాను నా
యొద్దనె పండియుం దశమి నోరిమిఁ బుచ్చి తదంతవేళ వే
నిద్దుర లేచి తామరసనేత్రు యజింపవలెన్ యథాస్థితిన్. ౧౨

క. సుమగుచ్ఛాదుల మాధవు
సమర్చ పవ లెల్లఁ గూర్చి సాయంవేలన్
సుమతి నొనరించు నాహ్నిక
మమరుం జాగర మొనర్ప నాకల్యంబున్. ౧౩

ఉ. జాగరలక్షణమ్ము విను స్వామికిఁ బ్రీతికరమ్ము సుమ్ము త
ద్యోగము గీతవాద్యనృతిధోరణులో? శ్రుతిపాఠమో? పురా
ణాగమసద్విచారమొ? మహాజనసంగతి నిర్వహించుచుం
ద్యాగము సత్య మింద్రియజయం బొలయంగ వినిద్రుఁ డౌటయే.౧౪

సీ. వాఙ్మనోబుద్ధిప్రవర్తనమ్ముల నాఁగి
గోవిందుఁ గీర్తింపఁ గుదిరెనేని
లేమి నుపవసించు నామెయికన్నను
దన కుండి తినకుండు టొనరెనేని
నూరక నిదుర వాయుటకన్న సజ్జన
గోష్ఠి జాగర మొనగూడెనేని
పరదినంబునఁ జేయు పారణ కెవ్వఁడో
కాక సద్విప్రుండు కలిగెనేని

ఏమి కావలె ముక్తికి నింతకన్నఁ
గంకణము గట్టుకొన్న దేకాదశీ తిథి
కలిమిలేముల నటు వెట్టి గట్టిభక్తి
ముం దడుగు వేయు వానిదే పున్నె మెన్న. ౧౫

ఉ. లేని యతండు భక్తిఁ గబళింపక కూర్కొడకుండ నెట్లొ? యం
చా నయ మెంచి తాను గలయాతఁడు గూడఁ జరింపరాదు వి
త్తానుగుణంబు వైభవ ముదారము గా హరివాసరంబులన్
దానము జాగరంబు మఱునాఁట ద్విజార్చన మాచరింప నా. ౧౬

గీ. తఱచెనో యేమొ? కలికాలకాలసర్ప
మథనుఁడేని గుడు పుడిగి యాప్రభాత
మస్తనిద్రత హరితత్త్వ మరయరాదె?
హరి! హరీ! యనరాదె? తా నజ్ఞుఁ డైన. ౧౭

ఉ. ఆదర మొప్ప జాగరము నయ్యుపవాస మొనర్పఁ డెవ్వఁ డే
కాదశి వచ్చి పోవఁ గలికాలమునం గనుచు న్వినష్టుఁ డా
పేదకుఁ దక్కు నేనిధి? యుపేక్షకుఁ డధ్రువజీవి నమ్మకం
బేది? పునస్తదాగమన మీతఁడు గాంచు నటంచు నెంచఁగన్. ౧౮

క. యమతిథిఁ బంచామృతముల
రమారమణు జలక మార్చి రాజితగోష్ఠీ
రములన్ హరిదినమున హరి
సముత్థితునిఁ జేయ నతని సారూప్య మవున్. ౧౯

సీ. అడుగడుగునఁ బున్నె మార్జించు నూర్జితుం
డా నాఁడు దేవాలయమున కరిగి
నిమిషనిమిషమున కమితమ్ము ముడుచు శ
ష్మా నాఁడు జాగర మ్మాచరించి
పదపదమ్మునఁ బరపదము సంభావించు
నా నాఁడు శ్రుతిపురాణార్థము విని

సత్క్రియ సత్క్రియ సంతరించుఁ బరార్థ
మానాఁడు మాధవు నర్చఁగూర్చి
నాఁటి యుపవాసమును మఱునాఁటి పార
ణాదివిధి పూర్వదినకృత మట్లు లుంచి
యుండ దా నాఁటి కే నాఁటి కుపమ యనుచు
నూరకే పోవుఁ గనుమూసి యుండ నింత. ౨౦

క. జ్ఞానాభావాంధతమస
భాసరహితుఁ డైన నాదు వ్రతమున దీనన్
బూనికఁ బ్రసాద మొలయన్
జ్ఞాన మొసఁగి మనుపు మీశ! సన్నుసవలయన్. ౨౧

ఉ. విన్నప మి న్నెఱిం జలిపి విష్ణుపరాయణుఁడై దివానిశం
బు న్నియతి న్భజించి వ్రతి ప్రొద్దున ద్వాదశినాఁడు స్నాతుఁ డై
జన్నము లైదు గూర్చి ద్విజజాతి సదక్షిణభోజనాదులన్
సన్నతులన్ యజించి యశనంబుఁ దినుం దరువాత మౌని యై. ౨౨

క. పున్నె మ్మేకాదశి వ్రత
మి న్నయమున నియతిఁ జేయు నెవ్వఁడు వాఁ డే
గు న్నిరతిశయము వైష్ణవ
ము న్నగరముఁ జేరఁగఁ దిరుగఁబోఁ డెన్నండున్. ౨౩

సీ. వృషలుల వేదవిద్వేషుల వృషలీప
తులఁ గుండగోలకాదుల శ్వపచులఁ
గవిగాయకనటప్రకాండుల వెకలుల
నమరధరామరాద్యపలపనుల
శాస్త్రతోఽయాజ్యయాజకులఁ బరాన్నప
రాంగనాలోలహృద్వ్యాపృతులను
వైద్యదేవలకుల వ్రతవివర్జితుల ని
వ్వారి యన్నము దిన్న పాపపరులఁ

జూడరాదు మాట లాడరా దర్చింప
రా దటంచు వేఱ యూది పలుక
నేల? యిట్టి నియమి యేకాదశీవ్రతి
సిద్ధి నుపవసించి చెందు నెందు. ౨౪

క. గంగ సరి తీర్థవరము ర
థాంగధరునిఁ బోలు వేలు పమ్మకు నెన గా
భంగపడని గురు వనశన
ముం గడచిన తపము నాస్తి ముల్లోకములన్. ౨౫

గీ. అందు నేకాదశీదివసానశనము
ద్వాదశీపారణను బోలు వ్రతము లేమి
నుపమ సెప్పెద నర్మద యొడ్డున ముని
గణముతో సంవసించె న గ్గాలవుండు. ౨౬

## భద్రశీలుని చరిత్రము

చ. అతనికి భద్రశీలుఁ డను నట్టి కుమారకుఁ డుండె వాఁడు చి
న్నతనపు టాటపాటల ననారత మన్యుల జోలి లేక య
చ్యుతుప్రతిమన్ మృదాకృతముఁ జూచుచు మ్రొక్కుచుఁ బూజ సేయుచున్
నుతు లొనరించుచుం దన కను ల్మొగుడన్ వెడఁ జొక్కుచుండఁగన్.

గీ. గాలవుఁడు వాని తత్త్వంబు గాన వచ్చి
నతఁడు లోకంబులకు స్వస్తి యగుత మనుచు
నా తుణమ్మ యేకాదశి యని తలంచి
విష్ణునకు వంచెఁ దల ప్రభవిష్ణు నొగి. ౨౭

చ. సుచరితుఁ డైన సూను నల సూనృతవర్తన మాదరించి సం
ప్రచితతనూరుహాంగుఁ డయి బాలుఁ గరంబుల నెత్తి యాడి హృ
ద్వచనము లెంచరాని సుఖపర్వము వర్వ వచించె గాలవుం
డుచితము త్వచ్చరిత్ర మిది యోగుల కబ్బదురా కుమారకా! ౨౮

ఆ. చెంది నిన్ను భద్రశీలాఖ్య నినుఁ దన్ను
సఫలజనులఁ జేయు జాడ కయ్యె
నన్ను మనిచితివిర నా తండ్రి! నీ యుద్భ
వమునఁ బున్నె మనము నమరఁ జేసి. ౩౦

క. హరిపూజ భూతహితరతి
హరివారవ్రతమున భువనానుగ్రహత
త్పరతఁ శాంతి విరక్తిం
గర మరుదుగఁ జొచ్చి నిలిచె గా మతి తనయా! ౩౧

గీ. ద్వంద్వములు సెంద వెటు మమత్వంబు వాసె
నన్నిఁట హరిం దలంచెద నవిరతముగ
నిసువు వయసున నెటు లబ్బె నీకు నిష్ఠ
యనుభవము సెప్పరా యని యడుగుటయును. ౩౨

క. జాతిస్మరజని నగుటఁ
ప్రాతం బైన దిపుడు యమపరిభాషిత మా
నీతి నిటు లైతి నా యను
భూతి యిదంవిధ మటన్నఁ బురువిస్మయుఁ డై. ౩౩

ఉ. ఎవ్వఁడ వీవు పూర్వ మెపు డే మనినాఁడు యముండు నీకొ? యిం
కెవ్వనికో? ప్రసంగ మది యెట్టిదొ? హేతువు యాదృశంబొ? నీ
క వ్విషయంబు జ్ఞప్తి కెటు లబ్బెనొ యి బ్భవమందుఁ దెల్పరా
దివ్యఁబడె న్మనంబు త్వదతిప్లుతి నం చన సూనుఁ డి ట్లనెన్. ౩౪

సీ. తండ్రి! తపోధనా! ధర్మకీర్తి యనంగ
రాజవంశంబున రాజ నైతి
నావేళ శాసించె ననఘ! దత్తాత్రేయ
దేవుండె ధర్మసందేహ మెడలఁ
బాలించితిం బేర్మి వసుధాతల మ్మెల్లఁ
దొమ్మిదివేలు వర్షమ్ము లోలి

ధర్మోత్తరంబు లధర్మంబులుం గూడఁ
జేయంగఁబడిన వీ చేత నప్పుడు
లచ్చి నెత్తికి నెక్కెఁ దల్లాభజనిత
మదము సేయించె నీఁక నధర్మప్రకరము
మున్ను కృతములు బహులము ల్పున్నెము లవి
నేఁటి పాషండసంగతి నీటఁ గలిసె. ౩౬

క. వేదవిరోధుల మతత
ద్వాదవిబోధములు మతికిఁ బట్టినకొలఁదిన్
వైదికమార్గము వదలితి
నే దే వంక యిడి ముఖము వెడలిచితిఁ గటన్. ౩౭

ఆ. నన్నుఁ జూచి చేసినా రధర్మంబులు
ప్రజలు దాన భాగభాగి నైతి
నవియు నివియుఁ బెరిగె వ్యసనాభిరతులతో
నంత మెఱుకపడనియంత లయ్యె. ౩౮

చ. ఒకపుడు వేటబాటఁ గొని యొక్క మహాటవిఁ జొచ్చి సైనిక
ప్రకరము మాటువడ్డ మృగవర్గము ద్రచ్చుచుఁ బోయి పోయి తి
గ్మకిరణు వేఁడి వాఁడి తురగమ్ము బలమ్మున నర్మదాఝరో
దకమునఁ జేరి యె ట్లెటులొ? స్నాన మొనర్చితిఁ బేర్చు నాకటన్.

గీ. ఎన్ని జలములు ద్రావిన నేమి ఫలము
తీఱ దాకలి డప్పియుఁ దీఱ దట్టె
సైన్యమా? చేరరాదు క్షుత్క్షాముఁడ నగు
నాకు నేకాకి కందుఁ గన్నా కెవాఁడు? ౩౯

ఉ. శూరుల కెల్ల నెందుఁ దుదిఁ జొప్పడు దుర్దశ లిట్టివే యటం
చా రవి చాటెనాఁ జనియె నస్తముపాంతము డాయఁగా నిరా
హారులు తీరవాసులు ధరామరు లచ్యుతవాసరవ్రతా
చారులు రేవరేవున విచారపరుల్ వెనఁ జేరి రంతలోన్. ౪౦

గీ. స్నాన మొనరించి ధౌతవస్త్రములు కట్టి
ప్రాఁజదువు పొత్తములు విప్పి ప్రకటభంగి
నీపనులు వెట్టి చెప్పిరి దేవదేవు
వివిధకథ లమృతమ్మున వెల్లి విఱియ. ౪౧

ఉ. మాటకు జోటు లేమి పలుమాటలు వల్కఁగ శక్తి లేమి న
మ్మాటలె వించునుంటి నల మాపు గ్రమించెడు నిద్ర రాదు రా
దేటికి? నెచ్చట న్మనసె నేమొకొ? నేనయు వచ్చె నింతలోఁ
గూటికి లేని వంక యిడి "క్రో" యని మిత్తి మొగల్చెఁ బ్రాణముల్.

చ. యమభటు లాయితం బయి మహాభయదంష్ట్రిలు చుట్టు ముట్టి పా
శముల నిబద్ధుఁ జేసి యతిసంకటకంటకసద్ధరుద్ధసం
తమసవిమార్గపద్ధతులఁ దన్నుచుఁ గొట్టుచు గ్రుద్దుచున్ ననున్
దెమలిచికొంచుఁ బోయి యమదేవుని ముందటఁ బెట్టి రుద్ధతిన్. ౪౩

క. సమవర్తిని గనుఁగొంటిన్
సుమహితుఁ డా దేవుఁ డధికశుద్ధాంతరుఁ డై
సమలులకు దారుణుం డగు
విమతులయెడ లే వతనికి వేరము లనఘా! ౪౪

గీ. వీని శిక్షావిధానంబు విప్పిచెప్పు
పండితుఁడ! యంచుఁ జిత్రగుప్తప్రధానిఁ
బిలిచి యడిగె నతండును వెనుకఁ జూచి
ముందుఁ గనుగొని పొత్తమ్ము పుటలు త్రిప్పి. ౪౫

క. తల యూఁచి యూఁచి పలికెం
గలుషంబుల ప్రోవె యితఁడు గాని మునుపు నేఁ
డలుపముల కర్తుఁడా? విను
మలమోచన మాచరించి మహితుం డయ్యెన్. ౪౬

ఉ. ఏ దురితంబు లెన్ని యెటు లేచుచునుండినఁ గూడు లేమి నే
కాదశినాఁడు శేవ నుదకంబుల నాఁడె విన న్నిశీథినిన్

వైదికవేదవాద ముపవాసము స్నానము జాగరమ్ము సం
పాదిత మయ్యె నే మని విపాటితుఁ జేయుద విూతనిం బ్రభూ! ౪౭

గీ. ఒక్క యుపవాస ఫలమున నిక్క లేక
కృతబహుళపాతకమ్ము లాహతము లయ్యె
నర్మదాస్నానజాగరధర్మఫలము
లెంతకుం జాల? వెంచ నిం కేమి కలదు? ౪౮

ఉ. దేవరవారి యిష్ట మనఁ దిగ్మకరాత్మజుఁ డాత్మశాంతి సం
భావితుఁ డై మదంఘ్రులకుఁ మం బడి దండము వోలె నమ్రుఁ డై
పూవులఁ బూజ సేసి ననుఁ బుణ్యమహాసనమందు నుంచి యు
చ్చావచదేహుల న్స్వపరిచారకులం బిలిపించి యి ట్లనెన్. ౪౯

ఆ. దూతలార! వారిఁ దో డ్తేకుఁ డెప్పుడు భ
వార్తి శాంతికిం బ్రయాసపడుచు
ధర్మకృతుల దారిఁ దప్ప రెవ్వారు మ
ర్త్యప్రకాండు లెట్టి యఘము లున్న. ౫౦

ఉ. ఏ యుచితజ్ఞు లచ్యుతు జితేంద్రియు లై భజియింతు రెవ్వ నా
రాయణ కృష్ణ! మాధవ! జనార్దన! యన్న పదంబు లెన్నఁదుర్
బాయ వెవారి నాల్క భిదఁ బట్టరు శంకరునందు విష్ణునం
దేయెడ నట్టివారి యఘ మెంచఁగ మీ రెవ? రేను నెవ్వఁడన్? ౫౧

మ. హరిభక్తుల్ గురుసేవ్యు లీశభజనవ్యాపారు లాచారమా
ర్గరతు ల్పాత్రధనప్రదాననిరతు ల్నారాయణవ్యాహృతుల్
దురితప్రాయజనాపసంగులు జనస్తుత్యు ల్సదా సజ్జనా
దరసత్సంగతిలోలుపు ల్మనకు సంత్యాజ్యు ల్పుఁడీ వింటిరే? ౫౨

చ. కరుణ నెసంగువారి నుపకారపరాత్ముల విష్ణుసంస్మృతిన్
హరికథలందు విప్రచరణార్చనమందు నివిష్టచిత్తు లా
పరములచే నొకప్పుడు శుభస్థితిఁ గన్గొనఁబడ్డవారిఁ బా
పరతుల నైన మీరు విడువన్వలయు న్భటులార! వింటిరే? ౫౩

ఉ. ఆదర ముండి, లేక, మరియాదకు, దంభమునన్, భుజింపఁగా
లే దని లోభసంగతిఁ జలింపనిభక్తి నెటే నెవండో యే
కాదశి రెండు ప్రొద్దులు స్వకం బవు జీవితమందు నెప్పు డే
నోదన మంటకుండెనో? మహోత్తముఁ డాతని నంటఁబోకుఁడా! ౫౪

క. తలిదండ్రుల నదలుచువా
రల విప్రాఽహితకరుల సురద్విజధనలో
భుల జననాశకులను ధూ
ర్తులఁ దెం డంటంగఁగట్టి ద్రుతముగ దూతల్! ౫౫

క. ఏకాదశీపరాఙ్ముఖు
లోక మపవదించువాని లుబ్ధు నితరనిం
దాకరు నుత్తమదూషణుఁ
జేకొని రండు భటులార! శిక్షింప నగున్. ౫౬

క. హరిభక్తివిముఖులను హరి
శరణాగతపాలకు నొకసారియు నెపుడే
స్మర ణననివారి మూర్ఖుల
నరులం గొనిరండు శిక్షణం బొనరింతున్. ౫౭

క. జీవితమున విష్ణ్వాలయ
మేవాఁడు సొరంగఁబోఁడొ? యీహితభక్తిన్
భావింప గ్రామనాశకుఁ
డౌ వానిని వానిఁ దెం డఘౌఘ్నుల స్వవశుల్! ౫౮

చ. యమపరిభాషణంబు లివి యాదిగ వింటిని బూర్వ మేను వృ
త్త మఘము సంస్మరించి యనుతాపముచేత విదగ్ధుఁడై తిఁ దం
డ్రి! మదఖిలైనము ల్వెలువరించెఁ దదాదరదర్శనానుతా
పములును ధర్మసంశ్రుతియు భవ్యుఁడ నైతిని సత్సమాగతిన్. ౫౯

ఉ. పాతకశేషము ల్దొలఁగఁబొటి సహస్రరవిప్రకాశసం
వీతుఁడ నై రమాధవసవేషుఁడ నౌ ననుఁ జేరి మ్రొక్కనొ

ప్రేతకులాధినాథుఁ గని విస్మితు లైరి తదీయదూతలు
ద్భీతిఁ గలంగి రంత యమదేవుఁడు నన్ను నుతించి మంచిగన్. ౬౦

ఉ. సంచితపుణ్య జీవశతసంకుల మైన విమానరాజ మె
క్కించెను బంచె వైష్ణవనికేతనసీమకు నందు సర్వభో
గాంచితసౌఖ్యసంపదధికాస్పదవృత్తిఁ జిరంబు నిల్చి ని
ర్వంచిత మింద్రలోకవిభవంబునకుం గుఱి యైతిఁ బిమ్మటన్. ౬౧

ఉ. దేవనమస్కృతుండ నయి దేవవిభుండు సమాదరింప న
ద్దేవజగంబునుండి మహిదేవగృహంబున జాతిసంస్మృతి
శ్రీ వహియించి తోఁచితిఁ ద్యజింతునె? యింకిట దేవదేవుపూ
జావిధి విష్ణువాసరవిశాలఫలవ్రతసంస్తవం బెటుల్? ౬౨

సీ. ఏకాదశీవ్రతం బింత గూర్చెడు నని
మును పే నెఱుఁగ నైతి జనక! వింటె?
పూర్వజన్మజ్ఞానమునఁ బ్రభావంబున
ననుభవించి తలంచి యరయుచుంట
నవశుఁడ నై చేసినట్టి కర్మమునకు
నేకాదశి యొసంగె నింత ఫలము
నెఱిఁగి భక్తి నొనర్చు నీహితపరులకు
నెవ్వరు సెప్పెదు రెంత కలదొ?
కాన నెడఁబాయఁబోవ నీ మేనఁ దద్వ్ర
తమ్ము ముప్పొద్దు హరిపూజనమ్ము నింక
శపథ మొనరింతు నిది శ్రద్ధ సలుపువారి
కవిరతానంద మొసఁగు శ్రీహరిభు వగుట. ౬౩

చ. అని కొమరుం డనన్వని మహాముని గాలవుఁ డొందెఁ దుష్టి నా
జని చరితార్థ మైనది ప్రశస్తము పావన మయ్యె వంశ మె
వ్వని కులమందుఁ బుట్టె నిటు వైష్ణవభక్తిపరాయణుండు వీఁ
డని హరిఁ బూజసేయు విధ మంతయు బోధ మొనర్చె వానికిన్.

గీ. మఱియు నడిగెఁ గౌమారు సంశయ మెడలఁగ
సౌమ్య! జన్మాంతరమ్మున శాసితుండ
నైతి నంటి దత్తాత్రేయుఁ డాదిదేవుఁ
డేమి బోధించెఁ దెలుపరా యెఱుఁగ వింద. ౬౫

క. అను జనకున కనె నందనుఁ
డనూన మది తండ్రి విందువా? విను మేనుం
బునరనువాదవిశేష
మ్మున నర్థవినిశ్చయమ్ముఁ బొందఁగ నౌదుఁ. ౬౬

మ. ద్విజవంశోత్తమ! రాజదేహమున ము న్దీపించుచుం బోయి స
ద్భజనీయుఁ మహాత్ము నత్రితనయుఁ దర్శించితిఁ సహ్యామం
దజయాఖ్యాంగన దుష్ప్రకంప తను గాఢాలింగితుం జేయ శీ
ధుజలం బొంట స్రవింపఁ బీత మతిమత్తుం డై ప్రణత్రింపఁగఁ.

శా. తానే యాడుచుఁ దాన పాడుచు సురక్తప్రాంతనేత్రుండు నై
స్త్ర్యానాంగాఖిలమత్కుకుం డవు విభుఁ దండప్రపాతంబుగా
మై నంఘ్రిస్థలి వ్రాలఁ గేలఁ గొని "త్వం మే భో గతి ర్నాన్య" యం
చే నుంటి న్విను మింక దేవునికృతుల్ హిం హుం మ్మనెం బైఁబడెఁ.

గీ. కాష్ఠలోష్టష్టికాదులు గాన నైన
వెల్లఁ గైకొని విసరెఁ బండ్లెల్ల గొఱికెఁ
బోరఁ యనె బెదరించె నా బుద్ధి యచల
యగుడు మ్రొక్కితి మ్రొక్కితి నడు గడుగున. ౬౯

శా. ఘోరా స్వామి! దురాత్మ! స్వామి! థు,థు,ఛీ మూర్ఖుండ!స్వామీ!దురా
చారుం డీతఁడు నీకు నేమి యిడనో, స్వామీ! హాతా! చావు, స్వా
మీ! రే వుండవు, స్వామి!మొండివటె?స్వామీ!చంపెద,న్స్వామి!యం
చీరీతిం దదనుగ్రహం బెనయ నేం డ్లెన్నేని సేవించితిఁ. ౭౦

ఉ. అంతటఁ గొంతకాలమున కా చషకం బిటు తెమ్మ్మ మాంసము
త్యంతసుపక్వము న్నలువు మాసవ మల్లదె యంది యి మ్మటం

చంతకు నంతకున్ సుముఖుఁ డాతఁడె యై యొకనాఁడు వత్స! యే
వింతపను ల్మదిం దలఁచి వీని వరించితిరా యనెం గృపన్. ౨౧

ఉ. ధర్మవివిత్సుకాముఁడను ధర్మనిధానమ వీవు తెల్పు త
న్మర్మ మటంచు వేఁడితి మనఃప్రియ మొప్పఁగ నానతిచ్చి స
త్కర్మము లాచరింపుము సుఖప్రతిపత్తికిఁ గమ్ము పో మ్మటం
చర్మిలిఁ బంపఁ బోయి సునయంబుగ నేలితి నే స్వరాజ్యమున్. ౨౨

మ. చిరకాలం బటు లేగ దుష్టజనతాస్నేహాప్తిరూపంబునన్
దురితం బే జనిసంచితంబొ తెలుపన్ దుర్నీతి న ల్లోచితిన్
నిరయద్వారకవాటముం దెఱచి గ్లానిం జెందఁగాఁ బోవుచో
దరిఁ జేర్చె న్ననుఁ యాతనాంబుధికి దత్తస్వామిదాక్షిణ్యముల్. 23

గీ. దత్తవిభుసంప్రసత్తిసంపత్తిఁ గాక
యాచరించిన ధర్మంపుటాప్తిఁ గాక
తండ్రి! వనమందు నొల్లు జాతం బయినది?
సత్సమాగతి యవసానసమయమందు. ౨౪

శా. ఆపుణ్యప్రతిభాతసంపద యమవ్యాహారము న్వింటి వి
ద్యాపూర్ణాంతరు లైన మీవలన విష్ణ్వత్యంతభక్తిప్రియ
వ్యాపారార్థము జన్మ మందితి నిఁకే వ్యాపాదముం బొందఁబో
నాపద్ధ్వాంత మడంచు జ్యోతి వెలిఁగెన్ హార్దాలయంబం దిదే. ౨౫

క. దత్తాత్రేయప్రకథిత
ముత్తమధర్మము సనాతనోచిత మనెదన్
మత్తాతుఁడ! వినవలచెదె?
చిత్తమ్మున శ్రద్ధ యున్నఁ జెవి నిడు మనఘా! ౨౬

గీ. ధర్మకీర్తి! మహారాజ! తవిలి వినుము
ధర్మము సనాతనము కలదారి వినుతు
నరవి వర్ణాశ్రమాచారసంయుత మవు
దేనిఁ గొన్నంత నరుఁడు శుద్ధిని వహించు. ౨౭

సీ. బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్య శూద్రు లనంగ
వర్ణములు నాల్గు వానియందు
బ్రాహ్మణుం డధికుండు బ్రాహ్మణక్షత్త్రియ
వైశ్యులు ద్విజు లనఁ బరగువారు
జననిగర్భంబున జన్మించుట కాక
యుపనయనమున నొం డొనరు జాతి
నీకు మూడవు జన్మ మాఱిస్త మవు వీరి
కేవరిధర్మము వారి కాఁ జరింప
నాత్మవర్ణాశ్రమాచార మవలఁ ద్రోచి
యిచ్ఛ విహరింపఁ బాషండుఁ డితఁ డటంద్రు
పతితుఁ డవ్వాఁడు ధర్మసర్వప్రచార
ముల బహిష్కృతుఁ డాతఁడు భూమిపాల! ౭౮

క. వీ రెల్లరు యుగధర్మాకారమ్ముల నధిగమింపఁ జనుఁ జను గ్రామా
చారమ్ములు స్మృతిమార్గావై రమ్ములు సంగ్రహింపవల దన్యమ్ముల్.

క. నాకు మనంబు శరీరం బేక మ్మొనరించి ధర్మ మొసఁగించెడివో
లోకము మెచ్చక స్వర్గము రాకుండెడు నర్థధర్మరమ వీడవలెన్.

సీ. మధుపర్కమునఁ బశువధము దేవరసుతో
త్పత్తి మాంసంబునఁ బైతృకంబు
అసవర్ణకన్యల నంగీకరించుట
దత్తాక్షతాపునర్దాన మొరున
కశ్వమేధమ్ము గవాలంభము నృమేధ
మును నౌక లెక్కి సముద్రయాత్ర
అతిదీర్ఘకాలనిశ్చిత మవు బ్రహ్మచ
ర్యమ్ము వానప్రస్థ మాశ్రమమ్ము
గాక మఱి మహాప్రస్థానగమనమును గ
మండలువిధారణమ్మును మానవలయు

నని వచించిరి కలియుగమందుఁ బెద్ద
లౌ పరాశరముఖ్యమహర్షివరులు. ౮౧

క. ఏయేదేశమ్ముల నరు
లాయాదేశములఁ జెల్లు నాచారమ్ముల్
వాయం జన దవుఁ బతితుం
డౌ యనద బహిష్కృతుఁ డవు నధిధర్మములన్. ౮౨

క. చాతుర్వర్ణ్యమువారి క్రి
యాతంత్రము లుత్తమమ్ము లభివర్ణింతున్
జేతోముద మొదవ మొదల
ఖ్యాత మ్మగు విప్రధర్మ మది మదిఁ గొనుమా. ౮౩

ఉ. దాన మొసంగఁగావలె నుదారధరామరులందు యాగసం
తానములన్ యజింపఁదగు దైవతమండలి నాత్మవృత్తికై
పూను సమస్తయాజన మవుం జదువుం జదివించు వేదముల్
స్నానము నిత్య మెట్టి జతనంబున మానఁడు విప్రుఁ డౌ పనిన్. ౮౪

ఆ. శస్త్రజీవి గాఁడు సర్వహితకరుండు
పలుకు మృదువు మట్టిఁ బరధనంబు
నరయు నేకబుద్ధి నగ్నిపరిగ్రహి
ఋతుదినములఁ బత్ని నతఁడు గవియు. ౮౫

ఉ. క్షత్త్రియుఁ డిచ్చు విప్రులకుఁ గామితదానము లొందు వేదముల్
సత్త్రిమఖంబుల న్సురల సన్మతిఁ దన్పు నజస్రము న్ధనుః
పత్త్రిలు దాల్చియే బ్రదుకు పాలనసేయు మహి న్స్వధర్మ మం
చాత్త్రిము శిష్టులం దెడయ నస్యుల దౌష్ట్య మడంచు శిక్షలన్.

ఉ. దాన మొనర్చు విప్రులకుఁ దాఁ జదువున్ శ్రుతి యాగపూగము
ల్వాని యజించు వేల్పుల నవుం గృషి బేరము పాశుపాల్యముల్
వానికి వృత్తు లిన్నిఁట నుపార్జిత మౌ ధనధాన్యరాశి స
న్మానన మొనర్చి యిచ్చు జనమాన్యుఁడు వైశ్యుఁడు సద్విధిం గృపన్.

క. ఇమ్మాడ్కి కోలమ్ముల పసు
లిమ్ముగ నొసరించి దాన నెసఁగడు ధనముల్
సమ్మతి నిడి ద్విజులకు య
జ్ఞమ్ములు సేయించు శూద్రసంజాతుండున్. ౮౮

మ. ఋతుకాలాదృతదారసక్తి భువనశ్రేయం బపేక్షించు స
న్మతి యొందుం బ్రియవాదిభావము లసన్మాంగల్య ముత్సాహశ
క్తి తితిక్షావిగతాభిమానతలు ముక్తిం బున్యలోకంబులన్
సతతాకాంక్షయు సర్వవర్ణములకు న్సామాన్యము ధ్ధర్మముల్. ౮౯

క. ఈ తెఱఁగునఁ బరగెడు వా
రాతతనైజాశ్రమోచితాచారములన్
జ్ఞాతజ్ఞాతవ్యులు ము
క్తీతులు నగుదు రిదె త్రోవ యెల్లర కనఘా! ౯౦

శా. ఆపత్కాలమునందు బ్రాహ్మణుఁడు క్షత్త్రాచార మాతండు వి
డ్వ్యాపారంబునుఁ బూననౌ ద్విజుల కత్యాపత్తియం దైనఁ గా
దా, పజ్జాతులవృత్తిఁ జెందఁ గొననా? యవ్వాఁడు చండాలుఁ డా
భూపు ల్విప్రులు గోమటు ల్ద్విజు లనన్ భూమిం బ్రసిద్ధు ల్గదే?

ఉ. నాలుగె యాశ్రమంబులు సనాతనుఁ డా హరి సంతసించు మ
ర్త్యాలి స్వకర్మయోగరతమై పురుధర్మము సంతరింపఁ గా
మాలిఁ దొఱఁగి శాంతమతులై నిజకర్మము సల్పువార లు
త్తాలము తత్పదం బెనసి తారు యుగాంతములందు రా రిఁకన్.

గీ. ఆత్మకర్మం బుడిగి యన్య మాచరించు
వాఁడు పాషండుఁ డెందును బనికిరాఁడు
స్త్రీపురుషుల కమంత్రమంత్రాపితములు
సలుపవలెఁ దఱి సంస్కారములు పదారు. ౯౩

శా. గర్భాధాన మొనర్చి యాద్య మగు తద్గర్భంబు సీమంతసం
దర్భశ్రీతము సేసి తోక మది జాతం బైనఁ దత్కర్మ మా

యుర్భద్రార్థి విధిం బొనర్చి యపుడే యుజ్జాత మా వేళ నా
విర్భూతాఖ్యము నారచింపవలయుఙ్ స్వీయాత్తగృహ్యస్థితిఙ్. ౯౪

గీ. అన్నసంప్రాశనం బాది యైన క్రియల
నెడనెడ నొనర్చి మూడవు నేటఁ జౌల
మర్హవిధిఁ గూర్చి మఱి గర్భతోష్టమాబ్ద
మందు నుపనయనంబు సేయందగు నొగి. ౯౫

గీ. పాదకృచ్ఛ్రంబు కర్తవ్య మాదినుండి
సంస్కారణముల చౌలము ల్జరుగకున్న
నదియు దైవికముగ జరుగదో? తగుతఱి
నర్థకృచ్ఛ్రంబె వడు గప్పు డొఁ జరింప. ౯౬

గీ. అష్టమైకాదశద్వాదశాబ్దము లగు
నర్హములు విప్రరాజవైశ్యవటువులకు
నుపనయనమున కటు దైవ మొనరనీదో?
యంత కంతతఱికి నైన నగు నొనర్ప. ౯౭

గీ. నియతి నటు ద్విజునకు నుపనీతునకును
వేదసంగ్రహపర్యంత మాదరమున
గురుకులంబున నాచార్యుఁ గొలిచియుండి
బ్రహ్మచర్యంపు నిష్ఠ నిర్వహణ మొప్పు. ౯౮

శా. ప్రాతస్స్నాతుఁడు బ్రహ్మచారి కుశలుం బం డ్లాది యా సర్థముల్
ఖ్యాతమ్ముల్గొని తేవలె న్సతము గుర్వర్థంబు సాయంతన
ప్రాతర్వేళల నగ్నికార్య మది కార్యం బార్యగేహాళి భి
క్షాతంత్రార్జిత మన్నముం గురుననుజ్ఞం బాఁ దినంగావలెఙ్. ౯౯

గీ. జందె మజినంబు దండంబు జలములందు
జీర్ణములు వైచి నవములు స్వీకరించు
ప్రథమమధ్యసమంతభవత్పదముగఁ
బలికి భిక్షింపవలయుఁ ద్రివర్ణము లొగి. ౧౦౦

మధువు లవణంబు కామిని మాంస మన్ను
పగటి నిద్రయు దంతధావనము సేత
యుపి విడుచు వర్ణి తాంబూల మెంగిలియును
ఛత్రపాదుకాగంధాదిసమనుభూతి. ౧౦౧

ద్యూతము జలకేలియు సం
గీతము వాద్యాభినయవిగీతపరీవా
దాతిప్రలాపములు దు
ర్జాతిసహాస్థితులు పనికిరావు వటులకున్. ౧౦౨

వయసునఁ దపంబునను జ్ఞానవర్తనముల
వృద్ధులకు నెల్లఁ దగవుమై నెరఁగవలయు
నందు నాధ్యాత్మికాదిదుఃఖాలిఁ దొలఁచు
వేదశాస్త్రోపదేష్ట కా విసతి ముందు. ౧౦౩

శర్మ వర్మ గుప్త శబ్దము ల్వరికి బ్రా
హ్మణనృపార్య్య లోలి నవనతు లిడు
వారు దీవన లిడువారు పైకొలమువా
రవలికొలమువారి కనుమతు లయి. ౧౦౪

గ్రామయాజకు భిన్నమర్యాదు దొంగ
జూదరిఁ గృతఘ్ను నాస్తికు శుచిత లేని
వాని నున్మత్తు శఠు ధూర్తుఁ బతితుఁ బాపిఁ
గ్రూరు నక్షత్రజీవి మ్రొక్క లిడరాదు. ౧౦౫

జప మొనరించుచున్నయెడ స్నానము సేసెడి వేళఁ బాఱుచు
న్నపుడు సమిత్సుమాదికరుఁడై తటి నిద్దుర వోవుచుండ భు
క్తి పరుఁడు గాఁగ భైక్షము విధిం జనుచుండఁగ మ్రొక్క రెట్టివా
రపరిమితప్రభావనిధి కైన వివాదవిగానశీలికిన్. ౧౦౬

వమనముఁ జేయం జలమ
ధ్యమునం దుండంగ నగ్నుఁడై యుండఁగ భా

రము మోయుచుండ నభ్యం
గ మాడుచుండంగ మ్రొక్కఁ గా దెవ్వరికిన్. ౧౦౭

ఆ. భర్తృహంత్రి పుష్పవతి జార సూతిక
చండి గర్భపాతచరి కృతఘ్ను
మ్రొక్కఁదగరు వీరు మోమోటపడియైన
భక్తి నైన నుక్కివమున నైన. ౧౦౮

క. సభయందు యజ్ఞవాటిక
ఋభుభవనములందు మ్రొక్క రిలఁ బ్రత్యేకం
బభివాదన మటఁ గూర్చు న
నభిజ్ఞుల పురాకృతమ్ము లడఁగు నటంచున్. ౧౦౯

గీ. పుణ్యతీర్థమహాక్షేత్రభూములందు
సత్త్రములయందు స్వాధ్యాయసమయమందుఁ
జనదు ప్రత్యేక మవు నమస్కార మదియుఁ
బుణ్యముఁ బురాకృతమ్ము నప్పుడ హరించు. ౧౧౦

చ. వ్రత మొనరించు చున్నతఁడి శ్రాద్ధము వెట్టెడువేళ శంకరా
చ్యుతపరిపూజనంబుపని నున్నపు డధ్వరతర్పణక్రియా
వితరణముఖ్యకాలముల వేనికినేని నమస్కరింపరా
దతఁ డది సేయునా? యితనియానతి కాదృతి నిర్వహించునా ?

గీ. వందనమునకుఁ బ్రత్యభివాదనంబు
సేయఁడా? శూద్రుఁడే వాఁడు సేయరాదు
వాని కానతు లేనాఁడు వాఁడు వీఁడు
శుద్ధు లై కాని తత్కృతిఁ జొరఁగరాదు. ౧౧౨

గీ. అంఘ్రియుగి క్షాళన మొనర్చి యాచమించి
గురున కభిముఖుఁ డై కేలఁ గొని తదంఘ్రి
సధ్యాయన మొనరింప నా జ్యోతిషికులు
వల [illegible] యనతిథు ల్వాయఁబెట్టె. ౧౧౩

గీ. నాధ్యయనవేళ స్వాధ్యాయ మాచరించు
వాని యశమును బ్రజ్ఞ సంపద బలమ్ము
నాయురారోగ్యములను స్వయము హరించు
యముఁడు వాని పై బ్రహ్మహత్యాఘము నిడి. ౧౧౪

గీ. కుండ గోలక జడులకుఁ గొడుకులకును
నుపనయన మర్హ మందు రొకొం డ్లొకొండ్లు
పలుకరింపరు మత్తు మూర్ఖులుక రతఁడు
పలుకరించిన సజ్జను ల్పాపభీతి. ౧౧౫

ఉ. ఆదర మొప్ప వేదముల నధ్యయనం బొనరింపకుండ శా
స్త్రాదిక మభ్యసించు ద్విజు లారయ శూద్రసమాను లొందఁగా
నాదురు వారు సంయమని యాతనలన్ దగ నాచరించి ని
త్యాదిసుకర్మము ల్ఫలము లందఁగఁ జో రనధీతు లెమ్మెయిన్. ౧౧౬

శా. శబ్దబ్రహ్మమయుండు శార్ఙ్గి శ్రుతి సాక్షాద్విష్ణురూపంబు త
చ్ఛబ్దం బెప్పుడు వించు నేర్చుచు సమస్తప్రాప్యసంప్రాప్తిఁ జా
నబ్దంబు ల్పది రెండు వేదములు వేదాంగంబులుం జెంది తీ
ర్థాబ్దేశంబుల నాడి రావలయు గుర్వర్థాప్తిపూర్వమ్ముగన్. ౧౧౭

ఉ. ఆపయిఁ బెండ్లి సేసికొన నా ద్విజుఁ డుత్తమవంశజాత స
ద్రూప గుణన్ సలక్షణ నరోగ నవృత్తవిశాలలోచనన్
శ్రీపరమ న్నవామ ననరీణ నదీర్ఘ సుకేశి నాతిక్ర
ష్ణాపఘనన్ నఘూర్త బొమ లంటనిదాని నఘుర్ఘరస్వనన్. ౧౧౮

గీ. తల్లివంశంబునం దైదుతరములు నన్ఁ
దండ్రివంశంబునం దేడు తరము లేగఁ
గన్నియ సముద్వహింప నొఁ గాక కాదు
పెండ్లియాడంగ నంతకు వెనుక కొమల. ౧౧౯

క. ఎప్పుడు నేడ్చెడు దానిని
నెప్పుడు వెడనవ్వు నవ్వ నెలనాగ నదా

రొప్పెడుదాని న్నిద్దుర
నెప్పుడుఁ బడియుండుదాని నెనయరు విబుధుల్. ౧౨౦

క. వెకలిని లోకద్వేషా
పకారపరఁ బరజనాపవాదనిరతఁ జే
సికొనంగ రా దటు లెఱుం
గక కైకొనెనేని విడువఁగా నగుఁ దెలియన్. ౧౨౧

ఆ. బ్రాహ్మదైవతార్షపాణిగ్రహణవిధు
లుత్తమములు ద్విజుల కూనము లవు
నింకఁగొన్ని వలయునేని గ్రహింప నౌ
నష్టవిధములందు ననయ మెంచి. ౧౨౨

సీ. సోత్తరీయమ్ముగ యజ్ఞోపవీతద్వయ
ము ధరించు ధౌతవస్త్రములు రెండు
స్వర్ణకుండలధారి సమనులేపకృతాంగుఁ
డును శుచి కృత్తకేశనఖుఁ డౌను
వారికమండలు వైణవదండము
లభిరూపపుష్పమాల్యములు పూను
జెప్పులు గొడుగు నుష్ణీషంబును వహించు
గమనవేళలఁ బ్రియాకారశాలి
యేమఱఁగఁబోడు స్వాధ్యాయ మెపుడు విడువఁ
డ స్వర్గ్యమైన యాచారంబు నన్యూనన్న
మెన్నఁడు దినందు పరివాద మెంచఁ డెందు
సంచితుండు ద్వితీయాశ్రమాప్తుఁ డగుచు. ౧౨౩

సీ. కాలు కాలం ద్రోసి కడుగరా దెంగిలి
లంఘింపరాదు నిర్లజ్జత దగ
దుత్తమాంగము పాణియుగ్మమ్ముతోఁ బెట్టు
గండూయన మొనర్పఁ గా దొకపరి

పూజ్య దేవాలయమ్ములను గోవు రావిని
 ప్రదక్షిణముగ నరుగరాదు
స్నానాచమనసురార్చావ్రతశ్రాద్ధాదు
 లందు గాఁ గా దేకశాంబరుండు
ముక్తకేశత్వ మురదు తత్పుణ్యకృతుల
నన్యదారాభిమర్శనం బకరణీయ
మెక్కరాదు దుష్ట మ్మవు నెక్కరింత
విడువవలె శుష్కవాదము ల్పిశునతలును. ౧౨౮

ఉ. పెద్దలయం దసూయఁ దలపెట్టక దుస్సహవాసముం బవల్
నిద్దురయుం ద్యజించి యొరు నేరమి స్త్రీయముఁ బుణ్యముం జనా
పద్దశఁ బెద్ద సేయక శుభం బశుభం బపశాస్త్రమైన నా
యొద్దకుఁ బోక యుండునది యుత్తమభావము గోరువారికిన్. ౧౨౯

ఉ. ఆసవమందు ద్యూతములయం దపగీతులయందు నాస ని
ర్వాసితఁ జేసి కేశనఖవస్త్రజలంబు నజాతురేణువుల్
బాసిన యన్నముం దినుట వంచము దీపము నీడల న్విడం
గాసికిఁ గాఁడు ధార్మికులు కాయముఁ బూయరు నెత్తి తైలమున్.

ఆ. అంటరానివాని నంటరు శుచు లొంట
నంటరేని స్నాన మపుడ చేతు
రెనయనీరు తమకు వృషలీదయితసంగ
మద్విజాతిపక్వ మారగింపు. ౧౩౦

సీ. గురుదేవతాగ్నులఁ బరిచరింపఁగరా ద
 శుద్ధుండు బోధింప నుప్పుఁ దగదు
వామహస్తం బొంట వారిఁ ద్రెక్కం బొండె
 ద్రావరా దనఘులఁ దగ దధిక్షింప
నాచార్యునీడఁ దదాజ్ఞ నుల్లంఘింప
 రాదు తాంబూలమ్ము గా దశుచికి

మలఁగి పరస్పరమర్మసముద్ఘాట
నము సేత మిత్రుల నన్యాయకార్య
మగ్గి రేపు మాపు నాసాసన మొనర్ప
కున్నఁ గల్లు గొన్న యన్నిటి కగు
యాగ మమరఁ జేయనౌఁ బున్నమ నమాసఁ
దద్విధుల కొకింత దప్పకుండ. ౧౨౮

సీ. రెం డయనమ్ముల రెండు విషువముల
నమ్మేయి నాల్గు యుగాదులందు
నష్టకలందు మన్వాదుల నమవసఁ
బ్రేతపక్షమునఁ దన్మృతదినమున
నింటికి శ్రోత్రియుం డేగుదెంచిననాఁడు
నభినవధాన్య మాయాత మైన
నర్కచంద్రగ్రహణావసరంబులఁ
బుణ్యతీర్థక్షేత్రములఁ గనినపు
డాచరింపఁగవలయు శ్రాద్ధోచితవిధు
లిష్టి హోమమ్ము తపము పేరివి వేద
మధ్యయన మెప్డు చేయుట యటు పెతరులఁ
దర్పితుల సేతయును గేస్తు ధర్మము లివి. ౧౨౯

గీ. ఊర్ధ్వపుండ్రత్రిపుండ్రంబు లొప్పఁ దాల్చి
చేయవలయు నియ్యవి యంద్రను శిష్టు లొకళ్లు
లూర్ధ్వపుండ్రంబు తులసియు నొల్ల రొడ్లు
శ్రాద్ధముల వృద్ధసంమతక్రమ మవుఁ గొన. ౧౩౦

క. ఏవంవిధ ధర్మమ్ము ల
పావృతములు స్మృతులఁ దెలుపఁబడినవి వానిఁ
భావించి చేయఁ గామఫ
లావహము లవు నృరగవి యట్టులె రాజా! ౧౩౧

గీ. ఫలము లురివి సదాచారపరత నుండు
వారికిఁ బ్రసన్నుఁ డౌ నల వారిజోద
రుండు విష్ణుండు సుప్రసన్నుం డగునెడ
జంతుతతి కెందు లేద యసాధ్య మెదియు. ౧౩౨

గీ. బ్రాహ్మము ముహూర్తమందు నిద్ర నెడసేసి
స్వపురుషార్థావిరోధిప్రవర్తనంబు
నెంచి యుంచి జందెమ్ము యోజంచి చెవి ను
దఙ్ముఖుఁ డయి పురీషమూత్రములు వదలు. ౧౩౩

గీ. గంధలేపక్షయావధిక్షాలనంబు
సేయవలెఁ దోయముల మృత్తుఁ జెరివి చెరివి
శౌచహీనకృతము సమస్తమ్ము కర్మ
మఫల మని రార్యు లది ద్వివిధాభిహితము. ౧౩౪

క. శౌచము బాహ్యము మృత్సలి
లౌచిత్యవిధానవిహిత మాభ్యంతర మా
శౌచ మన భావశుద్ధి ద్వి
ధాచారము సాంప్రతము మహాత్ముల కనఘా! ౧౩౫

ఉ. చీర శిరంబు వేష్టితము సేసి తృణమ్ముల నేలఁ గ్రమ్మి యా
చేరువ గోవులుం ద్విజులు స్త్రీలు గురుల్ గుడి లేమిఁ జూచి కాం
తారము చెట్టు నీడ సుపథంబు తటాకము గోష్ఠ మాపగా
తీరము బావి ము న్నవు ప్రదేశముల న్విడనాడి మాని యై. ౧౩౬

చ. కరమున దండ మూని మలకార్యముఁ దీర్చి సమృజ్జలమ్ములన్
గురువులు శాస్త్రము ల్దెలుపఁ గొన్న విధిం దగు శౌచ మొప్పఁ గూ
ర్చి రుచిరశుద్ధతోయములఁ జెచ్చెర నాచమనం బొనర్చి స
త్వరుఁ డయి చేయఁగావలయు స్నానమనూనవిధానసంగతిన్. ౧౩౭

ఆ. అవల సంధ్య నార్వ నవు మున్నె రవికి గా
యత్రి సదివి భక్తి నర్ఘ్య మిచ్చి

తజ్జపమ్ము నిలిచి తదుదయపర్యంత
మాచరింపవలయు నహము మొదలు. ౧౩౮

క. అమ్మొయి సాయము తటి న
ర్ఘ్య మ్మిడి యాతారకోదయము నాసీన
త్వమ్మున జపించునది యా
యమ్మమనువు మదిఁ దదర్థ మారూఢముగాన్. ౧౩౯

గీ. హంసమంత్రమ్ముతో నర్ఘ్య మప్పగించి
కల్యమునఁ బోలె మధ్యాహ్నకాలమందు
జప ముపస్థాన మొనరించి సంయమి యయి
బ్రహ్మయజ్ఞము సేయ నో బ్రాహ్మణునకు. ౧౪౦

క. వేదోదితకర్మములు ప్ర
మాదంబునఁ బవలు సేయ మసలిన శర్వ
ర్యాదిప్రహరమ్మున సే
నాది యథాక్రమ మొనర్ప నుచితము భవికిన్. ౧౪౧

ఉ. ఆపద లేక సాంధ్యసముపాస్తి దొలంగు ద్విజుండు ధూర్తుఁ డా
త్మీపకు మోక్షము న్దివియు సిద్ధము గాదు బహిష్కృతుండు ధ
ర్మోపచయంబునం దతఁడు యుక్తివిశారదుఁ డౌచు సంధ్య నిం
దోపహతం బొనర్చు నరుఁ డుత్కటపాతకపాతుకుం డవున్. ౧౪౨

క. ఎవ రభిభాషింతురు సాం
ధ్యవిధానవిదూరుతోడ నవ్వారలు త
ద్రవిచంద్రతారకాదులు
దివి నుండెడుదాఁక నరకధృతు లౌదు రనా! ౧౪౩

ఆ. దేవతార్చ వైశ్వదేవంబు విధి నను
ష్ఠించి యతిథి రా యజింపవలయు
మంచి పలుకు పలికి యంచితాన్నము పెట్టి
మొదల నర్ఘ్యపాద్యముల నొసంగి. ౧౪౪

చ. అతిథి నిరాశుఁ డై యొనని యావసథంబుఁ ద్యజించి పోవు? దు
ష్కృతము నిజంబు వాని కిడి చేకొని యేగు నదఃపురాకృతం
బతిసుకృతం బతండు నగరాంతరతస్సముపాగతుం డవి
శ్రుతకులగోత్రనాముఁ డని సూ వివరింతురు సూరు లంచితా! ౧౪౫

గీ. ప్రత్యహము శ్రోత్రియుని నిజగ్రామవాసి
నొక్కరుని విష్ణుతత్పరు నుర్విసురునిఁ
బెతరుల గతిఁ దలంచి భావించి భోజ
నాదిక మొసంగ మే లగు ననిరి మునులు. ౧౪౬

గీ. దేవపితృభూతమానుషోద్దేశకృతము
ఖమ్ము లే నయ్యె బ్రహ్మయజ్ఞమ్ముతోడ
బ్రహ్మహత్యాఘ మెనయుఁ దద్వర్జితుఁ డటు
లొటఁ దప్పింపరా దవి యహరహంబు. ౧౪౭

ఉ. మిత్రులఁ బుత్త్రుల న్సతుల మేకొని భృత్యుల నాదరించి స
త్పాత్రము సంత్యజింపక సతం బొక విప్రునితో భుజింప నా
న్యాత్రము లేక వాగ్యతుఁడు నై తగు న ల్లతిభుక్తి మాని ని
ర్మాత్రము గాక యుండ మధురప్రచురంబుగఁ గోష్ణ మన్నముల్.

గీ. మోదకమ్ములు ఫలములు మొద లవు నవి
ఖాదితార్థమ్ములు భుజింపఁ గాదు మరల
నవియుఁ బ్రత్యక్షలవణంబు నారగించి
గోపలల మాహరించు నెగ్గుస కతఁ డవు. ౧౪౯

శా. పాలు న్నీరము ద్రావు చాచమన మొప్పం జల్పు చాపోశనం
బోలిం జేయుచు మ్రోత గూర్పఁ జన దా యోజ న్మహోఘం బగుౕ
మే లౌ నన్నము నీసడింపక ధృతి న్శిష్టం బదుష్టంబు నా
వేల న్దాఁ దిని యాచమించి శ్రుతిసంవిచ్ఛింతకుం గావలెౕ. ౧౫౦

ఉ. రాతురులందు నే నతిథి రా శయనాసనభోజనాదులౕ
బ్రాతిగఁ బూజసేయవలె భవ్యుఁడు గేస్తు స్వశక్తికిం దగౕ

జేతము పక్వమై త్రిదివసేవియొ? జ్ఞానియొ? యకానతం డదో
రీతికిఁ దప్పెనో? చనుఁ జరిత్రము వో నిరయంబునం బడన్. ౧౫౧

క. నరలు గల శిరము ముడుతల
సిరి వాసిన మేనుఁ గాంచి చెచ్చెరఁ దన సుం
దరిఁ గొనియో, సత్పుత్రుల
దరి నుంచియొ? కాన కేగఁ దగు నాతనికిన్. ౧౫౨

చ. త్రిషవణియందు స్నాత యవుఁ గ్రిందఁ బరుండును బ్రహ్మచర్యమున్
ధిషణ సముద్వహించు స్వవిధి న్నరవేర్చును బంచయజ్ఞముల్
విషయము లంటనీయఁ డెడలింపఁడు శ్మశ్రుజటానఖాదులన్
విషముగఁ జూచు గ్రామ్యపదవీసుఖకృత్ఫలపుష్పజాతులన్. ౧౫౩

చ. ఎనిమిది ముద్దలం దిను నిఁ కేమియు నాఁటికి రాతిరిం దినం
డను వగు వన్యతైలమును నంగసమంజన మాచరించు సై
చు నధిక శీతవాతరవిశుష్మమహోష్మము లాశుశుక్షణిన్
దినదినమం దహర్నిశ మతిప్రతిపత్తి యజించు సద్విధిన్. ౧౫౪

ఉ. ఆయతి నెంచి నిచ్చలు రథాంగగదాంబుజశంఖహస్తు నా
రాయణు సంస్మరించుచు నయంబునఁ బూను మహావ్రతంబుఁ జాం
ద్రాయణ ముఖ్య మెన్నఁ డపరాగత నెమ్మదిఁ దోఁచు గట్టిగా
నాయెడ సన్యసించు నభయం బెనయున్ వనవాసి భిక్షు వై. ౧౫౫

ఉ. అంతటినుండి వాఁడు విజితాంతరశాత్రవుఁడున్ నితాంతవే
దాంతవిబోధశీలి నిరహంకృతి నిర్మమతానుబంధుఁడున్
దాంతుఁడు శాంతుఁడున్ విజని ద్వంద్వనివృత్తుఁడు ముండితుండు ని
శ్చింతుఁడు నై చరించు నతిజీర్ణము గోచి ధరించుఁ దాల్పుఁడున్.

సీ. శత్రుమిత్రులయందు సముఁ డవు మానావ
మానంబులం దభిమాని గాఁడు
గ్రామమ్ములం దేకరాత్ర మ్మటు త్రిరాత్ర
మధివసించును బట్టణాళులందు

నాసింపఁ డొక యింటి యన్నమునకు యతి
భైక్ష్యవర్తనమున బ్రదుకుఁగాని
వ్యంగార మవివాద మర్హావిప్రగృహమ్ము
భుక్తవర్జనము తద్వ్యక్త మరయ
స్నాన మొనరించు మౌత్తులు ల్జపించుఁ
బ్రణవ మనిశంబు నింద్రియప్రకర మాఁగు
నట్టి నారాయణపరాయణాత్ముఁడు యతి
యీ ప్రకృతిసంసరణము జయించినాఁడు. ౧౫౭

ఆ. ఒకనియింటివంట నొకపుడు కడుపు నిం
డార లంపటుఁ డయి యతి తినియెనొ?
చాలు నింక వాని సంన్యాస ముండదు
నిష్కృతి యని వాని నేరములకు. ౧౫౮

క. యతి యయ్యు లోభమునఁ దన
గతి డాచి చరించె నేని గర్హితుఁ డతఁ డా
యతి లే దతనికిఁ జండా
లతులాహితుఁ డగు నని యమలమతు లనరొకో? ౧౫౯

సీ. తన్నుఁ జింతింపఁగాఁ దగు ననామయుని నా
రాయణు నమలు నిర్ద్వంద్వు శాంతు
నపమత్సరునిని మాయాతీతు సచ్చిదా
నందవిగ్రహునిఁ బూర్ణప్రకాశు
నవికారు నాది నవ్యయు లోకచైతన్య
కారణుఁ గారణకారణాత్ము
నగుణు జ్యోతిర్జ్యోతి నవ్య సనాతను
నప్రకారప్రకారాస్థితునిఁగ
నుపనిషద్వాక్యముఁ బఠించు నొండె స్వమతిఁ
జింతసేయు వేదాన్తార్థసిద్ధి నొండె

నవజితేంద్రియుఁ డౌచు సహస్రశీర్షు
దేవు ధ్యానించు నొండెఁ స్వభావవిభుత. ౧౬౦

క. ఇమ్మెయి ధ్యానపరుం డని
శమ్మును యతి సుగతి నెనయు దత్త్వోసురుఁ డీ మా
ర్గమ్మున నడవఁడి చేరుఁ బ
దమ్ముం బరమమ్ము నెందుఁ దడఁబడకుండన్. ౧౬౧

క. వర్ణాశ్రమధర్మము లను
వర్ణించె నిదంవిధముగ స్వవినేయున కు
త్తీర్ణ నొనరించె సమర్థ
ర్మార్ణోనిధి దత్తదేవుఁ డని గురుఁ డాడన్. ౧౬౨

ఆ. ఛాత్రుఁ డిచ్చ మెచ్చి జనకనందనుల యా
మీఁది సుప్రసంగ మను మనుటయు
వాని సత్ప్రసక్తి వరదుధర్మప్రోక్తి
స్వోక్తి మలఁచి మరల నుచ్ఛ్రితుఁ డనె. ౧౬౩

క. వినుచుంటివె? యవు మే ల్మే
లనుచుంటివె? వచ్చి రాని యద్భుత పలుకుల్
ననిరూపణీయరూపా!
స్వనిరూపితవేదవాదచంచత్సత్త్వా! ౧౬౪

శా. ఆశాశానిశసంప్రకాశక! నిరాశాప్యప్రసాదక్రమా!
శ్రీశప్రస్తుత! చందవోలునగరీహృత్సమ్మదాపాదకా!
కాశీశానసమానమాన! హృదయాకాశస్వయంభాస్వరా!
ఈశావామ! పరేశ! తైజసికరాశీ! నాశితాపప్రమా! ౧౬౫

మాలిని. వివిధవికృతివిశ్వాఽవిశ్వసత్త్వైక్యవీతాఽ
పవిధవికృతిశూన్యప్రస్ఫురత్స్వైకభాసా!
పవిధరముఖదివ్యవ్యాహృతిస్తూయమానా!
వ్యవహృతితదభావాపాస్తభేదస్వభావా! ౧౬౬

సీ. ఆంధ్రేల రామకథాఽమృతమ్మునఁ నింపె
వేంకటప్ప కవి సుపవిత్రుఁడు
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెఁ దనయు విత్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ సుఖములఁ

ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదిగో
యుద్వహింపుము సుమగుచ్ఛ ముపదళమ్ము. ౧౬౭

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీ దత్త భాగవతము

## ద్వాదశ గుచ్ఛము

క. శ్రీప్రకృతిపురుషయోగవి
భాప్రకటితజగదమేయతాతదధికృత
త్వప్రత్యయాప్యమానా!
శప్రాకృతి! చంద్రపురసుఖశ్రీప్రకృతీ! ౧

క. లింగోద్భవాభిధానా!
గంగాపార్వత్యనూనకశరీరార్ధా!
యంగీకరింపు మవలి ప్ర
సంగ ముపాధ్యాయుఁ డల్ల ఛాత్రుం బాత్రున్. ౨

ఆ. కౌఁగిలించి మెచ్చి కల్యాణధామ! నీ
మూలమునఁ దలంచు పున్నె మొలసెఁ
బూర్వగాథల ట్లపూర్వమనఃప్రియం
బావహించి తనయుఁ డయ్యె కనియె. ౩

### శ్రాద్ధ విప్రతిపత్తి సమాధానము

చ. అడిగితి నట్లు కొల్చి వినయంబున నత్రితనూభవు న్విభూ!
వెడఁ గనఁబోక నా యడుగు విప్రతిపత్తి సముత్తరింపు మే
వడువున శ్రాద్ధదత్తములు ప్రాప్తము లౌ మృతులైనవారికే
గొడవ కడు న్విమృశ్య మధికు ల్గొని రిప్పని యొప్పరుం బరుల్. ౪

ఆ. చచ్చినట్టివారు స్వర్గాదిలోకంబు
లందొ? పొడమి పుడమియందొ యుందు

రల్లవారు వచ్చి యాకొని యడుగరు
తినరు తృప్తిపడిన తీరొనరదు. ౫

గీ. ఇచట విప్రుల కిడియెద మచటనో? యొకో?
పెతరు లుందురు వారికి వీరి కేది
సంక్రమించు సందర్భమ్ము చెప్పుచుంటి
మడుగువారికి నిద మిత్థ మనఁ గుదురము. ౬

క. ఇది మున్ను నిర్ణయింపుము
పదపడి యను మాది నది యెవరు మొదలిడిరో?
తదనువిధానం బంతయు
దదుపరి వినియెదఁ ద్వదుక్తి దాఁపర మడఁగన్. ౭

మ. అని ప్రశ్నించితి నెత్తె నుత్తరము దత్తాత్రేయ దేవేశ్వరుం
డనుమానింపకు విశ్వ లట్లు వసురుద్రాదిత్యులు న్విష్ణుఁడున్
విను ప్రక్రాంత మపక్రమం బవు గతి న్విధ్వంసముం జెందకుం
డ నయింపం బితృకవ్య మవ్యయ మఖండం బెందు నొప్పారెడున్. ౮

గీ. తండ్రి తాతయు నవ్వాని తండ్రియు నొగి
వసువులును రుద్రు లాదిత్యులొనఁగుచుండఁ
గవ్యమును సంగ్రహింతు రెక్కడల నెట్టు
లుండిరేనియు జ్ఞాతిజనోపహితము. ౯

క. విశ్వ లను పేరి వేల్పుల శశ్వత్పరిపాలనమున సాగు నఖిలమున్
విశ్వపతి విష్ణుదేవుఁడు విశ్వాస మెసంగ నరయు విధమున కగుచున్.

క. దేవతలో? నరులో? పశువులో?
స్థావరములో? యయి మెలఁగెడు జనకాదుల కా
యా విధమె యన్నమును సం
భావించి యొసంగువారు వా రమలాత్మా! ౧౦

ఉ. కావునఁ గట్టుదిట్టము లఖండముగాఁ గల శ్రాద్ధతంత్ర ము
ద్భావిత మౌను గా దను విధంబున కన్యుఁ డెవండు దిట్ట? జ్ఞా

నావహితుండు మజ్జనకుఁ డౌ ననఁ గా నిమి మత్సగోత్రుఁ డౌ
దేవత లిచ్చ మెచ్చి వినుతింపఁగ నాది నొనర్చె ని వ్విధిన్. ౧౨

గీ. వేదశాస్త్రంబులం దెందు విన్న కన్న
వివిధవిషయంబు లొక్కెడ వెలయఁ గూర్చి
తా ననుష్ఠాన మొనరించెఁ దనయున కయి
కాని నిమివాని కాఁడు తత్కల్పకర్త. ౧౩

చ. విను మది విన్నమాత్ర నపవిత్రత వో శుచి యౌ నరుండు బ్రా
హ్మణుఁడు క్షయాహపూర్వదినమం దొగి స్నాన మొనర్చి యేకభో
జనుఁ డయి బ్రహ్మచారి యయి భూమ్మిశయానుం డయి విప్రులన్ నిమం
త్రణ మొనరింపఁగా నగును రాత్రి వ్యవాయము వారు మానఁగన్.

గీ. శ్రాద్ధభోక్తృత్వకృతనిమంత్రణుఁడు బ్రహ్మ
చర్య మెడలిన నిరయవాసంబు తప్ప
దతని దండించు బ్రహ్మహత్యానుగుణము
తప్పిదము మోపి యట యమధర్మరాజు. ౧౫

ఆ. దంతధావనమ్ము తాంబూల మభ్యంగ
మాట యౌషధము పరాన్నము రతి
శ్రాద్ధకర్త చెందరానివి పూర్వప
రాహములను దన్మృతాహమందు. ౧౬

శా. స్వాచారాంచితు శాంతు సత్కులజు విష్ణ్వారాధకున్ శ్రోత్రియున్
ప్రాచీనార్థవిశారదాత్మ్యుఁ ద్రిసుపర్ణజ్ఞున్ గృతజ్ఞున్ గుణిన్
స్వాచార్యోపనిషన్నిషేవకు నరాగాద్వేషసంపన్ను స
ర్వాచితోన్నతు విప్రు శ్రాద్ధవృతులం డౌ సన్నిమంత్రింపఁగన్.

గీ. నాస్తికులు రోగాంగులు సుదీర్ఘరోగు
లవ్రతులు శవదాహకు లశుచులు ఖలు
లన్యశాస్త్రాభిరతులు పరాన్నపరులు
శ్రాద్ధములయందుఁ బిలువంగరానివారు. ౧౮

ఆ. గ్రామయాజకుండు కాయస్థుఁ డమతి న
క్షత్రపాఠజీవి శాంతి లేని
వాఁడు వృషలిఁ గొన్నవాఁడును బనికిరా
రామతింప శ్రాద్ధమందు నెందు.

ఆ. తగినవారిఁ బిలిచి తత్రాప్తరుత్తిత్తుం
డై స్వనిత్యకృత్య మాచరించి
విధి నొనర్పవలయుఁ బితృకర్మ మపరాహ్ణ
మందు బ్రహ్మదత్త మది సమయము.

చ. పవలిఁటి యష్టమం బయిన భాగము భానుఁ డొకింత మందమై
దవసుఁడు గా నవుం గుతుపనామము కాలము దత్త మఱియుఁ
బవుఁ బితృదేవతావళికి న య్యపరాహ్ణమునం దకాలమం
దవిధి నొసంగు కవ్య మసురాపిత మందఁగరాదు వారికిన్.

గీ. ఖండతిథి యైన నపరాహ్ణగత నెఱింగి
యదియు రెం డపరాహ్ణములం దెనసిన
వృద్ధి నుత్తర గ్రాహ్య పూర్వక క్షయమున
గ్రాహ్య యనిరి పెద్దలు కవ్యకలనమునకు.

గీ. విశ్వ లవు దేవతలకుఁ గా విధి నిరువుర
ముపురిఁ బిత్రర్థముగను విప్రులను బిలిచి
కాని విశ్వుల కొకరి నొక్కరిఁ బెతరుల
కయి నిమంత్రించి కాని కవ్య మిడు టొప్పు.

శా. ఆయాతద్విజవర్యులన్ గొలిచి ప్రాయశ్చిత్తముం దన్మతిన్
జేయం గా నవు నంతఁ బాద్య మిడి యాసీను ల్కృతాచాము ।
నా యర్ఘ్యార్ఘ్యల నర్హసద్విధులతో నర్చింప నౌ వస్త్రభూ
షాయుక్తంబుగ యుక్తకోయదలపుష్పప్రాయసంపత్తికిన్.

క. దేవతలకు యవలును బితృ
దేవతలకుఁ దిలలు కుశలు ద్వితయులకును గా

నే వస్తువులం దేనియు
భావించి యొసంగవలయు స్వకగృహ్యవిధిన్. ౨౫

గీ. శ్రాద్ధవిధియందు నగ్నౌకరణ మొకండు
విప్రభోజన మొక్కండు పిండదాన
మొండు నివి మూడు ముఖ్యము లొకటినేని
విధి దొఱఁగనీరాదు తద్విహితగతికి. ౨౬

గీ. భక్ష్యభోజ్యలేహ్యబహుఖాద్యములఁ దృప్తి
యొసఁగ విప్రవరుల కొసఁగవలయు
నవి భుజింపవలయు నాజ్యప్లుతము గాఁగ
వల దనంగరాదు వలసియుండి. ౨౭

క. హరి నెడనెడఁ దలఁచుచుఁ దది
తరకృత్యము లుడిగి భుక్తి తత్సమయమునం
బరిపఠితపురుషసూక్తుఁ డ
సురఘ్నమంత్రానువాది శుచి కావలయున్. ౨౮

ఉ. నవ్వినఁ బెద్దగాఁ బలికినన్ దనుజావళి హవ్యకవ్యముల్
దవ్వుననుండి కైకొనెడు తద్విధ మెంచుచు వాగ్యతు ల్ద్విజుల్
నెవ్వగ లేక పాత్రమున నిల్పిన వ్రేలు విడంగఁబోక యే
చివ్వలు మాని భోజనము సేయవలెన్ విధిఁ గర్త పెట్టఁగన్. ౨౯

గీ. భోక్తలు భుజించు చన్యోన్యమును స్పృశించి
రాఁ దదన్నము విడువక యారగించి
సాష్టశతము గాయత్రీమహామనుజప
మాచరింపఁగ నవు దోష మది యడంగ. 30

గీ. పావమానయజుస్త్రిసుపర్ణములను
ద్రిమధుమధుసూక్తముల సుచరిత్రకథన
ముల నల ద్విజన్ము లను భుక్తభోజ్యులైన
తఱికిఁ గార్యము పిండప్రదానవిధియు. 3౧

ఉ. భోజనపాత్రముల్ చలితము లొనరింపక స్వస్తివాచనం
బే జను లాచరించెదరొ? యేమటి తత్పిత లాబ్ద మెంగిలిన్
భోజనముం బొనర్తు రది పోల దటంచు నెఱింగి యుక్త మా
నోజ ననంతరంబ నతు లొప్పఁ దదాశిషము ల్గ్రహింప నౌ. 32

శా. తాంబూలంబు సదక్షిణాకము సగంధద్రవ్య మర్పించి రా
త్రిం బుచ్చన్వలె బ్రహ్మచర్యమునఁ గర్తృశ్రాద్ధభోక్తల్విధిన్
సంబాళింపఁగ లేని యాతురుఁడుఁ బాంథప్రాయుఁ డామంబొ? హే
మంబో? బ్రాహ్మణసాత్కరించి యొనరింపం బాడి శ్రాద్ధం బనా! 33

ఉ. విప్రులు లేక ద్రవ్యము సపేతము గా నొసరించి యన్నమే
సుప్రచితంబు పైతృకము సూక్తమునన్ శుచిఁ జేయు హోమ మ
ర్థప్రతి లేనివాఁ డొసఁగుఁ దర్పణముల్ సతిలోదకంబులన్
గోప్రతతిం దృణంబు లిడి కొల్చుఁ బితృప్రియుతన్ దరిద్రుఁడున్. 34

చ. ఎదియు రుచింపదో? యడవి కేగి యొకండును సన్నిషణ్ణుఁ డై
యొదవదు నాకు ద్రవ్యము మహోత్కటపాపిని నన్నుఁ గానరే?
సదయత వేల్పులార! పితృసంఘములార! యటంచు రోదనం
బుదితరవంబు గాఁ జలుప నొప్పును దత్పితృభక్తి భూవరా! 35

గీ. శ్రాద్ధ మొనరించు పుణ్యులు సలుపవలయుఁ
దత్పరతఁ దప్పరేహాని తర్పణంబు
సలుపరా? తత్కులమ్ము నాశనముఁ జెందు
బ్రహ్మహత్యాఘ మా కర్త వడయువాఁడు. 36

గీ. శ్రద్ధమై శ్రాద్ధ మొనరించు సజ్జనులకు
సంతతిచ్ఛేదమా? కాదు సంతతమ్ము
లాయురాదులు నవ్వుఁ బితృయజనకర్మ
మునకు సుప్రీతుఁ డౌ విష్ణుఁ డనుకలమ్ము. 37

ఉ. ఈ యఖిలప్రపంచమున నెవ్వరు తుష్టి వహింప? రింక నా
రాయణదేవుఁ డాత్మఁ బ్రియ మందిన స్థావరజంగమంబు త

త్ప్రియము గాక వేర కలదా? పరిదృశ్య మదృశ్యమానముగా
ధ్యేయుఁ డతండు స్వశ్రుతిశతి న్వివరించెను దీనిఁ దప్పనే? ౩౮

సీ. భగవంతుఁ డవు హవ్యవహుఁ డనౌపమ్యస్వ
భావుఁ డౌనో? కాదో? పరిభవింప
భావించి కనఁ బరబ్రహ్మ పరబ్రహ్మ
యన జనార్దనున కన్యంబు కలదె?
యాతఁ డీతం డొక్కఁడై నిర్వహించు శ్రా
ద్ధము తంత్రమున కన్యథాత్వ ముండ
దవనీసురుల కిదు మనియు నాతఁడె తెల్పఁ
డా? యేమి? శ్రుతి స్మృతి నాజ్ఞ సేసి
కర్త కారయితయు హరి కానఁ జెంద
దిందు దత్తము పట్టిది యెవరు చూచి
వచ్చినా రన వచ్చునే? ప్రభువశమున
నిచటి ధన మెచ్చటికొ పోవు టెంచ వలదె? ౩౯

చ. అతిమతి కెవ్వఁడుం దెలుపఁ డాతని కింపవు వారి పల్కులా
యతి నెవఁ డాత్మ నమ్మ ననయమ్ము వచింతురు వాని కుత్సితుల్
వ్రతము ప్రదాన మాది యవు శ్రౌతమ్ము స్మార్తము కర్మ మెల్ల సం
గతతిథినిర్ణయమ్ముగఁ దగం బొనరింప ఫలించు నంచితా! ౪౦

క. ఏకాదశి షష్ఠి నవమి రాక చతుర్దశి యమాస వ్రతముఖ కృతులకా
స్వీకార్యలు పరవిద్ధ లుపాకృత లవు బూర్వవిద్ధ లల తద్దెలతోఁ.

ఆ. షష్ఠి నాగవిద్ధ సప్తమి శివవిద్ధ
నుపవసింపరాద యొకపుడేని
నెఱిఁగి యెఱుఁగకేని నేకాదశిం దశ
మీయుతం గ్రహింప మేలు కాదు. ౪౧

చ. వ్రతముల కెల్ల మే లసితపక్షముకన్న సితమ్ము పక్ష మా
గతి నపరాహ్ణకాలమునకన్న సుయుక్తము పూర్వ మా నహం

బు తిథి తదాస్థితం గనియె పుణ్యము సేయఁగ నౌను నక్తక
వ్రతముల నాప్రదోష తిథి గ్రాహ్య తదన్య ఫలింప దవ్విధిన్. ౭౩

క. ఆ యా తిథు లా యా విధు
లా యా శాస్త్రములఁ జదివి నట్టి మహితులన్
స్థాయ త్తదాచరితములఁ
జేయంజను ననుసరించి శిక్షించి మతిన్. ౭౪

ఉ. వేదముచేతఁ జోదితమె విశ్రుతధర్మము తత్క్రియాప్రకా
రాదృతి నాదిదేవుఁ డవు నచ్యుతుఁ డిష్టుఁడు తుష్టుఁ డౌఁ దదీ
యాదిపదంబు ధర్మపరు లందుచు రెందును దచ్చికీర్షు లా
రాదితవిష్ణురూపులె తొలంగు భవామయ మల్ల వారలన్. ౭౫

క. జ్ఞాతము లజ్ఞాతము లవు
పాతకముల కెల్ల నాదిఁ బ్రాయశ్చిత్తం
బే తీరున శాస్త్రం బను
నా తీరునఁ జేసి సత్క్రియలఁ జేయఁ జనున్. ౭౬

గీ. విప్రవధమును గలు ద్రావు విధము గురుని
దారఁ గలియుట కాంచన-చోరతయును
వానిఁ జేసినవారితో వర్తనంబుఁ
బంచపాతకములు మహత్త్వమున మించు. ౭౭

ఆ. వీని కెంచు మించు వివిధపాతకములు
గలవు వాని కెల్లఁ గలవు స్మృతుల
నాచరింప వలయునట్టి ప్రాయశ్చిత్త
తతులు తరగతులకుఁ దగినయట్లు. ౭౮

క. అవి సేయుచుఁ జచ్చిన మే
లవుఁ జీర్ణము లైన నంతకన్నను మేలౌ
నవి యేనియు నారాయణుఁ
దవులని మదిఁ జేయఁ గావు తగు ఫల మీయన్. ౭౯

ఉ. రాగముఖంబుల న్విడిచి ప్రాక్కృత మోచి తపించి సర్వసం
త్యాగము భూతజాతదయ యాత్మకుఁ జొప్పడు విష్ణుసంస్మృతిన్
భాగవతత్వ మేర్పడిన వానికిఁ జిన్నవి పెద్ద వైన పా
పౌగము లూడి ధ్వస్తము లపాస్తము లస్తము లౌచు రూపఱున్.

ఉ. ధ్యాతుఁడు పూజితుండు స్మృతుఁడై నమితుం డయి రూపడంచు నే
పాతకజాతి నైన ఖగవాహనుఁ డా హరిచేతఁ గా దటం
చే తర మైన దుష్కృతము నెన్నఁడు నెన్నఁ డొకింత వానికిం
జేత మొనంగజాలిన విశిష్టుఁడు వీడి చనంగఁ జాలఁడున్. ౫౧

క. హరిఁ బూజించెడువాని న
వరునేని నెఱుంగ కేనిఁ బాతకియే స్నం
గరతుం డయి తిరిగినఁ గనుఁ
బరమపదము వాని పాపపటలము చిటులున్. ౫౨

క. ఒకసారి విష్ణుఁ దలఁచినఁ
గకవిక లై క్లేశము లెడగలుగఁ జను స్వరా
దికలోకభోగభాగ
ప్రకటమహాత్త్వంబు వైభవం బనఁ దరమే? ౫౩

సీ. దొరకక దొరకక దొరకె నెట్లో మా
నవజన్మ మచిరభాననియతంబు
హరిభక్తి దుర్లభ యమర దం దమరిన
నంతరాయములు పెక్కులఁచుచుండుఁ
బశుపాశమోచను వాసుదేవు భజింప
మానసశుద్ధి సంపన్న మగును
దానితో మోక్షసందర్భము నిర్భరం
బౌఁ ద్రివర్గము మాట కదియె పూఁట
మోహనిద్రాసమాకులమ్ము భవ మెనసి
హరిశరణ మందు జనమె కృతార్థ మరయ

దారపుత్త్రగృహక్షేత్రధాన్యధనవి
శేషలబ్ధికి దర్పంబు సెందరాదు. ౫౪

మ. మును కామంబును కోపలోభమదసంమోహంబుల న్మచ్చరం
బును నిర్జించి పరాపవాద మెడఁగాఁ బూజింపు మయ్యా! జనా
ర్దను వ్యాపారము సర్వము న్వదలి యుత్సాహంబుతో దాన నీ
జననం బౌఁ జరితార్థ మింతకును సత్సంగంబు మూలం బగున్.

చ. యమనగరద్రుమాళి నికటాస్థిత గాఁ గన నాట నెంచి సం
యమపరులై హరిం గొలుచు నవ్యసనంబునఁ బుచ్చఁగావలెన్
సమయము నింద్రియప్రకరశక్తి నశింపకమున్నె రోగపూ
గము జరతోఁ బయిం బడి వికారముఁ గూర్పకమున్నె మానవుల్.

గీ. విశ్వసింపరు సుమతు లశాశ్వత మవు
వపువు నత్యంతచలల సంపదల నెందు
నిత్యమును సన్నిహిత మైన మృత్యువుఁ గని
దర్పమును మాని కొలుతురు వారు శౌరి. ౫౭

ఉ. యోగము వెంటనంటియె వియోగము నున్నది వీడఁబోవ దా
శాగుణపాశసంచయము సర్వము నా క్షణభంగురంబు పా
పౌఘవిభేదనక్షమము హరిహరిప్రియభక్తియోగ మా
వేగముతోడఁ బాతకియు విష్ణుపదంబు చిరంబుఁ జెందెడున్. ౫౮

గీ. వేదశాస్త్రతపోధ్వరవివిధతీర్థ
భజనములు సఫలమ్ము లీశ్వరపరునకు
వేదశాస్త్రతపోధ్వరవివిధతీర్థ
భజనములు నిష్ఫలము లనీశ్వరపరునకు. ౫౯

గీ. సాంగములు వేదములు తీర్థసార్థములును
యాగపూగమ్ము లధికసంత్యాగములును
విష్ణుదేవసమర్చాగ విధిఁ బదారు
పాలుఁ బోలవు మాటలు నేల వేలు? ౬౦

మ. అని యన్నింటి నిరాకరింపఁజన దభ్యాసంబునం జేయు నీ
పనుల న్వచ్చు ఫలంబు లప్పుడపుడే ప్రార్థింపకున్నట్టి స
జ్జనికి న్సజ్జని నిచ్చి విష్ణుపరతన్ సంధించు ముక్తిప్రసా
ధన మా జ్ఞానముఁ గానఁ గారణములే ధ్యానింపఁ బారంపరిన్. ౬౧

క. జ్ఞానమున ముక్తి దోఁచుం జ్ఞాన మొనరు విష్ణుపరత సాక్షాద్ధేతు
ధ్యానూసభక్తిఁ బోలునె? దానిం గర్మతతి క్రమనిదానం బైనన్.

సీ. వర్ణాశ్రమాచారవర్తనమ్ముల మించి
పుణ్యకర్మమ్ములఁ బ్రోవు సేసి
యెడనెడఁ జొప్పడు నెఱిఁగిన యెఱుగని
తప్పుఁ బ్రాయశ్చిత్తతతిఁ దొలంచి
సగుణదేవాధ్యానసంపత్తిఁ దల్లోక
ముల మేలి విజ్ఞానమునఁ గణించి
సంగమ్మును ద్యజించి స్వస్వరూపస్థితి
సంసిద్ధ దవిలి విశ్వమ్ము స్వముగ
నుండుఁ గృతకృత్యుఁ డీకర్మ మొల్లఁ డొల్లఁ
డాగమంబు లుపాసనాయోగగతులుఁ
గాని యందాఁక మనకెల్లఁ గా వలదొకో?
కర్మకరణమ్ము వదలిన గతులు లేవు. ౬౩

ఉ. పొమ్మర ధర్మకీర్తి! నృపభూషణ! పౌరుష మొంచి చేయ భా
గ్యమ్మున నన్యజన్మమున నైనఁ గృతార్థుఁడ వౌదు లే మదీ
యమ్ముపదేశ మిద్ది వృథ యౌనె మనమ్మున నాటి యెన్నఁడే
యిమ్మనసే స్ఖలింపక? వహింపుము రాజ్యభరంబు మే లవున్. ౬౪

క. అని దత్తముని వచించినఁ
జని యా జని యట్టు వోక జనకా! యిచ్చో
జననం బెనసితి నిమ్మెయి
మును చెప్పితి నంతవట్టుఁ బుణ్యాచరిత్రా! ౬౫

చ. అను సుతు భద్రశీలుఁ దన యంకముఁ జేరిచి గాలవర్షి ము
ద్దును మురిపెంబు పున్నెమును తోష ముపాసన భక్తి ముక్తియుం
దనయుని రూపుఁ జెంది జనసంబునఁ దన్ను గృతార్థుఁ జేసె నం
చనసె నెడందఁ దృప్తి నిరియించెను గౌఁగిఁట మాటిమాటికిన్.

గీ. నారదుఁడు సెప్పె నిట్లు సనత్కుమారుఁ
డూఁచె నొఁదల నది యెల్లఁ జూచినట్లు
సందియము వాసెనే? దీన ఛాత్రపాత్ర!
విభుని ధర్మప్రబోధసువిస్తర మిది. ౬౭

శా. దత్తాత్రేయకృతప్రసాదుఁ డవు భూదారుం డతం డల్పుఁడా?
తత్తాదృక్షత్రవీరసంప్రశమనస్థైర్యప్రకారక్రమో
పాత్తాస్తోత్రమ్ముఁ డల్పుఁడా? భృగుకులప్రష్ఠుండు రాముండు త
ద్వృత్తాంతం బెనిమారు లన్నఁ బునరుక్తిం దోసముం జెందునే? ౬౮

ఉ. చెప్పఁగఁ జెప్పఁగా విసువుఁ జెందితి మందురొ? మందు లంచు నా
యప్పల గొప్ప గొప్ప చరితాద్భుతముల్ మది నూరి మానితిం
జెప్పక చెప్పుచుండఁగ విశేషము లెం డెవి సంస్ఫురించునో?
చెప్పు మటందువా? సుపరిశీలితముం బొసరింపు ముక్తముల్. ౬౯

గీ. అడుగు మెందైన సందియం బంకురింప
గిల్లివేయఁగ వలయు వర్ధిల్లఁజేయ
రా దనెడు వేదధర్మున కాదరమున
నెరగి యంతేవసద్వరుం డిట్లు లనియె. ౭౦

ఉ. అంతటి దేవు సద్దయు నయంబునఁ గాంచి జగద్ధురంధరా
త్యంతపరాక్రమక్రమత నమ్మెయిఁ జేర్చిన తేఁడు భూసుర
స్వాంత మెఱింగి నేర్చి మనఁ జాలెనో? యందఱ నొక్క లెక్క నె
క్కింతు స్వారాజ్య మిద్ది యని కేవలదర్పత నిజ్జనీగ్లెనో? ౭౧

ఆ. కాకయున్న నూరక జమదగ్న్యాశ్రమ
సీమ నట్టి చేత సేయ నగునె?

తాను కాదు నృపసుతప్రకరం బనఁ
దనదునాన మీఱు తరమె? వాఁడు. 22

కార్తవీర్యుని గర్వప్రకారము

ఉ. ఆపవు నాశ్రమంబు జ్వలనార్పితముం బొనరించి వానిచే
శాపముఁ జెందె నంటివి ప్రశస్తమతీ! మదదంతిపంక్తి ని
ల్పోపని గాలి నిల్వఁగలవో? మశకంబులు వాని రాజ్యమం
దేపని కైరి బాడబు లిఁకే నియతిం బ్రతుకంగ నైరొరుల్? 23

చ. అని యడుగంగ నాతనికి నా గురునాథుఁడు ప్రీతిఁ దెల్పె నా
పనియు వినంగ నర్హమె శుభప్రవిచార! నృపాలుఁ డొక్కనాఁ
డనయము విఱ్ఱవీఁగి తనయంతటివా రిల లేరు నిగ్రహం
బునకు ననుగ్రహంబునకుఁ బూరుషు లంచు రుషన్ వచించినన్. 24

చ. అది సభ సభ్యు లంద ఱెది యాడిన నేమి దొసంగొ? యంచు ని
ర్మదమున నుండ మంత్రు లొక మాటయు లేక హసింప సర్వసం
పదల నడంచు గర్వ మిది పాటికి వచ్చునె? యంచు నంచితుల్
మదిఁ దలపోయ భూతము లమానుషము ల్గలఁగంగ నైనచోన్. 25

సీ. అపరూపు నేమి సేయంగలఁ డితఁడు న
న్నెవ్వరు వచియింతు రిత వెఱింగి
నను నడంపఁగఁ బూనెనా? మేలు లేకుండుఁ
దనకుఁ దా నొక్కఁడె తత్త్వయుక్తి
నా కేల? పొమ్మని నల్వు రూరకయున్న
నిమ్మడి గాకుండ దిమ్మదంబు
వీని వరమ్మున విభుని సమ్మతిఁ గల
దుర్వృత్తి నుత్తము లుడుపుమాట
అని విచారించి పోవుచు నాఁగి పలికె
ధీరరవమున వాయుభట్టారకుండు

మింటియాచెంట నేమంటివి? మేదినీశ!
బ్రాహ్మణులశక్తి యెఱుఁగక పలికితేమొ? ౭౬

శా. నాకున్నీకును లోకలోకములకున్నారాయణుం డీశుఁడా?
వైకుంఠం బెపుడున్ధరామరుల పత్పంకేజము ల్మెచ్చునా?
యా కల్యాణకరు ల్నిరంతర మిల న్వ్యాపించియే యుండిరా?
వాకు ల్దేకు మిఁ కీదృశంబులు మహీపాలా! హసింపం బరుల్. ౭౭

శా. ఈపాండిత్యము సంతరించితివె? నీ విన్నాళ్ల కేపుట్టలో
నే పా మున్నదో? యంచు నుండి యిటులో యీ యున్న మూనాళ్లు సం
తాపప్రాయము సంభవం బెఱిఁగి కర్తవ్యక్రియాకారి వై
యా పై దారిఁ గ్రమింప కింత లయితే? యాలే ద్వితీయద్విజా! ౭౮

మ. అనిన న్మెచ్చక క్రుద్ధుఁ డైన పతిగర్వాటోపముల్ లక్ష్యపె
ట్టనివాఁ డై జగదాత్ముఁ డీ ట్లనియెఁ గట్టా యన్యవిప్రాళి నె
ట్టన పోనీ భృగుఁ డ వ్వసిష్ఠుఁడు నవష్టంభంబునం జేసిరే?
పను లా పుణ్యుల మెచ్చునా? యకట కుంభప్రోద్భవు న్వంటివే?

శా. వారల్ సీదగు గౌరవంబుఁ గనరో? వర్ధిల్లు మర్థించి భ
క్త్యారూఢిం జని యత్రిపుత్త్రు నల దత్తాత్రేయు సేవించి కా
దే? రాజాధమ! తద్దయాగరిమ నుద్రిక్తుండ వై తింతకుల్
దీ రా కారణ మమ్మహామహుఁడ వాదింపంగ నిం కేటికిల్? ౮౦

మ. తిన శౌచంబును దీర్ప లేని తనకుల్ దేవుం డతం డై యొసం
గెను బాహానిచయంబు యోగి నొనరించెం జేసె ని న్నింతవా
నిని గర్వం బిది లేదు వాని మది నిల్ జెందెల్ ఘనం బొచు నే
మని యద్దేవునిమోము జూడఁ గలవయ్యా? మూఢ! మూర్ఖుండ వై.

ఉ. విప్రులతోడు పీడి పృథివీపతి యెవ్వఁడు నేల నేలె? నీ
వప్రతిబద్ధవిక్రముఁడ వౌట తదీయదయాలవంబుచేఁ
బ్రప్రథమస్థితిం దలఁచి పార్థివ! పల్కు మటన్న విత్తుఁ డై
దీప్రయశుం డతండు వినుతించె నతిం బొనరించె మంచిగన్. ౮౨

మ. అనుశాసించితి మేలు మేలు నను నార్యా! వాయుదేవుండ! నీ
యనుశాస్తిం దలఁ దాల్చి వర్తిలెద భవ్యంబైన బ్రాహ్మంబు శ
క్తిని దజ్జ్ఞాపకుఁడైన నిన్ను మఱవన్ గీర్తింతు నావందనం
బును గైకొమ్మన నౌ ననామయ మటంచుం బోయె నవ్వాయువున్.

క. జగదాయువైన వాయువు
జగతీనిర్జరమహోలసద్భాగ్యం బి
ట్టిగతి నవర్ణించిన పయిఁ
బ్రగుణుం డా తేఁడు మెలఁగె బ్రహ్మోత్తరుఁడై. ౮౪

ఉ. సత్యపరాక్రముండు ముని ఛాత్రుఁడు కారణజన్ముఁ డర్జున
క్షిత్యధినాథుఁ డర్హవిధి శిక్షితుఁ డక్షుసుపుణ్యశాలి యే
వ్యత్యయ మేల చేయుఁ? దుది యై విధి లాగ భృగూద్వహాశ్రమా
కృత్యము మాత్ర మట్లు చెలఁగెన్ గెలువన్ వశ మౌనె దైవమున్?

చ. అడిగిన చిత్రభానునకు నాజలరాశి ధరాతలమ్ము ము
న్నిడెద నటంచుఁ దప్పని దహింపఁగఁ జేసె వసిష్ఠునాశ్రమం
బడరు తదీయశాపమున కగ్గలమై యడఁగించెఁ బాపమున్
దుడుకుఁడనం బడంప ధరఁ దోఁచిన తాదృశుఁ డెగ్గు సేయునే? ౮౬

ఉ. అంతటివాని కుండక స్వయం బొక దేవు నుండునే? నభ
స్వంతుఁడు చెప్పచుండఁగనె స్వాంతము మార్చుకొనం డె? రెండు మూ
డింతటి చిన్ని నేరము లనేకగుణార్ణవమైన వానియం
దెంచితివే? వా చరిత్రమున నింత విమర్శము సేయకుంటివే? ౮౭

ఉ. బారతిఁ బోగలెన్ దలఁచు జాల్మల కాతఁడు మందె తోఁచి యా
భూరమునందు శ్రీభరము బుద్ధిక బ్రేగుగఁ గూర్చి యెన్నఁ డీ
సారి వసర్పు మిట్టి లేగఁ బో లనిపించి ధరిత్రియందు నెం
దా గని గూన దుర్బుగాముల లంకుర మెత్తకయుండఁ జేయఁడే? ౮౮

ఉ. పాపముఁ జేసెరుడఁ బ్రజఁ బొలసనేనెఁ బరం బిహంబు సు
ప్రాపముగా మహాత్ము గురురాయని దత్తవిభు న్భజించి యో

గోపనిషద్రహస్య మనుయోజితముం బొనరించికొంచు నా
భూపతిఁ బోలు రా జొకఁడు పుట్టెనె? పుట్టునె? పుట్టియుండెనే? ౮౯

చ. క్షమఁ దనకోసమై స్వయముగా హరియే యవతార మెత్తి నా
ద్రము దగ రుద్రశిష్యుఁ డవురా యని లోకము మెచ్చ రాముఁ డం
తమునకు నంతసేసె ననఁ దన్నృపమౌళియశం బసంవరం
బమితము లోకలోకముల నప్పటి కిప్పటికిన్ రహింపదే? ౯౦

ఉ. ఆ విభు రాజ్యమందుఁ గల హాయి మఱొక్కని రాజ్యమందుఁ గ
ద్దా? విధినిర్విశేషముగఁ దన్మహిమంబు నొసంగె దత్తభూ
దేవుఁడు జాతమాత్రునకుఁ దీక్షట తప్పని దొట రాము సం
భావితుఁజేసె నైజమహిమం బటఁ జేర్చి తదర్హవేళకున్. ౯౧

ఉ. కావున నీ కథాంశమునఁ గల్గిన పాత్రములందు నెందు సం
భావన కందరాని మహిమంబు గనంబడు నద్ది యెల్ల వి
శ్వావిత యత్రిపుత్త్రుఁడు స్వయంభవుఁ డయ్యనసూయపుణ్యపుం
బ్రో వవు దత్తదేవు నతిగోహితమై భవ మంచు నెంచుమా. ౯౨

చ. అడిగినవాని కెల్ల సరి యైన సదుత్తరము ల్వచించి నా
వడుగ! కృతార్థుఁ డై తిని భవత్కృత మా నతిలోకసేవ కీ
పుడమికి భూషణంబ వయి పొల్చితి వింకను నా కిడంగ నీ
కడుగఁగ నైన వస్తు వెది యైనఁ జిరాయువ! పృచ్ఛసేయరా. ౯౩

చ. ఋణ మని కాదు కా దిది ముఖస్తుతి త్వత్కృత మైన దాని కే
ఋణ మెటు తీర్పనౌదు నిపు డెప్పుడొ? యన్న భవాబ్ధి ముంపదా?
గుణగణరాశి! కోరు మెదో? కోరక నే నిడరాదు వత్స! యే
తృణము నసంగ దీపకుఁ డదీనుఁడు దా ననియె న్నదీనుఁ డై. ౯౪

ఉ. స్వామి! యిదేటిమాట? సమశాస్త్రపరిశ్రమసంప్రదాయబో
ధామలమానసాప్తుల పథంబున కే నెది మీ కొసంగ నౌ
నామెయి కాదు? మీనుడికి నడ్డు వచింపఁగరామి నందు నో
భూమసమాత్మ! యట్టిదయ వొంగినఁ గా దన నాకు శక్యమే?

ఉ. హస్తము నాదు మస్తకమునం దమరం దగ నుంచి యున్న యా
వాస్తవ మెక్కఁ డంటివె? భవం బెడలన్ గురునాథ! యట్టి యా
వస్తువె నీవు నే నను స్వభావవిభేద మడంగ నేక మై
యస్తిత నిర్వహించు స్థితి కై వెలయ న్సమనుగ్రహింపవే. ౯౬

చ. అనుటయు నాతఁ డన్నయటు లంతయు నప్పుడ నిర్వహించె నే
మనవలె? వారి వర్తనము లయ్యవి వారికె చెల్లు నంచు నా
ననములు నాల్గు గల్గు సురనాథుఁ డొగిం గలికిన్ వచించి నీ
పనిఁ జను మీవు తప్పకొని భవ్యులు పోదు రిటే స్వపద్ధతిన్. ౯౭

క. అని కలి ననిచి విధాతయుఁ
దన కర్జము నిర్వహించు తరమున నుండెన్
మునులార! యీప్రసంగం
బున మీ సంప్రార్థితార్థములు సేకూరెన్. ౯౮

ఉ. దత్తవిబోధవై భవము తత్తదుపేయచయానువర్ణనం
బుత్తమ తాంబుబుత్సులు మహోత్సుకు లౌఁ దమచిత్తభిత్తులన్
హత్తెనె? సంశయం బెచట నైన స్ఫురించినఁ బృచ్ఛసేయుఁ డా
యత్తుఁడు శోఁచిసంత లను నార్యదయాపితబుద్ధిసంపదన్. ౯౯

క. అను సూతు నధికగౌరవ
మున మును లర్చించి యతని మురువుం గని యి
ట్లని రనఘ! బాదరాయణ
మునిశిష్యునినుడుల లోసములు గనఁ గలవే? ౧౦౦

చ. అదియునుఁ గాక దత్తపతి యప్విధి మాకు స్వవిశ్వరూపసం
పద సమనుగ్రహించి నినుఁ బంచి వచింపఁగఁ జేసె నింతయున్
దదనువిధానమందు నొక తప్పని యొప్పని చెప్ప నౌదుమే?
మదికి సమన్వయించిన సమగ్రరసానగ మంచు సంమనన్. ౧౦౧

చ. అయినను ద త్తగో ప్రు మభవాయిఁటెఁ పత్రితనూభవుండు స్వ
ప్రియ మొదఁ గొరి కూర్చిన సువిస్తర మందు నుపక్రమంబు వి

ద్వయము నుపసంహృతంబు కృతిధర్మము కర్మము గాఁగఁ దోఁచు స
న్వయము విధం బొకించుక మనంబులకు న్విశదం బొనర్పుమా.

మ. అన వ్యాసానుచరుం డనె న్మరల నా న్యాయంబు సామాన్య మై
చనుఁ దత్త్వమ్మును ము న్వచించియు మనీషం బట్టునో? పట్టదో?
యని ధర్మాధ్వమున న్ముగించెదరు విద్యావంతు లుద్గ్రంథముల్
ఘనమే మోక్ష మలభ్యమా? యది త్రివర్గం బైనఁ గొం డం చొగిన్.

గీ. బ్రహ్మసూత్రాదులందు నీ వరుసయె కల
దది యటుంచుఁడు తను నెవ్వ రడిగి రెద్ది?
తద్విషయబోధ మొనరించె దత్తమూర్తి
యదె యుపక్రమ ముపసంహృతార్థ మదియె. ౧౦౪

ఉ. వేదములం బురాణముల నిద్యల నర్థము లెన్నియేని ని
ష్పాదితము ల్పరంపరత స్వప్రమితి న్నభయంప్రతిష్ఠ సం
పాదిత మాట కెవ్వరికి మంచిగ నెయ్యది దోఁచు దాన నా
పాదితగమ్యు లయ్యెద రసంగత మం దొకఁడేనిఁ గల్గునా? ౧౦౫

గీ. జ్ఞానముననె కైవల్యంబు సంగత మగు
జ్ఞానము వెలుంగ నిన్నియు సాధనములు
సాధనజ్ఞాన మన మనోజన్య మాది
నదియుఁ బ్రజ్ఞానమునఁ దుది ననుగత మగు. ౧౦౬

మ. అతిలోకుం డతివేదుఁ డా విబుధుఁ డధ్యాస న్మహావాక్యబో
ధిత మా నర్థమునం దొలంగి యనుభూతిన్ "సర్వ మాత్మైవ" య
న్మతి నున్నాఁ డది యందకున్న "భగవన్! సర్వాత్మనా త్వా మహం
ప్రతిపన్న శ్శరణం నమో" స్తని హరిం బ్రార్థింపుఁడా భక్తులై. ౧౦౭

మ. అని దేవుం డుపదేశముం జలుపు నెష్టా యా వతారంబులన్
ఘను లౌ జ్ఞానులు పూర్వమార్గమున భక్తవ్రాతము ల్తద్వ్రతీ
యనయాధ్వంబున దాటఁగల్గుదు రనాద్యంతంబు సంసారవా
ర్ధిని లే దింకొక దారి దత్తవిభుఁ డాదేశించె నీ బోధమే. ౧౦౮

చ. తపములు యాగము ల్నియమతత్పరత ల్తదనుప్రవేశయో
గపరము లంచు నీశ్వరముఖప్రతిపన్న మెఱింగి యోగు ల
న్యపథములన్ దగ న్వివరణం బొనరించిరి బుద్ధిమంతు లు
క్తపదవులన్ మెలంగి దరిఁ గాంతురు సెంద రొకప్పు డార్తులన్. ౧౦౯

గీ. పాపము లొనర్చి నరకకూపములఁ బడుట
కన్నఁ బున్నెము సేసి నాకసుఖ మొనయు
నైన మే లవు సజ్జన్మ మంద నగుట
పాపి యాతనలఁ బడి దుర్భవముఁ గాంచు. ౧౧౦

గీ. మీకుఁ దన రూపుఁ జూపించి నాకు సెల వొ
సంగి నిజమహిమాళిప్రసక్తి నిట్లు
వరలఁజేసిన దత్తదేవస్వరూపుఁ
డైన హరి మీకు మాకు దిక్కు జగతికి. ౧౧౧

గీ. ఇప్పురాణంబునం దంశ మేక మైనఁ
బద్య మైనఁ దదర్థతత్పాద మైన
నింబుగా భక్తిఁ బారాయణం బొనర్చి
నరుఁ డభీప్సిత మొనయు నానంద మొనయు. ౧౧౨

క. ఇది యెల్లఁ జదివి యర్థము
మది కదుకఁగ ననుభవించు మహితుఁ డతండే
విదితము పరోక్ష మైనను
తదర్థభవ మంది భూమతత్పరుఁ డతఁ డౌ. ౧౧౩

క. దత్తాత్రేయాయ పదం
బెత్తి నమోంతముగ వెంటనే ద్రా మని మా
యోత్తరపూర్వమ్ముగఁ బ్రణ
వాత్తం బిటు నటు నొనర్ప నా విభు మను వౌ. ౧౧౪

ఆ. అక్షమాలనేని నచ్ఛస్ఫటికమాల
నేనిఁ గేలఁ బూని యెడఁద విభుని

రూపు వెలయ రేపు మాపు నీ మనువు స
హస్రమితి జపింప నవుఁ బ్రసత్తి. ౧౧౨

శా. దత్తాత్రేయ! హరీ! దిగంబరమునీంద్రా! కృష్ణసంజ్ఞాన! యు
న్మత్తానందపదప్రదాయక! యఖండజ్ఞానవారాకరా!
సత్తామాత్ర! పిశాచబాలవిధ! విశ్వస్వామి! నన్నేలు మా
యత్తుండం జుమి నీ కటన్న నుడి కాయాతుం డతం డయ్యెడన్.

ఆ. దత్తనేత్రుఁ డవుచుఁ దత్తద్భువనముల
నరయుచుండుఁ బవ లెవరు విలుతురో,
యని సమాధిఁ బాసి యాగతుండవుఁ బ్రోవ
రాత్రిఁ బిలుచువారి యాత్రములకు. ౧౧౩

ఆ. మలయు నూరివారు మాటుమడఁగకున్నఁ
బురుషుఁ డున్న యింటి పొరువుఁ గనదు
చీమ చిటుకు మన్నఁ జడిముడిపడి వచ్చు
నెంత మానవతియొ? యెంత సిగ్గొ? ౧౧౪

క. ఇటు చూచుచు నటు చూచుచు
నటించు నిం దున్నయట్లు నర్మము చెడనీ
దెటు నేర్చెనొకో? యబల యిం
తటినై పుణి నా రహించు తన మధ్యతలోన్. ౧౧౫

చ. కులముఁ ద్యజించి యొక్క కురుకుల్య కులాంగన పూరుషుం బరున్
గలిసి రసప్రసార మధికంబుగ రే పవ లంచు నెంచ కు
జ్జ్వలమహామూర్తి మేను మఱవన్ జగ మున్నది లే దనం గొనం
గలదె? తదాప్తికిం గలసుఖాలిఁ దొలంగి మును ల్తపింపఁగన్.

సీ. ముగురుమూర్తులఁ దన మురిపె మాలానంబు
గా ననుబద్ధనాగమాలఁ జేయుఁ
బంచతన్మాత్రాసుమాంచితాస్త్రము లిచ్చి
సాగించు నవగాత్రు జైత్రయాత్ర

నెంతకు నంతగా నెనఁగు రూపులు దాల్చి
యపరూపు నాడించు నాట సూపు
నెంత కాలీన యీ యింతినా నాత్మేశు
తలలోని నాల్క చందానఁ గొలుచు
సమ్మహోమతి యద్దేవి యోదిరహిత
యోగమాయాభిధాన వియోగ మొదలి
యనిశము భజింప వెలుఁగొందు నానసూయ
సత్రిపుత్త్రి దత్తాత్రేయు నభినుతింతు. ౧౨౧

ఉ. త్వాదృశదేవతాప్రతివిధాత్మనిప్రీతికిఁ బాత్రు త్రైతి రే
తాదృశతత్త్వధారసము ద్రావితి రెంచెద రీశు నాత్మన
న్యాదృశు లీర తెల్లవుదు? రా సురపాళికిఁ దక్కదీ పథం
బీదృశ లీ శరీరములు నీ శ్రుతులుం జరితార్థతం గనెన్. ౧౨౨

సీ. అనుచు వారును దాను ననసూయ ననసూయ
నత్రి నత్రిని దత్తు నాత్మదత్తు
నాతని శ్రీదేవి నాతి శ్రీదేవునిఁ
బ్రియభక్తిఁ గొలిచి యర్పించి రర్చ
లరునది నాల్గో? పదారో? యెన్మిదియో? యై
దో? యన నేటికి? నుత్సవమున
నవి యవి యవి యవి యన్నియు నుపచార
కలనల సముపాత్తగమను లయ్యె
భజనపరుల నల్లవారిఁ బ్రత్యక్షమై
శ్రేయ మొసఁగి మనిచి సిద్ధుఁ జేగ
నేము చూచితిమే దేవిఁ బోయితి మటంచు
ననఘవారు నేటి యాప్తి లేరు. ౧౨౩

శా. ఆ దేవుం డనఁ దీవు నా నది భిదావ్యాపార? మీ వ్యాపృతిన్
శ్రీదేవలకే యనుకొందఁ మంగ దయిన ధీభేదంబు మీ కున్నదే?

వాదంబు ల్వాడదారులం జలుపు తత్త్వార్థమం దున్నదే
మో? దోసంబు లెడల్చి మ మ్మిరువురుం బ్రోవుండు లింగోద్భవా!

మ. కలలో నాదిని మధ్యమందుఁ దనకై కల్యాణరత్నాకరుం
డల యాత్రేయుఁడు దత్తుఁ డీశుఁడు స్వకీయాత్రేయతాబంధు న
న్నలితం బీ చరితంబు వ్రాయుపనికి న్బంచెన్ భవద్దత్తనా
లలికి న్నాలితుఁ డయ్యె లేవు కొఱఁత ల్నా కింక లింగోద్భవా! ౧౨౫

క. ఆలించితివే? యీకృతి
లాలించితె మనమున నుపలాలింపంగం
బాలింపఁగ నను నెంచితె?
లీలాస్వీకృతకథావలీహితదేహా! ౧౨౬

ఉ. ఇప్పటివేలకుం దగిన యే వెడవేసము లే నెఱుంగ దే
చొప్పులు చెప్పులు న్వినదు శుద్ధ సనాతని యీశ వోలె ని
న్నెప్పుడు సేవ సేసికొను నేలుకొనందగు నీ కృతి న్సతం
బొప్పులకుప్ప! లే దెదియు నోం నమ యందు నదే సహస్ర మూ. ౧౨౭

ఉ. ఈశున కే మిడంగలది యేమి? మహేశ! యకించనుండ వీ
వాశలు మా కనేకములు హాస్య మవుం గదె నోరు విప్ప నా
దేశమున న్మెలంగెద విధింపు మెదేని భవత్ప్రసక్తి ని
ర్దేశము నాకు నీ జనికి విస్తృతము న్సులభంబు నయ్యెడున్. ౧౨౮

చ. వినతులు నీకు దత్తునకు వేడెద నంజలి వట్టి చిత్తశో
ధన మొనగూర్పఁ డిద్దఱు బుధప్రవరుల్ నను నేల నాకు నెం
దు నొదవ వే విపత్తు లిదె దుర్జనుల న్బడలించి కూర్మి స
జ్జనుల నెసంగఁజేయు తన సాములకు న్మనసార నారతుల్. ౧౨౯

ఉ. ఆధారాదికషట్సరోజసృతిమధ్యానాహతాభిఖ్యసం
బాధస్థానవితానితాంశుచయభాస్వత్కర్ణికాసీన! స్వా
మీ! ధర్మాచరణప్రకాశితపదా! మిత్రాతిమాత్రాస్పదా!
బోధైకప్రవణాత్మసంప్రచితసంపూర్ణాత్మతానంతతా! ౧౩౦

క. విస్మయకరకృతిభరితా!
యన్మత్స్ఫురసంనివేశ! యస్మయమానా
నుస్మరణవిత్తవృత్తీ!
విస్మేరకటాక్షపుషితవిద్యుదారంభా! ౧౩౧

మంగళ మహాశ్రీ వృత్తము

వృత్తయుతచంద్రనగరీనివసదర్యకులసృష్టధృతిమంగళమహాశ్రీ!
విత్తకలవేంకటకవిప్రథితతత్త్వదతివేలకృతిమంగళమహాశ్రీ
వృత్తకముహాస్తుతసవీభవదుదారవిభవిప్రకృతిమంగళమహాశ్రీ!
దత్తనవభాగవతదానకృతిమద్విహితతత్త్వస్మృతిమంగళమహాశ్రీ! ౧౩౨

సీ. ఆంధ్రేల రామకథామృతమ్మున నింపె
వేంకటప్ప కవి సంవిత్పరుండు.
హనుమాంబ పేరి మహాసాధ్వి పత్నిగా
ననుఁ గనెఁ దనయు విత్తనయుఁ జేసె
నాత్రేయగోత్రుండ నాఖ్యఁ దాడేపల్లి
రాఘవ పూర్వ నారాయణుండ
శ్రీదేవి దయితగా శ్రీవిద్య సేవింతు
బహిరంతరర్చానుభవ ముఖములఁ

ద్వత్ప్రసాదిత వాచా ప్రవాహచితము
దత్తభాగవతాఖ్య పాదపమునందు
నిందుపురనాథ! లింగోద్భవేశ! యిదుగో
తాల్పుము సుమాచ్ఛగుచ్ఛమ్ము ద్వాదశమ్ము. ౧౩౩

శ్రీ దత్త భాగవతము
సమాప్తము.

# సవరణ

| పే | ప | త | ఒ |
|---|---|---|---|
| 2 | 10 | ఖుట్టి | బుట్టి |
| 16 | 24 | గా తో | గాన నాతో |
| 26 | 17 | ఘూరు | ఘూమ |
| 27 | 19 | ఘది | మది ఘది |
| 33 | 4 | నల | వళ |
| ,, | 19 | ఘన | వప |
| 41 | 1 | ము క్తి | ఘు క్త |
| ,, | 13 | శ్రద్ధ | కర్ధ |
| 54 | 4 | డను | డమ |
| ,, | 20 | ఘుద్ది | మద్ది |
| 65 | 2 | రద్ది | రర్ధి |
| ,, | 26 | నొకొక | దినెధ నొకొక |
| 69 | 66 | నది | నధి |
| 71 | 21 | మని | ఘది |
| 73 | 13 | వశి | శశి |
| 75 | 25 | త్రము | త్రములు |
| 76 | 18 | నై యొ | నైమునినై యొ |
| 77 | 9 | కము | కఘున |
| ,, | 22 | డా | దా |
| ,, | 25 | వముల్ | ఘముః |
| 80 | 23 | క్రేత | క్రీత |
| 81 | 18 | బాడ | వాడ |
| 86 | 23 | మొన | మొనన |
| 87 | 20 | పిన | విన |
| 87 | 22 | యుత్త | నుత్త |
| 91 | 26 | నిగ | నిఘోడిట్టిగ |
| 96 | 21 | నట్టి | నట్టై |
| 98 | 6 | నుండె | ఘుండె |
| 101 | 15 | పతిం | సతిం |
| ,, | 19 | యెదె | ఖదె |
| 103 | 25 | నక్త | రాత్రి |
| 108 | 24 | వని | నని |
| 117 | 11 | త్రాన | త్రావ |
| 131 | 22 | ముఃక | ముల్ |
| 135 | 20 | నూరి | దూరి |
| 137 | 4 | తాత్మిక | తాత్మ |
| 141 | 6 | జేర్చి | జేర్చి |
| 143 | 17 | పీట | పీటి |
| 143 | 19 | వాఘ | వాస |
| 144 | 12 | దుష్కప | ధుష్కర |
| 152 | 3 | దృఢ | దృఢం |
| ,, | 8 | నని | నవి |
| 155 | 20 | బులంజెం | బుంజెం |
| 158 | 7 | కమ్ము | కము |
| 163 | 11 | కవి | కలి |
| 166 | 7 | హాంకు | హాంకా |
| 167 | 6 | తృ్మన | తృ్మనకా |
| 171 | 23 | దీక | ఫీక |

| పే | ప | త | ఒ |
|---|---|---|---|
| 172 | 6 | యమ్ము | యజయమ్ము |
| 177 | 8 | శీమత | శీత |
| ,, | ,, | మత | మతి |
| 180 | 20 | మాయు | బాయు |
| 191 | 16 | ఖ్వాఖు | ఖ్యాఖు |
| ,, | 17 | యూ | యుం |
| 197 | 19 | న్బరహీ | న్బహీ |
| 198 | 16 | జింకో | మింకో |
| 200 | 22 | వినిన | విన |
| 204 | 20 | కెన్ని | కెన్న |
| 215 | 15 | రగి | రిగి |
| ,, | 9 | పోక | పోఁక |
| 216 | 3 | ద్యూమ | మ్యూమ |
| 223 | 3 | మున | ముల |
| 226 | 5 | త్యూము | త్యూమ్ము |
| 231 | 7 | డాత్మ | డాత్మా |
| 232 | 26 | కాదురెండు | కాదురెండు |
| 233 | 18 | నింత | లింత |
| 236 | 3 | తిను | తను |
| 23 | 84 | దవేద | దవేదీ |
| 239 | 16 | తాద్భ | త్వాద్భ |
| 240 | 5 | ధునత | డసతు |
| 241 | 13 | లుచ | లుచ్మా |
| 242 | 19 | దోక | కోక |
| 243 | 16 | న్యయము | న్యము |
| ,, | 21 | బంచి | బంబి |
| 246 | 6 | చ్చెచే | చ్చెఁజే |
| ,, | 18 | రా | జా |
| 247 | 22 | బవి | బ్రవి |
| 249 | 10 | జాను | జాతు |
| 252 | 13 | తుఁడాలికా | తుఁడా |
| 254 | 4 | భావ | భాన |
| 256 | 6 | లై లు | లైలు |
| 257 | 23 | తులు | తుల |
| 259 | 20 | శేషి | వేషి |
| 261 | 19 | చేర్చి | జేర్చి |
| 265 | 6 | సతు | పతు |
| 269 | 1 | యుఁడ | యుండ |
| 274 | 4 | నెచ్చి | మెచ్చి |
| ,, | 9 | గఁబో | గవో |
| 277 | 25 | స్మరూ | స్వరూ |
| 278 | 8 | మంచు | మందు |
| 283 | 1 | గనితర | గనిరత |
| 294 | 14 | నిష్టా | విష్టా |
| 295 | 10 | ప్రదా | ప్రదాన |
| 298 | 19 | బడి | బిడి |
| 299 | 20 | మున్న | మన్నా |
| 301 | 15 | ప్రత్న | ప్రశ్న |
| 302 | 22 | నియో | నిమో |
| 305 | 5 | తమ్ము | తమ్మ |
| 308 | 1 | గోను | గోలు |
| 309 | 11 | అట్టు | ఇట్టు |

| పే | ప | త | ఒ |
|---|---|---|---|
| 317 | 8 | ఉమ్మ్మ | ఉము |
| ,, | 15 | దివినుందుర | ద్యోగతుల |
| 321 | 15 | మిడు | మిడుమిడు |
| 325 | 17 | దాని | దాన |
| 334 | 9 | మాని | నూని |
| 338 | 25 | లిసి | లిపి |
| 340 | 10 | న త్తి | ర త్తి |
| 343 | 10 | యిచ్చు | యిచ్చ |
| 344 | 17 | నా | సా |
| ,, | 20 | త్తజి | త్తటి |
| 349 | 20 | లారు | లాలు |
| 359 | 9 | తుఁడి | తుండి |
| 360 | 13 | కూల | శూల |
| ,, | 18 | సెల్లు | సెల్ల |
| ,, | 19 | నాయ | నాయక |
| 362 | 16 | జనస్య | జన్య |
| ,, | 19 | బంచి | బంబి |
| 364 | 20 | ఏమీా | ఏమి |
| ,, | 25 | నెటు | నెల్లు |
| 365 | 8 | ర్గముల్ | ర్గముఁ |
| 367 | 1 | నన్చె | నచ్చె |
| ,, | 3 | రాజా | రాజ |
| 369 | 23 | పత్తున్ | ప త్తిం |
| 376 | 4 | యిచ్చు | యిష్టి |
| ,, | 18 | మనెఁ | మనెదఁ |
| 377 | 17 | త్మక | త్మిక |
| 378 | 26 | తాద | లాద |
| 382 | 10 | మతం | మాతా |
| ,, | 20 | సంగు | సంగె |
| 394 | 17 | నక్క | నిక్క |
| 397 | 10 | ధ్యావతి | ధ్యానతి |
| 398 | 1 | మెలు | మ్మెలు |
| ,, | 14 | కుండ | కుంట |
| 400 | 13 | ప్రప | ప్రస |
| 401 | 4 | ర్హావి | న్హావి |
| 402 | 11 | మగు | వగు |
| 403 | 2 | లిల | తిల |
| 406 | 14 | తరూ | తసురూ |
| 412 | 2 | చ్ఛివి | చ్ఛవి |
| 419 | 4 | యుచుఁ | యుడుఁ |
| ,, | 8 | నరు | వరు |
| 421 | 17 | కాని | వాని |
| 424 | 6 | పెట్ట | పెట్టి |
| 425 | 11 | స్థాయ | స్ఫాయ |
| 426 | 25 | వల్లన | వల్ల |
| 431 | 11 | లేచి | వేచి |
| 433 | 9 | జెడ్డ | బెద్ద |
| 442 | 6 | సృష్ట | సృజ్య |
| 445 | 4 | యిది | యిద్ది |
| 446 | 4 | యితఁడు | నితఁడు |
| 450 | 10 | యమల | . యెల |
| 452 | 24 | చెనా | చునా |

| పే | ప | త | ప | పే | ప | త | ఒ |
|---|---|---|---|---|---|---|---|
| 453 | 2 | ల్భచ | ల్సుచ | 476 | 15 | నాకు | వాకు |
| ,, | 24 | నీరు | నీఱు | 494 | 6 | రము | రమి |
| 454 | 1 | బంచి | బంబి | ,, | 10 | దాంప | ద్వాంప |
| ,, | 12 | నష | నవ | 495 | 22 | వృతు | కృతు |
| 455 | 15 | సవి | పవి | 497 | 6 | సీరా | సీయురా |
| 456 | 14 | సురలు | సరుల | 499 | 20 | లుహా | లహా |
| 457 | 7 | గద | గన | 503 | 24 | వోక | వోన |
| 458 | 26 | కత్య | కృత్య | 509 | 14 | బుత్సు | భుత్సు |
| 469 | 10 | వెడ | లెడ | ,, | 21 | యును | యుసు |
| 473 | 22 | వగుట | వనము | 510 | 12 | భయం | భయ |
| 476 | 4 | బరు | బర | 512 | 14 | యుంతసిన్న | యుంతినిన్న |
| ,, | 7 | నీక్ష | దీక్ష | | | | |